# తొలినాటి తెలుగు కథలు
## (1936 - 1945)



సంకలన కర్త

మధురాంతకం రాజారాం



1998

పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం

హైదరాబాదు

# TOLINAATI TELUGU KATHALU

Madhuranthakam Rajaram

---

పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం
హైదరాబాదు

**మొదటి ముద్రణ: 1978 (ఆం.ప్ర. సాహిత్య అకాడమి)**

ప్రచురణ సంఖ్య : 202

ముద్రణ : 1998

ప్రతులు : 1000



**వెల : రూ. 50/-**

**ప్రతులకు :**

డైరెక్టర్, ప్రచురణల విభాగం,
**పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం,**
లలితకళాక్షేత్రం, పబ్లిక్ గార్డెన్స్, నాంపల్లి,
హైదరాబాదు - 500 004.

**ముద్రణ :**

**శ్రీ దత్తసాయి గ్రాఫిక్స్**
పల్లకుంట, హైదరాబాదు,

ISBN No. 81-86073 - 40 - X

ఆచార్య నాయని కృష్ణకుమారి
ఉపాధ్యక్షులు
పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం.



లలిత కళాతోరణం, పబ్లిక్ గార్డెన్స్.
హైదరాబాద్ - 500 004.

# సమర్పణ

బోధన పరిశోధన, ప్రచురణ అనే మూడు విషయాలు లక్ష్యంగా, తెలుగు సాహిత్యం, భాష, చరిత్ర, కళలు - సంస్కృతి వంటి రంగాలలో కృషి సల్పడానికి 1985వ సంవత్సరంలో తెలుగు విశ్వ విద్యాలయం ఆవిర్భవించింది. పూర్వం ఉన్న ఆంధ్రప్రదేశ్ సాహిత్య, సంగీత, నాటక, నృత్య, లలితకళా అకాడమీలు ఇందులో విలీనం కావడం వలన పైన పేర్కొన్న లక్ష్యాలతో పాటు మరెన్నో బాధ్యతలు దీనికి సంక్రమించాయి. అన్ని విశ్వవిద్యాలయాల వలే లేదా కేవలం పఠన పాఠనాలతో సరిపెట్టుకునే అల్ప పరిధి కాదు దీనిది. మన సంస్కృతిని ప్రపంచం నలుమూలలకు వ్యాప్తి చేయడానికి ఉద్దేశింపబడిన "సాంస్కృతిక విశ్వవిద్యాలయ" మిది. ప్రచార సాధనకు పరికరమే ప్రచురణ.

ప్రచురణ కార్యక్రమానికి అనుగుణంగా, ఈ విశ్వవిద్యాలయంలో యిప్పటికెన్నో ప్రముఖ గ్రంథాలను ప్రచురించింది. వ్యాఖ్యా స్రవంతి శీర్షికన సుప్రసిద్ధ పండితులచే ప్రాచీన కావ్య ప్రబంధాలకు వ్యాఖ్యానాలు వ్రాయించి ప్రచురించింది. ఇప్పటి వరకు ఈ ప్రణాళికలో కుమార సంభవం, కాశీ ఖండం, శివరాత్రి మహాత్మ్యం వంటి గ్రంథాలను వ్యాఖ్యా సహితంగా ముద్రించింది.

తెలుగులో పేరుపొందిన ప్రాచీన ఆధునిక గ్రంథాలను ఇంగ్లీషు, హిందీ భాషల లోనికి అనువాదం చేయించి ప్రచురించింది.

# ప్రవేశిక

## (తొలినాటి తెలుగు కథలు)

## 1936-1945

కథ, కథానిక చిన్న కథ అన్న పర్యాయపదాలతో వ్యవహరింపబడుతున్న **'short story'** అనే సాహిత్య ప్రక్రియ ఏదైతేవుందో, అది నవలకన్నా నవలిక కన్నా చిన్నదీ, చిక్కనిదీ అయినా కల్పనా కథ. క్రీ. వె. 19వ శతాబ్దిలో యిదొక స్పష్టమైన సాహిత్య ప్రక్రియగా లెక్కకు వచ్చింది. అయితే యిదెంత అత్యాధునిక ప్రక్రియగా గోచరించినప్పటికీ, హఠాత్తుగా స్వయంభువులాగా సాహిత్యంలోకి ప్రవేశించింది మాత్రంగాదు. ఏదో ఒక విధమైన కథాకథనం మానవ నాగరికత ఎంత పాతదో అంత పాతది. కథ అనగా చెప్పడం కాబట్టి ఒకరితో ఒకరు వినడమే కథయొక్క ఆదిమ రూపంగా ఉంటూ వచ్చింది. మానవ నాగరికేతిహాసం ప్రారంభమైంది మొదలు మానవుడు స్వీయమైన అనుభవాలను, ఇతరుల ద్వారా విన్న విచిత్ర విషయాలను, పరంపరాగతమైన పౌరాణిక వృత్తాంతాలను, కాలక్రమాన రూపుమార్చుకుంటూ వచ్చిన చారిత్రక సంఘటనలను కథలుగా అల్లి చెప్పుకుంటూ వచ్చాడు. 19వ శతాబ్దినాటి 'చిన్నకథ' లక్షణాలు తమలో లేక పోయినప్పటికీ, దీని పుట్టుకకు ఆధారభూతమైన మాత్రం ఆలనాటి పుక్కిటి కథలేనని చెప్పవచ్చు.

ప్రాచీన కాలాల్లోని జానపద కథకులు ఒక్కొక్కప్పుడు బహుశాబొత్తిగా అక్షరజ్ఞానం లేనివాళ్లు గూడా అయివుండవచ్చు. అందుకని ఆలనాటి గాథ లెక్కువభాగం జ్ఞప్తిలో పెట్టుకోడానికి ఏదో వీలుగా ఒక

దేశీయ కవితారూపంలో నిబంధింపబడి వుండేవి. అలాంటి వాటిలో కాల గర్భంలో కలిసి పోయినవి కలిసి పోగా, యింకా ఈనాటికీ మిగిలి వున్నది'**The Ship Wrecked Sailer**' అనే ఈజిప్టుగాధ. కష్టాలు కల కాలం వుండవనీ, దురదృష్టాల తర్వాత అదృష్టాలు మానవుణ్ణి వెదుక్కుంటూ రావచ్చుననీ వివరించే ఈ గాధ క్రీ.పూ. 2000 ఏళ్ల నాటిదని తెలియ వస్తున్నది.

భారతదేశపు ప్రాచీన గాధలు ఈజిప్టు, మధ్య ప్రాచ్యాల జానపద కథల్లా అంత పాతవి కావు. వేదాలకనుబంధగ్రంథాలైన బ్రాహ్మణాల్లో (క్రీ.పూ. 700) చిన్నచిన్న నీతికథలు **(Parables)** కానవస్తాయని విజ్ఞులు చెబుతారు. పాళీభాషలోని జాతక కథలు అంతకంటే ఆసక్తి దాయకమైనవిగా గోచరిస్తాయి. బౌద్ధధర్మ సిద్ధాంతాలకు వ్యాఖ్యాన ప్రాయమైన ఈ జాతక కథలు మానవుడి ప్రవర్తన ఎలావుండాలో, ఎలా వుండగూడదో బోధిస్తాయి. ఇంచుమించు అదేకాలానికిచెందిన పంచతంత్ర కథలు గ్రీకు దేశపు ఈసప్ కథల్లా జగద్విఖ్యాతి సముపార్జించు కున్నాయి. వినోదాత్మకము, నీతిప్రబోధకము అయిన ఈ జంతువుల కథలు క్రీ. శ. 16వ శతాబ్దినాటికే ప్రపంచభాషలు పెక్కింటిలోనికి అనువదింపబడ్డాయి.

ఆధునిక కథానిక దాదాపొకటే కాలంలో జర్మనీ, అమెరికా, ఫ్రాన్సు, రష్యాలాంటి పాశ్చాత్త్యదేశాల్లో ఉద్భవించింది. 1795లో గెథే మహాకవి ఒకానొక పత్రిక కోసం కథలు వ్రాస్తూ వాటికి వినోదరచనలు **(entertainments)** అని పేరు పెట్టాడు. ముప్ఫైయేండ్ల తర్వాత తన వినోదరచనలపైన తానే వ్యాఖ్యానిస్తూ 'కథంటే ఏముంది? ఒకానొక సంఘటనను గురించి పూసగుచ్చినట్టుగా చెప్పడమే గదా !' అన్నాడు. ఆ తరువాతి విమర్శకులు 'నికరంగా జరిగిందీ, లేదా జరగడానికి

పీలున్నదీ అయిన సంఘటనను గురించి చెప్పేదే కథ' అంటూ సూత్రీకరించారు.

19వ శతాబ్ది ప్రారంభంలో పుక్కిటి కథకు **(Tale)** చిన్నకథకు **(Short Story)** మధ్య స్కెచ్ అన్న పేరుతో యింకొక వచన రచన సాహిత్యంలో చోటు చేసుకుంది. పుక్కిటికథ సాధారణంగా వాగ్రూపంలో వుండేది. చెప్పేవాళ్ల ప్రతిభను బట్టి, వినేవాళ్ల కుతూహలాన్ని బట్టి అది వీలయినంత సుదీర్ఘంగా కొనసాగేది. కల్పితాంశాల పాలెక్కువ. అతిమానుష, అలౌకిక సంఘటనలందులో నిరాఘాటంగా చోటు చేసుకునేవి. పుక్కిటికథకు విరుద్ధంగా 'స్కెచ్' పుట్టగానే లిఖిత రూపంలో పుట్టింది. వర్ణనలు, నాటకీయత తక్కువపాళ్లలోవుండి సహేతుకమైన సంఘటనలతో కూడిన వాస్తవిక జీవిత విషయాలను ప్రతిబింబించడం 'స్కెచ్' యొక్క ప్రత్యేకత.

ఆధునిక కథానికకు ఆద్యులుగా పేర్కొనదగ్గ నికోలాయ్‌గొగోల్, నెథానియల్ హథారిన్, ఎడ్గార్‌ఎలన్‌పో లాంటి మహారచయితలు ప్రాచీనమైన పుక్కిటికథయొక్క లక్షణాలను, అర్వాచీనమైన 'స్కెచ్' యొక్క లక్షణాలను కలబోసి, ఈ సరిక్రొత్త సాహిత్య ప్రక్రియకు మార్గ నిర్దేశకులైనారు. వారిలో ఒక్కొక్కరూ ఒక్కొక్క మార్గాన్ని అవలంబించిన మాట నిజమే. కానీ వాళ్లకృషి పుక్కిటికథలోని విచిత్ర విపరీత కల్పనలపాలు తగ్గించడంలోనూ, 'స్కెచ్' లోని అతివాస్తవికతా తత్వాన్ని పరిహరించడంలోనూ ఏకోన్ముఖమైపోయి, అందుకు ఫలితంగా ఈ సరిక్రొత్త సాహిత్య ప్రక్రియ ఆవిర్భవించింది. పాదాలు భూమిపైన ఆనకుండా, గాలిలోనే తేలిపోయే ప్రాచీన కల్పనాకథకున్నూ, ఫోటో పట్టినట్టుగా యధార్థ జీవిత విశేషాన్ని అక్షరబద్ధంగావించే 'స్కెచ్

కున్నా మధ్యే మార్గంగా 'కథానిక' తన మార్గాన్ని తాను మలుచుకుంటూ సాహిత్య ప్రపంచంలో విస్తరిల్లింది.

కాలక్రమాన కథానికా రచన యథాతథ కథాకథనమనీ, (The realistic story), అనుభూత్యాత్మక కథా కథనమనీ (The impres - sionist Story) అని రెండుపాయలుగా చీలిపోయింది. నిర్లిప్తంగా జరిగింది జరిగినట్లు చెప్పడం యథాతథ కథాకథనం కాగా, జరిగిన సంఘటన వల్ల పాత్రల మనసుల్లో చెలరేగిన కలవరాన్ని, ఏర్పడ్డ గాఢమైన అనుభూతుల్ని పాఠకుడి మనసుపైన హత్తుకునేటట్టుగా చిత్రించేది అనుభూత్యాత్మక కథా కథనంగా ప్రాచుర్యం పొందింది. ఎడ్గార్ ఎలన్‌పో నుంచీ హెన్రీజేమ్స్‌వరకు ఎందరో అమెరికన్ రచయితలు ఈ రెండోరకపు కథా విశేషంపైన పరిశ్రమించి, తమ రచనలద్వారా పాఠకుల మనసు పైన చెరిగిపోని ముద్ర వేయగలిగారు.

ఇరవయ్యో శతాబ్ది పూర్వార్థంలో 'కథానిక' మరింత వాసివన్నెలు సంతరించుకుని, సాటి సాహిత్యప్రక్రియల సరసన ఒక సుస్థిరమైన స్థానాన్ని సంపాదించుకోగలిగింది.వందలకొలది మంది రచయితలు- కేవలం కథకులు మాత్రమేగాదు; ప్రసిద్ధులైన నాటక రచయితలు, కవులు, నవలా కారులు గూడా ఈ ప్రక్రియపట్ల మోజుపడి వేలకొలదిగా కథానికలు రచించారు. సాహిత్య ప్రపంచంలో యిందాకా పేర్కొన్న జర్మనీ, అమెరికా మొదలైన దేశాల ఆధిపత్యం తగ్గుముఖం పట్టి, ఆధునిక సాహిత్యానికి సంబంధించినంతవరకు పెద్దగా పురోభివృద్ధి కానరాని సిసిలీ, జపాన్, జెకోస్లవేకియా మొదలైన దేశాలలోనుంచీ కథా సాహిత్యభండారాన్ని సుసంపన్నం చేయగల మేటి రచయితలు పుట్టుకరాసాగారు.

భారతీయ విద్యా సంస్థల్లో ఇంగ్లీషు బోధనా భాషగా విస్తరిల్లిన పంతొమ్మిదవశతబ్ది ఉత్తరార్థంలో ఆంగ్ల సాహిత్యప్రభావం దేశం నాలుగు

చెరగులకూ వ్యాపించింది. ఏ అభ్యుదయ భావానికైనా ప్రప్రథమంగా స్వాగతం పలుకుతూ వచ్చిన వంగదేశంలో ఆంగ్ల విద్యావేత్తలయిన రచయితలు, నవల, కథానిక మొదలైన ఆధునిక ప్రక్రియలపైన కృషి చేయడం ప్రారభించారు. 1861 లో జన్మించి పాతికేళ్ళకల్లా సాహిత్య ప్రపంచంలో లబ్ధప్రతిష్ఠుడైన మహాకవి రవీంద్రుడు రచించిన బెంగాలీ కథలు గతశతాబ్ది చివరి పాదంలోనే ప్రచురింపబడ్డాయి. మహోజ్వలమైన ప్రాచీన భారతీయ సంస్కృతికి వారసుడైన రవీంద్రుడు పాశ్చాత్య సాహిత్యంలో పొంగిసలారుతున్న నవచైతన్యం ద్వారా స్ఫూర్తిని పొంది పాతక్రొత్తల మేలు కలయికగా, మానవతకన్న మతం వేరేలేదన్న ఉదార భావనతో భారతీయ సాహిత్యాన్ని సుసంపన్నం గావించాడు. దేశభక్తుడుగా తత్వవేత్తగా, కవిగా, నాటక రచయితగా, చిత్రకారుడుగా, వాగ్గేయ కారుడుగా తన కాంతికిరణాలను దిశాంచలాలకు విరజిమ్ముకుంటూ సాహిత్య విహాయసంలో ఉదయించిన రవికవి మూలంగా తొలి రోజుల్లోనే భారతీయకథానికకు కావ్యగౌరవం పట్టే అదృష్టం సమకూరింది. కాబూలీవాలా, పోస్టాఫీసు, హోమ్‌కమింగ్ (పతిక్ చక్రవర్తి కథ), మైలార్డ్ ది బేబీ (రాయచరణుని కథ) మొదలైనవి కమనీయ ఖండ కావ్యాల్లా భాసిస్తాయి; మననంచేసి చూసుకున్నకొద్దీ మనసునొక కరుణామయమైన రసజగత్తులోకి తీసుకెళ్తాయి. ఒక్క పెట్టున భారతీయ రచయితలందరిలోనూ ఆత్మవిశ్వాసపూరితమైన నూతనోత్తేజం పుట్టుక రావడానికీ, ఒక్కుమ్మడిగా దేశభాషలకు సంబంధించిన సాహిత్యాల్లో పునరుజ్జీవనం ప్రారంభం కావడానికీ రవీంద్రుని అవతరణ నాందీ ప్రస్తావన కాగలిగిందని నిస్సందేహంగా చెప్పవచ్చు.

రవీంద్రుని తరువాత వంగ సాహిత్యలోకంలో మళ్ళీ అంతటి సంచలనాన్ని కలిగించినవాడు, మళ్ళీ అంతటి ప్రభావాన్ని ఆసేతుహిమాచల పర్యంతంగా పరివ్యాప్తంగావించినవాడు అయిన శరత్‌బాబు యొక్క

మొదటి కథ 'మందిర్' 1907 లో ప్రచురితమైంది. సరిగా అదే సంవత్సరం మహారచయిత ప్రేమ్‌ఛంద్ ప్రచురించిన ఆయన తొలి ఉర్దూకథల సంపుటం అందులో జాతీయావేశం తొంగిచూస్తూ వుందన్న మిషపైన బ్రిటిషు పరిపాలకుల నిషేధానికి పాత్రమైంది. భారతీయ సాహిత్య చరిత్రలో కథానిక యిలా ఒక గుర్తింపుకు, గణనీయతకు పాత్రమౌతున్న కాలంలోనే తొలితెలుగు కథానిక ప్రభవించింది (1910).

గురజాడ అప్పారావు పంతులుగారు 1919 లో మరణించినప్పటికీ, సాహిత్య ప్రపంచంలో ఆయన జీవించడం మట్టుకూ ఆ తరువాతనే ప్రారంభమైందని సాహితీవేత్తలు భావిస్తారు. శిల్పపరిణితిని బట్టి చూచినా సాంఘిక ప్రయోజనాన్ని బట్టిచూచినా తొలి తెలుగు కథానిక 'దిద్దుబాటు' యింకొక పాతికేళ్ల తర్వాత పుట్టివుండవలసినదని అనిపిస్తుంది.

సూటిగా కథలోకి చొచ్చుకపోయే ఎత్తుగడ —

పాఠకుడి ఊపిరికి ముకుదాడువేసి ఒక్కఊపుతో చివరిదాకా లాక్కెళ్లిపోయే ఉత్కంఠ, —

ముగింపు దగ్గరికి వచ్చేటప్పటికి గగుర్పాటు కలిగించే చమత్కారమూ, —

కథా వస్తువులోని క్లుప్తత, స్పష్టత, నాటకీయతా, —

ప్రారంభమైన తర్వాత ఒకటిరెండు గంటల వ్యవధిలోనే కథ ఆఖరై పోయినతీరు —

ఈ లక్షణాలవల్ల 'దిద్దుబాటు' ఒకమంచి నమూనా కథగా స్మృతి పథంలో నిలిచిపోతుంది.

'కథానిక' పైన లక్షణగ్రంథాన్ని వ్రాయక పోయినా, మంచి కథకు ఉండవలసిన లక్షణాలేవో ఊహించుకోడానికి వీలుగా అప్పారావు పంతులుగారు భావి కథకుల ముందుంచిపోయిన లక్ష్యం — దిద్దుబాటు !

ముందుగా గ్రాంథిక భాషలోనే వ్రాసి, అప్పుడీకథ వట్టి కొయ్య బొమ్మలా వుండడం గమనించి, మళ్లీదాన్ని సజీవ వ్యావహారికంలోకి మార్చడంలో గురజాడ అప్పారావుగారి ముందుచూపు మాత్రమేగాక, మన సాహిత్యంలో తప్పనిసరిగా రావలిసిన మార్పేమిటో గూడా నిరూపిత మైంది.

"వ్యావహారిక భాషావాదాన్ని ప్రవేశపెట్టి లక్ష్యమును చెప్పిన వారు గిడుగు రామమూర్తి గారు, ఆయన లక్ష్యమునకు లక్షణము చూపిన వారు గురజాడ అప్పారావు గారు. సలక్షణమైన ఆధునిక కథలు వ్రాసిన వారు ప్రథమంగా వారే. సాంఘిక కథలు వ్రాసిన వారిలో ఆయనే ప్రథముడు." అంటూ నిర్ధారణగావించిన గొర్రెపాటి వెంకటసుబ్బయ్యగారు "కానీ ఆయన ప్రభావం ప్రథమంలో కథకుల మీద పడలేదు" అన్నారు.*

"గురజాడ కథారచనతో తెలుగు కథానిక పుట్టగానే యౌవన దశను అందుకున్నది" అంటారు పద్మరాజుగారు గూడా. కానీ ఆతరువాత పది పదిహేనేళ్ళదాకా అది పసితనానికి లోనై తప్పటడుగులే వేస్తూ వచ్చింది.

తెలుగు కథానికల చరిత్రలో దాన్ని సాధనదశగా చెప్పుకోవచ్చు.

అప్పారావుగారి 'దిద్దుబాటు', 'మీ పేరేమిటి?' అన్న కథలు 'ఆంధ్ర భారతి' మాసపత్రికలో వెలువడ్డాయి. అనగా కథానిక పుట్టగానే తనకు

---

*'అక్షరాభిషేకము' పీఠికలో.

ఆవిష్కరణ సాధనంగా 'పత్రిక'ను వరించింది. 'పత్రిక'కు గూడా కథానిక ఒక హంగుగా పరిణమించింది.

అయితే తెలుగు దేశంలో ఆనాటి పత్రికల సంఖ్య చాలా స్వల్పం. వాటి సర్క్యులేషన్ గూడా చాలా తక్కువే అయివుంటుంది. పుట్టిన వాటిలో బాలారిష్టంపాలై పరిసమాప్తికివచ్చిన పత్రికలేఎక్కువ. నాటికీ నేటికీ కథానికా పరిణామాన్ని జాగ్రత్తగా బేరీజు వెయ్యడానికి ఉపకరించే పత్రిక ఒక్కటే. అది ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక (1910) పానుగంటి లక్ష్మీనరసింహం, రాయసం వేంకటశివుడు, సెట్టిలక్ష్మీ నరసింహం, కొత్తపల్లి సూర్యారావు మొదలైనవారి కథలు (1910-25) ఆంధ్రపత్రిక ఉగాది సంచికల్లో కానవస్తాయి.

ఆ ఒకటిన్నర దశాబ్ది కాలంలో ఆంధ్రభారతి, త్రిలింగ, ఆఖ్యాయిక, సాహితి, మొదలైన పత్రికలు ఈ క్రొత్త ప్రక్రియకు ఎంతో కొంత దోహదం గావించాయి. వెదురుమూడి శేషగిరిరావుగారి మదరాసుకథలు, మాడపాటిహనుమంతరావుగారి మల్లికాగుచ్ఛము, రాయసం వేంకటశివుడుగారి చిత్ర కథామంజరి, పంగూరి సుబ్బారావుగారి ప్రొద్దుపోడుపు పూలు, పానుగంటివారి సువర్ణరేఖా కథావళి, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి గారి పూలదండ, చింతా దీక్షితులుగారి ఏకాదశి మొదలగు కథా సంపుటాలు ఆ వ్యవధిలోనే వెలువడ్డాయి.

తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రి గారు సభాపతిగా నెలకొల్పబడిన సాహితీ సమితి అధ్వర్యంలో 1920లో 'సాహితి' పత్రిక ప్రారంభమైంది. కథానికారచనలో విధిగా వాడుక భాష వాడి తీరాలని సాహితీ సమితి సభ్యులందరూ నిర్ణయం తీసుకోవడం జరిగింది.

"1919లో సాహితీ సమితి బయలుదేరింది. వారు 'సాహితి' అనే పత్రిక, తరువాత 'సఖి' అనే పత్రిక కొంత కాలం దిగ్విజయంగా నడి

పారు. బందరులో 'శారద' మాస పత్రిక, 'కృష్ణాపత్రిక' వార పత్రిక ఉండేవి... ఈ పత్రికలూ, శ్రీ గిడుగు రామ్మూర్తి పంతులు గారి వ్యావహారిక భాషా ప్రచారమూ కథానికారచనలకు అగ్రస్థానమిచ్చి విశేషంగా ప్రోత్సహించెడివి. 'సాహితి' ప్రథమ సంచికల్లో వచ్చిన చింతా దీక్షితులు, త్రిపురారి భట్ల వీరరాఘవ స్వామి, కొడవటిగంటి వేంకటసుబ్బయ్య, వఝ్ఝ బాబూరావు మొదలైన వారి కథలు చెప్పుకో దగ్గవి, మెచ్చుకోదగ్గవీని! ఆనాటి కథకులే నేటి కథలకు రూపకల్పన చేసి అందములు సంతరించిన వారు"*

1924 జనవరిలో ప్రభవించిన 'భారతి' మాస పత్రిక కథానికకు గొప్ప ఆలంబనంగా వెలసి, ఈ సాహిత్య ప్రక్రియకు పెంపు, సొంపు చేకూర్చడంలో చాలావరకు జవాబు దారీ వహించింది.

1924 ఫిబ్రవరి 'భారతి'లో దేవులపల్లి అప్పల నరసింహంగారు 'ఆంధ్ర వాఙ్మయమున ఆంగ్ల సారస్వత ప్రోద్బలము' అన్నవ్యాసంలో ఈ ప్రక్రియను గురించి యిలా వ్రాస్తారు:

"చిన్న కథలు అను క్రొత్త భాగము ఆంగ్ల వాఙ్మయము ననుసరించి నూతనముగ మన పత్రికలలో తలయెత్తుచున్నది. చింతా శంకర దీక్షితులు గారు రచించిన నేర పరిశోధక కథలు* ఈ భాగములో చేరవచ్చును. కొంత వరకు ఈ కథలు ఇప్పటి మన సంఘా చారములను ఆధారము చేసి కొనుచున్నవి...ఇవి మిత వ్యాప్తిని కలిగి, చదువుటకు సులభమై అద్భుతానందములు కలుగ చేయును. ఇప్పుడు యూరోపుసం

---

* 'భిక్షువు' కథా సంపుటికి పీఠికలో మొక్కపాటి నరసింహశాస్త్రిగారు.

* చింతా దీక్షితులు, చింతా భీమశంకరంగార్లు కలిసి "చింతాశంకరదీక్షితులు" అన్న పేరుతో వ్రాసిన కథలు

దును, అమెరికాలోను మంచి పత్రికలు ఈ చిన్న కథలను ప్రోత్సహించు చున్నవి. చిన్న కథలను 'నవలిక' యనరాదు. 'కథిక' యని నామకరణము చేయవచ్చునేమో పండితులు యోచింతురు గాక !"

అదే దేవులపల్లి అప్పల నరసింహంగారు 1928 ఆగష్టు 'భారతి'లో చిన్న కథలను గురించి వ్రాసిన వ్యాసానికి 'గద్య కథానకములు' అని పేరు పెట్టి 'కథానకము' అన్న పేరు దీనికి తగియుండునని వేటూరి ప్రభాకరశాస్త్రి గారి వలన వినియున్నాను అని పేర్కొన్నారు.

'కథానిక'గా యిది ఒకస్థిరమైన నామాంతరం ధరించడానికి మళ్లీ ఏడెనిమిదేళ్లు పట్టింది. 'కథానిక'ను **Short story** కి పర్యాయపదంగా స్వీకరించి ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారు ఆపేరిట 'ప్రతిభ' మాసపత్రికలో (1936) ఒక వ్యాసం వ్రాసిన తరువాత ఈమాటకు సాహిత్యంలో ప్రాచుర్యం లభించింది.

'కథానిక–దాని పరిణామము' అన్న పేరిట తల్లావఝ్ఝుల శివశంకర శాస్త్రిగారు 1939 సెప్టెంబరు 'భారతి'లో ప్రచురించిన వ్యాసంలో, ఈ రంగంలో అప్పటికే గణనీయమైన కృషి చేసినవారి జాబితా ఒకటి ఉదహరించబడింది.

## రచయితలు

1. చింతా దీక్షితులు 2. నోరి నరసింహశాస్త్రి 3. కొడవటిగంటి వేంకటసుబ్బయ్య 4. మునిమాణిక్యం నరసింహారావు 5. వఝ్ఝు బాబూరావు 6. శ్రీనివాస శిరోమణి 7. మొక్కపాటి నరసింహశాస్త్రి 8. అడివి బాపిరాజు 9. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి 10. వేలూరి శివరామశాస్త్రి

11. కవికొండల వేంకటరావు 12. పూడిపెద్ది వేంకటరమణయ్య 13. గుడిపాటి వేంకటచలం 14. మల్లాది రామకృష్ణశాస్త్రి 15. వెంపటి నాగభూషణం 16. రాయసం వేంకట శివుడు 17. భావరాజు కృష్ణారావు 18. బుర్రా సుబ్రహ్మణ్యం 19. కొడవటిగంటి కుటుంబరావు 20 టేకుమళ్ళ కామేశ్వరరావు 21. వేదుల సత్యనారాయణశాస్త్రి 22. విశ్వనాథ సత్యనారాయణ 23. మొదలి సుబ్రహ్మణ్యశర్మ 24. కాళూరి రామారావు 25. కరుణకుమార 26. తాతా కృష్ణమూర్తి 27. ప్రతాప రెడ్డి 28. జానకిరాం 29. బొడ్డు బాపిరాజు 30. అత్తిలి సూర్యనారాయణ మూర్తి 1. ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి 32. కుమార రాఘవశాస్త్రి.

## రచయిత్రులు

1. కనుపర్తి వరలక్ష్మమ్మ 2. క్రమధాటి జానకీదేవి 3. యల్లాప్రగడ సీతాకుమారి 4. పులవర్తి కమలాదేవి.

1936 నుంచి 45 వరకు పరివ్యాప్తమైన ఒక దశాబ్దానికి మాత్రమే పరిమితమైన ఈ సంపుటం కోసం శిల్ప వైవిధ్యాన్ని ప్రతిబింబిస్తూ, ఆయారచయిత కథాసారస్వతానికంతా ప్రాతినిధ్యం వహించే కథను స్వీకరించాలని నిర్ణయించుకోడం జరిగింది. శివశంకరశాస్త్రిగారి జాబితాలోని రచయితల్లో పన్నెండుగురి కథలతోబాటుగా, ఆ జాబితాలో చేరని యింకొక పన్నెండుగురి కథలతో ఈ సంపుటం రూపొందింది.*

---

* శివశంకరశాస్త్రిగారి జాబితాలో చేరని పన్నెండుగురు రచయితలు: 1. చిలుకూరు నారాయణరావు 2. సురవరం ప్రతాపరెడ్డి 3. భమిడిపాటి కామేశ్వరరావు 4. పాలగుమ్మి పద్మరాజు 5. గోపీచంద్ 6. బుచ్చిబాబు 7. జమదగ్ని 8. రా.సీ. ఆంజనేయశాస్త్రి 9. వెంచాశా. 10. క్రొవ్విడి లింగరాజు 11. చాగంటి సోమయాజులు 12.గోఖలే.

# 2

పౌరాణిక కథలు, పుక్కిటి కథలు, చారిత్రిక కథలు మనకు కోకొల్లలు. అందుకని, స్వరూపంలో కథానిక ఎంతగా ఆధునికత సంతరించుకున్నప్పటికీ, పౌరాణిక వాసనలు, పుక్కిటి కథల ప్రభావమూ, చారిత్రిక కథల అవసరమూ ప్రతిఫలించే కథలు మూడింటిని, వరుసగా ఈ సంపుటి ప్రారంభంలో పొందు పరచడం జరిగింది.

'పుట్టిన ప్రతి ప్రాణికీ మృత్యువుసిద్ధమే! కానీ ఆ తరువాత?'– అన్న ప్రశ్న ఈనాటిది గాదు. ఏనాడో నచికేతుని కెదురైన ప్రశ్న. ఈనాడు కథకుడికిన్నీ ఎదురైంది. జవాబు తెలుసుకునే అవకాశం గూడా అందినట్టుతోచి, అంతలోనే అందకుండా చేజారిపోయింది. యథాతథంగా ప్రశ్నమాత్రమే మిగిలింది. పౌరాణికవృత్తాంతపు పునాదిపైన నిజ జీవితంలోని ఒక వాస్తవిక సంఘటన ఆధారంగా నిర్మించిన చిన్న కథ– 'తరువాత ?' చిలుకూరి నారాయణరావుగారి రచన.

పుక్కిటి కథను కొన్ని ప్రాంతాల్లో ఊకుడు కథగా వ్యవహరించడంకద్దు. ఊఁ కొడుతూ వినే కథన్నమాట! ముద్రణాలయాలు, పుస్తకాలు (ఇంతవిరివిగా) లేని రోజుల్లో ప్రతి పల్లెలోనూ యిలాంటి ఊకుడు కథలు చెప్పేవాళ్ళకెక్కడలేని గిరాకీ వుండేది. కథా కథనకౌశలం వాళ్ళకు కొట్టినపిండి. అలాంటి కథకుల కొక మంచి నమూనా భైరవశాస్త్రి. ఒక లేబ్రాయపు ముత్తయిదువ త్యాగాన్ని గురించి అతడు చెప్పిన పుక్కిటి కథే శిలాప్రతిమ. భార్యాభర్తల ప్రేమానుబంధం ఏనాటికైనా పాతబడని కథావస్తువు. ఆ విషయం అలావుంచి, సామ్రాజ్యాలు నశించి చిల్లర మల్లర రాజ్యాలెక్కువైపోయిన కాలంలో రాజులకు, గజదొంగలకు ఏపాటి తేడా వుండేదో ఈ కథవల్ల తెలుస్తుంది.

వట్టి చారిత్రిక కల్పనాకథగానే తోచినప్పటికీ, 'జీవుడి ఇష్టం' ఒక గొప్ప సాంఘిక ప్రయోజనాన్ని ఆశించి వ్రాసిన కథ. దేశంలో జాతీయావేశం పరవళ్లుద్రొక్కుతున్న కాలంలో విశ్వనాథ సత్యనారాయణ గారు వ్రాసిన కథయిది. సామ్రాజ్యవాదపు పశుబలం ఒక మామూలు వ్యక్తి ఆత్మబలంముందు వెలవెలపోవడం ఈ కథలో గమనించవచ్చు.

జాతీయోద్యమ తీవ్రతను గురించి మరింత సూటిగా, హృదయానికి హత్తుకపోయేటట్టుగా చెప్పిన కథ 'సుశీల'. ఉప్పుసత్యాగ్రహం, రౌలట్ చట్టం, పంజాబుహత్యలు, నాన్ కో ఆపరేషన్, ఖద్దరువ్యాప్తి, మీటింగులు, ఊరేగింపులు, హరతాళులు మొదలైన చారిత్రిక సన్నివేశాల నేపథ్యంనుంచే ఈ కథను చెప్పుకొస్తారు గుడిపాటి వేంకటచలంగారు. నాగరికంగా పైస్థాయికి చెందిన కుటుంబాల్లో వచ్చిన మార్పుల తీరుతెన్నులన్నీ ఈ కథలో కానవస్తాయి. సంసారంలో మగవాడి ఆధిపత్యాన్ని చలంగారు ఒప్పుకోరు. బహుశా తమ దృష్టిలో 'ఆదర్శభర్త' అనే మనిషి ఎలా వుండాలో, ఆయన 'నారాయణప్ప' పాత్ర ద్వారా నిరూపిస్తారు. నారాయణప్పభార్య సుశీల, తనకు లభించిన స్వేచ్ఛను పూర్తిగా వినియోగించుకోలేక పోతుంది. లైంగిక వాంఛకు, నైతికకర్తవ్యానికీ ఏర్పడిన సంఘర్షణలో దేనికి విజయం చేకూరుతుందోనని పాఠకుడు తహతహలాడి పోవడం సహజం. చలంగారి కథలన్నింటిలాగే యిదిగూడా ఒక తుపానులా పాఠకుణ్ణి ఆవరిస్తుంది. ముగింపు దగ్గరకు వచ్చేసరికి జడివాన వెలిసిన ప్రశాంతి మనసులో చోటు చేసుకుంటుంది.

భారతీయుడు ద్వేషించింది ఆంగ్లేయుల సామ్రాజ్య వాదాన్ని మాత్రమే; తెల్ల జాతి వాళ్లని గాదు. అలా కాదని ఎవరైనా పాలక జాతి పట్ల ద్వేషాన్ని పెంచుకొన్నప్పటికీ అది కృత్రిమమూ. తాత్కాలికమున్నూ మాత్రమే ! చిత్రకారుడు విశ్వేశ్వరరావు గీచిన రెండు విభిన్న ధ్రువాల

లాంటి 'రోడ్డు రోలరు', 'శాంతి దేవత'ల చిత్రాలకు నడుమ కమ్మని కావ్యంలా అల్లుకపోయిన మనోజ్ఞమైన ప్రణయ గాధ 'ద్వేషం'. ఉద్యమాలను గురించి వివరిస్తూ, శిల్పకళాక్షేత్రాలను చూపిస్తూ, మహోద్రేకాలలో ముంచి తేలుస్తూ, మహదానందాలతో తన్మయత్వం కలిగిస్తూ ఆకాశ వీధిలో దివ్యవిహంగంలా విహరించే బాపిరాజుగారి కథ చదివి ముగించే సరికి ఒక్క భారత దేశం పట్టుకే గాదు, సర్వప్రపంచాన్నీ ఒక సారి చుట్టి వచ్చినట్టే వుంటుంది.

కలిలో ఘోరకలిలా, కరువులో అధికమాసంలా దేశంలోని స్వదేశ సంస్థానాల పరిస్థితి మరింతదారుణాంగావుండేది. కృష్ణకవతలి గట్టున సాగుతున్న అంగ్రేజీ పరిపాలన వాళ్ళపాలిటికి స్వర్గతుల్యంగా వుండేదంటే, యికవాళ్ళ దుర్భర జీవితాన్నిగురించిచెప్పవలసిందేముంటుంది ? బ్రిటిషు వాళ్ళ అదుపులో నైజాము రాజ్యం. ఆ నైజాం రాజ్యంలో మళ్లీ పోలీసు వాళ్ళ ఏలుబడి. అమీనే నవాబు. అమీనుభార్యే బేగం సాహేబా. జవానులు అసహాయశూరులు, నోరులేనిప్రజకు దిక్కులేని రోజులు. తెలంగాణా జనజీవనాన్ని ఆ ప్రాంతపుపలుకుబళ్ళతో బాటుగా అద్దం పట్టి చూపించిన చిన్న కథ సురవరం ప్రతాపరెడ్డిగారి 'సంఘం పంతులు'

అన్నదమ్ములు, వ్యత్యయము, అంటు జాడ్యం, సరే కానివ్వండి, స్మరణ అన్నవి అచ్చంగా గ్రామీణ జీవనవ్యవస్థకు సంబంధించిన కథలు.

దేశానికి పల్లె, పల్లెకు రైతు వెన్నెముకగా పేర్కొంటాం. ఈగ యిల్లలుకుతూ తనపేరు మరచిపోయినట్టుగా మన కథా సాహిత్యంలో క్రమక్రమంగా రైతు సంగతి విస్మరింపబడుతూ వచ్చింది. పుడమి తల్లిని గోమాతను నమ్ముకుని పల్లెల్లో తమ బ్రతుకును తాము వెళ్ళదీసే కృషీవలుల్ని గురించి వచ్చిన కొద్దిపాటి గొప్ప కథల్లో 'అన్నదమ్ములు'

ఒక్కటి .ఈ నాటికి వట్టి వస్తు విశేషాలుగా మాత్రమే స్ఫురించే బొట్టు పెట్టెలూ, భోషాణాలూ, మేడికోళ్లూ, పలకట్టులూ, మైలారు జల్లిలూ మొదలైన సరంజామా యావత్తూ కానరావడమేగాదు, ఈ కథలో ఎదురయ్యే వర్ణనలు ప్రవరుడికి లభించిన పాదలేపనంలా మనల్ని తీసుకెళ్లి పల్లెపట్టుల ప్రకృతి రామణీయకతమధ్య దింపేస్తాయి. రైతుల, రైతు పడుచుల సుఖదుఃఖాలు, రాగద్వేషాలు, పట్టువిడుపులు ప్రతిఫలించడం మాత్రమేగాదు, ఇందులోని రెండు ఎద్దులుగూడా ప్రత్యేకవ్యక్తిత్వాలను సంతరించుకుని, నిండైన పాత్రలుగా కానవచ్చే తీరు ఈ కథకు విశిష్టతను చేకూర్చే అంశం.

'వ్యత్యయము' లోని కథావస్తువు ధర్మగ్లాని. ధర్మానికి కట్టుబడి వుండే నిజాయితీ జాతిలో దిగజారి పోతూ వుండడం ఈ కథలో కనిపిస్తుంది. దొరకొడుకు దగా చేశాక, పాలేరు కొడుకు రాములు తన సమస్యకేమయినా పరిష్కారం దొరుకుతుందేమోనని ఫాదిరీని ఆశ్రయిస్తాడు. గీతలయినా, బైబిలయినా చిత్త శుద్ధిలేని వాళ్ళనెలా సంస్కరిస్తాయి? లేదంటే లోకప్రతారణం చేయడానికి మాత్రం పనికొస్తాయి.' ఏమతములో తప్పున్నది, స్వార్థపరుడగు మానవుసిలో గాక !' అంటారు వేలూరి శివరామ శాస్త్రిగారు.

పల్లెల్లో రైతులుంటారు. రైతు పెద్దలుంటారు. భూస్వాములుంటారు. పాలేర్లుంటారు. అట్లాగే గ్రామాధికారులున్నూ వుంటారు. వాళ్ళకేమో చట్టాలను శిరసావహించాలనేవుంటుంది. అ చట్టాలు బ్రతికిన వాళ్ళని పోషించమని చెప్పవుగానీ, చచ్చిన వాళ్ళని కాబ్దారీ చేయమంటాయి! శవానికి కాబ్దారీ అంటే ఎంత కష్టం! అదీ రాత్రిపూట, గవళ్ళ పాలేనికి దక్షిణంగా చెర్లోకి పోయే డొంకదారి దగ్గర! ఈ నీడంతా మునసబుగారి తలకు చుట్టుకుంది పాపం! ఇంతకూ ఆయన్ను పట్టు

కున్నది పులిగాడా, గిలిగాడా? జానపదుల అనుమానాలు, అపోహలు, బ్రతుకు భయాలు మొదలైన వాటిని కళ్ళకు కట్టినట్టుగా చిత్రించే గమ్మత్తయిన కథ 'అంటు జాడ్యం'.

'సరే, కానివ్వండి' అసలు సిసలైన పామరుల కథ, వాళ్ళ అమాయకత్వం,దానివల్ల వాళ్ళకెదురయ్యే బాధలు కంట తడి పెట్టిస్తాయి. నాగరిక ప్రపంచానికి బొత్తిగా అంతుపట్టని పొడిపొడి సంభాషణల వెనుక వాళ్ళ తడిగుండెల్లోని ఆవేదనల్ని గోపీచంద్‌గారు అద్భుతంగా చిత్రిస్తారు. సంఘంలో ధర్మానికి తావులేక పోయింది. హృదయంలేని చట్టం వాళ్ళని జడిపించింది. అడవులే ఆశ్రయం యిస్తాయి. అజ్ఞాతంగా నివసిస్తూ దేశాన్ని తిరగ దోడాలనుకుంటున్నారు. ఇదెంతవరకూ సాధ్యమో తెలియకపోయినా ఈ సంఘటనమాత్రం మళ్ళీమళ్ళీ చరిత్రలో పునరావృత్తమయ్యేటట్టే వుంది!

జరుగుబాటున్న మోతుబరి ఆసాముల చేతుల్లో నిస్సహాయులైన బక్క రైతులకెదురయ్యే యిడుముల్ని గురించి తెలియజెప్పే కథ 'స్మరణ'. వ్యవస్థ యిలాగే వున్నంత కాలం వాళ్ళ భవిష్యత్తు పామునోట పడ్డ కప్ప చందంగా వుండక తప్పదని ధ్వని.

ఈశతాబ్ది ప్రారంభంనుంచీ సంఘంలోనూ, కుటుంబంలోనూ తెనుగుమహిళ స్థానం రకరకాల పరిణామాలకు లోనౌతూ వచ్చింది. ప్రతిదశలోనూ ఆయాసమస్యలను కథానిక సాహిత్యనిబద్ధంచేస్తూ వచ్చింది. ఒకప్పటి సమాజంలో వితంతువులకు శిరోముండనం, ఒంటి పూట భోజనం, శ్వేత వస్త్రధారణం లాంటి నియమాలు తప్పనిసరి! అలాంటి మూఢ విశ్వాసాల కంటించిన ఒక వేడిచురక "పళ్ళ పండగ" ఆచారం పేరిట జరుగుతూ వచ్చిన పాడు పనులనన్నింటినీ వ్యంగ్యంగా

దుయ్యి పట్టేశారికథలో చేకుమళ్ళ కామేశ్వరరావుగారు. మంత్రాలకు మామిడి కాయలు రాలవు. దెయ్యం జడిసేది దెబ్బకేనన్నది సారాంశం.

చుట్టూరా నెలకొన్న సమాజం వల్ల ఆడమనిషి జీవితం ఎలాంటి విషాద పర్యవసానానికి లోనౌతూ వచ్చిందో చిత్రించే రెండు కథలు ఈ సంపుటంలో వున్నాయి. సాంప్రదాయం పేరిట జీవితంలో అన్నివిధాలా వంచితురాలై, దుష్ట వ్యక్తుల దురన్యాయానికి బలై పోయిన ఒక వితంతువు కథ 'సర్వమంగళ'. లేమి మూలంగా అష్టకష్టాలకుగురై దయాదాక్షిణ్యాలు లేని కర్కశ వ్యక్తుల ఇనుప పాదాల క్రింద నుగ్గునూచమై పోయిన ఒక దుఃఖభాగురాలి దీనగాథ 'బాలింతరాలు'.

వ్యక్తిత్వంలేని ప్రాణిగా, చాకిరిచేసే యంత్రంగా మాత్రమే ఒకప్పుడు వితంతువుకు పరిగణన. ఎంత పని చేసినా కితాబు వుండదు. బంధువుల ఇళ్ళల్లో ఎక్కడెక్కడ వంటలక్క 'పోస్టు' ఖాళీ అవుతుందో అక్కడికల్లా ఆమె తరలింపబడేది. ఎంతటి బడుద్ధాయి మగవాడైనా నీళ్లు త్రాగినంత సులభంగా ఆమెపైన చొరవ తీసుకునేవారు. దురదృష్ట వశాత్తు శీలం కోల్పోతే ఆమె బ్రతుకు మరింత కనాకష్టమైపోయేది. ఆత్మీయులసహ్యించుకుంటారు. అమ్మలక్కలు ఆడిపోసుకుంటారు. ఆమె ఏడుపు అరణ్య రోదనం. అందుకనే ఒక వితంతువు తనదైన విషాద గాథను వినిపించు కోవడానికి మల్లాది రామకృష్ణ శాస్త్రిగారొక మామంచి దొడ్డతల్లినే శ్రోతగా ఎన్నుకున్నారు.

పట్టణాలు పేటలు, పల్లెలు హరిజనవాడలు—అంతటికే పరిమితమై పోవడంలేదు మానవ జనాభా! వాగుకు అవతలి వొడ్డున శ్మశానానికి ఆనుకుని వున్న మర్రిచెట్టు క్రింద గూడా కొందరు మనుషులు నివసిస్తారు. ఉగాదులూ, ఉషస్సులూలేని వట్టి వృథాజీవులు వాళ్లు. నీరసించిన గుండెల్నీ, అరుస్తున్న ప్రేగుల్నీ, ఎండిపోయిన ఎముకల్నీ దాచుకోడానికి

చిరిగిన పాత పేలికలైనా లేనివాళ్లు. ఓ యిరవై యేళ్ళ పడుచుపిల్ల దుఃఖ జీవితంలోనుంచీ ఆ నిర్భాగ్య మానవ సమూహాన్నంతా కథలోకి తీసుకొచ్చి పాఠకుడి కళ్ళ ఎదుట నిలబెట్టేస్తారు కథకులు రా.సీ. అంజనేయ శాస్త్రిగారు. ఒకప్పుడు అమృతధారల్ని చిందించిన ఆమె చూపులు కాలాగ్నుల్ని ఉమియడానికి కారణ మేమిటని ప్రశ్నిస్తారు.

సంసారాన్ని స్వర్గధామంగా మార్చుకోడం ఎంతో సులభ సాధ్యమేనని తెలుగు వారి గుండెల్లో ఎన్నెన్నో ఆశాభావాలు ప్రోదిచేసిన 'కాంతం' భర్తగారికి ఉన్నట్టుండి గొప్పచిక్కే ఎదురైంది. భార్యను విధేయురాలుగా చేసుకోడానికి ఏదైనా ఒక వశీకరణోపాయం ఉపదేశించమని ఒక పెద్ద మనిషి ఆయన్ను ఆశ్రయిస్తాడు. ఆయన చెప్పిన చిట్కా బెడిసి కొడుతుంది. మునిమాణిక్యం మార్కు ముచ్చటైన కథ 'బద్ నసీహత్'. ప్రతి మానవుడి మనోరాజ్యంలోనూ ఒక ఊహా సుందరి వుంటుంది. అతడామెను భౌతిక ప్రపంచంతో పోల్చుకోడానికి ఎడతెగని ప్రయత్నాలు సల్పుతూనే వుంటాడు. చేతికందినట్టేవుండి అందకపోవడం ఆమె లక్షణం. అలాంటి అప్రాప్త మనోహరికథ 'ఊహా ఊర్వశి'. ఈ సంపుటంలో పొందుపరిచిన పాలగుమ్మి పద్మరాజు, బుచ్చిబాబు, కొడవటిగంటి కుటుంబరావుగార్ల కథలు మూడూ మనో విశ్లేషణకు సంబంధించినవి. క్లిష్టతకు, వైచిత్రికి, క్షణక్షణపరిణామ శీలతకు తావలమైన మానవ మనస్తత్వం కథానికకు తరిగిపోని ముడి వస్తువు. వరదవెల్లువ లాంటి ఉద్రేకాలను గురించి, సహేతుకమైన వివరణకందక విశృంఖలంగా ప్రవర్తించే ఉద్వేగ ప్రకృతులను గురించి ఈ కథల్లో చిత్రించడం జరిగింది. 'అపనమ్మకం'లో మేనకోడలు, 'ఆ వాడిన ఆకులి'లో వదినగారు, 'పడవ ప్రయాణం'లో పద్దాలు ప్రియురాలి విచిత్ర మనస్తత్వానికి దాఖలాగా తెలుగు కథకుడు సృష్టించిన గొప్ప నమూనాలు.

శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారి 'గులాబీ అత్తరు' కథలో సంస్థానాల వైభవం తాలూకు చివరి వెలుగులు కనిపిస్తాయి—లోభులు, రసహీనులు, దుష్టులు అయిన రాజోద్యోగులు ఒక ముళ్ళ కంచెలా తయారై పోతే, కవులు కళాకారులు రాజుగారి నెలా సమీపిస్తారు? ఆత్మాభిమానానికి దెబ్బ తగిలినప్పటికీ ఆత్మ విశ్వాసాన్నీ, ఔద్ధత్యాన్ని గోల్పోని ఒక కళాశీలి కథయిది.

భమిడిపాటి కామేశ్వరరావుగారి కథ 'మడతపేచీ' మన పురపాలక సంఘాల నిరవాకం పైన నిశితమైన వ్యంగ్య రచన. సమాజంలో వేర్వేరు అంతస్తులకు చెందిన ఇద్దరు త్రాగుబోతులు ఒక రాత్రంతా జాగరణం చేసి ఉషః కాంతులతో బాటుగా బుద్ధి దెచ్చుకున్న కథ 'లి' గాడు. కవి కొండల వేంకటరావుగారి రచన. చిన్నప్పుడు గారాబంచేత, మధ్యకాలంలో తీరిక లేక, కొంచెం ముదురు పట్టాక అహంకారంతో కూడిన ప్రతిష్ఠ చేత బిడ్డల ప్రవర్తన పట్ల తల్లి దండ్రులు అశ్రద్ధ వహిస్తే జరిగే అనర్థాలను గురించి వివరించే కథ 'తీర్పు'.

అయిదారేళ్ళ పర్యంతం కొనసాగి, ప్రపంచ మంతటా మానవ జీవన పరిస్థితులను అస్తవ్యస్తం గావించిన రెండో ప్రపంచ యుద్ధం 1945లో ముగింపుకు వచ్చింది. 'వెంచాశా' గారి రచన 'పొరబాటు—అన్నయ్య!' ఆనాటి యుద్ధ వాతావరణాన్ని ప్రతిబింబించే కథ.

# 3

1935కు తెలుగు కథానిక పుట్టి పాతికేళ్లునిండాయి. ప్రతి ఇరవై అయిదేండ్లనూ ఒక తరంగా లెక్కకు తీసుకుంటే, మొదటి రెండు తరాల్లోనూ ఈ రంగంలో కృషిచేసి, తెలుగు కథా సాహిత్యాన్ని సుసంపన్నం గావించిన సుప్రసిద్ధులందరూ ఈ సంపుటంలో కానవస్తారు.

వేలూరి శివరామశాస్త్రిగారి కథ ఒక్కటి మినహాగా మిగిలిన కథలన్నింటిలోనూ కథనమంతా శిష్ట వ్యావహారిక భాషలోనే కొనసాగింది. రచయితలు నివసించిన ప్రాంతాలను బట్టి, ఎన్నుకొన్న పాత్రలను బట్టి ఆయాప్రాంతాల్లో ఆయా వర్గాలకుచెందిన ప్రజలు మాట్లాడుకునే జీవద్భాష ఈ కథల్లోని సంభాషణలలో వినిపిస్తుంది.

కథకుల్లో ఎక్కువమంది వృత్తి వ్యాపకాలరీత్యా పట్టణాలలోనే స్థిరపడినప్పటికీ, జనపదాలు,జానపదులూ అప్పటికింకా విస్మరింపబడలేదు. ఈ సంపుటిలో దాదాపు సగం కథలు గ్రామీణ జీవనానికి సంబంధించినవే.

1936 నుంచీ ప్రారంభమై 1945 తో ముగిసే ఒక దశాబ్దికాలంలో ప్రపంచమహాయుద్ధం ఒకటి ప్రారంభమై ముగిసింది. దేశంలో స్వాతంత్ర్యోద్యమం దాని పతాకస్థాయికి వెళ్ళింది. అమాంతంగా ధరలు హెచ్చి తిండికి కరువేర్పడింది. నగరాల్లో నిరుద్యోగ సమస్య పొడసూపింది. నాగరిక సమాజంలో మనిషికి మనిషికి మధ్య సద్భావం కొరవడింది. యువతలో అశాంతి చెలరేగింది. శతాబ్దాలుగా జాతిలో వేరూనుకొన్న గుడ్డి నమ్మకాలు ఒకవైపు చచ్చిపోసాగినా, మరొకవైపు సాంప్రదాయం పేరిట బాల్యవివాహాలు, వృద్ధవివాహాలు జరుగుతూనే వున్నాయి. వీరేశలింగంగారి వంటి మహాపురుషు లెంతగా ప్రయత్నించినా స్త్రీల జీవన స్థితిగతుల్లో యింకా చెప్పుకోదగ్గ మార్పురాలేదు. - పల్లెటూళ్ళల్లో యింకా శక్తియుక్తులున్న వాళ్ళదే రాజ్యంగావుంది. కూలీనాలీ బక్క జనానికి న్యాయం లభించడంలేదు. డబ్బున్న వాడు చట్టాన్ని తన గుప్పిట్లో పెట్టుకోగలుగుతున్నాడు. దిక్కులేని వాడికి రక్షణ లేక పోయింది. ఈ పరిస్థితులకు సర్దుబాటు కాలేని యువకుల్లో దేశాన్ని మార్చాలన్న జిజ్ఞాస బయల్దేరింది. ఇంకా యిలాంటి అంశాలు పెక్కింటిలో, ఆనాటి దేశ స్వరూపమంతా ఈ సంపుటిలోని కథల్లో ద్యోతకం గావడం గమనించవచ్చు. ఏ

సాహిత్య ప్రక్రియ యొక్క సార్థకత అయినా, అది సమకాలిక సమాజ జీవనాన్ని ఎంత వరకు ప్రతిబింబించిందన్న విషయంపైన ఆధారపడి వుంటుందని నిర్ణయించుకున్నప్పుడు, ఈ కథల సంపుటి సాంఘిక చరిత్ర కాక ప్రత్యామ్నాయంగా భావితరాల వాళ్ళకు ఉపకరించగలదని నిస్సందేహంగా భావించవచ్చు.

తెనుగు కథకు ఒరవడి దిద్దిన మహారచయితలకందరికీ ఒక భక్తి నీరాజనంగా ఈ కథలను యిలా సంకలనం చేసే అవకాశం నాకు ప్రసాదించిన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అధ్యక్షులకు, కార్యదర్శి గారికి, ఆధునిక సాహిత్య సలహా సంఘ సభ్యులకు హృదయపూర్వక నమస్కారాలు సమర్పించుకుంటున్నాను.

మధురాంతకం రాజారాం

# 1. తరువాత?

—చిలుకూరి నారాయణరావు

ఉత్తర క్షణములో ఎవరికేమి జరుగుతుందో ఎవరు చెప్ప గలరు?

ఇది ఒక మెట్ట వేదాంతపు మాట అని అనుకునేవాడను. ముందు రాబోయే విషయాలు మన యిచ్ఛాధీనము లనుకునేవాడను. "మేమీ దినము, రేపు, నెల్లాళ్ళయిన తరువాత, కొన్ని యేళ్లు గడచిన వెనుక, ఈ యీ పనులు చేస్తాము" అని చాలామంది అనడమూ, నేనుకూడా అనుకొనడమూ సాధారణముగా జరుగుతూనే ఉన్నది.

కాని, మనుష్యుల ఊహలు ఉత్త ఊహలే. ఒకప్పుడూహలు కొంతవరకు కార్యరూపములో నెరవేరినట్లే భాసించడమూ, ఇసుక పునాదులమీద కట్టిన గృహములవలె ఆ ఆకాశ హర్మ్యములు కూలి పోవడమూ, తరతరములుగా అనాదిగా అనుభవించినవారు చెప్పే విషయమే. అయినా, మానవుడు స్వశక్తిని నమ్ముకుంటూనే ఉన్నాడు. పరశక్తిని విస్మరిస్తూనే ఉన్నాడు.

అట్లా చేయకపోతే జీవయాత్ర సాగదు. జగల్లీల విస్తరిల్లదు.

దీనినే మోహమంటారు కొందరు; మాయ అంటారు మరి కొందరు.

ఇది మోహమూకాదు, మాయాకాదు; ఇది సత్యమే, అదీ సత్యమే అంటారు మరి కొందరు.

సత్యమయిన దొక్కటే; తక్కినదంతా అసత్యమే అని ఇంకా కొందరు.

సత్య పదార్థమే లేదనేవారుకూడా వున్నారు.
ఏమిటీ గొడవంతా ?
పుట్టుక ఏమిటి ? చావేమిటి ?
ఎందుకు పుట్టుతాము ? ఎందుకు చస్తాము ?
పుట్టే వాడెవడు ? చచ్చే వాడెవడు ?
పుట్టించే వాడెవడు ? చంపేవాడెవడు ?
పుట్టించడ మెందుకు ? చంపడ మెందుకు ?
అసలు పుట్టించేవాడున్నాడా ?
పుట్టించేవాడే చంపేవాడు కూడానా ?
లేక, వారు వేరా ?

"ఓయీ, వెర్రి వేదాంతీ ! చాలించవోయ్. పుట్టినవాళ్లు పుట్టుతారు; బ్రతికినవాళ్లు బ్రతుకుతారు; చచ్చేవాళ్లు చస్తారు. వాళ్ళతో నీకేమి పని ? నీ పనేదో నీవు చూచుకో. నీ ధర్మమేదో నీవు నిర్వర్తించుకో" అని ఎవరో ఉద్బోధిస్తున్నారు.

నాకు పని ఏముంది ?
నాకు ధర్మమేముంది ?
ఆ పని నేను కల్పించుకున్నదే కదా !
మరెవ్వరయినా నాకోసము కల్పించినారా ?
ఆ ధర్మమును నా కెవరు నిర్ణయించినారు ?
ఒకరు నిర్ణయించినదానిని నే నెందుకు నిర్వర్తించవలెను ?
లేక, ఆ ధర్మముకూడా నేను కల్పించుకొన్నదేనా ?
పనులను, ధర్మములను నేను నిర్ణయించుకొనడ మెందుకు ?
వాటి నాచరించలేక కష్ట మనుభవించడ మెందుకు ?
ఆచరింపలేదని ఒకరిచేత నిందను పొందడమెందుకు ?

నా పనిని నేను చేసుకుంటే ఎవరికి మేలు?

నా పనిని నేను చేసుకోకపోతే ఎవరికి కీడు?

నా ధర్మమును నేనాచరిస్తే లోకోద్ధార మవుతుందా?

ఏమో!

అవుతుందంటారు కొందరు-ఆచరించేవాళ్లు మాత్రము క్వచిత్తుగా కనబడుతారు.

వారయినా డంబముకోస మాచరిస్తారేమో!

ఏమో? ఒకరి ఊసు నాకేల?

*　　*　　*　　*

సరే! నా పనిని నేనుచేస్తాను; నా ధర్మమును నేను నిర్వర్తిస్తాను.

తరువాత?

"తరువాత?" అని ప్రతిధ్వని వస్తున్నది. ప్రత్యుత్తరము వినబడదు.

తరువాత? —నిశ్శబ్దము.

*　　*　　*　　*

వాజశ్రవసుడు విశ్వజిద్యజ్ఞము చేస్తున్నాడు.

నీరుగాని, గడ్డిగాని లేని బక్క ఆవులను దానము చేస్తున్నాడు.

కొడుకు నచికేతుడు చూచినాడు. "అయ్యో, ఇట్టి ఆవులను దానముచేసి నా తండ్రి సౌఖ్యములేని లోకములకు పోతాడే!" అని వగచినాడు. "తండ్రీ! నన్నెవరికిస్తా" వన్నాడు. తండ్రికి కోపము వచ్చినది. "నిన్ను మృత్యువుకిస్తానురా!" అన్నాడు.

నచికేతుడు:

"నాకు ముందెందరో పోయినారు; నాకు
వెనుక నింకెందరో యట్టె వెడలగలరు.

యముని కేనెట్లుపచరింతు ? అతడు నాకు
నేమి చేయంగ గలవాడు నిపుడు తండ్రి !
పూర్వులందఱు నెట్టుల పోయినారొ
వరుసఁబోయిరి తరువాతి వారుఁగూడ;
సస్య జాలంబువలెఁ జచ్చి, సస్యమువలె
మరల జనియించు చుండును మర్త్యుఁ డెపుడు''

అన్నాడు.

(ఇది కథ. నచికేతుని కెట్లు తెలిసింది "సస్యజాలమువలెఁ జచ్చి సస్యమువలె మరల తానున్న జన్మ మెత్తుతా" దని ?)

సరే ! నచికేతుడు మృత్యువు ఇల్లు ప్రవేశించినాడు. అక్కడ మూడు రాత్రు లుపవసించినాడు. బ్రాహ్మణు డిట్లుపవసించడము తన కనర్థ హేతువని మృత్యువు భయపడి, ''అయ్యా ! బ్రాహ్మణా ! దయ చేసి ఉపవాసము మాను. నీకు కావలసినవి మూడు వరములు తప్ప కుండా ఇస్తా" నన్నాడు.

''నీవు నన్ను విడిచిపెట్టు. నా తండ్రివద్దకు పంపు. అతడు నన్ను పోల్చుకొని తన కొడుకుగా పరిగ్రహించనీ'' అని మొదటి వరము కోరుకున్నాడు నచికేతుడు.

మృత్యువా వరమిచ్చినాడు.

''నాచికేతాగ్నిని గురించిన జ్ఞానము చాలా గొప్పదట. దాని నుప దేశింపు'' మన్నాడు నచికేతుడు రెండో వరంగా.

ఆ వరము కూడా ఇచ్చినాడు మృత్యువు. మూడో వరము కోరుకో మన్నాడు.

నచికేతుడు :

''మనుజుడు గతింప నాత్మయు మరలనుండు
ననుచు గొందఱు; ఉండదంచు గొంద
ఱందు; రీ సందియము నెల్ల అయ్య, నీవ
తీర్ప వలయు; నిదియె నా తృతీయ వరము"

అన్నాడు.

మృత్యువుకు గుండెలో గుభీలు మన్నది. ''మహాత్మా! మరి యేమయినా అడుగుగాని ఇది మాత్రము అడుగవద్దు. దేవతలకుగూడా ఇటువంటి సందేహమే కలిగింది. వారికి గూడా దీని రహస్యము తెలియ లేదు. నీకు సమస్త భాగ్య భోగ్యములను ఇస్తాను. సంతుష్టిపడు" అన్నాడు.

"నా కవేవీ వద్దు. ఇదే కావా''లని హఠము పట్టినాడు నచికేతుడు.

అప్పుడు మృత్యువు నచికేతునికి ఆత్మజ్ఞాన ముపదేశించినాడు. అదంతా ఇక్కడ వివరించ నక్కరలేదు. కఠోపనిషత్తు చదువుకొంటే తెలుస్తుంది.

ఆత్మ నిత్యుడు. అత డమృత స్వరూపి. అతనికి మృత్యువు లేదు. సకల దేహములలోను వర్తించి, వానిని చైతన్య సహితములుగా చేసేవాడతడే. ఆయా జీవులు తాము చేసుకున్న కర్మముల ననుసరించి ఆయా యోనులలో జన్మమెత్తుతూ వుంటారు. ఆత్మజ్ఞానము కలుగగానే జన్మరాహిత్యము కలుగుతుంది. అందుచేత మృత్యురాహిత్యమున్నూ కలుగుతుంది. కాబట్టి ఆత్మజ్ఞాన లబ్ధికోసము ప్రయత్నము చేయవలెను.

*  *  *  *

నచికేతునికి సందేహము తీరినది. కాని, నాకు తీరలేదు. ఎట్లు తీరుతుంది ? నేను నచికేతుడ నైతేకదా ? మృత్యువు సిద్ధ విషయమే కదా. ఏమిటా మృత్యువు—ఏమిటా మృత్యువు ? మృత్యువు చెప్పలేదు; నచికేతుడు తెలుసుకొననూ లేదు. ఈ సనాతన ప్రశ్న కింకా ఎవ్వరున్నూ సమాధానము చెప్పలేదు.

* * * *

సరే ! నిలువగ్రుడ్లు పడుతవి, లేదా కన్నులు మూతలు పడతవి. దౌడలు దగ్గరకు కఱచుక పోతవి. వాత పిత్త కఫములు ప్రకోపిస్తవి. గుండె కొట్టుకొనడము మానివేస్తుంది. శరీరమంతా చల్లబడి కొయ్యబారి పోతుంది. ఇదే మృత్యువు అంటారేమో. కాని ఈ అవస్థ మృత్యువుకు బయటి చిహ్నమవుతుంది గాని, అసలు మృత్యువంటే ఏమిటి ?......ఏమిటి ?.........ఏమో !

* * * *

శరీరమునకే మృత్యువు; ఆత్మకు కాదు. ఆత్మ శరీరములో చేరి సుఖదుఃఖముల ననుభవిస్తూ ఉంటుంది. ఎందుచేత ? అజ్ఞానము చేత అంటారు. ఆత్మ కజ్ఞాన మేమిటి ? అజ్ఞానము భ్రమ మూలముగా కలుగుతుందంటారా ? ఆ భ్రమ ఎందుకు కలుగవలెను ? తాను చేసుకొన్న కర్మవల్లనా ? కర్మ ఎందుకు చేయవలెను ? అట్లా ఇష్టమయినదా ? కానీ, ఆత్మకర్మానికి మనమేమి చేస్తాము ? ఆత్మ మాత్రమేమి చేయగలదు (డు) ?

* * * *

సరే ! మృత్యువు సిద్ధము. తరువాత ?

స్వర్గ మంటారు, నరకమంటారు— కొంత కాలమువరకు. తరువాత జన్మము - పూర్వజన్మ పరంపరా కర్మానుసారముగా, నిజమేనా?

'నిజమే, నమ్ము' అంటున్నవి శాస్త్రాలన్నీ. కాని, చచ్చి ఎవ్వడున్ను తిరిగి రాలేదు, మనకు చెప్పడానికి. పునర్జన్మము కాగానే పూర్వజన్మ జ్ఞానము మరపునకు వస్తుంది.

పూర్వజన్మ జ్ఞానము కలవారు కొంతమంది మహాత్ము లున్నారట. ఉండవచ్చును. నమ్మి సంచరించుకోవలసినది తప్ప అంధకారములో వెదుకులాడుతూ ఉన్న నాబోటి సామాన్య నరులకు దిక్కేమున్నది ?

*   *   *   *

మొన్న జనవరి మూడో తేదీనుంచి ఏడో తేదీవరకు చెన్నపట్టణములో పనిమీద నిలువవలసి వచ్చినది. నేను లేనప్పుడు నా భార్యకు గొప్ప గండము గడచినది. ఏడో తేదీ ఉదయము ఇల్లు చేరుకొన్నాను. ఆమె స్వస్థముగానే ఉన్నది. ఇద్దరమున్ను అర్ధగంటసేపు మాట్లాడుకొన్నాము. దేవుడు మా పాల నున్నాడని సంతోషించినాము. కాని ఆ సంతోషము ఆ అర్ధగంట మాత్రమే.

నేను కాలేజీకి పోదామని ఒక అడుగు ఇంటిలో నుంచి బయట పెట్టినాను. లోపలనుంచి పెద్ద కేక వినబడ్డది ! "ఏ మది ?" అని లోనికి పోయినాను. నా భార్య "నేను వెళ్ళుతున్నాను. పిల్లలను చూచుకోండి" అని ఊరకొన్నది. నా కళ్ళ యెదుట పెద్ద జ్యోతిస్సు కనబడినది.

ముప్పై యేండ్లుగా కలిసి ఈడ్చిన ఈ మహా సంసార రథము; ఒంటిగుర్ర మీడ్వ గలదా ?

ఒక్క నిమిషము. తుది లక్షణాలన్నీ వచ్చినవి. కదిలించినా స్మృతిలేదు. సూదితో గ్రుచ్చినా స్మృతిలేదు.

ఆసుపత్రికి మేఘూలమీద తీసుకొని వెళ్ళినాను. సర్జను చూచి పెదవి విరిచినాడు. కార్యము లేదన్నాడు. ఒకటో, రెండో నిముషము లన్నాడు.

ఒకటి......రెండు నిమిషములలో ఏమి చేయగలిగితే అది చేయం డన్నాను.

నా ధైర్యము చూచి ఆయనకున్ను ధైర్యము వచ్చినది.

చికిత్స చేసినాడు. అయిదు గంటల కాల మట్లే ఉన్నది; అప్పటికి కంటి రెప్పలు కదలినవి. ఆశ......

(ఇప్పు డామె బాగున్నది. క్షమించాలి. స్వవిషయము గనుక.)

ఇంటికి వచ్చిన తరువాత నవ్వుతాలుగా అడిగినాను: "నీకు స్మృతిలేనట్టు మాకు కనబడిన నీ అవస్థలో నీ కేమి కనబడినది?"అని.

"నా కేమిన్ని కనబడలేదు."

"ప్రయత్నంచేసి జ్ఞాపకం తెచ్చుకో."

"ఊహూఁ! ఏమిన్ని కనబడలేదు."

"పురాణాలలోను, శాస్త్రాలలోను ఏమేమో చెప్పుతారే!"

"అవి నిజము కావచ్చును. నా కేమీ కనబడలేదు."

"గట్టిగా ప్రయత్నము చెయ్యి."

చిరునవ్వు నవ్వింది. "ఆ తరువాత ఏముందో తెలిస్తే ఇంకేమున్నది?" అన్నది.

నా వంటిదే ఆ వెర్రి వేదాంతి.

* * * *

ఆమెకు స్మృతి తప్పిపోతున్నప్పుడు నాకు కనబడిన ఆ జ్యోతి ఏమిటి? శారీరక వికారమా? అయితే అటువంటి మెరపే నా మనసు

కుదుటపడిఉన్న ఇప్పుడు కూడా అప్పుడప్పు డెందుకు నా కళ్ళలో మెరుస్తుంది ?

బ్రతుకు చావుల మధ్య ఒక నల్లనితెర. అంధకారము కంటె గాఢాంధ కారము. తెర కీవల మన లోకములో వెలుతురు; ఆ తెర చాయ లీ వెలుతురులో మిళితములౌతూ ఉంటవి. తెర ఆవల మహా తేజస్సు; ఆ తేజస్సుకు ఈ చర్మచక్షువులు తాళలేవు.

ఆ తెరను చీల్చుకొని ఆవలి జ్యోతిలో కలిసిపోవడానికి ఆమె ఆత్మ ప్రయత్నించింది. ఆ సందులోనుంచి ఒక్క కిరణము నా యెదుట మెరసింది. ఇది భ్రమ కాదనుకుంటున్నాను. ఆమె ఆవలికి పోకుండా తెర మూతపడినది.

*          *          *          *

మళ్ళీ సంసారము. కామము – క్రోధము – మోహము * లోభము – మదము – మాత్సర్యము – జీవిత నాట్యము – జగల్లీల. అదే ఈశ్వర లీల.

(ఫిబ్రవరి, 1941)

# 2. శిలాప్రతిమ

– చింతా దీక్షితులు

౧

"త్యాగం అంటే ఏమిటండీ" అన్నాను భైరవ శాస్త్రుల్లుగారితో.

భైరవ శాస్త్రుల్లుగారు అప్పుడే భోజనముచేసి, అంగాస్త్రముతో చేతులు తుడుచుకొంటూ వచ్చి అరుగుమీద కూర్చున్నారు. రాత్రి ఎనిమిది గంటలయింది. ఆ సమయానికి ఆ చుట్టుపట్ల కాపురమున్న నేనూ యితర గృహస్థులూ భైరవ శాస్త్రుల్లుగారి అరుగుమీద చేరి పిచ్చాపాటీ చెప్పుకోవడం అలవాటు. భైరవ శాస్త్రుల్లుగారికి కథలంటే మహా సరదా. ఏ ప్రశ్న అడిగినా ఆ ప్రశ్నకు సమాధానంగా ఒక కథ చెప్తూతూ ఉంటారు.

"త్యాగం అంటేనా?" అని శాస్త్రుల్లుగారు ఒకమారు త్రేన్చి, కడుపు నవరించుకొని, అంగాస్త్రం నడుంచుట్టూ త్రిప్పి మోకాళ్లకిందకట్టి పర్యంక బంధం వేసుకొని "త్యాగం అంటేనా?" అన్నారు.

"చిత్తం. త్యాగం అంటే తమరేమి సెలవిస్తారో వినాలని వున్నది శాస్త్రుల్లుగారూ!" అన్నాను.

"భగవద్గీతలలో త్యాగం అన్నప్పుడు సర్వకర్మ ఫలత్యాగమే త్యాగముగా ఎన్నుకోవలసి ఉంటుందని చెప్పబడ్డది. అట్టి త్యాగమున్నూ సత్త్వ రజస్తమో గుణాల ననుసరించి మువ్విధముగా ఉంటుంది – అని చెప్పబడ్డది. కాని దరిమిలాను త్యాగార్థము అనేక విధాలుగా మారింది. త్యాగానికి ప్రసిద్ధార్థము ఈవి. ఋషితో సమానమైన

కాళిదాసుగారుకూడా "త్యాగాయ సంభృతార్థానాం" అన్నారు. అతడికి యెంత మాత్రమూ త్యాగం లేదన్నా, త్యాగబుద్ధి లేదన్నా లోకములో, ఈవి లేనివాడు అనే అర్థము చేసుకొంటారు.

ఇది ఇలా ఉండగా ఈ కాలములో ఆత్మ త్యాగమనే మాట తరుచుగా వాడుతున్నారు. దీని కర్థము దేహత్యాగమనే; అనగా ఉదాత్తమైన కార్యాన్నుద్దేశించి తన ప్రాణములను విడిచిపెట్టడమే. ఆత్మత్యాగమనే మాటలో ఆత్మకు దేహమనే అర్థం చెప్పాలి. ఎందువల్లనంటే ఆత్మ అనేదానికి త్యాగమంటూ ఉండదుకదా. "ఆత్మ త్యజించేదీకాదు, త్యజించబడేదీకాదు" అని శాస్త్రుల్లుగారు పొడుంకాయకోసం యిటూ అటూ వెతుక్కోవడం మొదలుపెట్టారు. కథ చెప్పడానికి బదులు వాక్యార్థం చేస్తున్నారు, అడ్డు ప్రశ్న వేస్తేనేగాని ఈ ధోరణి తగ్గదని అన్నానుగదా —"శాస్త్రుల్లుగారూ! ప్రాచీన కాలంలోనైతేనేమి, ఈ కాలంలో నైతేనేమి ఉత్కృష్టమైన త్యాగంచేసినవాళ్ళు చాలామంది ఉన్నారు గదండీ?"

శాస్త్రుల్లుగారు పొడుం పట్టు పట్టుకొని "తొందరపడకు, విశ్వం, తొందరపడకూ; వస్తున్నాగా — అయితే ఈ త్యాగమున్నూ అనేక విధాలుగా ఉంటుంది. మన విశ్వం చెప్పినట్లు గొప్ప గొప్ప త్యాగాలు చేసినవాళ్ళు పూర్వమందూ, ఇప్పుడూకూడా ఉన్నారు. అజమహారాజు, రఘు మహారాజు, శ్రీరామచంద్రులవారూ, శ్రీకృష్ణ చంద్రులవారూ—"

"అయితే శాస్త్రుల్లుగారూ-వీరు వీరు చేసినటువంటి త్యాగాలు—"

"తొందర పడకయ్యా, విశ్వం – చెప్పవచ్చినమాట ఏమిటంటే – మహాపురుషులైతేనేమి, స్త్రీలైతేనేమి, పూర్వకాల మందైతేనేమి, ఈకాల మందైతేనేమి, చేసిన త్యాగాలు అనేక విధములుగా ఉండుకుంటున్నవి. శ్రీకృష్ణ చంద్రులవారిని సత్యభామా అమ్మవారు నారదులవారికి దానము

చెయ్యడమనేది బహు ఉత్కృష్టమైన త్యాగ మనిపించుకుంటుంది. మరిన్నీ మరణించిన భర్తలతోపాటు సహగమనము చెయ్యడము అనే దేహ త్యాగము ఏదైతే గలదో అదిన్నీ ధర్మప్రేమ పరమావధిగా గలది అయినప్పటికిన్నీ అమ్మవారి త్యాగముతో సరితూగదు.

ఇది యిలా ఉండగా - శైవ సంప్రదాయ దీక్షితులైన భల్లాణ మహారాజులుంగారు జంగమరూపమున అతిథిగావచ్చిన శ్రీమహేశ్వరుల వారి భోగార్థమై నిజధర్మపత్నిని త్యాగము చెయ్యడ మనేది శైవులలో భక్తి పారమును తెలియజేస్తుంది.''

''అయితే శాస్త్రుల్లుగారూ! ఇట్టి త్యాగము శైవులలోనే గాకుండా మనలోకూడా ఉన్నట్లు భారతము చెప్పుచున్నది గదండీ—''

''అతిథి నినుగోరెనేనియు మతి గింకిరపడక యోలమాస గొనక నీ వతనికి సపర్య సలుపుము'' అన్నాడు గదా.

''అవును, ఆ మాట నిజమే, అతిథి అభ్యాగతులు విష్ణువుతో సమానులని ప్రమాణ వాక్యములున్నవి కాబట్టిన్నీ, మన దేహ ప్రాణ మానములు భగవంతునివే కాబట్టిన్నీ యిట్టి త్యాగమున్నూ భల్లాణ చక్రవర్తి త్యాగము వంటిదే అవుతుంది.

మరిన్నీ దేశక్షేమము కోసము యోధులున్నూ, దేవతా ప్రీతి కోసం ప్రాకృత భక్తులున్నూ, ఎట్టి త్యాగమైనా చేస్తారు.

అన్ని కాలాలలోను ఎక్కువగా చేయబడే త్యాగం స్త్రీ ప్రేమ కోసం అని మీకు తెలిసే ఉంటుంది.

అన్ని త్యాగాలకంటే అత్యుత్తమమైన త్యాగం ఏమిటంటే - ముక్తికోసం సర్వసంగ పరిత్యాగంచేసే సన్న్యాసిది. ఏలనంటే—''

"దీనికేదైన కథ ఉన్నదా శాస్త్రుల్లుగారూ?" అన్నాను, ఉండ బట్టలేక.

కథ మాటకువస్తే - కథా ఉన్నది! - దీనికి కాదుగాని - అయితే వినండి చెబుతాను.

౨

సుమారు యిప్పటికి రెండువందల ఏళ్ల క్రితం సంగతి.

ఆ కాలంలో రాఘవరాజు గత్తర అని ప్రజలు భయంతో చెప్పు కుంటూ ఉండేవారు. మొన్న మొన్నటిదాకా వీరాపురంలో ముసలివాళ్ళు కూడా ఒకమారు ఈ రాఘవరాజును తలుచుకొని భీతావహులవుతూ వుండేవారు. రాఘవరాజు అనే ధైర్యశాలి ఏ కులంవాడో తెలియదు. ఏ ఊరివాడో తెలియదు, కాని తనవంటి ధైర్యసాహసాలు కలిగినటు వంటిన్నీ, తనవలె బలాఢ్యులైనటువంటిన్నీ జట్టీలను యాభైమందిని పోగుజేసికొని అదునుచూచి గ్రామాలమీదపడి దోచుకుంటూ వుండేవాడు. ఆ కాలపు రాజులకు అట్టి దోపిళ్ళు తెలియనే తెలిసేవికావు. ఒకవేళ తెలిసినా వాళ్లు ఏమీ చేయలేకపోయేవారు. ఏలనంటారా - దొరతనము వారి సిబ్బంది ఒక తట్టునుంచి వస్తే రాఘవరాజు ముఠా యింకో తట్టుకు పారిపోయేది.

నానాటికీ రాఘవరాజు తొందర ఎక్కువైపోతోంది. ఏ విధంగా నైనా యితగాడిని రాజసైన్యముచేత పట్టిద్దామన్నా అతగాడి నివాసము కొండలలో.

కొండలలో ఒక కోటకట్టుకొని ఆ కోటలో తానూ తన సహ చరులూ మాత్రము ఉంటూండేవారు. వారికి కుటుంబాలున్నవో, లేవో, ఒకవేళ ఉంటే అవి ఎక్కడ ఉంచబడ్డవో ఎవరికీ తెలియదు.

ఈ రాఘవరాజు తొందర తట్టుకోవడం చుట్టుపట్టులనున్న గ్రామాలకు చాలా కష్టమౌతూ ఉన్నది. ఉన్న ధనమూ, బట్టలూ, జవాహరీ భోషాణాలలో దాచుకొన్నా లాభంలేకుండా ఉంటున్నది. కోటలవంటి యిళ్ళల్లో కాపురముండే మోతుబర్లు చేతికిచ్చి దాచిపెట్ట మన్నా లాభము లేకుండా ఉంటున్నది.

ధనముపోతేపాయె. అతగాడు పెట్టే బాధలు సహించడం బహు కష్టంగా ఉండడంవల్ల గ్రామస్థులకు ఏమి చేయడానికీ తోచలేదు. తాము పన్నులు చెల్లిస్తున్నప్పటికిన్నీ, తా మెన్ని మారులో మొరపెట్టు కొన్నప్పటికిన్నీ, తమ ఏలిక ఏమీ చెయ్యలేకుండా ఉన్నాడు. అత గాడిని అని లాభం లేదుకదా! ఇక చేయవలసిందేమిటి?

ఆయా గ్రామాలలో ఉండే పెద్దలందరూ సమావేశమయ్యారు. కర్తవ్య మాలోచించారు. తమ యేలికకు పన్నులిచ్చే బదులు ఈ రాఘవ రాజుకే ఏటేటా పన్నులు చెల్లిస్తూ ఆయన్నే తమ యేలికగా ఏర్పాటు చేసుకుంటే తమకు ఇంత ధననష్టమున్నూ ఉండదు. బాధలున్నూ ఉండవు. క్లేశమున్నూ ఉండదు.

అయితే అందుకు రాఘవరాజు సమ్మతిస్తాడా? దేశాలు దోచు కొనే దొంగ అనిపించుకోవడంకన్న గ్రామాలనుండి పన్నులు వసూలు చేసుకొంటూ, అందుకు ప్రతిఫలంగా గ్రామస్థులను రక్షించుకొంటూ రాజ చిహ్నములు ధరించి ఏలిక అని అనిపించుకోవడముకు అతడు సమ్మతించడా?

ఈ యేర్పాటులో మరిన్నీ మరి వక చిక్కు ఉన్నది. అదేమిటంటే తమ్ము యింతవరకున్నూ పాలిస్తూన్న ఏలిక తమకు పన్నులు చెల్లించడం లేదనే కారణంవల్ల ఈ గ్రామాలమీదికి దండెత్తివచ్చి ధ్వంసము చేస్తే అప్పుడు చెయ్యవలసినదేమిటి? ఈ రాఘవరాజు గత్తరకన్న

ఆ యేలిక దండయాత్ర బహు క్రూరముగా ఉండవచ్చు. చెప్పరాని బాధలు అప్పుడూ అనుభవించవలసి ఉండవచ్చు. ధన ప్రాణముల కప్పుడున్నూ అపాయము కలగవచ్చు. అయితే దీనికి ఉపాయమేమిటి? తమ యేలిక తమ్ము శిక్షించవలెననే క్రోధముతో ఒకవేళ దండెత్తివస్తే తమ గ్రామాలను కాపాడే బాధ్యత రాఘవరాజే భరించవలసి ఉంటు దనిన్నీ, అట్టి బాధ్యత వహించే పక్షమందే అతగాడికి తాము పన్నులు చెల్లించవలసి ఉంటుందనిన్నీ వారు నిర్ణయం చేసుకొన్నారు.

అందుకొరకై రాఘవరాజుతో రాయబారాలు నడపడమునకై గ్రామస్థులలో కొందరు పెద్దలు ఏర్పాటైనారు. ఈ రాయబారము బహు ప్రమాదకరమైన కార్యము. ఏమంటారా? తానెంత సాహస వంతుడైనా, ఎన్ని ఊళ్లు తాను నిరాఘాటంగా దోచుకుంటూ ఉన్నా, తన కెంత బలగంవున్నా రాఘవరాజు నిరంతరమూ భయముతోటే మెలగుతూ వుండేవాడు. ఏ మూలనుంచి ఏ సైన్యము వచ్చిపడుతుందో, తనపై కసి తీర్చుకోవడానికి గ్రామస్థులు ఎట్టి కుట్రలు పన్నుతున్నారో, ఏ చెట్టు వెనక ఏ శత్రు వున్నాడో, ఎక్కడ నుయ్యో, ఎక్కడ గొయ్యో - అని అతగాడి భయం.

ఈ రాయబార కార్యాన్ని అతడు కుట్రగా భావించి రాయ బారుల నందరినీ అతడు చంపివెయ్యవచ్చు. లేదా వారి నా కొండలలో బంధించవచ్చు, వారిని చిత్రవధ చేయవచ్చు. ఏమిచేసినా చేయదగ్గ వాడే గదా!

ఇట్టి సందర్భంలో రాయబారం నడపదలచుకొన్న పెద్దలు ప్రాణాలకు తెగించియే ఈ కార్యానికి పూనుకొన్నారని వేరే చెప్పనవ సరం లేదుగదా!

ఆటవికుల వల్లనూ, చారుల వల్లనూ గ్రామస్థులు రాఘవరాజు కోట, కొండలలో ఎక్కడ వుండేదీ తెలుసు కొన్నారు. రాయబారులు

భత్యాలు మూటకట్టుకొని ప్రయాణం సాగించారు. గుట్టలు దాటారు, సెలయేళ్ళు దాటారు, కొండలు దాటారు. ఎక్కడా మనిషి అలికిడి లేదు. జంతువులూ లేవు. పక్షులు మాత్రం అక్కడక్కడ దృగ్గోచర మయ్యేవి.

నిర్ధారణగా రాఘవరాజు కోట యిక్కడ వున్నదని తమకు చెప్పేవారెవరూ లేరు. స్వతంత్రముగా తెలుసుకొనే ప్రయత్నములు విఫలమౌతూన్నవి. ఆనాటి సాయంకాలం ఒక కొండ పక్కనే విశ్ర మించవలెననుకొన్నారు. అక్కడ నీరు ఉన్నది. విశ్రమించడానికి ఎత్తైన బండ లున్నవి. మృగ భయము ఉంటుందనే అనుమానంతో నెగళ్లు వెలిగించుకోవా లనుకొన్నారు. ఈ విధంగా ఆలోచించుకొంటూ మూటలు దింపుకొంటూ ఉంటే-పదిమంది సాహసులు ఎక్కడినుంచో వచ్చి వాళ్ళని బంధించారు. వాళ్లు మొలల్లో కఠారులు దోపుకొన్నారు. చేతుల్లో కత్తు లున్నవి. గిరజాల జుట్లు. చల్లాడాలు తొడుక్కొన్నారు. వాళ్లు మాట్లాడలేదు. రాయబారుల చేతులు వెనుకకు విరిచి కట్టివేశారు. కళ్ళు కనిపించకుండా గట్టిగా గుడ్డలతో బిగించారు. వాళ్ళ మూటలు వాళ్ళ భుజాలకు మళ్ళీ కట్టివేసి వాళ్ళను నడిపించుకు పోయారు.

రాయబారులకు సగము ప్రాణాలు పోయినవి. కాళ్ళతో తడుము కొంటూ, రాళ్ళూ, వేళ్లూ పాదములకు తగిలినప్పుడు తూలుతూ పడుతూ, కొమ్మలు మొహాలకు తగిలినప్పుడు బుర్ర వంచుతూ నెమ్మ దిగా నడుస్తూ పోయారు. ఎప్పటికి ఈ బాధ అంతమౌతుందో తెలియ లేదు. తాళ్ళు పట్టుకు వాళ్ళు నడిపించుకు పోతూనే ఉన్నారు. వీళ్ళు వాళ్ళ ననుసరించి పోతూనే ఉన్నారు.

"ఎవరు నాయనా, మీరు ? నిరపరాధులను మమ్ము యీ విధ ముగా యేల బంధిస్తిరి ? మావల్లవచ్చిన అపరాధమేమిటి ? మమ్మెల్ని

యిట్లా చేయడంవల్ల మీకు వచ్చేలాభం ఏమిటి ?" అన్నాడు రాయబారులలో ఒక్కడు.

సమాధానంలేదు.

సూర్యుడస్తమించాడో లేదో తెలియదు. ఎండుటాకుల చప్పుడు తప్ప మరేశబ్దమూ వినబడ్డంలేదు.

నెమ్మదిగా నడచివెళ్లుతూఉండగా ముందునడచేవాళ్లు ఆగినట్లు రాయబారులకుతోచింది. వాళ్లూ ఆగారు, వాళ్లను ఎత్తి గాడిదలమీదవేసి కట్టినట్లు వాళ్లు గుర్తించారు. గాడిదలు ఎంతసేపో నడచినవి. ఏ దిక్కుగా నడచినవో, ఎంతదూరమునడచినవో వాళ్లకు ఆనుపానులు చిక్కలేదు. ఎప్పటికి యీ యాత్ర అంతమునకువస్తుందో వాళ్లకు గోచరించలేదు.

## 3

చేతులకట్లువిప్పారు. కళ్లకట్లువిప్పారు. చేతులు స్వాధీనమునకు రాలేదు. మొద్దుబారినవి. అంతా చీకటిమయం. నిలబడ్డచోటనే నిలబడిపోయారు.

కొంతసేపైన తర్వాత వాళ్లకు ఒక కొండవంటి పదార్థం కనిపించింది. నిదానంగా చూడగా అది కొండలమధ్యకట్టిన యిల్లని వాళ్లు గుర్తించారు. ఆ యింట్లోకి రాయబారులను వాళ్లు తీసుకుపోయారు. అక్కడవాళ్లను వదలి వెళ్ళిపోయారు. విస్మయము, భయము, ఆశ, నిరాశలమధ్య ఊగులాడుతూ వాళ్లు ఆరాత్రి ఆ కొండ యింట్లో కలత నిద్రపోయారు.

తెల్లవారింది. అడవిపక్షులు కిలకిలలాడుచున్నవి. వాళ్లు కళ్లు నులుముకు లేచారు. కాలకృత్యాలు తీర్చుకొన్నారు. కర్తవ్యం ఆలోచిస్తూ ఉండగా ఇద్దరు ఆజానుబాహులు వచ్చి వాళ్లనురమ్మని సైగచేశారు.

రాఘవరాజు సమక్షానికి తీసుకుపోయారు. అది కొండగుహ అయినప్పటికీ చాలా విశాలంగాఉన్నది. మంచములు, పరుపులు, దిండ్లు, పీకిదోనెలు వగైరాసామానులు గుహనిండా ఉన్నవి. రాఘవరాజు ఒక పరుపు మీద దిండునానుకు కూర్చున్నాడు. ఆజానుబాహువు. వర్చస్వి.

రాయబారులు చేతులుజోడించి ఎదుట నిలువబడ్డారు. వారిలో నాయకుడు ముందుకువచ్చి యీ రీతిగా విన్నవించుకొన్నాడు: ''మహాప్రభూ! తమ కీర్తి దిగంత విశ్రాంతము; తమ సాహస పరాక్రమములు అర్జునుణ్ణి మరపునకుతెస్తవి. తమ హృదయము దయార్ద్రము. మహాప్రభూ! మేము తమ దర్శనంచేసుకొని తమతో ఒక్కమాట మనవి చేసుకోవలెనని వస్తూఉండగా-ఈ పుణ్యాత్ములెవరో తమ సమక్షానికే మమ్మల్ని తీసుకువచ్చారు. వెదుకబోయినతీగ కాళ్లకే తగిలింది. ఆడబోయిన తీర్థమెదురైనది. శకునములు మంచివైనవి. తాము ఉదారులు. మా కార్యము తమవల్లకాకపోదు మహారాజా!''

''ఎవరు మీరు? ఏమిటి మీ కార్యం?''

''తాము పాలించే గ్రామాలలో నివసించే బీదగ్రామస్థులము మేము, మహారాజా!''

''మేము ఎట్టి గ్రామములూ పాలించడములేదే?''

''తమరు పాలించడానికి సమర్థులైఉండిన్నీ, రాజనీతి పారంగతులై ఉండిన్నీ, సాహసవిక్రములై ఉండిన్నీ ఎందువల్లనో యథాక్రమంగా గ్రామాలను పాలించకపోవడం యథార్థమే కావచ్చు, మహారాజా! కాని మేముమాత్రము-యాభై గ్రామముల కాపురస్థులము, మీకు సమీపమందుండే గ్రామాలలో నివాసంచేస్తూన్నవాళ్లము, తమరినే ధర్మప్రభువులనుగా ఎంచుకొంటూ తమరే మా యేలికగా భావించుకొంటూ ఉన్నాము, మహారాజా! కాబట్టి తమరు మాకు ఏలికగావుండి, మావల్ల

తాము పన్నులు గ్రహిస్తూ, మమ్మల్ని రక్షించే భారం వహించరా మహాప్రభూ !"

"అందుకా మీరువస్త ?"

"చిత్తము, మహాప్రభూ !"

"మీ యేలికకు పన్నులుచెల్లించకుంటే అతనివల్ల మీకు ఉపద్రవము సంభవించదా ?"

"తమరి అండజేరిన మాకు ఎట్టి ఉపద్రవములూ సంభవింపవని మా ధైర్యం. తమరు నిజముగా విజృంభిస్తే తమ పరాక్రమమును ఎవ్వరు తట్టుకోగలుగుతారు, ధర్మప్రభూ !"

రాఘవరాజువారు చెప్పినమాటలన్నీ విన్నాడు. తన సహచరులతో ప్రసంగించాడు. ఇటువంటితరుణం పోగొట్టుకోవడం మంచిది కాదనుకొన్నాడు. ఈ రాయబారములో మోసములేదని తేల్చుకోవడమునకున్నూ, గ్రామస్థుల సద్భావమును పరీక్షించడమునకున్నూ, తాను ఏలికఅయ్యే పక్షమందు తనపదవిని దృఢపరుచుకోవడమునకున్నూ కొన్ని షరతులు ఏర్పాటుచేశాడు. ఆ షరతులప్రకారం వాళ్లు నడచే పక్షమందు తాను వారి యేలికగా ఉండి ఎట్టి ప్రమాదములూరాకుండా కాపాడతానని చెప్పాడు. తక్షణం యాభై గ్రామాలవారూ తనకు ఆయేటి పన్నులు చెల్లించడం మొదటి షరతు. గ్రామములలో ఉండే పురుషులలో యుక్తవయస్సువచ్చిన వాళ్లందరూ తనవద్ద తరిఫీదుపొంది అవసరమైనప్పుడు తనకు యుద్ధకార్యములలో సహాయముచెయ్యాలి.

ప్రాకారము, బురుజులు, కందకము మొదలైనవాటితో అతనికి ఒక కోట అనువైనతావున గ్రామస్థులే కట్టించవలెను.

ప్రతి గ్రామమునకున్నూ ప్రాకారములు, బురుజులు, కందకములు ఆ గ్రామస్థులే కట్టుకోవలెను.

ఈ షరతులు రాయబారులు వప్పుకొన్నారు. రాయబారులను గౌరవించి, బహూకరించి, కొంతవరకూ తన మనుష్యులను తోడుయిచ్చి వారిని సాగనంపించాడు రాఘవరాజు.



రాఘవరాజుకు మొదటి దఫా పన్నులు చెల్లినవి. గ్రామస్థులు సద్భావముతో ప్రవర్తిస్తున్నారని అతడు గ్రహించాడు. తాను తన అనుచరులతో తన స్వాధీనమందుండే గ్రామాలనన్నింటినీ చూచినాడు. గ్రామస్థులను పురిగొల్పి ప్రతి గ్రామమునూ ఒక చిన్నకోటగా మార్చి వేసినాడు. అన్ని గ్రామములలోను గరిడీ లేర్పాటుచేసినాడు. యుద్ధ పరికరాలు చేయించినాడు. యుక్తవయస్సుగల పురుషులందరినీ కూర్చి సైన్యము తయారుచేశాడు.

అన్ని గ్రామాదులకూ అందుబాటుగా ఉండగలందుకున్నూ, రక్షగా ఉండగలందులకున్నూ, తాను తన ప్రజలు కొందరితో నివసించ గలందులకున్నూ ఒకకోట కట్టడానికి అనువైనస్థలము నిర్ణయముచేశాడు.

కంటక బాధ తీరినందుకు ప్రజలు సంతోషించారు. కాని తమ మొదటి యేలికనుండి ఎట్టి చిక్కులు వస్తవో అని భయపడుతున్నారు. ఆ భయమున్నూ రాఘవరాజు తీర్చినాడు. ఆ ఏలికతో తాను రాయ బారాలు నడిపాడు. కప్పము కొంత తాను క్రమముగా చెల్లించడానికి వప్పుకొన్నాడు. తాను సామంతరాజుగా ఉండుటకు అంగీకరించమని కోరాడు. యాభై గ్రామములవారూ తన చెప్పుచేతలలో ఉండుటకు అంగీకరించారనిన్నీ, తనద్వారా వారిసేవ ఏలిక పొందవచ్చుననిన్నీ నచ్చజెప్పాడు. ఇట్టి తరుణము పోగొట్టుకుంటే ధన, ప్రాణముల కపార నష్టము సంభవించగలదని కూడా సూచించాడు. ఎన్నడూ స్వక్రమ

ముగా పన్నులు వసూలుకాని కారణముచేత ఆ యేలిక యీ యేర్పాటు లకు వప్పుకున్నాడు. గ్రామస్థులు సంతోషించారు.

*  *  *  *

అయితే భైరవశాస్త్రుల్లుగారూ-ఈ కథలో త్యాగమనేది ఆ రాయ బారులు చేసినట్లా యీ రాఘవరాజు చేసినట్లా మీ అభిప్రాయమేమిటి ?" అన్నాను. వేళ అతిక్రమిస్తోంది. కళ్లుబరువెక్కుతున్నాయి. ఎంతకీ కథ ముగియడంలేదు.

"మళ్లీ తొందరపడుతున్నావూ, విశ్వం ? జరిగిన కథలోలేదు త్యాగం. ముందు వస్తోంది-కథా కావచ్చిందిలే-" అన్నారు భైరవశాస్త్రుల్లు గారు.

"చిత్తం-కానీయండి"

౩

పూర్వకాలాల్లో రాజులకు కోటకట్టవలసివస్తే అది నరబలిలేకుండా జరిగేదికాదు. కోటకు సౌభాగ్యము, దేశమునకు కల్యాణము యీ నర బలివల్లనే చేకూరగలదని ఆనాటి నమ్మకం. రాఘవరాజు కోట చురు కుగా తయారవుతోంది. ప్రాకారాలులేచినవి. కొంతవరకు కందకములు త్రవ్వడమైనది, కందకములకు నీరు కొండ సెలలనుంచి తీసికొనివచ్చు టకు కాలవలు త్రవ్వుతున్నారు. మూడు దిక్కులా మూడు బురుజులు తయారైనవి. నాల్గవదిక్కున బురుజుకట్టవలసి ఉన్నది. అక్కడే, అది కట్టుటకు ముందుగానే నరబలికూడా జరగవలసి ఉన్నది. నరబలి కోసమని బలవంతాన మనుష్యులను తీసుకురావడం ఆనాటి ఆచారము కాదు. ఐచ్ఛికముగా ధైర్యోత్సాహములతో ఎవ్వరైనా అట్టి బలికి సం సిద్ధులు కావచ్చు. అట్టి బలిలో ఆ ధైర్యవంతులు దేశసేవ చూడవచ్చు. అట్టి బలిలో వారు మోక్షము చూడవచ్చు, దేహమును బలియిచ్చినంతనే

దేశకల్యాణము, ధర్మస్థాపన, మోక్షము కలుగునని నమ్మకమున్నప్పుడు దేహాభిమానులు కానివారు యిట్టి నరబలికియ్య కొందురంటే ఆశ్చర్యమేమిటి? ఇట్టి ఆశయములకే ఎందరీ కాలములో దేహత్యాగం చెయ్యటంలేదు? నాల్గవ బురుజుకట్టి ప్రాకారము పూర్తిచేయవలసి ఉన్నది. బురుజుకు పునాదులు నరదేహముమీదనే పడవలెను.

నరబలికి ముహూర్త మేర్పాటైనది. బురుజుకు పునాదుల కొరకై పెద్ద గొయ్యి తవ్వినారు. ఆ గోతిలో ముత్తైదువులు పసుపూ కుంకుమచల్లినారు. పెద్దలూ పిన్నలూ స్త్రీలూ పురుషులూ ఆబాల గోపాలమూ ఆ గోతిలో-పళ్లో, బట్టలో, నాణెములో, పసుపో, కుంకమో, పువ్వులో ఏదోవకటి వేస్తూవచ్చారు. ముత్తైదువులు మంగళహారతి పళ్లెములు పట్టుకొని గోతికి కొంత దూరముగా నిలబడ్డారు. మేళతాళాల వాళ్లు వారికి ముందుగా నిలబడ్డారు. గోతిచుట్టూ వీరపురుషులు పునాదిరాళ్లదగ్గర నిలబడ్డారు.

ముహూర్తం సమీపిస్తోంది. ఎవరు నరబలికి ఆ ముహూర్త కాలానికి సరిగావచ్చి ఆ గోతిలో దూకుతారో తెలియడంలేదు. వ్యగ్రోత్సాహులై అశేషజనమూ కనిపెట్టిచూస్తూ ఉన్నారు. వారి ఉత్సాహములో భయమూ, జాలీ, ధర్మబుద్ధి తాండవ మాడుచున్నవి.

ముహూర్తం సమీపిస్తూన్నది.

దూరమున ఒక చక్కని స్త్రీ కన్నులనుండి బాష్పములు జారుచున్నవి. పసుపురాసుకొన్న మొహమైనప్పటికి తెల్లదనము కనిపిస్తోంది. ఆవిడకెదురుగా నిలబడ్డా డొక పురుషుడు. కండలు తిరిగిన శరీరం. ఆమె ఆ శరీరానికి పసుపుకలిపిన మంచిగంధం పూసింది. ఆ పురుషుని మెడలో మందారపుష్పమాలవేసింది. అతడామె చేతులు పట్టుకున్నాడు. దిగులు పడవద్దని అతని కళ్లు ఆమెతో చెప్పినవి.

ఆమె అతనిభార్య ! అతడు బలియగుటకు - దేశక్షేమమునకై, ధర్మమునకై బలి అగుటకు ఆమె సమ్మతించింది. కడసారిమాటు ఆమె నతడు చూచాడు. తల తిప్పుకొన్నాడు. ఆమెచేతులు వదలినాడు. ఫీట్కారముచేస్తూ గోతివైపు అతడు దుమికినాడు.

ఆమె అక్కడనే నిలిచియున్నది. ఆమె దృష్టి అతని మీదనే నిలిచియున్నది. ఆమెకు రెప్పపాటుపడలేదు. దేహము కదలలేదు. ఫీట్కారశబ్దము ప్రజలు విన్నారు. ఒక్కమారు అతనికేసి చూచారు. ''హరహరశంభో''-ఒక్కమారు కోటి గొంతుకలలోనుంచి బయలు వెడలింది. తూర్యనాదాలు చెలరేగినవి. స్త్రీలూ పురుషులూ అతని మెళ్లో పుష్పమాలలు వేస్తున్నారు. అతనికి కొత్తబట్టలు కప్పుతున్నారు. ముత్తైదువులు కర్పూరాలు వెలిగించి మంగళహారతులు పాడమొదలు పెట్టారు.

ఆమె అక్కడనే నిలిచియున్నది. ఆమె దృష్టి అతనిమీదనే నిలిచియున్నది. ఆమెకు రెప్పపాటు పడలేదు. దేహము కదలలేదు.

వీరహుంకారాలు, తూర్యనాదాలు, హరస్మరణలు, మంగళ హారతులు-ఈ ఘోషలో ఆ వీర పురుషుడు 'శంభో' అని ఉచ్చైస్స్వర ముతో అర్చి ఒక్క గంతువేసి గోతిలోకి దుమికాడు-సరిగా ముహూర్త కాలముకు చుట్టూనిలిచిన పురుషులు పునాదిరాళ్లు గోతిలోకి తోశారు. వాద్యఘోష మిన్ను ముట్టుతున్నది. రాళ్లతో గోయి నిండింది. ''హర, హర, శంభో'' దిక్కులు నిండినది.

ప్రజలింటి ముఖము పట్టారు. బురుజుకట్టుటకు పనివాళ్లు అప్పుడే పూనుకొన్నారు. క్రమక్రమంగా జనసమ్మర్దం తగ్గింది. కాని —

ఆమె అక్కడనే నిలిచియున్నది. ఆమెకు రెప్పపాటు పడలేదు. దేహము కదలలేదు.

రాఘవరాజు నరబలి చూచాడు. ప్రజల ఉత్సాహము చూచాడు. ఆ వీరుని ధైర్యసాహసాలు మెచ్చుకొన్నాడు. ప్రజలు యిండ్లకు వెళ్లడం చూచాడు. అందరూ యింటికిపోయినా ఒక స్త్రీ మాత్రం కదలక మెదలక ఒక్కచోట నిలబడి ఉండడం అతడు గ్రహించాడు. కారణము తెలుసుకోందామని ఆ స్త్రీని సమీపించాడు. అత డామెను చూచాడు. ఆమె అతన్ని చూడలేదు. పలకరించాడు. మాటాడలేదు. భయపడి తిరిగివెళ్లి పోయాడు. ఆ రాత్రి అక్కడ కాపలా ఉంచాడు. మర్నాడు మళ్లీ వచ్చి చూచాడు. అక్కడ స్త్రీ విగ్రహంలేదు. స్త్రీ ప్రతిమ ఉన్నది. అక్కడ ఆమె నిలిచియున్న తావుననే; ఆమె కళ్లే; ఆమె దేహమే; ఆమె ముఖమే; ఆమెయే.

ఆమె అక్కడనే నిలచియున్నట్లున్నది. ఆమె దృష్టి అతని మీదనే నిలిచియున్నట్లున్నది. ఆమెకు రెప్పపాటులేదు.

ఒక్క కలి కాల ఖండములో, ఒక్క సతి, ఒక్కనాటిలో, శిలా ప్రతిమగా మారి తన సతీత్వమును ఘనీభవింప జేసింది.

ఆనాటినుండి ఆ శిలా ప్రతిమను ప్రజలు పూజిస్తూ ఉండేవారు.

రాఘవపాలెం జమీందారుగారి కోటదగ్గిర యీ శిలా ప్రతిమ నేడు కూడా మనము చూడవచ్చు. కాని మన మది శిల్పి మలిచిన విగ్రహమనుకుంటాము.

రాఘవపాలెం జమీందారుగారు రాఘవరాజుగారి సంతతివారే అని చెప్పు కుంటారు. ఈ మధ్యవారికి 'రాజా' అనే బిరుదు దొరతనము వారిచ్చేరని వదంతి.

*        *        *        *

"అయితే భైరవశాస్త్రుల్లుగారూ-అతగాడు చేసిన త్యాగం సాత్విక రాజస తామసాల్లో ఏదిగా ఎన్నుకోవలసి ఉంటుందండీ" అన్నానులేచి.

"అబ్బాయీ, విశ్వం, అతగాడుచేసిన త్యాగం గొప్పదైనా అంతకన్నా గొప్ప త్యాగంచేసిన అతనిభార్య సంగతి ఎత్తుకోవేమి?"

చిత్తం. ఆ మాటనిజమే-ఇక సెలవిప్పిస్తారా?

"మంచిది. త్యాగమన్నప్పుడు అంతకుమించిన త్యాగమెక్కడా నాకు కనిపించలేదు సుమా!"

"చిత్తం. సెలవు"

(సెప్టెంబరు, 1938)

# 3. జీవుడి యిష్టము

—విశ్వనాథ సత్యనారాయణ

౧

ఒక మారుమూల సముద్రంలో ఒక ద్వీపం ఉంది. ఆ ద్వీపం కూడా యెక్కడో మారుమూల ఉంది. ఓడలమీద సముద్రాలను నాగరకులు గాలించారు. అంత గాలించిన ఆ ద్వీపం ఒక పట్టాన కనిపించలేదు. నాగరకులు సర్వ ప్రపంచము, సముద్రపు నీళ్ళలో తేలిన ప్రతి-మంటిగడ్డ తాము సాధించామని అనుకొన్న తరువాత ఆ ద్వీపం ఉన్నదని తెలుసుకునేందుకే కొన్ని వేల యేండ్లు పట్టినవి. తెలుసుకోటమే ఆలస్యము. మతాలు, వర్తకులు, తుపాకులు అక్కడికి చేరినవి. ఆ ద్వీపంగూడా డిటో ప్రకారం అయింది

అయితే ఆ ద్వీపంలోవాళ్ళు ఇతర ప్రపంచంలో లొంగిపోయిన యితర ద్వీప నివాసులకంటె కొన్ని వేల సంవత్సరాలు ఎక్కువ స్వాతంత్ర్యం అనుభవించారు. అందుచేత వాళ్ళు బానిసతనం అంత తేలికగా అలవాటు చేసికోలేక పోయినారు. ఇతరచోట్లకు మల్లేనే అక్కడా తిరుగుబాట్లు, మరఫిరంగులు, కాల్పులు.

ఒక నాగరకజాతి సేనా నాయకుడు ఆ ద్వీపానికి సైనిక నియంత. అతడు బ్రహ్మచారి. అనగా అవివాహితుడన్నమాట. ఆ ద్వీపము శీతమండలాల్లో ఉండటం మూలంగా అక్కడి జనులు తెల్లని వాళ్ళు. చర్మము తెల్లన. ఇతర ఖండములలోని అనాగరకుల వంటి వారు. అనగా కోట్లకొలది సంవత్సరాలు బ్రతికిన జాతి అన్నమాట

చెట్టులో - పుట్టలో, సూర్యునిలో - చంద్రునిలో, కాలువలో - కొండలో, మెరుపులో - మేఘములో నేదో దివ్యశక్తి యున్నదని దాని నారాధించిన వాళ్లు. మెరుమునుచూస్తే జేజేలు పెడతారు. మిణుగురు పురుగులనుచూచి తొలగిపోతారు. ప్రాణశక్తివంటిది వాళ్లకు మహా గౌరవము. ప్రాణాన్ని నేలక్రింద పడవేసి రాయరు. జీవుణ్ణి కాలిక్రిందబెట్టి త్రొక్కరు. బంగారము నాణెముగా వాడుకోరు. దానియందు తేజశ్శక్తి ఉన్నదని ఆరాధిస్తారు. కుండ పెంకులలో వండుకొని తింటారు. లోహపాత్రలు నాగరికత అని యెరుగరు. శరీరావయవములు కావలసినంత మాత్రము కప్పుగొంటారు. నాగరకులై ఒళ్ళంతయు కప్పుకోరు. ఈ యనాగరకులు నాగరకులయ్యే రోజులువచ్చి ఆ ద్వీపం నాగరకుల కంటబడ్డది.

సైనిక నియంత ఒక స్త్రీని చూచాడు. ఆమె అందం అతని కళ్ళు పట్టరాకండా ఉండిపోయింది. ఆ సాయంత్రం ఆవిడ మొగుడికి కబురు పంపించాడు - నీ భార్యని నాకు తోలిపెట్టమని. ఆ జీవుడు యేమి చేస్తాడూ.? ఇంతవరకే తమ ద్వీపంలో జరిగిన ఘోరాలు అతనికి తెలుసు. అయినా జీవుడు పెనగులాడడం స్వభావం. అది అన్యాయమనీ, తన ప్రాణము పోయినా తాను తన భార్యను వదలిపెట్టనని కబురంపించాడు. నియంతకు కోపం వచ్చింది. పదిమంది సైనికులు, తుపాకులతో వాని యింటికి వెళ్ళాడు. అతడు వీళ్లు వస్తారని తెలిసి పొయ్యిలో పెట్టుకొనే పొడుగాటి పుల్లలు తానొకటి, తన పెద్దకొడుకొకటి చేతులలో పుచ్చుకొని, తమ గుడిసె ముందర నిల్చున్నారు. వారి యాయుధాలను, వాళ్ళను చూస్తే నియంతకు నవ్వు వచ్చింది. అతడు "ఎందుకు నవ్వుతావు?" అని యడిగాడు. నియంత ఇట్లా అన్నాడు : "ఓరి మూర్ఖుడా! మా తుపాకులముందు నీ కట్టెపుల్లలు నిలుస్తవా?" అని. అతడన్నాడుకదా - "నా కట్టెపుల్లలు నీ తుపాకులకు సమాధానము చెపుతవనిగాదు నే నీ కర్రలు పుచ్చుకొన్నది. నా మనస్సు

నీ మనస్సుకు సమాధానం చెప్పవలెననికాని మరొక దానికి గాదు'' అని.

నియంతకు కోపము వచ్చింది. ఒక్క కత్తి విసరుతో తండ్రి కొడుకుల తలలు తెగిపోయినవి. నియంత ఆ గుడిసెలో ప్రవేశించి అతని భార్యను తీసుకు రాబోయినాడు. ఆరేండ్ల మొదలు చనుబాలు త్రాగే శిశువువరకు నలుగురు పిల్లలు గుడిసెలో ఏడవ మొదలుపెట్టారు. ఆ స్త్రీ తన పిల్లలను వదలి రాలేకపోయింది. భర్త శవం, కొడుకు శవం మీదబడి యేడవడం మొదలుపెట్టింది. సైనికులు శవాలను తీసి కొని పోయారు. సముద్రంలో పారవేశారు. ఆమె యిక పిల్లలను పట్టు కొని యేడవటం మొదలుపెట్టింది. సైనికులు నియంత ఆజ్ఞతో పెద్ద పిల్లలను ముగ్గురినీ తల్లి చేతులలోంచి లాక్కొని పది పదకొండుసార్లు విదలించివేయగా వేయగా వాళ్ళు దెబ్బలుతగిలి, ఉస్సురని ప్రాణాలు కడవట్టి చనిపోయినారు. ఆ స్త్రీ పాలుత్రావు పిల్లతో నియంత యింటికి వెళ్ళింది.

౨

ఈ కథ జరిగి అయిదేళ్ళయింది. పాలుత్రాగే పిల్లకు అయి దేండ్లు వచ్చినవి. ఆ స్త్రీ ఆ పిల్లతో కాలం పుచ్చుతోంది. ఒక రోజున నియంత వచ్చాడు.

నియంత — ఆ పిల్లకూడ పోతేగాని నీవు నాతో సరిగా ఉండవు.

స్త్రీ — నీకన్న కర్కోటకుడవు నీవే! నీవు మనుష్యుడవు కావు. ఈ పసిపిల్ల ప్రాణములుకూడా తీస్తావా?

నియంత—నిన్ను తీసుకువచ్చినప్పుడు ఇది పసిపిల్ల. ఇప్పుడు పసిపిల్ల కాదే! దీని యీడుపిల్లలను అప్పుడు నీ దగ్గరనుండి లాగి వేయలేదా? అట్లాగే ఇప్పుడూనూ.

ఆ స్త్రీకి అతనితో అయిదేండ్లున్న తరువాత అతని యే మాటకు ఎంత అర్థమో తెలిసినది. తనబిడ్డ తనకు మిగులదని ఆమెకు తెలిసింది. ఆ పిల్లను తీసుకువెళ్లి అతనిచేతిలో పెట్టి ''యిదిగో, పిల్లను చంపివేయి. ఈ పిల్ల ఉన్నన్నాళ్లు నేను దానిని వదలిపెట్టలేను" అన్నది. అతడు ఆ పిల్లను ఆమెయెదుటనే కత్తితో రెండుగానరికాడు. ఆమె యేడుస్తూ వెళ్లిపోయింది.

## 3

ఆమె కొన్ని రాత్రులు ఉరిపోసుకొందామనుకుంది. పోసికోలేదు. ఆమె కొన్ని రాత్రులు సముద్రములోబడి చద్దామనుకుంది. చావలేదు.

ఆమె కొన్ని రాత్రులు కిరసనాయిలు మీదపోసికొని నిప్పు ముట్టించుకుందా మనుకుంది. ముట్టించుకోలేదు.

ఇల్లా యెన్నో అనుకుంది. ఏమీచేయలేదు. తరువాత కొన్నాళ్లకు ఒక రాత్రి నియంత తప్పత్రాగి మదించిన కళ్లతో ఆమెవున్న గది లోనికి వచ్చాడు. "తనకు దుఃఖానికి భేదములేదు" అన్నట్లుగా ఉన్న ఆమెను చూచాడు. ఇట్లా అన్నాడు :

''నీ మగడు, నీ పిల్లలుపోయి పదేళ్లయింది. నీ పసిపిల్లపోయి అయిదేళ్ళయింది"

స్త్రీ — నా ద్వీపపు స్వాతంత్ర్యంపోయి పాతికయేండ్లయింది.

నియంత—(వెటకారముగానవ్వి) ఇంకా యెన్నాళ్లీ దుఃఖం ?

స్త్రీ — ఈ శరీరం వున్నన్నాళ్లు.

నియంత—నీకు ఏమి తక్కువగా ఉంది ? పూర్వంకన్న మంచి దుస్తులు ధరిస్తున్నావు. పూర్వంకన్న మంచి ఇంట్లో నివసిస్తున్నావు.

పూర్వంకన్న మంచి భోజనం చేస్తున్నావు. నేను నిన్ను ప్రేమిస్తున్నాను. నీ జాతికన్నా నా జాతి గొప్పది నీ భర్తకన్న నేను గొప్పవాడను.

స్త్రీ—నీవు నా భర్తకన్న గొప్పవాడవు కావు.

నియంత—(కోపముతో) కానా ! ఎట్లు కానో చెప్పుము.

స్త్రీ—మీకు తుపాకులున్నవి. కత్తులున్నవి, అతనికి యేమీ లేవు. అయినా తన భార్యను, పిల్లలను రక్షించుకునేందుకు కర్రపుచ్చుకొని నిలబడ్డాడు. రక్షించలేనని తనకు తెలుసు. అయినా తన ధర్మం తాను చేశాడు. తాను చచ్చిన తరువాతగాని నిన్ను నా దగ్గరకు రానీయ లేదు. నేను నిజముగా నీ భార్యనైఉంటే నీకన్న బలవంతుడు నాకోసం వస్తే, నీవు పారిపోయేవాడవు. నీవు వట్టి పిరికిపందవు.

నియంత— (కోపముతో) నేను పిరికిపందనుకాదు.

స్త్రీ—నీవు పిరికిపందవని నా కానాడే తెలియును. నీవు ధైర్యస్థుడ వైనచో నింకొక కర్రపుచ్చుకొని అతని నెదిరించెడివాడవు. అంతమంది సైనికుల నేల తెత్తువు ?

నియంత—(నవ్వి) అయినచో ఆ చచ్చు వెధవను నేను కర్ర పుచ్చుకొని యెదిరించలేకపోతిననియా నీ యుద్దేశ్యం ?

స్త్రీ—అతను చచ్చిపోయినాడు. నీమాటకు ఋజువు ఏమున్నది? ఇప్పుడు నీ ధైర్యాన్ని నీవు నాకు ఋజువు పరచలేవు నిజంగా నీవు ధైర్యస్థుడవే అయితే అప్పుడలా చేసి యుండవు.

నియంత—నాకు ధైర్యము లేకపోవుటకాదు. నా కప్పుడీ తెలివి లేక పోయింది.

స్త్రీ—మా జాతిలో తెలివికి ధైర్యానికి యెక్కువ భేదంలేదు. న్యాయానికి తెలివికి యెక్కువ భేదంలేదు, మాకు న్యాయమే తెలివి. తెలివే ధైర్యం.

నియంత—మఱి యిటువంటివారితో, నాతో నీవు సంసార మెందుకు చేస్తున్నావు ?

స్త్రీ—నేను నీతో సంసారము చేయుటలేదు.

నియంత—ఈ మాటలు వింటే యెవరైనా నిన్ను మూఢు రాల వను కొంటారు.

స్త్రీ—నేను వాళ్లని మూఢులనుకుంటాను.

నియంత—అయితే నీకు నాతో ఉండటం యిష్టంలేదన్నమాట.

స్త్రీ—లేదని నీతోచెప్పట యిది యెన్నిలక్షలోసారి.

నియంత—నీవు నన్ను ప్రేమించటంలేదని నాకుతెలుసు, నీ ప్రేమను నేను సాధుమార్గాన సంపాదించవలసింది. అప్పుడు ప్రేమించే దానవు.

స్త్రీ—నీ జాతి అంతా నశించిన తరువాత నిన్ను ప్రేమిస్తాను.

నియంత—నిన్ను చంపేస్తాను.

స్త్రీ — పదియేళ్లనుంచి అలా చేస్తావేమోనని యెదురు చూస్తు న్నాను.

నియంత—నీకు చావంటే అంత యిష్టమా ?

స్త్రీ—అంతా యింతా యిష్టమా ?

నియంత—అయితే చావడానికి మార్గాలులేవా ?

స్త్రీ—ఉన్నవి.

నియంత—అయితే ఎందుకు చావవు ? సముద్రంలోపడి చావ వచ్చు. ఉరిపోసికొని చావవచ్చు.

స్త్రీ—నా కట్లా చావడం యిష్టంలేదు.

నియంత—ఎట్లా చావడం యిష్టం ?

స్త్రీ—నీకు కోపముతెప్పించి నువ్వు నన్ను చంపితే చావాలని.

నియంత—అంటే, నీకు నామీద ప్రేమ ఉన్నదన్నమాట.

స్త్రీ–అవును, ఉంది. ఆ ప్రేమ యెల్లాంటిదంటే–నాభర్త, నా పిల్లలు నీచేతిమీదుగా చచ్చారుగనుక అలా నీచేతిమీదుగానే చద్దామన్నంత ప్రేమ.

నియంత–ఈ మాటలకేమిగాని నీకు చావడానికిష్టంలేదు.

స్త్రీ—చాలాపొరపాటు. చావటానికిష్టం ఉన్నది. ఆ యిష్టము కూడా ఒళ్లంతా తగలబెడుతూ ఉన్నంత యిష్టం. కాని చావు రెండు రకాలు, ఒకటి తనంతట తాను చచ్చేదావు. రెండవది యెదటివాళ్లు చంపితే చచ్చేచావు. నాకు రెండవ చావే యిష్టము.

నియంత— అంటే నాతోకలిసి సుఖించడం యిష్టమన్నమాట.

స్త్రీ—నిన్ను నేను పదేండ్లనుంచి యెరుగుదును. నీవు పశువువు. నీ నాగరికత అంతా నీవుచేసే సురాపానంలో, నీవు ధరించే దుస్తుల్లో, నీచేతిలోనున్న తుపాకి మందులో ఉంది. నీమనసులోలేదు, నీజాతిలో లేదు. నీసృష్టిలోలేదు. నిన్ను నేను ప్రేమించటంలేదు; నీవు మనుష్యుడవేకాదు. నేను బ్రతుకుతున్నానన్న విషయం నీకాశ్చర్యంగా ఉంది. నేను ఉరిపోసికునో, సముద్రంలో పడో చావటం నా జీవుడికి యిష్టం లేదు. నాజీవుడు ఈ శరీరాన్ని పట్టుకున్నాడు. వాడంతటవాడు వదలిపోడు. ఆ నా చనిపోయిన భర్తకోసం, పిల్లలకోసం గుండె అటమటించి చావటం, మహాగ్ని జ్వాలలతో గ్రమ్మిపోవటం ఈ జీవుడికి యిష్టం. ఈ జీవుడికి యిదియొక అనుభవం. ఆ జీవుడు తనంతట తాను చచ్చిపోడు. చచ్చిపోవటానికి యిష్టపడడు, సౌఖ్యమనుభవిద్దామని కాదు. దుఃఖమనుభవిద్దామని. సౌఖ్యమో దుఃఖమో యీ శరీరంతో పుట్టి, యీ శరీరానికి సంబంధించినవి అనుభవించటమే అతనికిష్టం. ఈ

శరీరానికి, యీ జీవుడికి ఒక యెడతెగరానిలంకె. ఈ శరీరంతో ఈ జీవుడికి యిష్టమైన అనుభవము వాడు అనుభవమను కొంటాడు. మరి యీ శరీరంతో నేను నీతో సంసారము చేస్తున్నాను గనుక అది వాడి యిష్టమే అనుకుంటావు కాబోలు. అల్లాకాదు. నా అంతట నేను చావటం నా కిష్టంలేదు. నీవు చంపితే చచ్చిపోవటం చాలా యిష్టం. మృత్యువు దానియంతట అదివస్తే చావటం యింకా యిష్టం. అట్లాగే ఈ జీవుడు ఈ శరీరంతో తన యిష్టంవచ్చిన సౌఖ్యాన్ని అనుభవించి సౌఖ్యం అనుభవించాననుకుంటాడు. ఇతరులవల్ల బలవంతంగా చేయు బడ్డ అనుభవం అదివాడికి సౌఖ్యంకాదు. అది దుఃఖమే. ఆ దుఃఖమైనా అనుభవించటం అతని కిష్టం.

నియంత-అయితే నీవు నాకక్కరలేదు.

స్త్రీ—నేను నిన్నడుగలేదు.

నియంత-నిన్ను చంపుతాను.

స్త్రీ—ఊరికే అనట మెందుకు?

నియంత ఆమెను చంపెను. చనిపోవుచున్న యామె పెదవి మీద సంతోషపునవ్వు తాండవించెను. ఆమె కొన యూపిరితో నిట్లనెను. "నీవు నీజన్మలోచేసిన మంచిపని యిది యొక్కటియే. నేను చనిపోవుచుంటినిగదా! నీవు తరువాత యేమిచేసెదవు?"

నియంత—మరల నింకొక స్త్రీని సంపాదించెదను.

స్త్రీ—నీకు తగినమాట! నీజాతికి జీవుని యిష్టము తెలియదు.

(ఏప్రెల్ 1941)

# 4. వ్యత్యయము

—వేలూరి శివరామశాస్త్రి

౧

నరసింహులుకు కాటఁడు పాలేరు. ఇపు, డిరువురికిని సుమారు ఎనుబదేండ్లు.

కాటఁడు నమ్మినబంటు. నరసింహులయింట దొంగలు పడినపుడు కాటఁడు తానే వారిదెబ్బలు తినెను. పని పట్టినపుడు ముసురురేలఁ గాఁబడవులఁగుండ పయనించి దొరపనులన్నియు సాధించెను. ఊరంతయు కాలిపోవుచున్నపుడు తన శరీరమంతయు కాలినను దొరయిల్లు కాపాడెను.

నరసింహులుకూడ కాటని కఱవులలో కాపాడెను. పెండ్లిపేరంటము లొనరించెను. ఇల్లు కట్టించియిచ్చెను. కూడు గుడ్డలకు వెతుకు కొన నక్కఱలేకుండఁజేసెను. ఇటులు దొరవలన పాలేరును, పాలేరు వలన దొరయు సుఖజీవన మొనరించిరి.

ప్రాయము పడమటికి తిరిగినపిమ్మట దొరకును, పాలేరునకును పుత్రోదయమాయెను. దొరకొడుకు సోములు, పాలేరుకొడుకు రాములు. కొడుకులఁగని యాయమ్మ లిరువురును ఒకరి తరువాత నొకరు పసపు కుంకుమలతో పరలోక మేఁగిరి.

ఒకనాఁడు కాటఁడు నలుగురిసాయముతో నరసింహుల యింటికి నడచివెళ్లెను. మడిగట్టుకొని యున్నసోములు కాటనిజూచి 'దూరముగా నుండుమని' కరాళించి లోనికి తొలఁగిపోయెను.

గదిలో జ్వరశయ్యమీఁద నున్న నరసింహులు - 'ఏమిరా నాయనా! ఏల యటులు బొబ్బవెట్టెదవు?' అని యడిగెను.

'ఉఁహుఁ. వింటివా? పాముచెవులు! ప్రొద్దుననే కాటఁడు, మధ్యాహ్నమున కాటఁడు, సాయంకాలము కాటఁడు. కాటఁడు కాటఁడు! అని సోము లనెను.

నరసింహులు కష్టపడుచుకొనుచు వాకిటికివచ్చి అరఁగుపై కూరుచుండెను. మాలఁడు భక్తిపూర్వకముగా తల నేలమోపెను. బాపఁడు దీవించెను. వా రొకరినొకరు తమతమ ఆరోగ్యముగుఱించి ప్రశ్నించుకొనినపిదప కాటఁడు - 'స్వామీ! నా కిఁక స్వామిసేవ చేయఁగల భాగ్యములేదు. ఇదియే చివరచూపు...' అని చెప్పుచుండఁగా అతని కంఠము స్తంభించెను. పలుకుగద్గదమాయెను. కనుల నీరోడెను. కాటఁడు కాష్ఠమువలె క్రిందఁబడెను; నరసింహులు లేచి రెండడుగులు ముందరికి వేయుచుండఁగా నలుగురు కలిసి కాటని లేవఁదీసి కూరు చుండఁబెట్టిరి. కాటఁడు కొంచెము సేపటిలో కన్ను దెఱచి చూచెను.

నరసింహులు కన్నీరు బొటబొట జాఱుచుండఁగా-'కాటా! మన మిరువురమును ఒకపడవనే యెక్కితిమి. నీవు ముందు నేను వెనుక. నీ విఁక దుఃఖింపకుము! నారాయణుని స్మరింపుము' అని యనెను.

అదియే యుపదేశముగా కాటఁడు నారాయణమంత్రమును గ్రహించెను. అటుపిమ్మట నతఁడు తనకొడుకునుదక్కఁ దక్కఁగల బంధుగుల నవలికిఁబంపి నరసింహులయెదుట నొక మూట విప్పెను— నూ అర కాసులు. కాటఁడు వానిఁజూపి—'అయ్యా! ఇది మీసొత్తే. ఇవి తమ కడనే సంపాదించితిని. నా కొడుకున కిఁక మీరే దిక్కు. అక్కఱలో వీని నతని కిత్తురు గాక'అని మనవిచేసెను. నరసింహులు సోములను బిలిచి కాసుల సంగతి చెప్పి భద్రపఱపించెను. కాటఁడు

ముమ్మారు మ్రొక్కి నారాయణుని స్మరించుచు పలువురసాయమున తనయింటి కేఁగెను.



నరసింహు లచటనే కూరుచుండి పలుమారు లావులించెను. అతని కదియే తుదిసెలవుగా కానిపించెనా? అతఁడు నిట్టూర్చి ఆకాశము కేసి చూచుచుండెను. అతని కేమియు తోఁపలేదా? ధనముకన్న విలువ యగువస్తు వేమేని పోవుచున్నదా? ఔను. తానును కాటఁడును ఒకరి వెనుక నొకరు దున్నిరి. పాంద్రపొలములను పంటపొలములనుగా మార్చిరి. రాత్రులందు చేలగట్లమీద నెదురుబొదురుగా శయనించిరి. నీరు కట్టిరి, కోసిరి, కుప్పలువేసిరి, నూర్చిరి. వారి కిండ్లకడనే దవ్వు. పనిలో ప్రేమలో ఒకటే చేయి, ఒకటే మనసు.

కాటని బాహుబలమును దానికన్న మిన్నయగు విశ్వాసమును తన సౌభాగ్యమునకు కారణము. ఆ భాగ్యముచేతనే తాను బవంతి కట్టుకొనెను, కాటనికి ఇల్లు కట్టించి యిచ్చెను. తాను పెండ్లిచేసి కొనెను, కాటని నొక యింటివానిఁ జేసెను. అట్టి కాటఁడు తనకడనే కాక యిహలోకముకడ సెలవుగొనిపోవుచుండగా ధనముకంటె విలువఁ గల పదార్థ మొకటి తనను మఱపించిపోవుట లేదా?

నరసింహు లటులు కూరుచుండి కూరుచుండి రేయిచొరుదల యందు కాటనిఁ గానఁబోయెను, అమ్మదపుదివ్వె వెలుఁగు చుండఁగా నరసింహులు కాటని కాయమును కనుఁగొనెను. అతనికి దుఃఖమును సంతోషమును ఒకతూరియే కలిగెను. రాముఁడు 'దొరగారు వచ్చిరి, దొరగారు వచ్చిర'ని తండ్రిచెవిలో నూఁదెను.

ఇపుడు చెవిలో నూఁదవలయునది 'నారాయణ' అని నరసింహు లనెను.

కాటఁడు 'నారాయణ' అని అనెను. అతఁడు కనులెత్తి కనలేక పోయినను నరసింహులదెస చేతు లెత్తును. అంతట నరసింహులు జ్వర బాధచే గడగడవడఁకుచు వెనుదిరిగిపోయెను. నరసింహులు ఇల్లుచేరి తన ఆస్తిలో మూఁడవపాలు కాటని కొడుకు రాములకు వ్రాసి రాముని పిలిపించి యాకాకిత మతనికిచ్చెను. రాములు దానిని సోములకడ దాఁచనిచ్చెను.

నరసింహు లంతట నపథ్యమయినను స్నానముచేసి శయ్యా నాశ్రయించెను. స్పృహకలిగినపుడు ఇచట నరసింహులకును అచట కాటనికిని నారాయణ స్మరణముతక్క వేఱుమాట లేదు.

ఎవరము ముందర పోదుమా యని పన్నిదము చఱచిన చంద ముగా వా రిరువురు నొక్కొక్క యింద్రియమును విడనాడుచు మృత్యువు ముంగలికి పరుగిడిరి. శ్మశానమున స్వామిభృత్యు లిరువురు నొకరి వెలుఁగును మఱియొకరు చూచుకొనుచు కలిసియే పరలోక మరిగిరి.

3

సోములు కడుఁ గొలఁది కాలములోనే సొంత సేద్యపు కామా టము ఎత్తివేసెను. తన పొలములనే కాక తన తండ్రి రాముల కిచ్చి వైచిన పొలమునుగూడ నమరకపఱిచెను.

సోముల కిపుడు కావలసినంత తీరిక. ఆఁతడే యిపుడు కులము నకును, గ్రామమునకును పెద్ద. సంఘ వ్యవహారములకు, గ్రామ వ్యవ హారములకును అతఁడే యిపుడు పరిష్కర్త.

ఒకనాడు సోములు గీతలు చదివి ఇటులు అర్థముచెప్పి కొనుచుఁ బోవుచుండెను—'ఎఱుకగలవారు విద్యావినయములు కల బ్రాహ్మణుని

యెడలను, ఆవు నెడలను, ఏనుఁగు నెడలను, కుక్క యెడలను, మాలని యెడలను సమబుద్ధి కలవారు.'

రాము లపుడు సోముల యెట్టెదుటికి వచ్చి చేతులు జోడించి దూరముగా నిలువఁబడెను. రాములను చూచినంతనే సోముల అవస్థ మాఱెను. అతఁడు గజిబిజిపడి గీతలుమూసి నేల చూచుచుఁ గూరు చుండెను.

రాము లిటు లనెను—'అయ్యా! తమ తండ్రిగారును వారి బంటును ఒకరి నొకరు వదలలేక వదలలేక తుదకు కలిసియే పయ నించిరి. వారి యిరువురి స్థానములందును ఇపుడు మనమున్నాము. మా నాయన విశ్వాసమే నాకు తమయెడఁ గలదు. తమ నాయనగారి అనుగ్రహమునే తమరు నాయెడ నవలంబింపుఁడు. నేను మీ వ్యవసాయ మంతయు చేసెదను. మీరు లోటుపాటులు సవరించుకొను చుండుఁడు.'

సోము లిటు లనెను—'నేను వ్యవసాయ మెత్తివైచితిని. అందు లకు నీ విఁక ఒడలు విఱుచుకొన నక్కఱలేదు.'

'నాకిదియంతయు అయోమయముగా నున్నది. ఇంత తొందరగా తమ రింత తాఱుమాఱేల చేసితిరి!'

'దీనిలో అయోమయముగా నుండుట కేమున్నది? మా నాయన గారికి వ్యవసాయమే వృత్తి నాకిఁక అదికాదు. అందుల కని అంతయు అమరకపఱచితిని.'

'అటులగుచో నా పత్రమును, నా కాసులను నాకిండు.'

'నీకు పొలమును లేదు. కాసు లంతకన్న లేవు. నా పొల మంతయు పాలున కిచ్చుకొంటిని. అదంతయు మా సొత్తు!'

'తమ నాయనగారు వ్రాసిన పత్రమును చెల్లునటులు చేయరా?'

'నా అనుమతి లేకుండ పత్రము వ్రాయుటకు నా తండ్రి కేమి హక్కు ? దొంగలును దొంగలును కలిసి ఊళ్ళు పంచుకొని రనినటు లున్నది. నీనా తండ్రులు కలిసి పయనించిరనికదా యనఁగలిగితివి ! ఏమి ? చాలు నీ మరియాద. ముక్కుపచ్చలు మానకమునుపే బిరుదు పిచ్చుక కాట్లాడ వచ్చినదఁట ! చేతనగుచో వ్యవహారము చేసికో !' అని చివాలున లేచి పత్రము తెచ్చి ముక్కలు ముక్కలుచేసి ముంగిటఁ బాఱవయిచి లోని కేఁగి తలుపులు మూసికొనెను.

రాము లా కాకితపు ముక్కలకేసి చూచుచు చాలసేపు అచటనే నిలువఁబడెను. రాములకు కాళ్ళక్రింద భూమి లేనటులాయెను. 'ఔరా వ్యత్యయము' అని అనుకొనుచు నిలువఁబడి నిలువఁబడి అతఁ డాముక్కల నన్నింటిని ప్రోగుచేసి మూటకట్టుకొనెను. తన అదృష్ట మిపుడు తన మూటలోనే కలదని రాములకుఁ దెలియును. అదృష్టమో దురదృష్టమో తానే యిపుడు నిర్ధారణ మొనరించుకొన వలయును. ఇపుడు ధర్మమునకు ప్రతినిధియగు నరసింహులును లేఁడు, కాటఁడును లేఁడు. ఇపుడు వారి యిరువురయు స్మృతిమాత్ర మున్నది. ఇటుల వారిని స్మరించుచు రాములు కొంచెము దవ్వుగా పోయి కూర్చుండెను.

సోము లన్నము తినుచుఁ దినుచు చివాలున లేచి తలుపు తీసికొని ముంగిటికి వచ్చి పరికించి చూచెను. అచట నొక కాకితమేని కనఁబడక పోయెను. గాలికి అటు ఇటు కొట్టుకొని పోయెనేమో యని నలుమూలలు తిరిగి చూచెను. కానిపింపలేదు. అతనికి పిచ్చులును వెఱ్ఱులును పుట్టుకొని వచ్చెను.

ఈ ప్రమాదమును గుర్తించి సోములభార్య దీపముఁగొని వాకిటిలోనికి రివ్వునవచ్చి తానును నేలయంతయు కలయఁజూచి—'మీరు పత్రము చింపితి రని నేరము రాదుకదా. కొంప తవ్వ' అని యనెను.

సోముల కావెలుఁగున నంధకారమే యెక్కువాయెను. అతఁ డాకాశముచూచి పిడికిలించి—'రాముఁడే ఎత్తుకొని పోయియుండును. ఇది వానిపనియే. కానీ, కోర్టున్నది; వాఁడున్నాఁడు. ఈ యాస్తి వెల యెంత యుండునో అంతయు కక్కించక దీనిని వానికిఁ దక్కనీయను. కాని యిది నేరము కాదుకద ?' అని యనెను.

రాము లిటు లనెను—'అయ్యా ! జడియకుఁడు ! మీరు చింపి వైచిన కాకితపుముక్క లన్నియు నివిగో ! తాము వీనిని జాగ్రత్త పెట్టుకొనుఁడు.'



పదుగురికి అన్నముపెట్టు కాటనియిల్లు నేఁడు పొల్లు. రాముఁడు లోగఁడ అన్నాభావ మెఱుఁగఁడు. రెన్నాళ్లనుండి పస్తు.

అతనితోఁ గలిసి బడిలో చదివికొనిన రెబెకాకు రామునియవస్థ తెలియును. తలిదండ్రులకు తెలియకుండ ఆమె అన్నముతెచ్చి నిద రించుచున్న రామునిముందు పెట్టి యతనిని ఆచి చూచి వెనుదిరిగెను. తమ గుడిసెకును రాము నింటికిని నడుమ యొక చిన్నకంచె. దాని నామె దాఁటుచుండఁగా నాదారిని పోవుచున్న పాదిరీ చూచెను.

కొంతవడికి రాముఁడు మేలుకనెను. ఎట్టెదుట అన్నము చూచెను. అతని కాశ్చర్యము కలిగెను. 'ఈ కఱవులో నా యాఁకలి యెఱిఁగినవా రెవరు ? ఓ భగవానుఁడా ! నాయెడ నీ కెంతదయ ! నా యాఁకలియు నీకుఁ దెలిసెనా ?' అని యనుకొనెను.

అతని కన్నులనుండి జొటజొట నీరు రాలెను. వాకిటికి వచ్చి చెను. కాకియేని కనఁబడలేదు. అంత నతఁడు భగవంతుని స్మరిం చు అన్నము ముందు కూరుచుండి భుజించుచుండఁగా కంచె యావలి

నుండి రెబెకా రెండు కన్నులను రాముని పైఁ బడెను. రాముఁడు లజ్జచే తలవాల్చి కొంతసేపటికి తలయెత్తఁగలిగి రెబెకాను చూచెను. ఆ చూపులో అన్నదానముకన్న ఆత్మదానమే యెక్కుడుగాఁ గానిపించెను. రెబెకా తలవంచి చాటుల కేఁగుచుండఁగా రాముఁ డామెకు ధన్యవాదము చెప్పెను.

రాముఁడు మరల నన్నదానము చేయఁగల యవకాశమును రెబెకాకు కల్పింపలేదు. కాని తనను చూచుట కవకాశ మీయకపోలేదు. రెబెకారాముల రహఃప్రసంగములను రెబెకా తలిదండ్రులు నిరోధింపలేదు.

రెబెకా రాముని కిరస్తానీ మతమున కలియు మనెను. రాముఁడు కిరస్తానీమత మన నేమి యని యడిగెను. రెబెకా చెప్పఁజాలక పోయెను. రాముఁడు లోతుగా చూచెను.

ఒకనాఁడు పాదిరీ రెబెకా తండ్రిని పిలిచి—'నీ కూఁతురు రాముని ప్రేమించుచున్నటులు నాకు తెలియును. దానికి నా దీవనలు. కాని రాముని మతములో ఎంత వడిగా కలుపఁగలిగిన నంత వడిగా పెండ్లి చేసికొనవచ్చును. మతమునఁ గలిసిననాఁడే రాముఁడు పంతులు, రెబెకా పంతులమ్మ పొమ్ము' అని పంపెను.

రెబెకా తండ్రి రాముని జూడఁబోయి—'నీవు వెంటనే మతము పుచ్చుకొన వలెను' అని యనెను. 'ఏల?' యని రాముఁ డడిగెను. 'పుచ్చుకొననిచో రెబెకానీయ వీలులే'దని రెబెకా తండ్రి చెప్పెను. 'నే నిపుడు నిఱుపేదను; మతము పుచ్చుకొనినంత మాత్రమున పిల్ల నిత్తువా?' అని రాముఁ డనెను. 'మతము గొనుచో నీవు పంతుల వగుదువు. పోయి దొరగారిని చూడుమ'ని రెబెకా తండ్రి చెప్పెను.

రాముఁడు పాదిరికడకు బోయెను. అతఁడు తెలుఁగు బైబిలు తెఱచి—కంటికికన్ను, పంటికిపల్లు అని చెప్పఁబడినమాట మీరు విన్నారు. అయితే నేను మీతో చెప్పేది ఏమనగా, దుష్టుని ఎదిరించక నిన్ను కుడిచెంపమీద కొట్టువానితట్టు రెండవదికూడ తిప్పుము. నీతో వ్యాజ్యె మాడుచు నీ అంగీ తీసుకొన కోరువానిని నీపై వస్త్రముకూడ తీసుకొన నిమ్ము. ఒకడు ఒక మైలుదూరము రమ్మని నిన్ను బలవంతముచేసితే వానితో రెండుమైళ్ళు వెళ్ళుము. నిన్ను అడుగుకొనువాని కిమ్ము. నీ యొద్ద అప్పు పుచ్చుకొనకోరే వానినుంచి నీ ముఖము తిప్పుకొనవద్దు, అని చదువుచుండెను.

'పక్షులను చూడుఁడు ! అవి విత్తవు, కోయవు కొట్లలో నిలువ చేయవు. అయినను ఆకాశమందున్న మీ తండ్రి వానిని పోషించు చున్నాఁడు. మీరు వానికంటె శ్రేష్ఠులు కారా ? మీలో నెవఁ డెంత తల పోసినను ఆయువు మూరెఁ డెక్కువ చేసుఁకొనఁగలరా ? బట్టలకు వగవనేల ? అడవిపూ లెటు లెదుగుచున్నవో యెఱుఁగరా ? అవి శ్రమించి వడకవు. ఏ చక్రవర్తియు సకల సంపదలతో వానివలె అలం కృతుఁడు కాఁజాలఁడు. నేఁడుండి రేపు పొయిలోఁ బడుదానిని భగ వంతుఁ డిటు లలంకరింపగా ఓ విశ్వాస విహీనులారా ! మిమ్ముల వాని కంటె నెక్కువగా అలంకరించునే ! కాన ఏమి తిందు మేమి త్రాగుదు మేమి కట్టుదు మని వగవవలదు. ఇవి ఎవరో సమకూర్తురు. ఇవి యన్నియు మీకు వలయునని ఆకాశమునం దున్న మీ తండ్రికి తెలియును. కాని మీరు దేవుని రాజ్యమును మొదట వెదకుఁడు. అపు డివియకాక యెన్నియో మీకు సమకూరును. కావున రేపటి సంగతిని గూర్చి వగవకుఁడు' అని చదువుచుండెను.

రాము లది విని నాఁటికి వెడలిపోయెను. అతఁ డిటులు నెల రోజులు పాదిరికడకు వెళ్ళెను. రాముఁడు జకరయ్యగా మాఱెను. కొలఁది నాళ్లలోనే రెబెకా రాములకు పెండ్లియాయెను.

౨౪

రెబెకా జకరయ్య లిరువురును నెలరోజులు పాదిరి యింటిచుట్టును తిరిగిరి. నూఱు నేఁబదిరూకలు నా కిచ్చుచో పాతికరూకల పంతులపని యిప్పింతునని పాదిరి యనెను.

జకరయ్యకు లజ్జయు ఉదాసీనతయుఁ గలిగెను. అతఁ డిటు లనెను—'అయ్యా, అన్నముచే కడుపునిండు ననియు, బైబిలుచే నోరు నిండు ననియు, సద్ వృత్తిచే మనస్సు నిండుననియు నేను మతమునఁ గలిసితిని. నాకు పూఁటకూటికి టికాణా లేదు. నే నిన్నిరూక లెటు లీఁగలను ?'

'కాటఁడు కాసులమూట యని యేరికి తెలియదు ?, అని పాదిరీ యనెను.

'కాసుల మూటమూట నిక్కమే. మా నాయన అప్పులవారి కిచ్చి వేసెను' అని రాము లనెను.

పాదిరి నవ్వి—'ప్రకృతము పదియేను రూకల కొకటియును పది రూకల కొకటియును కాళీ యున్నవి, మీ యిరువురును ప్రవేశింతురా ?'

రెబెకా జకరయ్యలు సంతసముతో నంగీకరించి వెళ్ళిపోయిరి.

రెబెకా పంతులమ్మ యాయెను. జకరయ్య పంతులాయెను !

రెబెకా జకరయ్యలు ప్రతి ఆదివారమునాఁడును ఏసు పేర పావలా ముడుపు కట్టవలసియుండెను. వేఱువేఱు పండుగలలో

పండుగుపండుగునకును ఒకొక్కరూపాయ యీవలసి వచ్చెను. నెల కొక రూపాయ యిచ్చి మతవాఙ్మయము కొనవలసియుండెను. ఇదియంతయు లెక్క వేసి చూడఁగా కుడిచేతితో ఇచ్చి ఎడమచేతితో లాగుకొను చందముగా నుండెను. వీని యన్నిటికిని చెల్లఁగా మిగిలిన ద్రవ్యము రెబెకా రాముల పొట్టకు చాలలేదు. ప్రొద్దుగ్రుంకులు బడిలో వాగివాగి యింటి కడకు వచ్చినఁగోలె వారికి వాకట్టు.

పాదిరి వలననే తమజీత మిటు లారతి కప్పుర మగుచున్న దని జకరయ్య తెలిసికొనెను. జకరయ్య పాదిరి దర్శనమున కేఁగి తమకు కలుగుచున్న యన్యాయమును సర్దుబాటు చేయఁగోరెను.

'ఓరీ ! మే మేసు కొలము వారము. మీకును ఏసునకును సాక్షాత్సంబంధములేదు. మాగుండ మీ రా యేసుగుడి ముంగిలికి మాత్ర మేఁగఁగలరు. మీ నల్లవారందఱు మాకు బానిసలు. బానిసలమీఁద నుంపవలసిన దయ నాకు తెలియును. నేను చేయఁగలిగినంత ఉపకారమును చేసివేసితిని' అని యనెను.

జకరయ్య తలవాల్చి—'నీ దవడమీఁద కొట్టినవానికి రెండవ దవడగూడ ఒగ్గుము, నీ చొక్కా తీసికొనినవానికి నీ కోటుగూడ నిషేధింపకు' మని చదివి యింటికి వెళ్ళిపోయెను.

కొలది దినములకే రెబెకా జకరయ్యల యుద్యోగము లుద్వాసితము లాయెను. రెబెకా ఆనాఁడు 'కిరస్తాని మతము కాని మతము' అని జకరయ్యతో అనెను.

జకరయ్య చిఱునవ్వు నవ్వి యిటు లనెను—"విద్యా వినయములు కల బ్రాహ్మణుఁడును మాలఁడును ఎఱుకగలవారి కొకటే" యని చదువుచు దాని యర్థమును తృణీకరించు సోములుగారే చెడ్డవా

రని యనుకొంటిని. "దైవమును చింతించుచుండు వారిని దైవమే కాపాడు" నని చదువు పాదిరి సోములుగారికి తీసిపోయెనా? ఏ మతములో తప్పున్నది, స్వార్థపరుఁడగు మానవునిలో గాక! ఇంతకు నేటి మాలల యవస్థ యిటులున్నది. భగవంతున కెవరిమీద యనుగ్రహము కలుగునో వారి కతడు ధనములేకుండ జేయును. భగవంతు డిటులనెను:—

"ఎవ్వని గరుణింప నిచ్చించితిని దాని
యఖిల విత్తంబునే నపహరింతు"

మనమిక దాసరుల మగుదము పద!

# 5. ద్వేషము

—అడవి బాపిరాజు

౧

ఆవేశంతో ఆ చిత్రము లిఖిస్తున్నాడు. రంగులు కలపడంలో, కుంచెలు రంగుల్లో ముంచడంలో, కుంచెలతో చిత్రలేఖనం కాగితంమీద చిత్రించడంలో అతివేగము.

ఆ చిత్రంపేరు 'రోడ్డు రోలరు' అట. రంగులు 'అంబరు, సియన్నా, పెయన్సుగ్రే, నీలిమందు, క్రిమిసన్‌లేకు,' కలిపిన తమస్సును కలిగినది.

రేఖలు అసాధువులు, కర్కశాలు. రూపాలు వికృతాలు, భయంకరాలు.

హెచ్చు తగ్గులుగా ఉన్న రోడ్డు—ఆ రోడ్డును సమం చేయడానికి భారతీయ నర, నారీ మణులు రాళ్ళు–శిశువులూ, వృద్ధులూ, వికృతాంగులూ—ఆ రాళ్ళమీదనుంచి రోడ్డురోలరు నెమ్మదిగా, నిదానంగా, అత్యధికమైన బరువుగా నడుస్తున్నది. ఆ రోలరు బండి పొగలు విడుస్తూ విపరీతమైన చప్పుడుచేస్తూ వెడుతూ వెడుతూ ఉన్నట్లున్నది.

ఆ రోలరుబండి నడిపేవాడు నల్లటి ఎత్తుటోపీ బ్రిటిషు రాజ్యతంత్రజ్ఞుడు. రోడ్డుకు ఈవలావల ఉన్న భారతీయులను ఆంగ్ల యుద్ధభటులు, ఆంగ్ల వర్తకులు, ఆంగ్ల మిషనరీలు కఱ్ఱలతో రోడ్డుమీద పడేటట్లు నెట్టుతున్నారు. బండి వెనుకభాగం రక్తమయం......

ఆ యువకుడు చిత్రం పూర్తిచేసి తనపేరు దానిమీద లిఖించు కొని వెనక్కు వెళ్ళి చిత్రాన్ని చూచి కళ్ళు సన్నగిల్ల, బొమలు ముడివడ, పళ్లు పటపట కొరుక్కున్నాడు.

విశ్వేశ్వరరావు ఆవేశ హృదయుడు. చిన్నతనాన్నుంచీ దేశ భక్తి విశేషం.

గాంధీ మహాత్ముడు ౧౯౨౧ లో అహింసా మహాయజ్ఞం భారత మాత దాస్యశృంఖల విమోచనార్థం ప్రారంభించిన రోజుల్లో విశ్వేశ్వ రుడు పదేళ్ళ బాలుడు. అప్పటికే అతనికి తాను ఆంధ్రుణ్ణనీ; బానిస అయిన భారతీయుణ్ణనీ గాఢ భావాలు ఆతని మూర్తి మూర్తంతా వ్యాపించి పోయినవి.

ఆతని హృదయం ఆంగ్లజాతి ద్వేషంతో నిండిపోయింది. అత నికి ద్వేషం మోముమీద మచ్చలా ఉన్నది. చిన్నబిడ్డ గుణం వచ్చి నప్పుడు కాల్చగావచ్చిన మచ్చలా ఉన్నది.

ఎక్కడ చూచినా ప్రత్యక్షమయ్యే దారిద్ర్యం, అనాగరికతా, అనారోగ్యపు పరిసరాలూ, తెల్లవాడు తెచ్చిపెట్టిన మహాభిక్ష అని అతని నిశ్చితాభిప్రాయం.

కర్కశ హృదయంతో, స్వలాభాపేక్షతో ఈ ఇంగ్లీషు బంది పోటు భారత జాతీయత, ఐశ్వర్యము, నాగరికతా తరలించుకు పోయి నట్లు అతని చిన్న హృదయానికి గోచరించింది.

పాఠశాలలు విడిచి బయటకు రావలసిందని మహాత్మాజీ ఆదేశం ఇవ్వగానే బడికి వెళ్ళనని పట్టుపట్టి రాజకీయసభలకు పోవడం, స్వచ్ఛంద భటులతో తిరగడం ప్రారంభించాడు.

గాంధీగారి బోధనలు అతని చిన్న హృదయానికి అర్థం కాలేదు. ఇంగ్లీషువాళ్ళను దేశంలోంచి వెళ్ళగొట్టడానికి వేసిన ఎత్తు అనిమాత్రం అతడు భావించు కొన్నాడు.

౧౯౨౨ నుంచి మళ్లీ చదవడం ప్రారంభించాడు. ౧౯౩౦ కి బియ్యే పూర్తి చేశాడు.

మళ్ళీ శ్రీ మహాత్ముడు ఉప్పు సత్యాగ్రహం ప్రారంభించగానే కదన రంగంలోకి దూకారు. రెండేళ్ల జైలు. గాంధీ ఇర్విను ఒడంబడిక వెనక వదిలారు.

కాని అతని జీవితము జైలులో పిశాచరూపం వహించింది. జైలులో అతడు తిన్న దెబ్బలు వాతలు కట్టినవి.

విశ్వేశ్వరరావు క్రోధం మిన్నుముట్టింది. తిన్నగా ఉత్తర హిందూస్థానం చేరుకుని లక్నోలో ఒక వర్తకపు దొరమీద ఆకలితో మాడుతూవున్న తోడేలులా విరుచుక పడ్డాడు.

చేతిలోఉన్న కత్తియొక్క వేగం ఇంకా ఎదమవైపుకు మళ్ళింది కాని, ఆ ఆంగ్లేయుని హృదయం చిమ్మటగొట్టం అయిపోయి వుండేది. విశ్వేశ్వరరావుకు ఇరవై ఏళ్ళు ద్వీపాంతర వాసము వరమీయబడింది.

౨

అండమాను ద్వీపాలు చూశాడు. అనేక ఇతర జైళ్ళు చూశాడు. గాంధీమహాత్ముడు సత్యాగ్రహం విరమించమని ఆదేశం యిచ్చి, క్రొత్త చట్టం క్రింద కాంగ్రెసువారిని శాసన సభలకు వెళ్ళవలయునని కోరిన వెనక, అనేక రాష్ట్రాలలో కాంగ్రెసు మంత్రివర్గాలు ఏర్పాటయిన వెనక

రాజకీయ బంధితు లందరూ బోనుల్లోంచి ఎండిపోయిన శివంగుల్లా వచ్చారు.

అందరూ సత్యమూ, అహింసలయందు తమకు నిశ్చలమైన నమ్మకం కుదిరిందని శపథంచేసే బయటకు వచ్చారు. కాని కొందరికి మాత్రం వాళ్ళ హృదయాలల్లో ద్వేషం దాగేఉన్నది. కొందరు దాచుకొన్నారు; ఆ దాచుకున్న వాళ్ళలో విశ్వేశ్వరరావు ఒకడు.

అనేక ఖైదులు చూచాడు. అనేక రకాల కూడులు కుడిచాడు కొరడా దెబ్బలు తిన్నాడు. అడ్డబేడీల్లో, నిలువు బేడీల్లో, గోడ కుర్చీల్లో చీకటి కొట్లల్లో పిశాచరూపం దాల్చాడు. పై పెదవి పైకిపోగా, క్రింది పెదవి క్రిందికిపోగా, ముక్కు పుటాలు విస్ఫారితంకాగా, కళ్ళు కాయలు కాచిపోగా "ఖాఁ-ఖాఁ" అని బుసలు కొట్టాడు. ఉపవాస వ్రతాలు చేశాడు. బలవంతంగా ద్రవాహారము ఇచ్చారు. కొన ఊపిరితో బయటపడుతూ ఉండేవాడు.

అతని హృదయంలోని దవానలం గాంధీమహాత్ముని చల్లని మాటలతో చల్లారలేదు; ఇంటిదగ్గిర తనవాళ్ళ ప్రేమ చూపుల్లో మాయమై పోలేదు.

రైల్లో బిచ్చగాళ్ళు, ఋణవిమోచన చట్టం, గాలివాన, పొలాల వరదలు, ఎగిరిపోయిన యిళ్ళు, చచ్చిపోయిన జంతువులు, అన్నీ తెల్లవిషాని ఛాయలే!

ఈ తెల్లనిపాము భరతదేశం అంతా ?ండింది. దానికి లక్షలు లక్షలు నాల్కలు. ఆ నాల్కలు చిన్న పిల్లాళ్ళని రుచికి నాకుతున్నవి. కూలీలపై ఆడుతున్నవి. చదువుకొని ఉద్యోగంలేని యౌవన వయస్కులను పీల్చి పాలిపో చేస్తున్నవి.

అతని ఆస్తి పెద్దది కాకపోయినా ఆకారం పెద్దది. అందంలేని జీవితమైనా మూర్తి మాత్రము ఆర్యజాతి రేఖలు పుణికి పుచ్చుకొన్న సౌష్టవం కలిగిన సౌందర్యము. కళ్ళల్లో తాలిమిలేదు. హంసిత కాంతులు కృతికా నక్షత్రయుక్త సూర్యుని కిరణాల తీక్షణతతో కను రెప్పలమీద తాండవిస్తుంటవి.

జైలులో వున్నన్నాళ్ళూ చదువు మాత్రం చక్కగ నేర్చుకున్నాడు. ఫ్రెంచి, జర్మనీ, ఇంగ్లీషు భాషలూ, ఉరుదూ అరవ భాషలూ మంచినీళ్ళ ప్రాయం చేసికొన్నాడు. అనర్గళ ధారతో మాట్లాడుతాడు, వ్రాస్తాడు.

ఖైదునుంచి రాగానే చక్కని పిల్ల నొకదాన్ని కట్టబెడితే చెదిరి పోయిన మనసు కుదుట పడుతుందని మంచి సమ్మంధాలు రెండు మూడు తీసుకవస్తే విశ్వేశ్వరరావు-ఇష్ ఇష్-అన్నాడు.

## 3

అతని జన్మమంతా నిండిపోయిన కోపానికి విరుగుడు కన్పడటం లేదు. ఏం చెయ్యాలో అతనికీ తోచటంలేదు. తనబోటి వారిని పది మందిని కలేసి ఒక పార్టీ చేదామనుకున్నాడు. నడపబడే వారూ లేరూ-నడిపే మొనగాడూ లేడు. పదిమందిలోనూ తనకున్న భావాలు గట్టిగా మాట్లాడటానికి వీలులేదు. తెల్లవాళ్ళ బానిసత్వ ప్రచారానికి గాంధీమహాత్ముడు ప్రధాన వ్యాసంవంటివా డనుకొన్నాడు.

ఇలాంటి యినుమునిప్పుల విశ్వేశ్వరరావుకి ఒక్కటే నీరస గుణం వుంది. శిల్పమన్నా, చిత్రలేఖన మన్నా, సంగీత మన్నా గబగబా వెళ్ళే అడుగు ఖంగున ఆగిపోతుంది. క్రిందికి తిరిగివున్న పెదవుల రేఖలు ఒక్కొక్కప్పు డొకవైపునా, ఒక్కొక్కప్పుడు రెండు

వైపులా ప్రసరించి అతని మొహాన్ని వెన్నెల చేస్తవి. వేసంకాలపు మధ్యాహ్నంనాటి అతని జీవితం మాఘ పూర్ణిమనాటి నిశిరాత్రి ఔతుంది.

ఎల్లోరాలూ, అజంతాలూ చూస్తూ, ఆంగ్లేయులని ద్వేషించ వలసిన కాలమంతా కళలలో మునిగి వృథాపుచ్చటం తప్పని వాదించు కుంటాడు గాని కళల మధ్య ప్రతి హింసాత్మకమైన కలలు బాగా కన వచ్చని సమాధానం చెప్పుకుంటూ దక్షిణాదినివున్న గుళ్ళూ గోపు రాలూ, శిలలూ, శిల్పాలూ, విగ్రహాలూ, వితానాలూ, చెక్కడాలూ, చిత్రలేఖనాలూ దర్శనంచేస్తూ గడుపుతున్నాడు జీవితం విశ్వేశ్వరరావు.

౭

బొంబాయి పట్టణంలో అలెగ్జాండ్రా రేవులో 'పి. అండ్ ఓ.' కంపెనీవారి క్లియోపాత్రా అనే పెద్దవోడ వొడ్డుకువచ్చి చేరింది. మెట్లు దింపినారు. ఓడలో నుంచి క్రిందికి మొట్టమొదట దిగినవారు పదిమంది ఆంగ్ల స్త్రీలు.

హిందూదేశ విచిత్ర కళా సౌభాగ్యాన్ని దర్శించి చూరగొని పోదామని జట్టుగ వారందరూ ఈ శీతకాలంలో బొంబాయి పట్టణంలో అడుగుపెట్టారు. అందరూ వున్నత కుటుంబాలకు చెందినవారే! చదువుకున్నవాళ్ళు! డబ్బుగలవాళ్ళు! ఇరవై ఏండ్ల దగ్గరనుంచీ ముప్పైఏండ్ల వరకూ వున్న విలాసవతులు వాళ్ళు. పెండ్లిండ్లు చేసి కోవడం స్వాతంత్ర్యానికి భంగకరమని పూర్ణంగ నమ్మిన పూవు బోడులు.

ఈ జట్టుకు నాయకురాలు 'మార్గరెట్టు సల్లివాన్'. ముప్పైయేండ్ల వడుచు. ప్రపంచంలోకల్లా అందమైన దేశం హిందూదేశమని ఆమె

నమ్మకం. హిమాలయ పర్వతం, 'షాలిమార్' తోటలు, 'తాజ్ మహల్', 'అజంతా' వీని యన్నింటికీ తలమాణిక్యం గాంధీ మహాత్ముడు. ఇవి చాలవా ప్రపంచానికి ఒక దేశాన్ని నాయకమణిగ చేయటానికని ఆమె వాదన.

బొంబాయి నుంచి తిన్నగ శివగ్రామానికి వెళ్ళి వారు గాంధీగారి ఆశ్రమానికి చేరుకున్నారు. పదిహేనురోజులా ఆశ్రమంలో, ఆశ్రమ వాసు లందరితోపాటు ప్రార్థన సమయానికి ప్రార్థనలకు వెళ్లుతూ అప్పుడప్పుడు గాంధీ మహాత్మునితో సత్యాగ్రహం, ప్రేమ, సంతాన నిరోధం, యూదులు, ప్రపంచయుద్ధం, భారత జాతీయత, భగవద్గీత మొదలైన విషయాలను గురించి ఆ అవతార పురుషుని అభిప్రాయాలు చూరగొంటూ కాలం గడిపారు. వృత్తి ఆధార విద్యనుగురించి తెలుసుకొన్నారు.

మగన్వాడి, నల్వాడి, విద్యామందిరం మొదలైన ప్రదేశాల తీర్థ యాత్రలు సాగించి ఆ తెల్లస్త్రీలు గాంధీమహాత్ముని మహత్త్వాన్ని అర్థం చేసుకొనేందుకు ప్రయత్నం చేశారు. అక్కడున్న ఆ పదిహేను రోజులూ ఆశ్రమ వాసులూ, ఇతర గాంధీ శిష్యులూ వాళ్ళకు చూపించిన గౌరవం, మర్యాద వాళ్ళ హృదయాలను ద్రవింప జేశాయి.

డెబ్బయ్యేళ్ళు దాటిన ఆ ముసలివాడు, బోసినవ్వులతో చిన్న బిడ్డలా ఉన్నవాడు, దివ్యమయిన కళాకాంతులతో అవతార పురుషునిలా తేజరిల్లేవాడు, జ్ఞానపూర్ణమయి, స్పష్టమయి, ప్రేమ సుధారసాలు నిండిన వాక్కులు కలిగినవాడు. మోహనదాసు వాళ్ళ కళ్లకు అపర యేసుదేవుడులా కనబడ్డాడు.

వాళ్ళ జట్టులో ఇరవై యొక్క యేళ్ళు నిండిన మేరీ టెంపిల్ అనే ఓ అమ్మాయి ఉంది. ఆ అమ్మాయి బంగారు అందంపిల్ల;

ఉంగారు జుట్టు, విశాలమైన నీలికళ్ళు, పరువం పండించుకొన్న స్నిగ్ధ మయిన ఉత్తమజాతి దంతంలాఉన్న వొళ్ళు. ఆమె అందాలలో హిమవాలుకలు కరిగిపోతూ ఉండేవి. ఆమె పెదవుల్లో కాశ్మీర కుసుమ వర్ణం జీరలు సాగేది. సన్నని పొడుగాటి ముక్కు, కోలమోము, గులాబీ రేకల చెవులు, ఎప్పుడూ నవ్వుతూ జీవిత రహస్య సౌందర్యం ప్రతిఫలించే ఫాలము ఆమెకు దివ్యసౌందర్యం నివేదన లిచ్చినవి.

మేరీకన్య ఎదుటివాడు మాటాడుతూ ఉండగానే అతని భావం గ్రహించేది. తనకు ఏ విషయమైనా నచ్చితే మళ్ళీ దానినిగురించి తర్జన భర్జన చేసుకునేదికాదు. ఏ కార్యమయినా తన ఆలోచనా పథంలో మెరుములా ప్రత్యక్షమయితే ఆ కార్యం నిర్వహించు కొన్న దాకా నిద్రపోయేదికాదు. అఖిల ప్రపంచశాంతి సంఘాధ్యక్షురాలయిన మార్గరెట్ సల్లివాన్ శిష్యురాలు. మార్గరెట్ సల్లివాన్‌కు గాంధీ మహాత్ముడు దేవుడాయెను. అందువల్ల గాంధీ మహాత్ముడికి చెందిన జాతిలో ఉన్న మనుష్యులంతా భగవంతుని ప్రక్కనున్న దేవతలవంటి వాళ్లనే ఆమె ఉద్దేశం. బొంబాయిలో దిగినప్పుడు రైళ్ళల్లో ప్రయాణాలు చేస్తు న్నప్పుడు, హోటళ్లలో భోజనాలు చేస్తున్నప్పుడు కొందరు మనుష్యులు తమ్ము మోసం చేస్తున్నారని ఆమెకు తెలిసినప్పటికీ తన సిద్ధాంతానికి ఏదో కొంచెం వ్యతిరేకం సంభవించిందనే భావమే కాని భారతీయుల యెడ ఆమెకున్న ప్రసన్నతా భావానికి ఈషణ్మాత్రమైనా జంకు కలుగలేదు.

భరతదేశపు ఆకాశంలోని నీలిమ "లెపిస్‌ల జూలి" శిలకన్న ఎక్కువ కాంతిమంత మయినదట. భరత దేశంలోని నదీ నదాల నీరు గ్రీకు దేవతల 'అంబ్రోసియా' (అమృతము)ట. భరత దేశంలోని పువ్వుల యొక్క వాసన స్వర్గధామంలో కూడా దర్శన మవుతుందో

లేదో అని ఆమె కనుమానం. రెండు చేతులూ జోడించి ఆమె జోహారు లివ్వడం నేర్చుకొంది. 'సుజలాం సుఫలాం మలయజ శీతలాం' అని పాడుతూ పులకరించుక పోయేది.

జీనెట్టి మేక్డొనాల్డు గొంతుకకు వన్నెలుదిద్దే గొంతుకతో 'వైష్ణవ జనతో' అని పాడుకుంటూ కళ్ళు అరమూతలు చేసుకొని, వణికి పొయ్యేది. ఆంగ్ల స్త్రీలందరు మీరాబెన్ను లయితేనేకాని ఇంగ్లండుకు మోక్షంలేదని ఆమె నిశ్చితాభిప్రాయము.



ఉదయ సంధ్యానృత్య పరవశుడయిన నటేశ్వరుని పదకింకిణీ రవాలు రామప్ప చెరువు చిరుకెరటాలలో లీనమై పోయినవి. లూయీ బోధం బొగైన్‌విల్లా పూలయొక్క కుంకుమవర్ణం, తెరలుకట్టి ప్రత్యూష మంగళ గీతికారావాలను నేపథ్య గాంధర్వ మొనరిస్తున్నది. ఉదయ కాదంబినీ మూర్తియొక్క అవ్యక్త రూపాలనుంచి ఉదయ నృత్యాలోక నాభిలాషులయిన దివ్యులు అనిమిషులై పొడచూపుతున్నారు. అంగహార వివిధ కరణోపేతమైన అభినయలాస్య యుక్తలై అప్సరసలు పరమ నటునకు హంగుచేస్తున్నారు. రామప్ప దేవాలయంలో ప్రత్యక్ష మవు తున్న ఈ దివ్యలీలనంతా దర్శించడానికి గాఢాభిలాషలై మార్గరెట్ సల్లివాన్ జట్టువారు ఆ తెల్లవార కట్లకే ఆ దేవాలయానికి వేంచేశారు.

కారులు దిగడంతోనే అందరికన్న ముందుగా పరుగెత్తుకు వెళ్ళా లని అయిదంగల్లో వంతెన దాటింది. సింహద్వారం దాటింది, మండపం దకుంది మేరీ టెంపిల్. ఆ మండపము ముందర శిల్ప వైభవం చాటే స్తంభాలు, ఆ స్తంభాలకు శిఖర స్వరూపాలుగా నాట్యంచేసే నల్లరాతి శిల్ప కన్యలు! ఆ శిల్ప సుందరుల నాట్య భంగిమ రేఖావిలాసాలను

చూసి నిస్తబ్ధురాలై పోయింది మేరీ. ఆ శిల్పాల లందరలో ఒక మనోహరాంగి తన అందంతో మేరీ గుండెను చిదిమివేసింది. తదేక దీక్షతో అలాగే చూస్తూ ఆమె నిలబడి వుంది.

తన వెనకాల ఏదో చప్పుడయినట్లు కాంచి, చటుక్కున వెనక్కి తిరిగింది మేరీ. విషాల్రుక్కే చూపులతో రెప్ప వాల్చకుండా తనకేసి చూస్తున్న ఒక యువకుడు బిర్రబిగిసి నిల్చి ఉన్నాడు.

"అపశ్రుతిలాగ ఇక్కడ దాపురించా వేమిటి?"

తెల్లబోయి మేరీ టెంపిల్ మాటాడలేక పోయింది.

"దేశమంతా పిప్పిచేస్తూ ఎక్కడో మూల దాక్కొనిఉన్న ఈ కాస్త కళనూ కూడా నమిలివేయడానికి వచ్చిన తెల్ల రాక్షసిలాగున్నావే నీవు?"

మేరీ భయంచేత కుంచుకు పోయింది. అందమైన ఆమె పెదవులు అప్రయత్నంగా విడివడిపోయాయి.

"నీ దేశంపోయి మమ్మల్ని అపహాస్యం చేయడానికి మేయో పిశాచంలాగ ఇక్కడి కెందుకు వచ్చావు?"

బిర్రబిగుసుకుపోయి మేరీ రాయిపడి శిలావిగ్రహంలా అయి పోయింది.

ఇంతట్లో తక్కిన జట్టు వాళ్ళంతా అక్కడికి వచ్చారు. వాళ్ళందర్నీ చూస్తూ అసహ్యంచేత కనుబొమలు ముడుచుకపోగా, పై పెదవి పైకి తిరిగిపోగా, ఆ యువకుడు విసవిస నడిచి చక్కా పోయాడు.

మార్గరెట్ సల్లివాన్ మేరీని చూసి, ఆ అబ్బాయి ఏమిటి నీతో ఇంగ్లీషుతో మాటాడు తున్నాడని ప్రశ్న వేసింది.

ఎక్కడో నీలాకాశంలో నుంచి ఊడిపడిన పిడుగుదెబ్బ తిన్న దానిలా చైతన్యం తప్పిఉన్న మేరీ, మార్గరెట్ మాటలను వినిపించుకో లేదు.

''మేరీ ప్రియా! ఏమిటో అలా చూస్తున్నావు-పామును చూసి భయపడే పాశ్చాత్యునిలా?''

"తళుక్కుమని దెయ్యంలా మాయమైన ఆ కుర్రా దేమయినా అన్నాడా నిన్ను? వాడి మాటలు మాకు కొంచెం కోపంగానే వినిపిం చాయి'' అని మేరీని తట్టుతూ మళ్ళీ పలకరించింది మార్గరెట్

మూలమూలలకు చెదిరిపోయిన ధైర్యశక్తిని నెమ్మదిగా చేర దీసుకొని, గుండెల్లో పదిలపర్చుకొని మేరీ వెలవెలపోయే చిరునవ్వు నవ్వింది.

''ఆఁ! ఆఁ! ఏమిటీ అన్నావుమార్గీ! అబ్బే, ఏమీలేదు ఆ కుర్రాడు ఏమన్నాడో నాకూ వినపడలేదు. ఈ ఉదయపు చిరు చీకట్లలో ఎవరూలేరుకదా అని నేనువస్తే ఆ అబ్బాయి కనపడ్డంచేత భయ పడ్డాను. అంతే,"

ఇంతల్లో హెలెన్ అనే అమ్మాయి ''ఏమి అందంగా ఉందే ఈ గుడి! ఏమి అందంగా చెక్కారు నందుల్ని. ప్రతి స్తంభంపైన తన కున్న కళంతా ధారపోసి నాట్యంచేసే ఈ స్త్రీవిగ్రహాలను చెక్కినవాడు ఎంతటి మహాశిల్పికదా!'' అని అన్నది.

నుసి—''రాతిలో చెక్కాడా, రాతినికరిగించి పోతపోశాడు.

నెల్లీ—"ఇవి రాతిబొమ్మలుకావర్రా; శాస్త్రజ్ఞానం అంతా కన ుచి ఇనుముకరగించి తయారుచేసిన బొమ్మలుగాని!

మేరీ—''ఆ దేహరేఖలు, ఆ శరీరసౌష్ఠవం, ఆ విచిత్రభంగిమ, ఆ రాతితనంలోని నలుపును మరపింపజేస్తున్నవికదా! రక్తం పోటెత్తుకువస్తూ, స్నిగ్ధమై, సిక్తకమయిన ఆమె శరీరమే కనబడుతోంది. ఈ వేళ్లతో ఆమెను అంటుకొంటే ఆమె ఎంతమార్దవంగా ఉంటుందో!"

మేరీ అప్పుడు వెనక్కితిరిగి చూచింది. విశ్వేశ్వరరావు దూరంగా ప్రాకారపు గోడదగ్గర నిలబడి వాళ్ల సంభాషణవింటూ తెల్లవాళ్లమీద ద్వేషం ఒక నిమేషమాత్రం మరచిపోయి, భారతీయకళను నిర్మలహృదయంతో అభినందిస్తున్న వాళ్ళమాటలలోని పూజ్యభావానికి సంభ్రమించి పోయాడు. మేరీవంక తదేకదీక్షతో చూస్తున్నాడు. అప్పుడాతని మోములో ఆశ్చర్యానంద వర్ణాలుతప్ప ద్వేష వైవర్ణ్యం ఏమీ గోచరించడంలేదు. ఒక చిరునవ్వు ఒక చిన్న మేఘంలోని చిరుమెరుములా కలకలమంటున్నది. ఆ సమయంలో అతన్ని మేరీ చూసింది.

పెద్దపులో, తాచుపామో, పిశాచమో అని అనుకొని భయంపడ్డ ఆ బాలిక కూడా అతనికి తెలియకుండానే అతన్ని ఆవరించిన ఆనంద జ్యోత్స్నను చూచి ఆశ్చర్య హృదయయైనది. ఆ క్షణంలో ఉన్నత రూపుడై గంభీరరేఖా సమంచితుడైన అతనిరూపం అతన్ని ఆమెకు దివ్యుణ్ణిగా కనబర్చింది. సుమనస్కయైన ఆ పాశ్చాత్య బాలకు విశ్వేశ్వరుని హృదయం ప్రస్ఫుటంగా ద్యోతకమయింది. ఆమె కప్పుడు గుడిలేదు. హిందూదేశంలేదు, ఇంగ్లండులేదు. కాలపథాలలో ఒక యెద మధురిమలు ఆవహించిన యువతి ఆమె. దూరదూరాన ఆ మహా నిర్జన స్థలంలో దివ్యుడయిన పురుషమూర్తి అతను. ఆమె బుద్ధినుండి జాతి తెరలు పటపటమని క్రిందకుజారి కూలి పడిపోయినవి.

౬

ఇంతకుముందే ఎంత కర్కశంగా తిట్టినాడు? ఎవరితను? ఎందుకితనికి ఇంతకోపం? ఈ దేశంలోని యువకులంతా తెల్లవాళ్లని

చూస్తే బ్రిటీషువారిని తలుచుకుంటే ఇంత విషపూరితమైన ద్వేషంతో చూస్తూ ఉంటారా ? యూదులంటే హిట్లరుకోపంవంటిదా వీరిద్వేషం ?

అతనిది ఎంత చక్కని విగ్రహం ! మేరీ హృదయనేత్రానికి ఇంగ్లండులోని తన యువక స్నేహితులందరూ జ్ఞాపకం వచ్చారు. మనకువల్లేవాళ్లూ ఆంగ్లశాక్షను జాతికి చెందినవాళ్లు. జాతులన్నింటిలోకి ఆంగ్లశాక్షను, జర్మనీవారి జాతులు ఉత్తమమైనవి. వాళ్ళవొళ్లు దేవతల వొళ్లు. స్వచ్ఛమై నిర్మలమై, సాయంకాల కుంకుమవర్ణాలు ప్రసరించిన ధవళహిమంలా ఉన్న దేహాలు దేవతలవికాక మరెవరివి ?

గుణగణాలలో ఆంగ్లశాక్షను జాతి ఉన్నత పథాలల్లో లేదా ? ఆ జాతివారు అబద్ధాలాడరు, అన్యాయాలుచేయరు. వారి గంభీరత, రాజఠీవి, వీరత్వము, సర్వకళలయందూ ఆరితేరినతనము, సర్వదేశాలను అరికట్టి నిలబెట్టిన రాజనీతి.

భారతీయులలో ఉన్న అద్భుతత్వము ఏమిటి ?

అనేకయుగాలనుంచీ విచిత్రమైనగ్రంథాలు ఉద్భవింపజేశారు... వేదాంతవిచారము, కవిత్వము... కాని వీరి కవిత్వం షేక్సుపియరు కవిత్వంతోటి తులతూగగలదా ?...... విచిత్రాతి విచిత్రమైన శిల్పం వుంది. ఆలయనిర్మాణం ఉన్నది. ఈ మాత్రమూలేకపోతే హిందూ దేశంయొక్క గొప్ప ఏమిటి ?

పైగా గ్రీకుశిల్పంతో, రోమక చిత్రలేఖనంతో డోరిక్కు, కారిన్తి యను, రోమక, గాతిక్కు నిర్మాణాలతో ఈ యాలయాలు తులతూగ గలవా ?............

పైగా వీళ్లు రంగులవాళ్లు. లాటిను జాతులై తేనేమి, స్లావికు జాతులై తేఏమి, యూదుజాతులవాళ్లయితేనేమి ? మాఫియార్లయితేనేమిటి? రంగువాళ్లకన్న ఎక్కువకాదూ ?.........

రంగులవాళ్లు నీగ్రోలకన్న కొంచెం నయం...

"మేరీ ! నీ ఆలోచనలకు ఒక పెన్నీ ఇస్తాను. ఏమిటీ ఒకటే ఆలోచన ? నీ నీలంకళ్లలో కొన్ని వందల ఆలోచనలు సుళ్లు తిరిగి పోయినవి. నువ్వు తేరిపారచూస్తూన్న ఆ కుఱ్ఱవాడు అప్పుడే వేరో చోటకు వెళ్లాడు'' అని మార్గరెట్టు మేరీభుజంమీద చేయివేసింది. మేరీ మొదటిమాటకే ఉలిక్కిపడింది. మార్గరెట్టు మాటలువిన్నకొద్దీ ఆమె చెంపలలోని అరుణవర్ణాలు పోటెత్తుకువచ్చినవి. ఆమెకళ్ళలో సిగ్గులు అలమినవి.

మేరీ—"మార్గీ ! నేను ఓ ప్రశ్న అడుగుతాను. నీ హృదయ పూర్వకమైన జవాబు ఇవ్వాలి.

మార్గరెటు—"ఓసి వెర్రిపిల్లా ! నేనెప్పుడయినా నా అభి ప్రాయాలను దాచుకున్నట్టు నీవెరుగుదువా ?''

మేరీ— "నీబంధత నానికే నీవంటే అందరూ భయపడుతారు. హైందవజాతికన్న ఆంగ్లజాతి ఉత్తమమయినదికాదా ?"

మార్గ—"ఇదా నీ ప్రశ్న ! ఇన్నేళ్లు నా సావాసంచేసి ఇప్పుడు ఆ ప్రశ్న అడుగుతున్నావు ! వారెవా ! – ఏవిధంగా గొప్పదంటావు ? సామ్రాజ్యం స్థాపించటంలోనా, అన్యాయాలు చెయ్యటంలోనా ?"

మేరీ—".ఒకజాతికి ఇంకొకజాతికి అనేక విషయాలలో భేదా లుంటాయా లేదా ? ఆ భేదాలలో ఒకజాతి ఎక్కువా ఒకజాతి తక్కువా అవుతుందాలేదా ?''

మార్గరెట్టు—"జాతికీ జాతికీ భేదాలుండవచ్చు. ఆ భేదాలలో హెచ్చులూ తగ్గులూ ఉండవచ్చు. అంతమాత్రంచేత ఒకజాతి గొప్పది, ఒకజాతి హీనమయినది. ఒకజాతి ఎక్కువది, ఒకజాతి తక్కువది

అనేది మాత్రంనేను ఈ షణ్మాత్రమూనమ్మను. అలా నమ్మేవాళ్లను చూస్తే నాకు సంపూర్ణమయిన విచారం అని మాత్రం చెప్పగలను.

వారంతా అక్కడినుంచికదలి, పాడుపడిపోయిన ఆ రంగమంటపంలోకి వెళ్ళారు. అక్కడ ఒక స్తంభంలో చెక్కిన దివ్య నటరాజ మూర్తి విగ్రహాని కెదురుగుండా కూర్చొని ఆ బొమ్మయొక్క ప్రతి రూపాన్ని చిన్న చిత్రలేఖన పుస్తకంలో వ్రాసుకుంటూ ఆ యువకుడు వాళ్ళకు మళ్లీ ప్రత్యక్షమయ్యాడు. ఆ విగ్రహంయొక్క అద్భుత సౌందర్యానికి, ఆ కుర్రవాని దీక్షకు ఏదో పరమ్రశతివాళ్ళకు గోచరించింది. ఆ నృత్యంలో ఉండే విచిత్రత, భావం ఎవరు తమకు చెప్పగలరు?

ఒక్క అయిదునిముషములు వాళ్లు నిశ్శబ్దంగా ఈ దృశ్యం చూస్తూ నిలబడ్డారు. పదిమందీ పదిస్థలాలకు, అప్పుడే కాలిజోళ్లు టక్కుటక్కున చప్పుడుచేసుకంటూ. వివిధవిగ్రహాలు, ద్వారబంధము, వితాన శిల్పము, నందిని. ఏనుగులను తిలకిస్తూ చెదిరిపోయినారు.

అతిసన్నని గొంతుకలతో శిల్పాన్ని గురించి వ్యాఖ్యానాలు సాగించడం మొదలుపెట్టారు. చువ్వున విశ్వేశ్వరరావు లేచాడు, అతని కళ్ళు విస్ఫులింగాలు రాలుస్తున్నవి.

"హిందువుల పవిత్రమైన దేవాలయాలన్నా కూడా మీకు ఈషణ్మాత్రం గౌరవంలేదే? నంగనాచిల్లా కాలిజోళ్ళు తొడుక్కొని అప్రశతి శబ్దాలు మారుమోగిస్తూ, ఈ దేవాలయం అపవిత్రంచేశారే. ఈ పవిత్ర శిలానృత్యమూర్తి సన్నిధానాన్ని శిల్పసత్యానికై అన్వేషిస్తున్న ఓ మనుష్యునిపట్లయినా మీకు ఇంత దయన్నాలేదే. మీ అమెత్తు మదమలకింద ఎంతకాలం మా భారతీయహృదయాలు చిమ్మట గొట్టాలలా రక్తాలు చిమ్ముతూ ఉండగా నలిపినలిపి తొక్కగలరు?"

అని గుప్పిడిచూపిస్తూ "మీ ఆఖరిదినాలు వచ్చాయి. ఏ ఫూంటీ వాదాల వాళ్ళయినా ఇంగ్లీషువాళ్ళకు మెలిమొగుళ్ళు, హిట్లరు, ముసోలినీ వాళ్ళ కడుపులు చల్లగా! ఆంగ్లజాతి ఈ శతాబ్దాల పాపపుమంటల్లో పడి భగ్నమయిపోయె—"

మార్గరెట్టు — చిరునవ్వుతో-"ఏమయ్యా! క్షమించు. ఇది పాడుదేవాలయంకదా అని జోళ్లు తొడుక్కు వచ్చాం. పాడుదేవాలయం అయితేమాత్రం ఇది పవిత్రమయిన శిల్పదేవాలయం. జోళ్లు విడిచి రావలసిందే. ఈ శిల్పానికి మేము కొత్తవాళ్లమవడంచేత అర్థంచేసు కోవడానికని మాట్లాడుకున్నాము. మనస్ఫూర్తిగా మా అందరితరపున్న మిమ్మల్ని క్షమాపణ వేడుతున్నాము. మీ బొమ్మ అయినదాకా. పైనే తిరిగివస్తాము. ఈ పట్టులోపలికి వచ్చేటప్పుడు జోళ్ళుతీసే వస్తాము" అని చిరునవ్వు నవ్వుతూ తన జట్టు యావన్మందితోనూ రండని సైగ చేసి వాళ్ళతో పైకిపోయింది.

ఖస్‌ఖస్సని బుసలుకొట్టుతూ మాట్లాడిన విశ్వేశ్వరరావు విభ్రాంతి పొంది, తనది జయమో, అపజయమో, నిర్ణయించుకోలేకపోయాడు. అందాలుపుణికి పుచ్చుకొన్న ఆ శ్వేతబాలిక చిరునవ్వునవ్వుతూ తనవైపున వారచూపులు ప్రసరింపజేసి వెళ్ళిపోయింది.

"ఎంత అందంగా ఉన్నది? శ్వేతజాతుల్లో అందమయిన వాళ్ళుంటారా? దేహ సౌష్టవంలో భారత నారీమణులు ప్రపంచంలోని తక్కిన స్త్రీలకన్న అందమయినవాళ్ళుకారా? ఒకవేళ, బాహ్యసౌం దర్యంలో కొందరు పాశ్చాత్యజాతుల స్త్రీలు హైందవ నారీమణులతో సమానమైనా హెచ్చయినా అంత సౌందర్యంలో వాళ్లు ఎట్లా పోల గలరు? కాని ఈ అమ్మాయి ఏవో శిల్ప సౌందర్యాలను సేకరించు కొన్నది"

అయినా వీళ్ల సంగతి? విశ్వేశ్వరరావు గబగబ రెండంగల్లో వేరేపక్కనవున్న దేవాలయంలోని శిల్పం చూస్తూఉన్న ఆ యువతీ మండలి దగ్గరకుపోయి వాళ్ళకు జోహారించి,

"నన్ను మీరంతా క్షమించాలి. ఈ శిల్పాన్నిగురించి నేనంతా మీకు చెప్పడానికి మీరు అనుజ్ఞయిస్తే మీరు నన్ను క్షమించినట్లు ఎంచు కొంటాను" అని పలికినాడు.

మార్గరెట్టు నవ్వుతూ "అలాగేరండి, కొంచెం చెప్పండి. మా కృతజ్ఞత అందుకొండి" అన్నది.

ప్రతిశిల్పందగ్గరికీ వాళ్లను తీసుకువెళ్ళి దానినిగూర్చి విశ్వేశ్వర రావు చక్కనిభాషలో గంభీరమయిన భావంతో విపులంగాచెప్పాడు. కొద్దివాక్యాలలో భారతీయ శిల్ప లక్షణాలనుగురించి వాళ్లకు బోధపరి చాడు. భారతీయ శిల్పానికి పాశ్చాత్య శిల్పానికి ఉండే తేడాలు అనర్గ ళంగా ఉపన్యసించాడు.

"ఇక్కడినుంచి మీరు ఎక్కడికి వెడతారు" అని ప్రశ్నించాడు అతను.

మేరీ—"అజంతా, ఎల్లోరా, ఎల్ఫెంటాలు మాత్రమే చూశాము. వార్థావెళ్ళి గాంధీమహాత్ముని ఆశ్రమంలో పదిహేనురోజులున్నాము. అక్కడినుంచి తిన్నగా అనుమకొండ, ఒరంగల్లుచూసి ఇక్కడికి వచ్చాము. హిందూదేశము యావత్తూ చూడాలని సంకల్పం ఉంది".

విశ్వే— అట్లయిదే ఇక్కడినుండి అమరావతి, నాగార్జునకొండ చూసుకొని అక్కడినుంచి హంపి, బిజాపూరు, బాదామి, హర్పనహళ్లి యాత్రలు సేవించుకొని, పెనుగొండ, తాడిపత్రి లేపాక్షివెళ్ళి మైసూరికి వెళ్ళండి. మైసూరులో హళేబీడు, బేలూరు, శ్రవణబెళగొళాయాత్రలు

సేవించిన వెనుక అరవ దేశం, మళయాళ దేశయాత్రలు సేవించవచ్చు. నేనున్నూ లేపాక్షివరకు మీతో వస్తాను. మీకు నా రావడం ఆక్షేపణ లేకపోతే".

౭

వాళ్లతో మైసూరుదాకా యాత్రలు సాగించాడు విశ్వేశ్వరరావు. ఎక్కడో అడగిఉన్న అతనిలోని మర్యాదంతా ఉబికి వచ్చింది. మార్గరెట్టుకూ విశ్వేశ్వరరావుకూ అహింస, జాతిభేదాలు, కళలు, సాహిత్యమూ మొదలయిన విషయాల్నిగురించి వాదాలు జరుగుతూ ఉండేవి. విశ్వేశ్వరరావు కోపం విపరీతరూపం తాల్చేది. అతడు మేరీ అందంచూచి భరించలేకపోయేవాడు.

అతనిలోని క్రూరత్వము లోలోన గాలివానరేగింది. మింగబోయే పాము వెంబడించినట్లు వాళ్ళతో కూడా అతడు ప్రయాణాలు తీర్చినాడు.

వాదనలోని కరకుతనమూ విజ్ఞానమూ అతనిలో వెలుగు, నీడలు అయ్యాయి.

ప్రతివాదన విషయంలోనూ అతని ద్వేషం ఉడుకెత్తుకుని, ఉబుకెత్తుకుని పరవళ్ళుతొక్కుతూ ప్రవహించింది. అది గై యిసరులా వేడి నీటి ఊట. ఆకసం అంటేటట్లు గబుక్కున వస్తూవుండేది.

అతనికున్న అపారజ్ఞానం ఆ పాశ్చాత్యస్త్రీలను ఆశ్చర్యంలో ముంచింది. అతనిద్వేషానికి వాళ్ళలో కొందరు ఒణికిపోయ్యారు. ప్రతి భారతీయయువకుడు ఇల్లాగే ఆంగ్లేయులను ద్వేషిస్తున్నాడా?

నెల్లీ మార్గరెట్టుతో అనేకసార్లు "ఎందుకు ఈ రాక్షసుణ్ణి కూడా తిప్పుకోవడం" అని కోపంతో వాదించింది. మేరీతప్ప తక్కినవాళ్ళు ఆమెవాదాన్ని బలపరిచారు. కాని మార్గరెట్టు చిరునవ్వునవ్వుతూ,

"నా ప్రియ బాల బాలికల్లారా! నాకు పాలంపేటగుళ్లో ఒక దీక్ష అంతరాత్మలోంచి ఉద్భవించింది. రెండురాత్రిళ్ళు ప్రార్థనలో ఆ భావాన్ని సత్యబద్ధమైందా, కాదా అని భగవంతుని ప్రశ్నించుకున్నాను. ఈ విషయం యావత్తు గాంధీమహాత్మునకు వ్రాసుకున్నాను. ఆయన జవాబు-నన్నాశీర్వదిస్తూ-రానివ్వండి. ఈ బాలకుడు మనల్ని చంపుతాడా? చంపనీ. ఈలాంటివాళ్ల ద్వేషానికి మనం ఆహుతి అవడం ఎంతవిచిత్రమైన, పవిత్రమైనదానము. ప్రేమతో బలిదానం-ఈ ఉద్యమాన్ని అరికట్టదా?" అని అరమూతలైన చూపులతో దివ్య హాస నృత్యాలైన పెదవులతో పలికింది.

వెంటనే మేరీ ఆమెను గాఢంగా కౌగిలించుకుంది.

"ప్రియ! నాకున్న అనుమానాలు పటాపంచలుచేశావు. ఈ రాత్రి ఒక రహస్యం నీతోచెప్పి నా హృదయతాపం ఉపశమనం చేసుకుంటాను "అని అన్నది.

తక్కినవాళ్ళంతా "ఏమిటి మేరీ! గాంధీగారు రహస్యాలు ఉండకూడ దన్నారు కాదా!" అని ఒత్తిడిచేశారు.

చిరునవ్వు నవ్వుతూ మేరీ "తొందరపడకూడదు. స్పష్టత పొందని ఆలోచనను అప్పుడే వ్యక్తంచేయలేను. అది సరిగాదూ! మార్జీ?" అని మార్గరెట్టువైపు చూసింది నవ్వుతూ.

"అలాగే మేరీ."

అందరూ నవ్వుతూ బేలూరు ప్రయాణం అయ్యారు.

విశ్వేశ్వరరావు వాళ్ళదగ్గర శలవు తీసుకొని గబుక్కున మదరాసు తిరిగివచ్చాడు.

౮

దారిపొడుగునా మేరీకన్యమూర్తే అతని ఎదట మేఘశకలంలా గోచరిస్తున్నది. పువ్వునికమ్మిన నల్లని తుమ్మెదలా అతని ద్వేషం అతని హృదయంచుట్టూ ఝుమ్మని తిరగడం ప్రారంభించింది. అతని హృదయ పుష్ప మధ్యాన అల్లరిచేయకుండా తేనెలుతాగుతూ, దాగు కుంటూ ఏదో ఒక భావం, ఏదో ఒక కోర్కె, ఏదో ఒక అనుభూతి...

మేరీ మాటలు, మేరీ పాటలు, మేరీ నడక, మేరీ వాదన, మేరీ శిల్పహృదయం... ఆమె భారతీయ శిల్ప దేవాలయంయొక్క ప్రథమ ప్రాంగణంలోకి ప్రవేశించింది.......

"ఎందుకు ఈ దేవాలయానికి ఆమె రావాలి? ఆమె ఆ హీన పాశ్చాత్య శిల్ప శిధిలత్వంలోనే పొర్లాడనీ. ఎవరామె భారతీయ మహా శిల్పసత్యాన్ని గోచరింపచేసుకొనే అధికారం సంపాదించడానికి......

పోనీ ఈ నీచస్త్రీలను తన దేశంవదలి, వాళ్ళతోపాటు తన దేశ సౌభాగ్యం తనకే ఉండనీ. దేశంలోని సువర్ణరాసులు, దేశంయొక్క మహా సౌభాగ్యమైన అభిమానమూ, మానమూ, స్వేచ్ఛా తస్కరించుకు పోయింది పోక, ఈ కజిన్సులు, ఈ హాలెన్సులు, ఈ క్రామరెస్టులూ, ఈ కూల్డ్రేలు, ఈ గిల్లులు, ఈ మేరీలు మా శిల్పంకూడా తస్కరించుకు పోవాలి........."

అతని కళ్ల విషవాయువులుపీచే నాభీసుమా లయ్యాయి. అతని పెదవులు పళ్లల్లో ఎలుకబోనులా బిగుసుకు పొయ్యాయి.......

ముష్టిపట్టి అతడు బల్లను గట్టిగా గుద్దినాడు...

వాళ్లతో ఉన్నప్పుడు తనకంత పిరికితనమెందుకో? వాళ్లను బాధపెట్టలేక పోయినాడు. వాళ్లకు అంత సేవచేయడమేమిటి తాను!

వాళ్ల సేవకుడిలా టిక్కట్లుకొన్నాడు, బళ్లు మాట్లాడాడు. కూడా వెళ్ళి ప్రతి శిల్పంయొక్క అర్థమూ, అందమూ. ఆనందమూ వర్ణించి చెప్పాడే! ఎంత ఛచ్చు హృదయం అయిపోయింది ?

మేరీకన్య తన్నుమంత్రంవేసినట్లు తిప్పిందే? తియ్యటి గొంతుకతో కబుర్లుచెబుతోంటే ఏదో మమతతో, కాంక్షతో, గాఢ సంతోషంతో విన్నాడుకబుర్లు......

ఇప్పటికీ ఆ రోజున జరిగిన ఒక విషయం ఒళ్లు జలజలమనిపిస్తుందే. ఆ రోజున తాను లేపాక్షి చిత్రలేఖనం శిల్పం అతిమాధుర్యంగా వర్ణిస్తూ, వాళ్లందరికీ హృదయాలు ఉప్పొంగచేసిన మాట నిజం. ఆ ఉన్నత, ఉత్తమ శిల్పంపక్క తాను ఒక చిన్న శిల్పంలా అయిపోయిన మాట నిజం. కాని... తన వెనకనే...వచ్చి...ఆ మేరీకన్య తన రెండుబుజాలమీదా చేతులువేసి...''వెన్నెట్లో శివునిలా నిలబడ్డావు పార్వతికోసమా విశ్వేశ్వర్ ?'' అని ప్రశ్నవేస్తూ నా వీపున...ఆమె హృదయం తాళగతులు లయింపగా అని... ఒక నిముషం... ఒకే నిముషం... పక్కకువచ్చి నిలుచున్నది...... తనకు గలిగిన పులకరాలు—ఒళ్లు వేడి, హృదయంలోమత్తు ... ఏమో ... ఏమో...అతి అతి భావాలు ! వీళ్ళు సైరను (తియ్యని పాటతో మోహంపెట్టి తమ మంత్రంలో పడవేసికొని రక్తంపీల్చే గ్రీకుఢాకినీ) వనితలా ?

ఆ మేరీ ?... ఏమి ఆమె అంధం...ఎందుకు వాళ్ళని తిట్టుకోవడం ?...''ఓయి వెట్టిమృగపు విశ్వేశ్వరరావూ! నువ్వువట్టివాజమ్మవు...నీ అగ్నిచల్లారింది, నీ హృదయం చచ్చింది. నీ అభిమానం అధోగతిపాలయింది. నీ దేశభక్తి కుళ్లిపోయింది. లే...ఏడు, నెత్తీనోరు బాదుకొని, గాజులు తొడిగించుకొని, వంట చెయ్యి, జజ్జమ్మా, చచ్చమ్మా!



"మేరీ! ఆ చిన్న ఫోటో బాగాతీశావే. ఏమిటీ అతిగా పరికిస్తున్నావు ఆ విశ్వేశ్వరరావు బొమ్మను?" అని నెల్లీ మేరీని పలకరించింది.

వాళ్ళంతా మధుర దేవాలయం చూస్తున్నారు. తిరుమల నాయకుని మహా భవనం చూశారు, మంటపం చూశారు. తెప్పాకులం చూశారు. 'మేల' గోపురాలు పరిశీలించారు.

మీనాక్షి గుడి యెదుట ఉండే లోని మండపంలోని విగ్రహాలని సందర్శిస్తున్నారు. తిరిగి తిరిగి నృత్యమూర్తి అయిన శారదాదేవి విగ్రహం కడకు వచ్చారు. ఆ విగ్రహం యొక్క చిత్రం ఓటి విశ్వేశ్వరరావు - చక్కని రేఖాచిత్రం తన స్కెచ్చి పుస్తకంలో వ్రాసుకొని ఉన్నాడు. ఆ రేఖాచిత్రం చాలా అందంగా చిత్రించినాడు. "ఆ చిత్రం, అందుతో పాటు అతనూ ఈ విగ్రహం చూస్తే జ్ఞాపకంవస్తే అతనికి తెలియకుండా నేను తీసిన అతని ఛాయారూపం చూస్తున్నాను నెల్లీ!" అన్నది మేరీ.

నెల్లీ పక పక నవ్వింది.

"ఓసి నంగనాచీ! నా దగ్గిర దాపరికం వద్దు. థియాసఫిస్టులలా భారతీయులంటే ప్రేమించడం నేర్చుకున్నా వేమిటి?" అన్నది.

"నీ మాటలు విపరీతంగా ఉన్నాయి నెల్లీ!"

"నిన్ను నేను జాగ్రత్తగా పరిశీలిస్తున్నాను. ఒకటిలే, నువ్వు ఇదివరకే ఎందరి యువకులతోనో - జాగ్రత్తగా మాత్రం - సరదాగా గడిపావు. ఒకళ్ళిద్దర్ని ప్రేమించా ననుకున్నావు అట్లాగేనా ఈ విశ్వేశ్వరరావు అంటే వెఱ్ఱి?"

"నెల్లీ! నీకు ఈ జన్మలో వేళాకోళం గుణం పోయేది ఎప్పుడే ?"

తిరిగి వాళ్ళంతా రహదారి బంగళాకు చేరుకున్నారు.

నెల్లీ మళ్ళా మేరీని ఒంటరిగా కలుసుకొని "మేరీ! నువ్వు మార్గీతో ఆ నాడు ఏమి మాట్లాడింది నాకు తెలియజేయక పోయినా నేను ఊహించుకోలేక పోలేదు. మార్గీ జాతికీ జాతికీ ఎంత తేడా లేదని వాదించినా, ఒక పథంలోంచి ఆ వాదన ఒప్పుకున్నా స్త్రీ పురుష సంబంధం విషయంలో నువ్వు కోటి వాదనలు తీసికొనిరా. నన్ను మాత్రం మీరు ఒప్పించలేరు" అని తీవ్రముగా వాదించింది.

"ఇప్పుడు నీ సలహా అవసర మేమొచ్చింది నెల్లీ? నువ్వు కాదూ కూడదూ వాదిస్తాను అంటావూ ? అయితే నీ వాదనే నీకు అప్ప జెప్పుతాను. సాధారణ హీన విషయాలలో జాతి తేడాలకు నాకు అభ్యంతరం లేదు గానీ, ఉత్తమమైన కళల విషయంలో, స్త్రీ పురుష సంబంధం విషయంలో, భగవంతుని విషయంలో జాతిమత భేధాలు ఎంతమాత్రమూ ఉండకూడదని నా ఘట్టి వాదన. అంతే అంటుంది మార్గీ. అదికాకుండా నేను ఒక రహస్యం మార్గీతో మాట్లాడాను అన్నావు. అది ఏమిటో విను. విశ్వేశ్వరరావు వెఱ్ఱిగా దేశభక్తి అని అనుకొని అతిద్వేష హృదయం కలవాడై ఉన్నాడు. మహాత్ముని ఆదేశ ప్రకారం ఆ యువకుడికి మనం అహింసా మహావ్రతదీక్ష ఇవ్వాలి అని నేను మార్గీతో చెప్పితే, ఆమె ఎంతో సంతోషంతో 'సెహబాష్' అన్నది. అది ఆనాటి సంగతి - నీకు తృప్తి అయిందా?"

"ఏమి చేశారు మీరు? అతడు మరి కాస్త ద్వేషంతో మండి పోయాడు. మీరు వాడి దారిని వాణ్ణి పోనీక గాంధీ అంతవాడు చేయ లేని పిచ్చ పిచ్చ పనులు చేయబోయి పీకల మీదకు తెచ్చుకుంటారు."

## ౧౦

మధుర నుంచి యాత్రలు సాగించు కుంటూ వారు చెన్నపట్టణం చేరుకున్నారు, అక్కడ మైలాపూరు కపాలేశ్వరాలయాన్ని చూచారు. ఆ దేవాలయంలో విశ్వేశ్వరరావు వీళ్ళకు ఎదుర్కోలు ఇచ్చాడు. నెల్లీ మేరీని చూచి పరిహాసంగా చిరునవ్వు నవ్వింది. ఆ చిరునవ్వు విశ్వేశ్వరరావు చూచాడు. దాని భావమూ గ్రహించాడు. మనస్సులో ఉగ్రుడై పోయాడు.

విశ్వేశ్వరరావును చూడగానే మేరీ గుండె కొట్టుకుంది. మార్గరెట్టు ఆనందంతో విశ్వేశ్వరరావును బహూకరించి తమతో రమ్మని ఆహ్వానించింది.

ఆ గుడి చూస్తూన్నంత సేపూ విశ్వేశ్వరరావుకూ మార్గరెట్టుకూ భారతీయ జీవితాన్ని గురించి వాదోపవాదాలు పెరిగాయి.

భారతీయులు అఖండ ప్రయత్నంచేసి శుభ్ర జీవితం అలవాటు చేసుకోకపోతే ఈ ఉత్కృష్టజాతి అంతా నశించి పోతుంది అని మార్గరెట్టు...

ఈ హీన స్థితికి కారణం అంగ్లేయులే అనిన్నీ, దేశాన్ని పీల్చి పిప్పిచేస్తే ఈలాంటి జీవితం తమకు వచ్చిందనీ అతని వాదన.

అక్కణ్ణుంచి అందరూ కలసి 'కానమెరా' హోటలుకు వెళ్ళారు. అందరూ తమ తమ గదులకు దుస్తులు మార్చుకునేందుకు పోయారు. హోటలు హాలులో మార్గరెట్టూ విశ్వేశ్వరరావూ వాదించు కుంటూ కూచున్నారు.

''మీరు హిందూదేశ క్షేమమే నిజంగా కోరేవారయితే, అందు కనే లండనులో భారతీయ సంపూర్ణ స్వరాజ్య సమితి ప్రారంభించి

పనిచేస్తున్న వారయితే మీ వాళ్ళంతా సంపూర్ణ స్వాతంత్ర్యం ఇచ్చి వెళ్లేందుకు ఎందుకు ప్రయత్నం చేయరు ?''

''ఏమండీ ! అందరూ ఒకే ఉద్దేశం కలవాళ్ళవుతారా ? మా దేశం మొత్తంమీద ఏ వేయిమందో ఈ తక్షణమే భారతదేశానికి స్వాతంత్ర్యం ఇవ్వాలనే వాళ్ళు ఉన్నారు. పదివేలమంది ఏ కొద్ది సంవత్సరాలల్లోనో ఇవ్వవచ్చుననే వాళ్ళు ఉన్నారు. అసలు ఎప్పటికీ ఇవ్వరాదు అనేవాళ్ళు కోట్లు.''

''అందుకనే దెబ్బకు దేవేంద్రలోకం అన్నట్లు భారతదేశపు ముష్టి యొక్క బరువూ, బలమూ చూపిస్తేనే మీవాళ్ళు లొంగుతారని మా నమ్మకం.''

"అలాటివాళ్ళు ఏ లక్షో రెండు లక్షలోగా ఉండేది ?''

"తక్కిన వాళ్ళంతా భారతదేశం బ్రతికి ఉన్నన్నాళ్ళూ ఆంగ్లేయ పాదధూళి శిరస్సున ధరించే బ్రతకాలి అని నమ్మే వాళ్ళనా మీ ఉద్దేశం ?

''అది కాదయ్యా, అహింసా ధర్మంవల్ల సంపూర్ణ స్వరాజ్యం స్థాపించాలి అని నమ్మేవాళ్లు.''

"అయితే ఏవి వారి పనులు, వారి ఫలసిద్ధి ?''

''నమ్మకానికీ, నమ్మకానికి తగినట్లు జీవితాన్ని అనుసరించే టట్లు చేయగల శక్తి ఉండడానికీ ఎంతో దూరం ఉంది. ఆ దూరం క్షణ క్షణమూ మహాత్ముని నాయకత్వం క్రింద తగ్గించు కుంటున్నారు ారతీయ ప్రజాలోకము.''

''ఓహోహో. ఇది మాకు ఒక అంగ్లస్త్రీ బోధించడం !"

"హేళన ఎందుకు వీర పురుషుడు గారూ? నా జీవిత సర్వ స్వముతో నమ్మిన విషయం అది. అది నా బోధకాదు. మహాత్ముణ్ణి నేను అర్థం చేసుకున్న రీతి అది."

ఆమె మాటలలోని నిర్మలత్వమూ, ఆమె కళ్ళల్లోని నిశ్చలత్వమూ, అమె దరహాసంలోని కరుణత్వమూ అతనికి సిగ్గు పుట్టించాయి.

"క్షమించండి మార్గరెట్టు గారూ! నా లోని ఆవేశంచేత అన్న మాటలు. మీ నిష్కల్మష హృదయము నాకు సంపూర్ణంగా ద్యోతకము అయ్యింది. అహింసవల్ల లోకంలో శాంతి అవతరిస్తుందని అనుకోడం శుద్ధ వెఱ్ఱి అని నా నమ్మకం. అహింసా తత్వార్థమూ, దాని తర్కమూ, జ్ఞానమూ నా కేమాత్రమూ హృదయానికి తట్టలేదు. ద్వంద్వాతీతుడైన భగవంతునికి ద్వంద్వాలు రెండూ సమం కదా! అల్లాంటప్పుడు భగవంతుడు అహింసా స్వరూపుడు అని వాదించడం ఏమిటి? అహింసే మోక్షార్థకం ఏమిటి?"

"అది కాదయ్యా, భగవంతుడు ద్వంద్వాతీతుడనే శ్రీ మహాత్మాజీ కూడా చెప్పేది. స్థితప్రజ్ఞుడైనవాడూ, భగవంతునిలో లీనమైనవాడూ, వాడు సిద్ధుడు. సాధకుడు ప్రపంచంలో ఉన్నాడు. ప్రపంచంలో ఉన్న వాళ్ళకు ఆ ద్వంద్వాలలో ఒకటి మంచిది, ఒకటి చెడుగు. వెలుగు మంచిది, చీకటి బాధ. ఆ వెలుగుయొక్క తత్వం ప్రేమ, విశ్వేశ్వర రావుగారూ...."

"ఈ సిద్ధాంతా లన్నీ విన్నాను, నాకు నవ్వు వస్తుంది. అందులో మా వేదాంతాలలో పుట్టి పెరగని మీరు ఎల్లా తెలుసుకోగలరు?"

"ఇదివరదాకా పంటకు తేని భూములు ఎరువువేసి దున్నితే ఎలాంటి పంట వేసినా అద్భుతంగా పండవటయ్యా?"

అక్కణ్ణుంచి విశ్వేశ్వరరావు విడిదికి చక్కా పొయ్యాడు.



వాళ్ళతో ఆంధ్రదేశం అంతా తిరిగి, తన ఊరుకూడా వాళ్లను తీసుకుని వెళ్ళారు విశ్వేశ్వరుడు.

ద్వేషము అనుకుంటూనే అతడు వాళ్ళకు చూపించిన గౌరవమూ, వాళ్ళకిచ్చిన ఆతిథ్యము వర్ణనాతీత మైనాయి. విశ్వేశ్వరరావు తల్లితో వాళ్ల ఎంతో ప్రేమతో వ్యవహరించారు. విశ్వేశ్వరరావు తల్లి వాళ్ళను హృదయానికద్దుకుంది.

ఆమె సత్సంగములో చేరడంవల్ల తన పూర్వాచార పరాయణత్వాన్ని దయాల్‌బాగు పవిత్ర భూములలో శ్రీ ప్రేమ గురునికే సమర్పించిన మనిషి. సర్వదా భజనా ధ్యానములలో భగవంతుని అర్చించే భక్తురాలు.

ఆమెకు ఈ ఆంగ్ల స్త్రీలు తన ఇంటికి రావడం పరమ సంతోషమైంది. ఆమెను ఈ ఆంగ్ల వనితా సమూహము హృదయమార ప్రేమించింది.

మేరీ టెంపిల్ ఆమెతో విశ్వేశ్వరరావును దగ్గిర ఉంచుకుని అతడు భాషాంతరీకరణం చేస్తూండగా విశ్వేశ్వరుని బాల్య చరిత్ర అంతా అడిగి తెలుసుకుంది. విశ్వేశ్వరుని జైలు కష్టాలు, అతని సహజ ప్రేమ హృదయము, అతడు ఎల్లప్పుడూ ఏదో రూపంగా హీనజనులకు చేసే సేవా ఇంకా ఇంకా ఎన్నో తెలుసుకుంది. తాను భారతీయ జీవనంలోని అద్భుత ఘట్టాలను దర్శించిన చిత్రాలు ఆమెకు చూపించింది. అతని ప్రతిరూపాలు అతని వివిధ భంగిమలతో, అతని వివిధ కళలలో చిత్రించుకున్నది. ఆ బొమ్మలు ఆమె ఎవరికీ చూపించలేదు.



ఆంధ్రదేశ మంతా తిరిగి వాళ్ళు భువనేశ్వరము చేరుకున్నారు. భువనేశ్వరములో విశ్వేశ్వరుడు తాను చిత్రించిన "జగన్నాథ రథము" అను చిత్రమును ఆంగ్ల స్త్రీ మండలానికి చూపించాడు.

వాళ్ళు ఆ బొమ్మను చూచి భయపడిపోయారు. వాళ్ళు ఆతని హృదయంలో ఎంత ద్వేషము, ఎంత క్రోధము, ఎంత హింస గూడు కట్టుకొని పేరుకు పోయిందో చూసి గజగజ లాడారు. మేరీ టెంపిల్ కళ్ళవెంట బొట బొట పదహారు చుక్కలు రాలినవి. ఆమె అన్నది—

"మమ్మల్నింత ద్వేషిస్తున్నావా విశ్వేశ్వర్ ?" అని......

ఆ ముక్కలకు విశ్వేశ్వరుడు ఎంతో సిగ్గుపడి పోయాడు. ఆ సిగ్గుతో దహించుకు పోయాడు. కుంగి పోయాడు. ఆమెకంట సుడులు పోయి ఆ బిందువులు అమృతపు చినుకులై ఆతని హృదయాన్ని దహించి వేసినవి. అమృతమే కాలకూట మైనది. వాళ్ళ ఎదుట నిట్ట నిలువున కుంగిపోయిన మోముతో కాళ రాత్రులు కమ్మిన కళ్ళతో భయంకర దోషి ననుకుంటూ విశ్వేశ్వరుడు దహించుకు పోయాడు....

ఎవ్వరూ మాట్లాడలేదు. గజగజ మేరీ గదిలోనికి పారిపోయింది; చుర చుర విశ్వేశ్వరరావును అతి కోపంతోచూసి నెల్లీ ఆ బాలిక వెన కాలే వెళ్ళబోతే మార్గరెట్టు ఆమెను కనుసన్నతో ఆపు చేసింది.

చేతులు కట్టుకొని తూలుతూ విశ్వేశ్వరుడు తన బసకు వెళ్ళి పోయాడు......

అతనిలో గాలి దుమారాలు రేగాయి. ఆ దుమారాలను అణచి వేస్తూ ఆమె కంటి బిందువులు గాలివాన అయ్యింది.......

ఆ సాయంత్రం దాకా విశ్వేశ్వరుడు తిండి తినకుండా తన బస లోనే పండుకొని ఉన్నాడు.

అతని చుట్టూ చీకట్లు అలము కొన్నాయి. అతనిలో చీకట్లు గడ్డ కట్టుకు పోయినవి. అతని రక్త ప్రవాహము పూర్తిగా ఆగిపోయిన ట్లయింది.

....................

ఆ సాయంకాలపు ధూప్ ఛాహన్‌లో మెల్లగా అడుగులు వేస్తూ ఒంటరిగా విశ్వేశ్వరరావు తలవాల్చికొని పరశురామేశ్వర దేవాలయానికి పోయి వెలుగు వెనక సిలహౌటీ (నీడరూపం) గా కనబడే ఆ గుడిని చూస్తూ చూచీ చూడని చూపులతో చదికిలంబడి ఉన్నాడు.

....................

ఇంతలో చీకటి ఎక్కువౌతూఉన్న ఆ సందెలో అతని బుజంమీద ఒక చల్లని హస్తం.

ఆ చేయి ఒక పావురము ఒక బురుజుమీద వాలినట్లు వాలింది.

అతని ఒళ్ళు మరులలో తూలింది.

అతడు జలదరించి పోయాడు.

అతని హృదయం కరడు తనంలోంచి కరిగి పోయింది.

అతడు నెమ్మదిగా వెనక్కు తిరిగాడు.

అతని వెనక మెరిసిపోయే నక్షత్రాల్లాంటి కళ్ళతో తన్ను కలల చూపులు చూస్తూ మేరీ టెంపిల్ కూచుని ఉంది.

ఆమె చెయ్యి ఇంకా అతని బుజంమీద ఉంది.

....................

ఏదో మత్తు విడిన వానిలా చటుక్కున విశ్వేశ్వరుడు ఆమె వైపుకు మరలి ఆమె రెండు చేతులూ తన చేతులతో అదిమి పట్టుకొని

"మేరీ! మేరీ! నువ్వు నా జీవితంలోకి ఎందుకు ప్రత్యక్షమయ్యావు: నా ప్రేమ విశ్వాలను పొర్లి విశ్వాతీతమైన శూన్యాలు ఆక్రమిస్తూంది......నన్ను నువ్వు ప్రేమించ గలవా?"

అని ఆమె ఎదుట తలవంచినాడు అతడు.

ఆమె కరిగి పోయింది.

"ఎందుకు ప్రేమించలేను?"

"నిజంగా! నిజంగా!"

ఆమెను అతివేగంతో, తన కౌగిలిలోకి లాక్కున్నాడు.......

ఆమె ఆతని కౌగిలింతలో వివశ అయిపోయినది.

ఆమె ఆతని మోమును ఆ గాఢప్రేమతో చూచినది.

ఆతడామె పెదవులను దివ్యమైన, నిర్మలమైన దీర్ఘమైన ముద్దుకొన్నాడు.......

ఆమె కనకాంబర కాంతి రూపమైన, గంధరాజ పుష్ప పరీమళాత్మకమైన, వేదనాతీతమైన, మహా పవిత్రమైన ముద్దు నాతనికి వరమిచ్చినది....

"ఆ నృత్యమూర్తికడ క్రోధమూర్తివైన నిన్ను చూసినప్పుడే నా మనస్సు, నా ప్రాణము నీకు అంజలి ఘటించాయి. భారతీయుడా!"

"ఇది నిజమా మేరీ బాలికా! నా దివ్యరాజ్ఞీ. ఆంగ్లేయ యువతి ఈ దీనుణ్ణి ప్రేమించడం అసంభవం కాదూ! నేను ఇది మహా స్వప్నం అనుకుంటున్నాను."

"నా రాజూ! నా ప్రాచ్య పతీ! నీ హేళన నిన్నింకా వదలలేదూ?"

హేళనకాదు మేరీ ప్రియతమా! హేళనా! ఈ పరశురామేశ్వరుణ్ణి, ఈ ప్రథమరాత్రి క్షణాల్ని ఈ భూమి గడ్డను అడుగు... అడుగూ!"

..................

ఆ రాత్రి బంగాళాలో మార్గరెట్టు వరండాలో పడక కుర్చీమీద కూర్చుని నెహ్రూ జీవిత చరిత్ర చదువుకుంటున్నప్పుడు మేరీ నడుము చుట్టూ విశ్వేశ్వరుడు చేతిని చుట్టిన్నీ, విశ్వేశ్వరుని భుజంమీద మేరీ తలవాల్చిన్నీ మార్గరెట్టు ఎదుటకు వచ్చి ఆమె పాదాలకడ ఆ ప్రేమికులు మోకరిల్లారు.

మార్గరెట్టు చటుక్కున నుంచొని దివ్యానందము మోమున నృత్యం చేస్తుండ, కళ్లు పవిత్రకాంతులు ప్రసరిస్తూ ఉండగా "నా హృదయం కోర్కె ఈడేరింది నా బిడ్డలారా!" అంటూ వాళ్ళిద్దరి తలమీదా రెండు చేతులూ వేసింది.......

౧౨

ఈ వార్తవిని నెల్లీ భూమిమీద పట్‌పట్టని చప్పుడవుతూ వుండగా, జోళ్ళ పాదాలతో గబగబ ధడధడ భూమిమీద బాదింది.

"నేను ఒప్పుకోను. ఈ వ్యవహారాన్ని పళ్ళతో, గోళ్ళతో పీకి చీల్చి చెండాడుతాను. ఈ సంయోగం కానివ్వను. మేరీ గార్డియను కు త్తరం వ్రాస్తాను. కోర్టుల్లో దెబ్బలాడుతాను. ఆంగ్ల ప్రభుత్వానికి విజ్ఞప్తి పెట్టి అడ్డగిస్తాను. సిగ్గు! సిగ్గు!" అని అల్లరి చేసింది. ఘొల్లున ఏడ్చింది, పక్కమీదపడి దొర్లింది.

మార్గరెట్టు ఆమెను చూచి, ఆమె ప్రక్కనే మంచంమీద కూచుని, ఆమెను తన కౌగిలిలోకి తీసుకొని గట్టిగా హృదయాని కదుముకొని ప్రేమార్ద్రకంఠంతో "నెల్లీ! నీకు హిస్టీరియా వస్తోంది. ఇంత నీవు అల్లరి చేయడానికి బదులు ఆనందంతో ఉప్పొంగి పోవలసింది - ఇటు వంటి సంవిధానం సంభవించినందుకు, వందల కొద్దీ సంవత్సరాలు

భారత జాతీయతను, ఐశ్వర్యాన్ని పీల్చి పిప్పిచేసిన మనం ఇలాంటి వివేదనలతో కాని నిష్కల్మష చరిత్రలము కాలేము" అని అన్నది.

నెల్లీ రౌద్రంతో లేచి నుంచొని "నీ వెర్రిమాటల నిక చాలించు. నీ శుద్ధ తెలివితక్కువతనం చేత ఈ లాంటి దుష్ట సందర్భం దాపురించింది. నీవు వట్టి మెదడులేని మూర్ఖురాలవు. ఈ మేరీ అమాయకురాలు, బడాయికోరున్ను. సర్వ ప్రపంచానికి నాయకమైన ఆంగ్ల జాతికి-తీరని కళంకము అవమానము తెచ్చిపెడుతున్నారు. మేరీ! నీ అందమైన, సౌష్ఠవ పూర్ణమైన దివ్యమైన నీ దేహాన్ని, నీ గౌరవాన్ని వాసన వేసే కుళ్లులో కూరుతావా? గాఢమైన పశుత్వం ఉందేమో నీలో ఎక్కడో, నీలాంటి పశువులయిన మన జాతికి చెందిన అమెరికా స్త్రీలు కొందరు నల్లటి నీగ్రో వెధవలకు సమస్తార్పణలూ చేస్తారు..." అని ఆడు పెద్ద పులిలా గాండ్రించి పోయినది.

ఆ మర్నాడు ఆ జట్టును వదలిపెట్టి నెల్లీ తన సామానుతో బొంబాయి చేరినది. ఆ వెనకనే బయలుదేరు స్టీమరుమీద ఇంగ్లండు వెళ్ళిపోయినది.......

తక్కిన వాళ్ళంతా మేరీని కౌగలించుకొని "నీవు ఆదర్శ సమంచితమైన బాలికవు తల్లీ? భగవంతుడు నీ ఈ నూతన తపస్సును సర్వ సుఖ ప్రదంగా ఆశీర్వదించును గాక" అని ఆమె మూర్ధము మూర్కొన్నారు.

..................

## ౧౩

"మార్ణీ! ఇంగ్లీషు భార్యతో కాపరం చేయడానికి తగిన ధనం లేదు. సంపాదించే మార్గాలూ లేవు."

"ఓయి వెఱ్ఱివాడా! మేము భారతీయ స్త్రీల మవుతున్నాము. నీలో అయిక్యం అయిపోతూ మేరీ ఎంత అందం చేస్తుందో చూస్తూ

ఉంది. ఆమెకు సాలుకు మూడువేల పౌనులు రాబడి వచ్చే ఆస్తి ఉంది. అది ఆమె స్వంతం. తక్కిన ఆస్తి తనకు అక్కరలేదంటుందట.''

''నేను సాలుకు వేయిరూపాయలు మాత్రమే తెచ్చుకోగలను. ఆమె సాలుకు నలభై వేలరూపాయలు తెస్తే ఏలాగు ? దరిద్రునకు వివాహం ధర్మమా మార్షీ !''

''ఓయి వెఱ్ఱివాడా ! ప్రేమప్రధానం. ధనంకాదు. నువ్వు అహింసా వ్రతాచరణం చేయడమే పదివేలు. ఇన్ని శతాబ్దాలనుంచి దోచుకొన్నధనం మేము మీకు ఎన్నిరకాలుగా తిరిగి ఇవ్వాలో !''

విశ్వేశ్వరుని ప్రేమ మహాకావ్యమై లోకమోహనమైంది.

ఆంగ్ల యువతులు, ఆంధ్ర యువకుల కథనుండి ప్రేమను ఈ అద్భుత స్వరూపంతో చూరగొనియుండరు.

ఆమెను ఒకరోజున పద్మాలు చెక్కిన పీఠంమీద అధివసింపజేసి పదివేలపూవులతో పూజించినాడు విశ్వేశ్వరుడు.

కళలు పుణికిపుచ్చుకున్న చీరలు, ఖరీదుకలవి కొనివచ్చి ఆమెను ధరింపజేసి ఆమెకడ మోకరిల్లాడు.

అతని కళ్ళలోని పూజ ఉదయ సూర్యునివర్ణాలులా, పూర్ణిమా జ్యోత్స్నలులా అలిమివేసినది.

''నీ సౌష్ఠవ మూర్తిత్వానికికాదు, నీ స్నిగ్ధబాలికాత్వానికికాదు, నీ హిమాచ్ఛ శరీర కాంతికికాదు. నీ ఆంగ్లేయ శాక్షను జాతిత్వానికి కాదు. నీ దివ్యసౌందర్యానికిగాదు, మేరీ ! నిన్ను పూజించేది. నువ్వు నా దేవివి ! నా మోక్షానివి, నా నిత్యవు :

నిన్ను ముద్దుపెట్టుకుని నీకు మలినము ఇస్తానేమోనన్న భయం. నువ్వు కలగామాయం కావుగదా !

నువ్వు సూర్యుని కుమారితవు గాదుగదా!

ఇన్నాళ్ళూ ఈ ద్వేషం నా హృదయంలో ఉన్నందుకు ఫలితానివా, నన్ను ద్వేషరహితుడ్ని చేయడానికి వేంచేసిన దివ్యసాన్నిధ్యానివా?

అతడు పట్టుశాలీ పొందూరు దోవతి ధరించి, పొందూరు లాల్చీ ధరించి ఆమెకడకు వచ్చినప్పుడల్లా ఆమె చిన్నపరుగుతో అతన్ని వచ్చి కంఠము బిగియారగా బాహులతలు చుట్టివేసేది.

అతని విశాలఫాలంలో వేదబుక్కులు పనసలు పాడుతున్నవని ఆమె అనుకునేది.

అతనికళ్ళల్లో పరమశ్రమణకుడైన బుద్ధభగవానుని శాంతి కాంతులు పుంజీభూతాలయి దర్శనమిస్తున్నవని ఆమె ఒడికి పొయ్యేది.

అతనిమూర్తిలో గ్రీకుదేవుడు అపోలో ప్రతిఫలించలేదు. సర్వసౌందర్య స్వరూపాలు ప్రోగుచేసుకున్న భారతీయ దివ్యమూర్తి ప్రత్యక్షమయ్యేవాడు......

''మీ భారతదేశానికి నేను నూతన యాత్రికురాలిని విశ్వా! నా చేయిపట్టుకుని ఈ దివ్యజ్యోత్స్నలో నడిపించుకొనిపో'' అని ఆమె అన్నది.

...................

వారిద్దరూ ఒంటిగా ఉన్నంతసేపూ ఆమె అతని ఒళ్లో ఉండవలసిందే! వారి హృదయాలురెండూ లయలు శ్రుతులు కావలసినదే.

౧౪

మేరీ తక్కినవారితో ఇంగ్లండు వెళ్ళి తన వ్యాపారాన్ని సర్దుకుని తిరిగివచ్చేటట్లూ, అంతవరకూ విశ్వేశ్వరుడు శివగ్రామ ఆశ్రమంలో ఉండేటట్లూ ఏర్పాటు చేసుకున్నారు.

మేరీ మార్గరెట్టు మొదలయిన వాళ్ళతో బొంబాయి వెళ్ళి పోయింది.

ఒంటిగా ప్రాణమేలోకానికో పోయినవానిలా ఉస్సురంటూ ఆశ్రమంలో ఉన్నాడు విశ్వేశ్వరుడు.

అతి వేగంతో, అతి సున్నితంగా యిరువదినాలుగు రకాల దారం వడకదం నేర్చుకో ప్రారంభించాడు.

అతిబాధతో ఇంకో చిత్రం ప్రారంభించాడు అతడు. ఉజ్జ్వల రూపయై, జగత్కళ్యాణమూర్తియైన శాంతిదేవియొక్క చిత్రము. సర్వ కష్టాతీతయైన, సర్వద్వేషాతీతయైన పరమప్రేమమూర్తి ద్వేషపూర్ణమైన ఈ ప్రపంచంలో ఒక్కొక్క దివ్యవిధానాన్ని అహింసా స్వరూపమును నిర్ణయించుకుంటూ ప్రేమ పరావతారుడైన గాంధీ అహింసా మార్గమును అన్వేషిస్తున్నాడు.

ఆ మహా భావాన్ని సర్వవిధాలా ఉద్దీపింపజేయడం తనబోటివారి ముఖ్యధర్మము.

ఆ చిత్రం విచిత్రవేగంతో విజృంభింపసాగింది. నీలాలు, వంగ పండుచాయలు, పాటలవర్ణాలు —

అయిదవ రోజున సాయంత్రం ఒంటిగా ఆశ్రమానికి అనతి దూరంలోఉన్న ఎత్తు ప్రదేశంమీద కూర్చుని విశ్వేశ్వరుడు మేరీ దివ్య మూర్తిని ఊహించుకుంటూ పులకిత దేహుడౌతూ, ఈ రెండునెలలూ ఎట్లా భరించడమా అని ఆలోచించుకుంటూ, పరవశమైన స్వప్నాలు కంటూ కూచుని ఉన్నాడు.

దశమినాటి చంద్రుడప్పుడే నీలాకాశంలో పైననే ఉన్నాడు. చంద్రకాంతులూ, సంధ్యాకాంతులూ వియ్యమందుతూ ఉన్నవి.

చటుక్కున చంద్రకిరణాలలాంటి రెండుచేతులు ఆతని మెడను చుట్టుకున్నవి.

ఆతడు గుండెకొట్టుకుంటూ వెనక్కుతిరిగాడు.

"మేరీ! మేరీ! కలా?" అంటూ వెనక్కుతిరిగాడు.

"కలకాదు, నేను నిజాన్ని ప్రియా! నిన్ను వదలి ఇంగ్లండు వెళ్ళలేకపోయాను. రెండు నెలలయినవెనక, మార్జీ నావ్యాపారాలన్నీ సర్ది మన......మన.......వివాహానికి వస్తుందట..."

"ఓ మేరీ! ఇంత ప్రేమకు నేనెట్లా తగుదును దేవీ!"

వెన్నెలవెలుగు దీప్తి తాల్చినది.

ఆశ్రమంలో ప్రార్థనకు అందరూ చేరినారు.

(జూన్ 1939)

# సుశీల

—చలం

నారాయణప్ప గారిది కొత్త పద్ధతుల యిల్లు. బ్రాహ్మలే. అయినా యిల్లు పైనుంచి చూడడానికి యూరేషియనుల యిల్లులా గుంటుంది. వరండాకిముందు తడికలూ, తొట్లలో మొక్కలూ, గోడలికి సీనరీల పఠాలు, పట్టుసోఫాలు, పేము కుర్చీలూ, గాజుగిన్నెల్లో పువ్వులూ, చాల అందంగా వుంటాయి. మనుషులూ అట్లానే వుంటారు. ఆయన బూట్సులూ, షర్టులూ, బొత్తాములూ కోట్లూ, క్రాపింగు జుట్టూ అన్నీ నీటుగా వుంటాయి. ఆయన భార్య అట్లానే సన్నగా, పొడుగ్గా, చాలా నాజూకుగా వుంటుంది. ఆ జుట్టు దువ్వుకోడం, బొట్టు పెట్టుకోడం, చీర కట్టుకోడం, నడవడం, నవ్వడం, మాట్లాడడం అన్నీ నాజూకుగా అందంగా వుంటాయి. తెల్లవారి లేవగానే చూచినాసరే అట్లానే వుంటుంది. ఒక్క వెంట్రిక తలనించి రేగి వుండదు. తల్లో వొక్కపువ్వు నలిగి ఉండదు. ఆమె జాకెట్టూ, చీరా, బెల్టూ, చేతికి సన్నని గాజులూ, మెళ్ళో సన్నని గడియారం గొలుసూ, కాళ్లకి మొహమల్లుస్లిప్పర్లూ, అన్నీ సృష్టిలోనే ఆమెకోసం యేర్పడ్డట్టుంటాయి. ఆమె పేరు సుశీల. వాళ్ల వంటవాడూ అంతే. అంత శుభ్రంగా గవర్నరుగారి బొట్లరుకూడా వుండడు. ఆయన కుక్కలూ అంతే. తక్కిన కుక్కల వలె అల్లరి చెయ్యవు; అనవసరంగా మొరగవు ; బయటికి వెళ్ళవు ; వాటి ముక్కుదగ్గిర బిస్కట్లు తింటున్నా అడగవు; కాళ్ళమీద పెట్టవు. నాకమంటేనేగాని చెయ్యిగాని, మూతిగాని నాకవు. ఆయనకి పిల్లలు లేరుగాని, వున్నా వాళ్ళు అల్లరి చెయ్యరు. ఎత్తుకోమనరు. ప్రాణం విసిగేట్టు ప్రశ్నలువెయ్యరు. తేలు కుట్టినా బిగ్గరిగా యేడవరు.

నారాయణప్పగారికి ఆస్తి చాలావుంది. ఆర్జించుకునేందుకు ఆయనచాకిరీ చెయ్య నక్కర్లేదు. కాని యెప్పుడూ కూడ సోమరిగా వుండడు, చైర్మనూ, ప్రెసిడెంటూ, సెక్రటరీ, ఆనరరీ మెంబరూ, మొదలయిన పనులు ఆయనకి ఒక డజన్ వున్నాయి. తీరుబడే వుండదు సాయంత్రం తప్ప. సాయంత్రం వూళ్ళో పెద్ద వుద్యోగస్తులందరూ ఆయన యింటికి చేరుకుంటారు. ఈయన యిల్లు ఒక క్లబ్బు వొచ్చేవాళ్లు లేక ఆ వూరి క్లబ్బు మూసేశారు. ఏ ఉద్యోగస్తుడు ఆ వూరు కొత్తగా వొచ్చినా నారాయణప్పగారి స్నేహం కోరి, వెతికి చేసుకోంది ఒక్కగంట నిలవడు. వాళ్ళందరూ ఆయన యింటి కొస్తారు. టెన్నిసు ఆడతారు, టీ తాగుతారు, చీట్లాడుతారు, రాత్రి పదింటికి వెడతారు. సుశీల గూడా వాళ్లందరితో కలిసి యింట్లో తిరుగుతుంది. వాళ్ళకి షేకాండిస్తుంది, టీ యిస్తుంది, న్యూసు పేపరు సంగతులు చర్చిస్తుంది, వాళ్ళతో కూచునివుంటుంది వాళ్లు వెళ్ళిందాకా.

ఆ కాలంలో న్యూసు పేపర్లు చాలా హడావిడి చేస్తోవుండేవి. సత్యాగ్రహం, రౌలెట్ ఆక్టు, ఇవన్నీ అయిపోయి, పంజాబు వధల కాలం వొస్తోంది. దేశమంతా అల్లకల్లోలమయ్యేట్టు కనపడుతోంది. ఇదంతా సుశీలకి చాలా సరదా. వీళ్ళందరూ యేమంటారో తెలుసుకోవడం ఆమెకి చాలా యిష్టం. నారాయణప్పగారు యీ గవర్నమెంటు ఉద్యోగస్థులనే గాక వూళ్ళో అందరినీ యెరుగును. వీళ్ళ వుద్దేశాలేగాక లోకమంతటి వుద్దేశాల సంగతి తెలుసు అతనికి. అందుకనే అతనికీ, వుద్యోగస్తులకీ, చాల పెద్ద వాదనలు జరిగేది. కాని సుశీల వూహలు చాల మట్టుకి గవర్నమెంటు వుద్యోగస్తులవల్ల యేర్పడ్డవే! ఆమె స్త్రీ గనక వూళ్ళో తిరగదు. విశాలమైనదృష్టిలేదు.

నారాయణప్పగారికీ సుశీలకీ, మత, కుల, పట్టింపులు లేవు. మీ రెవరంటే బ్రాహ్మల మంటారుగాని, ఆ బ్రాహ్మణీకం యెక్కడుందో

గుర్తు పట్టడం చాల కష్టం. వాళ్ళ యింట్లో బ్రాహ్మల్ని, తురకల్ని, క్రిస్టియన్లని, ఒక మోస్తరుగానే చూస్తారు. కష్టమయినవాళ్ళు రావడం మానెయ్యవొచ్చు. వాళ్ళకి లక్ష్యంలేదు. ఇట్లావున్నా వూళ్ళో యెవరూ వాళ్ళని హీనంగా చూడరు. వాళ్ళని భోజనానికి పిలుస్తారు. వాళ్ళింటికి వెళతారు. ఆయన పిలిస్తేచాలు. ప్రతివారికీ గొప్పే ! నారాయణప్పగారి కున్న పలుకుబడీ, మర్యాద యెవరికీ లేవు. కాని వీపు వెనకాల గుసగుసలు యెవరికి తప్పుతాయి యెంత గొప్పవాళ్ళయినా, మంచి వాళ్ళయినా ?

సుశీలకీ నారాయణప్పగారికీ చాల ప్రేమ వొకరిమీద వొకరికి. ఎన్నడూ వొకరితో వొకరు పోట్లాడి యెరుగరు. వొకరు చెపితే అది రెండోవారు ఆజ్ఞగా నెరవేరుస్తారు. నారాయణప్పగారు భార్య ఆత్మని చంపి, తన వశం చేసుకొని, తనకు నీడనిచేసుకొని, తన వూహాలే ఆమె తల్లో పెట్టి, ఆమెనోట రప్పించి, మే మిద్దరంఒకటయిపోయినా మనే రకం మనిషి కాడు. ఆమె వూహాలకీ పనులకీ పూర్ణ స్వాతంత్ర మున్నది. యెన్నడూ వొకరిమీద వొకరికి అనుమానం లేదు అను మాన పడడమనే తలఃపే వారికి సిగ్గు వేస్తుంది. ఇందరు మొగాళ్ల వొస్తోవుంటారు, పోతూవుంటారు. నారాయణప్పగారు అనేకసార్లింట్లో వుండరు. అయినా అనుమాన మన్నమాట లేదు.

క్రొత్తగా ఆవూరు ఒక తురక పోలీసు సూపరెండెంటు వొచ్చాడు. ఆయన పేరు సులేమాన్. చిన్నవాడు. అందమైనవాడు. అతనికి కొత్తగా పనికావడం యిక్కడికే. ఆయన యూనిఫారం కత్తీ, పోలీసు వుద్యోగస్తుల శాల్యూట్లూ చూసుకొని, ఆయనకి చాలా వినోదంగా, కొంచెంగర్వంగా వుండేది. అతనికి పెళ్ళి కాలేదు; మొత్తానికి ఆయనతో ఆతవారెవరూలేరు. ఆయన ఇంగ్లండు వెళ్ళివచ్చాడు. ఆయన జాతి యేమిటో, మతమేమిటో నిర్ణయించడం కష్టం. సరే వొచ్చినరోజునే

అతను నారాయణప్పగారి యింటికి వొచ్చాడు. ఆయన యింట్లో భార్య, పక్క లూ, ఆయనకి పట్టింపులు లేకపోవడం, ఆ సాయంత్రపు టీ, కబుర్లూ, అన్నీ సులేమానుకి చాలా సంతోషం, ఆశ్చర్యం కలగచేశాయి. ఇండియాలో కూడా యిట్లాంటి వాళ్ళుంటా రనుకోలేదు. మొదటి రోజు నించీకూడా అయనకి సుశీలకీ చాలా స్నేహమయింది. వారం రోజుల్లో మరీ యెక్కువయింది. అది అక్కడ కొచ్చేవాళ్ళందరికీ కనపడుతునే వుంది.

పది సంవత్సరాలు నారాయణప్పగారితో కాపరం చేసినతరవాత సుశీలకి యిప్పటికి యింకొక పురుషుడిమీద ప్రేమకలిగింది. ఆమెకు యీ ప్రేమయేమీ యిష్టంలేదు. నారాయణప్ప గారంటే ఆమెకి యెక్కువైన గౌరవం కనక మొదట సుశీల యీ ప్రేమతో చాలా పోట్లాడింది. ఒకటి రెండు రోజులు వుత్త స్నేహమనుకుని సమాధాన పరుచుకుంది. తరవాత తెలుసుకొని ఆతనికి దూరంగా వుండడానికి ప్రయత్నించింది. కాని సులేమాను వెతికి ఆమెను తీసుకొచ్చేవాడు. తరవాత ఆమె ఆ ప్రేమని నిలుపుకోలేక ఘోరమైన యుద్ధంచేసింది. కాని ప్రేమ చాలా మాధుర్యంగావుంది. ఆమెకి భర్తమీద భక్తిగాని, పాపభీతి యేమీలేవు. అదంతా మూఢత్వమని ఆమె నమ్మకం, భర్త లేకపోతే అసలు యీ సందేహాలే ఆమెకు వుండేవి కావు ; ఈ యుద్ధమే అవసరంలేదు. తన భర్త కియ్యవలసిన ప్రేమ యితని కిస్తున్నానని ఆమెకు చాలా బాధగావుంది. నారాయణప్పగారితో చెప్పాలని నిశ్చ యించుకొంది. ఆయన్ని చూస్తే భయంలేదు. కాని ఆయనకి మనో వేదన కలుగుతుందనీ, తరువాత, ఆయన యెట్లానన్నా తననీ సులే మాన్ స్నేహం మాన్పిస్తాడనీ భయంవేసి వూరుకుంది. ప్రేమ జయం పొందింది. భర్తమీద యిప్పటికీ ప్రేమవుంది. అయినా యీ కొత్త ప్రేమ ఆమెను పూర్తిగా స్వాధీనంచేసుకుంది.

కొందరు స్త్రీలు వారినెవరికి పెళ్ళిచేస్తే వారిని వెంటనే ప్రేమిస్తారు. ప్రేమించినట్టే వుంటారు. ప్రేమించామనే, వారూ అనుకుంటారు. దాంట్లో యేమీ మోసంలేదు. చాల నమ్మకస్తులు. కాని ఎప్పుడో. వొకప్పుడు, యెవరో కొత్తవారిమీద నిలపరాని ప్రేమ కలుగుతుంది. వారికి. వారి హృదయాలు యెవరికోసం చెయ్యబడ్డాయో, అటువంటి వారిని కలుసుకొంటారు. అపుడు ఆ మహాగ్నిలో ఈ పూర్వపు ప్రేమ నీతి, విశ్వాసమూ, అన్నీ దగ్ధమవుతాయి. యెవరూ ఆపలేరు. కొన్ని బైటికి వస్తాయి. కొన్ని ఒకరిద్దరికి తెలిసి ఆగుతాయి. కొన్ని బైటికి రానేరావు.

సులేమాన్ స్వభావమంతా పట్టుదలతో చెయ్యబడ్డది. తలుచుకున్నాడా అది నెరవేరితీరాలి; అందాకా నిద్రపోడు. పోలీసు సూపరెంటు కావాలని పదిహేనేళ్ళకిందట చిన్న కుర్రవాడుగా వున్నప్పుడనుకున్నాడు. అయిందాకా వొక్క రోజు ఆ పట్టును మరిచివుండలేదు. సుశీలను చూచిన మొదటి రోజే ఆమెను ప్రేమించాననీ, తనదాన్ని చేసుకోవాలనీ అనుకున్నాడు. ఇంక అంతే; ఆమె ప్రేమను లోబరచుకున్నదాకా నిద్రపోలేదు. యెవరడ్డు మొచ్చినా, తనకెంత నష్టమయినా ఆ పనిని వొదలడు. ఈ కాలంలో యీ దేశంలో పుట్టాడుగాని హానిబాల్‌వంటి దీక్షాపురుషుడు కావలసింది. ఆమె తనని ప్రేమిస్తోందా లేదా అని ప్రశ్నేలేదు. తప్పించుకోడానికి ఆమె ప్రయత్నాలూ, ఆమె భయమూ, పశ్చాత్తాపమూ, అన్నీ చూశాడు. తన బలంతో ఆమెని, అవన్నీ కూడా తోసేసి తనదగ్గిరికి వొచ్చేటట్టుచేశాడు. ఇంక ముందువెనుకలు లేవు. స్నేహితుణ్ణి మోసంచేస్తున్నాననే ఆలోచన తట్టింది. కాని దాన్ని పైకి రానీయడు. తలచుకొన్నది చేసితీరాలి. అతనికి ఇంకొకరు చూస్తారు, తన కవుమానం, అల్లరి, యిల్లాంటి ఆలోచనలు లేనేలేవు. యెవరన్నా అడిగితే సంగతంతా చెప్పేస్తాడుకూడాను'

ఒకనాటి రాత్రి పదింటికి వొచ్చినవాళ్లందరూ తోట్లోంచి వెళ్ళి పోతున్నారు చీట్లాట చాలించి. నారాయణప్పగారు ఆ రాత్రి పన్నెం డింటికిగాని రానన్నాడు. పనిమీద వెళ్ళాడు. సులేమాను కదలలేదు ఆఖరు మనిషి వెళ్ళడంతోటే సుశీలా, అతనూ మధ్య అడ్డం తీసేస్తే కలుసుకునే రెండు ప్రవాహాల్లాగ కావిలించుకున్నారు. సన్నగా, తెల్లగా వున్న సుశీల, రాతి విగ్రహంమల్లే నిలబడ్డ అతన్ని అల్లుకున్నట్లు కలిసి పోయింది. అతని షర్టుమీదా, బుజంమీదా ముద్దు పెట్టుకుంది. ఇంకా యెప్పటికీ వొదలకండా, అట్లా వుత్తరీయంవలె వుండిపోతుందేమో ననిపించింది.

"పొద్దున్నించి యెదురు చూస్తున్నాను, ఇంక వొదలను. యెన్నటికీ వొదలను. ఇన్నాళ్ళూ, యిన్ని సంవత్సరాలు, నాకు కనపడకుండా యెక్కడున్నావు ! నిన్నింక వొదలను. యెట్లా వెడతావో వెళ్ళు"

రాత్రి వొంటి గంటయింది మంచంమీది సుశీల నిద్రపోతున్నట్లు పడుకుని వుంది. సన్నని దీపం వెలుగుతోంది. నారాయణప్పగారు పడుకోడానికి కోటూ అవీ తీసేస్తున్నారు.

"సుశీలా !"

జవాబులేదు. వొచ్చి మంచంమీద కూచుని సుశీలమీదికి వొంగి, మొహం తనకేసి ప్రేమతో తిప్పుకున్నాడు, చెంపలనిండా కన్నీళ్ళున్నాయి; యెన్నడు లేనిది జుట్టు చీదరగా చెంపల కతుక్కుని వుంది. ఆయన చాల ఆశ్చర్యపడ్డాడు.

"సుశీలా, సుశీలా; యేమిటి యీ కన్నీళ్ళేమిటి ? యెందు కేడ్చావు !"

ఆమెనంతా లాక్కుని తనవేపు, తొడలమీద పడుకోపెట్టు కున్నాడు. సుశీల కళ్ళువిప్పింది; మళ్ళీ నీళ్ళు కారుతున్నాయి.

''యేంలేదు ; యేదో దిగులేసింది.''

నారాయణప్పగారికి వారంరోజులనించి యేదో చెప్పలేని బాధగా వుంది. కారణం ఆలోచించినా తేలలేదు. ఇప్పుడు సుశీలని చూడగానే యీామె విషయమయ్యే ఆ బాధ అని తట్టింది.

''సుశీలా ! యేదోవుంది, నాదగ్గిర్నించి దాస్తున్నావు.''

''యేంలేదు''

''నేను నమ్మను. దాస్తావా, నాతో చెప్పకుండా ? చెప్పవూ ? నే నేమీ అననని నీకు తెలీదూ ? చెప్పు.....నా సుశీలకదూ ! చెప్పవూ ? ఛీ, యేడుస్తారా ! చెప్పెయ్యి. నేను ఆలోచిస్తాగా తరువాత యేం చెయ్యాలో''

అంతా అతనితో చెప్పేసి శాంతిపొందాలని సుశీల కెంతో అనిపించింది, కాని చెప్పేస్తే...తరవాత... ఆ రాత్రి యేమీ చెప్పలేదు. సుశీల యేదో మనోవ్యధలో వుందని నారాయణప్పగారికి తెలిసిపోయింది. తనకెందుకు చెప్పదో ఆయన కర్థం కాలేదు. తనే యెట్లాగన్నా తెలుసుకుని పోగొట్టాలని, నిశ్చయించుకున్నాడు. యేమీ అనుమానంమాత్రం మనసులోలేదు. ఆయనికి ఇంతేకాకుండా సులేమానంటే కూడా అయిష్టం మొదలు పెట్టింది నిష్కారణంగా. అతను యేమన్నా అంటే తను సహజంగానే దాన్ని కాదంటాడు. సుశీలా సులేమాన్ వొకటే మాట—గవర్నమెంటు పక్షం. ఇతను ప్రజలపక్షం, సులేమాన్ని చూస్తే ఆయనకి వొక విధమైన భయంకూడా పట్టుకుంది. ఆ నిష్కారణమైన భయంసంగతి తలుచుకొని నారాయణప్పగారు తనలో తను నవ్వుకునేవారు.

ఒకరోజు పొద్దున్న సుశీల పోలీసులైన్లకి వెడతానంది. ఆవాళ గొప్ప డ్రిల్లు జరుగుతుందని చూడ్డానికి సులేమాను రమ్మన్నాట్ట. సుశీల తనని యూనిఫారంలో చూడాలని అతని ఆశ.

నారాయణప్పగారు,

"యెందుకులెద్దూ, అందరి వుద్యోగస్తులలో నువ్వు ఆడదానివి వొక్కతెవూ వెళ్లడం బాగుండ''దన్నాడు.

"నేను వొస్తానని చెప్పాను, పాపం ఆయన యెదురు చూస్తో వుంటాడు'' అంది.

''ఇప్పుడు నువ్వు వెళ్ళకపోతే అతని డ్రిల్లు ఆగుతుందా? పోనిద్దూ!" అన్నాడు.

"అట్లాకాదు. వెడతాను, ఉండిపోవడానికి నాకేం కారణం కనపడ్డంలే''దంది.

యిద్దరకీ భేదాలు వొస్తున్నాయి.

సన్నని చీనా పట్టుచీరె కట్టుకుని, తల్లో గులాబిపువ్వులు పెట్టుకుని, గుఱ్ఱపుబండిలో వెళ్ళింది. ఇంకా సులేమాన్ బంగాళానించి బయలుదేరలేదు; కాఫీ తీసుకోబోతున్నాడు. యూనిఫారం వేసుకుని పెద్దకత్తి కిందకి వేళ్ళాడుతోంటో పెద్ద చేతులూ, ఆ బలిసిన మెడా, గుండ్రని దవడలూ, అతన్ని చూసింది.

"యెంత బావున్నావు ? ఈ డ్రెస్సులోనే యేదో అందం వుంది, నాకు తప్ప యింకెవరికీ కనపడదు;"

''నీకు కనబడాలనే నేను రమ్మన్నాను.''

''అంటరూ సోల్జర్లు కావాలని వుంటుంది నాకు. ఆ కత్తి, ఆ తుపాకీ, యెంతమందిని చంపెయ్యోచ్చు? యెవరూ అడ్డం చెప్పలేరు కదూ? పూర్వం యుద్ధాలుచేసే యోధులు జ్ఞాపక మొస్తున్నారు నిన్ను చూస్తే! ధర్మం నిలబెట్టే మహారాజులా గున్నావు. అన్యాయం, నీచత్వం, కత్తికి వొణకవలసిందే!''

"యేమిటి యీవాళ కవి వయినావు ?"

"ప్రేమ మారుస్తుంది. సామాన్య మానవుల్ని దేవతలని చేస్తుంది."

"అవును నేను యోధుణ్ణయితే, యోధుడికి జయమిచ్చే దేవతవి నువ్వు" అని మోకరించి ఆమె చెయ్యిని ముద్దు పెట్టుకున్నాడు.

"నా చెయ్యిని చెరుకు ముక్కలాగు నవిలెయ్యగలవనుకుంటా; ఆ దవడలతో ! యెక్కడిది నీ కింతబలం ?"

"చారూ, మజ్జిగ తాగితే బలం వొస్తుందా !"

"నేను కూడా మీ అంత లావుగా వుంటే బావుండేదాన్ని ?"

"వుండవు. నాకు సన్ననివాళ్ళని చూస్తే యిష్టం. నా మెళ్లో హారాల్లా గుండాలి వాళ్ళ చేతులు, నన్ను కావలించుకుంటే ! నా బలాన్నంతా ఆ బలహీనంతో, మృదుత్వంతో కట్టెయ్యాలి...నీకో ?"

"నా కేమిష్టమో తెలీదాయేం నీకు ? యిట్లా వుంటే" అని అతని నడుముచుట్టూ చేతులు పోనిచ్చింది.

"ఈ బలమంతా, అధికారమంతా, పొగరంతా నాదేకాదూ ?"

"నీదే. కాని యిది బలమే కాదు; నీ చేతులలో వోడిపొయ్యే మా బలమేం బలం ? యే తుపాకుల దెబ్బలన్నా తప్పుకుంటాముగాని యీ కళ్ళనించి... యీ పెదిమెలనించి... యీ మాధుర్యంనించి..."

సుశీల ఆరోజు యింటికి మధ్యాహ్నం మూడింటికి వచ్చింది. తరవాత త్వరలోనే నారాయణప్పగారికి అనుమానం తట్టడం మొదలు పెట్టింది. వాళ్ళ మొహాలే చెప్పాయి అతనికి. కాని అతను చూడ లేచుకోలా. ఆరితేరిన దొంగలూ, మొనగాళ్ళూ, తప్పుచేసి దాచుకో లేరు ; కాని నిర్మల స్వభావులు దాచలేరు, అందులో సులేమాన్ దాచ డానికి కూడా ప్రయత్నించడు. ఒకరిద్దరు స్నేహితులు నారాయణప్ప

గారితో కొంచెంగా సూచించారు. అయినా ఆయనికి నిశ్చయం లేదు. సాధారణమైన భర్తలవలె దాక్కుని, దొంగ వేషాలు వేసి, వాళ్ళిద్దరినీ కలిపి. యేం చేస్తారో చూసి, సాధించే రకం కాదు. ఆయన మనసు బాధిస్తోంది. కాని తను మాత్రం నీచమైన పని చెయ్యలేదు.

ఇంతలో దేశాన్నంతా వూగించేసే నాన్‌కో–ఆపరేషన్ వొచ్చింది. దేశానికంతా ఆదేశంపై ఆదేశం వస్తోంది. అందరికన్నా ముందు నారాయణప్పగారి మనుసులో ఆ విషయాలు కలవరం కలిగించాయి. యేదో తమ పొట్టకోసం పనితో పాటుబడేవాళ్ళకన్నా, తమ స్వంతపని లేని వాళ్ళని ప్రతి వుద్యమం ముందుగా కదుపుతుంది. యేమి దొరుకుతుందా కొంత హడావిడి చెయ్యడానికి అని వాళ్ళు చూస్తూవుంటారు. యేదో ఒక గోల లోకంలో జరుగుతూ వుంటేనేగాని వాళ్ళు బతకలేరు. దేశమంతా వాళ్ళపనులు వాళ్ళు చూచుకునేవాళ్ళే అయితే యిన్ని కాన్ఫరెన్సులూ, కాంగ్రెసులూ నిలబడతాయా? వెంటనే తన సూట్లూ, మల్లు పంచలు మానేసి, ఖద్దరు కట్టడం మొదలు పెట్టాడు. ఇంటినిండా పంచమజాతి నౌకర్లను పెట్టాడు. గోడలికి గాంధి పటాలు తగిలించాడు. మునపటి అందమే, షోకే, కాని యిప్పుడు యీ రకం. యే మీటింగులలో చూసినా అతనే ! యే ప్రొసెషనులో చూచినా అతనే ముందు. గవర్నమెంటును గురించి అతి త్రీవంగా మాట్లాడతాడు. కొందరు గవర్నమెంటు నౌకర్లు భయపడి ఆయన యింటికి రావడం మానేశారు. కాని సులేమాన్ మానలేదు.

ఒకరోజు రాత్రి చీకట్లో నీళ్ళకుండి దగ్గిర సుశీలా, సులేమాన్ నుంచున్నారు. అమావాస్య చీకటి, నక్షత్రాలు చుట్టూ కళ్ళలాగు మెరుస్తున్నాయి. తెల్లని పువ్వులుకూడా కనబడటంలేదు. వాళ్ళిద్దరూ రహస్యంగా మాట్లాడుకొంటున్నారు.

"నేనింక యిక్కడకు రావడానికికూడా వీలుండక పోవచ్చును. నువ్వు వొచ్చి నాతో వుండిపోవాలి. నా నౌకరిపోతే పోయిందిలే. కాని నిన్ను వదలను, రావూ? సుశీలా, రావాలి! తప్పదు."

"ఎట్లారాను? ఎట్లారాను? ఆయన్ని యెట్లా వదలను? వీలు లేదు"

"ఎందుకు వీలులేదు? వొచ్చెయ్యి. నేనింక యిక్కడికి రాను. యిట్లా రావడం నాకు బాగుండలేదు. ఆయన మొహం చూడ్డానికి సిగ్గేస్తుంది. యీ చీకట్లోంచి తప్పించుకొని బైటపడదాము."

"అయితే యీ వూళ్ళోనే మన మిద్దరమూ కలిసి వుండడం? నాకు ధైర్యం చాలుతుందో లేదో?"

"ఛా! అధైర్య పడతావా? ఏ విషయంలోనన్నా పడొచ్చు గాని భయపడి ప్రేమ జీవనాన్ని పోగొట్టుకుంటారా?"

"సరే ఆలోచిస్తా సంగతి. నాలుగైదు రోజులు కానియ్యి. తొందరేముంది?"

ఈ కొత్త ప్రేమ వచ్చిన తరవాత ఆ యింట్లో వుండడం అర్థ హీనంగా కనబడుతోంది, దేనికోసం తను అక్కడ వుండడం? కాని వెంటనే వెళ్ళడానికి ధైర్యం చాలడంలేదు. సులేమాన్ వెళ్ళిపోయిన తరవాత కూడా ఆ కుండీవద్దున అట్లానే నుంచుని ఆలోచిస్తోంది. ఇంతసేపు నారాయణప్పగారు యింట్లోనే వున్నారు. వీళ్ళిద్దరూ యిక్కడున్నసంగతి ఆయనకు తెలుసు. సులేమాన్ వెళ్ళిపోయిన బూట్సు చప్పుడు విన్న తరవాత చీకట్లో వెనకాలే వచ్చి సుశీల బుజం మీద చెయివేశాడు. చూడకుండానే వెనక్కి వంగి మెడ మీద చేతు లెయ్యడానికి వెతుకుతూ, సుశీల—

"మళ్ళీ యెందుకొచ్చావు"......అంది.

ఖ్యోడ కనబడలేదు. నారాయణప్పగారు సులేమాన్‌కంటె పొట్టి, వెనక్కి తిరిగి చూచింది, నారాయణప్పగారు కావలించుకున్నారు.

"నాతో చెప్పవూ? యిప్పుడన్నా చెప్పకూడదూ? యెందుకలా లోపలలోపల కుళ్ళుతావు? నాతో చెప్పేస్తే ఆ బాధ తప్పకుండా పోతుంది. యిన్నాళ్ళూ ఆనందంగా జీవించాము, యిప్పుడు నీ హృదయమిలా వేరు చేసుకొంటావా? నా మీద నమ్మకం లేదూ? చెప్పు."

"వొద్దు, వొద్దు. నన్నడగకండి. నే ననుభవిస్తోంది చాలు. మిమ్మల్ని కూడా యెందుకు బాధపెట్టడం? తెలియవలసినప్పుడు తెలియనే తెలుస్తుంది."

"అప్పుడు నీకు సహాయం చెయ్యగలనో; లేదో. ఆలశ్యంచేసి పాడుచేసు కొంటున్నావు. ఏదో మహాభ్రమలో, నీకు అణుచుకోడానికి బలములేని వ్యామోహంలోపడి, క్షోభపడుతున్నావు. నన్ను నీకు సహాయం చెయ్యనీ. నా బలంకూడా నీ కిస్తాను. నేను కూడా నీతో కలిసి ఆలోచిస్తాను...ఒక్క ఆత్మతో పెరిగామే, ఏం చేశానని నామీద నీకు నమ్మకం లేకపోవడం? పోనీ ఆలోచించు; ఎన్నాళ్లయింది నువ్వు నాతో మనసిచ్చి మాట్లాడి. నామీద ప్రేమ పోయిందా, నేను నీకేం ద్రోహం చేశాను?"

"మీరుకాదు, మీరుకాదు, అంతా నేనే. నన్నలా ముట్టుకోకండి? నేను పనికిరాను, తగను, వెళ్ళండి మీకే తెలుస్తుందంటున్నానుగా? వెళ్ళండి."

నారాయణప్పగారు కొంచెంసేపూరికే వున్నారు. ఇంక నిశ్చయంచేసుకొని అడిగేశారు.

"నేను నమ్మలేను. ఇప్పటికీ నాకు నమ్మకంలేదు. చాలారోజులు అనుమానమే రాలేదు. నేను రానియ్యలేదు. కాని యిప్ప డనుమానం గానేవుంది. నిజం చెప్పుతావని నిన్ను అడిగేస్తున్నాను."

రెండు చేతులలో మొహం పెట్టుకొని ఆ గట్టుని ఆనుకొని సుశీల యేడ్చింది.

" నాకు కోపమనుకోకు, విచారపడకలా, కాని యిలా సంగతులు జరగడం మాత్రం నాకిష్టంలేదు, నేను పనిచేసే పవిత్రమైన వుద్యమ మేమిటి? నా యింట్లో జరిగే సంగతులేమిటి? మొదటనుంచీ యేం జరిగిందో చెప్పేస్తావా?"

"చెప్పను, చెప్పలేను."

"చెప్పితే చాలామంచిది. అందరిమల్లే నేను నిన్ను శిక్షించడం కేకలు వేయడం అవీ చేస్తానని అనుకోకు. సుశీలా, నీమీద ప్రేమ నా కింకా పోలేదు. అంతా మరచిపోయి పూర్వమల్లేనే వుందాం, చెప్పు."

"చెప్పను."

ఆయితే పోనీలే, యికముందు మానేస్తావా?"

"ఏమో చెప్పలేను. ప్రయత్నిస్తాను. నా శక్తికి మించిపోయింది గనకే లోబడ్డాను."

"ఆదేమైనాగాని, యీ ప్రకారం యిక్కడ జరగడం నాకిష్టం లేదు."

"సరే. ఆయన్ని యిక్కడికి రావద్దంటాను."

సుశీల ప్రతిరోజూ సాయంత్రం సులేమాన్ బంగళాకి వెళ్ళిరావడం మొదలు పెట్టింది. నారాయణప్పగారు గట్టిగా వీలులేదని పట్టుపట్టారు. ఇంక యీ పద్ధతి సాగదని తెలుసుకొని మూడురోజుల్లో అతనితో వుండ డానికి వస్తున్నానని సులేమాన్‌తో చెప్పేసింది.

ఇవ్వన్నీ జరుగుతుండగా యీలోపల నాన్‌కో-ఆపరేషన్ చాలా యెక్కువయింది. విద్యార్థులు బళ్ళు మానేస్తున్నారు. ప్లీడర్లు కోర్టులకు

వెళ్ళడంలేదు. వార్తాపత్రికలు వుద్యమం దినదినమూ బలమవుతున్న సంగతి చాటుతున్నాయి. ఎవరికి చేత అయినట్లు వారు త్యాగంచేస్తున్నారు. ప్రతివారి హృదయాలలోనూ దేశభక్తి అంకురిస్తోంది. ధనం యిచ్చేవారు, సొమ్ములు యిచ్చేవారు, కాలమిచ్చేవారు, శక్తినిచ్చేవారు, సౌఖ్యాన్నిచ్చేవారు ఎవరికి చేత అయింది వారు అర్పించుకొంటున్నారు. ఏమౌతుఁదా అని ప్రతివారూ ఎదురు చూడ్డమే. 31 వ—డిశంబరులో ఏదో గొప్ప మార్పు జరగపోతుందని ఆబాలగోపాలమూ నమ్మేశారు. అందులో ఆ వూళ్లో ముఖ్యంగా యీ అడావిడి చాలా ఎక్కువగావుంది. భజనలు, కీర్తనలు, మీటింగులు, ప్రొసెషన్‌లు, లెక్చర్లు, సమ్మెకట్లు, హరతాళాలు ఎగిరి పోతున్నాయి. వీటికంతా నాయకుడు నారాయణప్పగారు. ఎప్పుడూ ఆయన యింటినిండా నాన్‌కో-ఆపరేషన్ మనుష్యులు ప్రొద్దుణించి సాయంత్రందాకా ఆ మాటలే, ఆ పనులే. కుర్చీలు, సోఫాలు, మూలపారేశారు. చరకాలు, మగ్గాలు పెట్టారు.

సుశీలకు యిదేమీ అంటలేదు. ఆమె వూహలన్నీ సులేమాన్ వూహలు. పూర్వమైతే నారాయణప్పగారితో యీ సంగతులన్నీ చెప్పేసేది. కాని యిప్పుడు ఆయనతో సరిగానన్నా మాటాడ్డంలేదు. ఈ పనులన్నీకూడ వట్టి భేషజమనీ నిరర్ధకమనీ, పనిలేనివాళ్ళూ, మూఢనమ్మకంకలవాళ్ళూ, దుర్మతాభిమానం కలవాళ్ళూ, ప్రోత్సహించి చేయిస్తున్నారని, సులేమాన్ చెప్పాడు. సుశీలకి కూడా అలానే కనపడ్డది. నారాయణప్పగారి గొప్పతనం, భావౌన్నత్యం, సుశీలకి తెలుసు. కాని ఆయనకి ప్రజలమీద వుండే అనుభక్తి, ఆయన స్నేహితుల ప్రోత్సాహమూ, ఆయన్ని చెడగొట్టి యీ ఉద్యమంలో చేర్చాయని ఆమె అభిప్రాయపడ్డది. కాని జరిగే సంగతులని చూస్తున్నకొద్దీ తనూ, సులేమానున్నూ, తక్కిన తమ స్నేహితులున్నూ తప్పు అభిప్రాయ పడ్డారేమో అని ఆమెకు సందేహం కలగడం మొదలు పెట్టింది. నిజమైన

త్యాగమూ, దీక్షా, సంతోషంగా కష్టపడ్డానికి సిద్ధం కావడమూ, యివన్నీ చూచి ఆమె క్రొత్తగా ఆలోచించుకోడానికి మొదలుపెట్టింది.

ఒకరోజు సాయంత్రం సులేమాన్ దగ్గిరనుంచి వచ్చేటప్పటికి యిల్లంతా గల్లంతుగా వుంది. వొచ్చేవాళ్ళూ, పొయ్యేవాళ్ళూ, గుంపులు గుంపులుగా కూడి నారాయణప్పగారితో మాటాడేవాళ్ళూనూ. అక్కడ ఎవ్వరినో అడిగింది. ఏమిటని ? అతను ఆశ్చర్యపోయినాడు.

''మీకు తెలీనే లేదండీ ? నారాయణప్పగారిని కోర్టుకు 20 వ తారీఖున సమను చేశారు.''

"ఎందుకు ?''

''రాజద్రోహపు మాటలు మాటాడారనీ, ప్రజలని దౌర్జన్యానికి పురికొల్పారనీ రోడ్లవెంబడి ఖద్దరు అమ్మారనీ.''

''అయితే''

''అయితే యింకేముంది ? యీయన జామీనివ్వరు గదా ! కఠిన శిక్ష వేస్తారు.''

సుశీల మేడమెట్లెక్కి తన గదిలోకి పరిగెత్తుకెళ్ళింది. ఖైదు ! నారాయణప్పగారికి ఖైదు ! తనతో చెప్పనేలేదు. ఎందుకు చెప్పాలి ! ఆయన యెవరు, తనెవరు ? పాపం ఆయన యీ గోలలు పడుతూవుంటే తను తనకేమక్కర్లేనట్లు సౌఖ్యపడాలని చూస్తోంది కాదూ ? ఆయన్నిమాత్రం ఎవరు సౌఖ్యపడొద్దన్నారు ? యీ ఖైదులోకి వెళ్ళడమెందుకు ? ఆ మాటలన్నీ మాటాడమన్న దెవరు ? పైగా జామీనియ్యననడ మెందుకు ? ఏమిలాభం ? యీ పనులన్నీ ? పోనీ పూర్వమైతే పనిలేనివాళ్ళకి యేదో పని అనుకోవచ్చు యీ వుద్యమం, కాని ఖైదులోకి పంపేటప్పుడు కూడా అదేపిచ్చా ? అలానే కూచ్చుని చాలాసేపు ఆలోచించింది. ఆయన

ఇవన్నీ యెందుకు చేస్తున్నారో తెలుసుకోవాలని నిశ్చయించుకొంది. ఆయన జీవితం తన జీవితం యెంత వేరైనాయి ! ఆయన్ని ఖైదులో పెట్టపోతుంటే తను యింటోంచి పారిపోవాలని చూస్తోంది కాదూ ?

మూడు రోజులు అదేపనిగా కూచుంది. ఎంగు యిండియా చదవడమూ, చదివి తక్కినవాళ్ళతో మాటాడి, దేశస్థితీ యీ వుద్యమము అవసరమూ, అర్థమూ గ్రహించింది. తన భర్తని అన్యాయంగా సమను చేస్తున్నారనుకుంది. ఖద్దరు బట్టలు కొంది. తనకున్న బట్టలన్నీ, పట్టు చీరెలతో సహా బైట రోడ్డు మీద తగలేసింది. ఖద్దరు బట్టలమ్మేవాళ్ళూ, లెక్చర్లు యిచ్చే వాళ్ళూ, స్త్రీలున్నారని తెలిసి, వాళ్ళతో కలిసి పని మొదలు పెట్టింది. ఖద్దరు బట్టల మూటలు మోసుకొని వాళ్ళందరితో కలిసి సులేమాన్ బంగళాకెళ్ళి అతన్ని కొనమని అడిగింది. నవ్వి, అదేదో జోక్ అనుకొని యెన్ని కొనమంటావ్ ? అన్నాడు. అన్నీ కొనమంది. కొనేశాడు. నవ్వుతున్నాడన్నమాటేగాని, సుశీలలో యీ మార్పు చూసి అతని మొహం వెల వెల పోతోంది. సుశీలకు జాలేసి సాయంత్రం వస్తానని చెప్పి వెళ్ళిపోయింది.

సాయంత్ర మెప్పటిమల్లేనే వెళ్ళింది. నాన్ - కో-ఆపరేషన్ గురించి యిద్దరికీ చర్చ జరిగింది. ఈసారి సుశీల అతను చెప్పిందంతా వొప్పుకోలేదు. తను చేసేపని చేసి తీర్తానంది. నారాయణప్పగారి సంగతి యేదో తేలిందాకా సులేమాన్ దగ్గర వుండిపోవడానికి రాననీ, వొచ్చి చూసిపోతూ వుంటాననీ వొప్పించింది.

సుశీల తన ఉద్యమంలో ప్రవేశించడం నారాయణప్పగారికి చాలా సంతోషం కలిగింది. ఇంక సులేమాన్‌తో సంబంధం మానుకుంటుందని కూడా అనుకున్నాడు. 20 వ తారీఖున కోర్టువారు నారాయణప్పగారిని విచారించి వదిలేశారు. నారాయణప్పగారు స్పెషల్ కాన్ఫరెన్సుకి, ఉత్తర యిండియా వెళ్ళారు.

నారాయణప్పగారి పని కొంత భాగం సుశీల మీద పడ్డది. అది గాక కొందరు నాయకుల్ని అరెస్టు చేశారు. ఆ భారమంతా కూడా సుశీలే పూనుకున్నది. ప్రొద్దున్న లేచింది మొదలు సాయంత్రం వరకు యెడ తెగని పని యిప్పుడామెకి. వూరంతా ఆమె మీద యెంతో భక్తి. ఆమెకీ సులేమాన్‌కీ యేదో సంబంధముందనే అనుమానం చాలా మంది కుంది గాని, ఆ గోలల్లో ఆలోచించడానికి యెవరికి తీరుబడి లేదు. సుశీలకి ప్రతి రోజూ సులేమాన్ దగ్గరికి వెళ్ళడానికి వీలయ్యేది కాదు. బండి ఆపి. లోపలికెళ్ళి అతన్ని చూసి "టైం లేదు. ఇవాళకి వెళ్ళనియ్యి, రేపు వస్తా'' అనేది.

ఒక వారమయింతరువాత ఒకసారి నాలుగు రోజులు అతనింటికి అసలే వెళ్ళలేదు. రోజు రోజూ సులేమాన్‌కి ఆమె మీద వెర్రిప్రేమ యెక్కువై పోతోంది. బైట తిరిగి వ్యవహారాలు చక్కబెట్టుకొనే నాయకురాలిని చూసేకొద్దీ అతనికి వొక విధమయిన పూజ్యభావమూ, భక్తీ యేర్పడుతున్నాయి. ఈ వుత్సాహ ప్రవాహంలో పడి నీతినీ, మర్యాదనీ బోధించే స్నేహితుల మాటలు విని, తనతో మాట్లాడ్డం మానేస్తుందేమో అని భయం ఎక్కువౌతోంది. అప్పటి నుంచి భరించరాని విరహావస్థ తటస్థమయింది. తనే ఇమె యింటికి వెళ్ళడం మొదలు పెట్టాడు. ఆమె యింటి దగ్గర వుండేది కాదు. రాత్రి పది గంటలదాకా కూచునేవాడు.

అప్పుడామె వొచ్చి భోజనం చేసి,

''నా సులేం, ఏం చెయ్యను చెప్పు ? నా కోసం కాచుకొని కూచున్నావా ! రోజల్లా అలిసివున్నాను. ఇప్పుడు నీతో కూచోడానికి కూడా ఓపికలేదు. కళ్ళు కూరుకొస్తున్నాయి. ప్రొద్దున్నే అయిదింటికే లేవాలి. యీ వాల్టికివి చాలవూ ? అని పంపించేది.

సులేమాన్ ఆమెని తన దగ్గరకొచ్చి వుండమని ప్రాణం తీసేవాడు.

"ఇంకొకడి పెళ్ళాన్ని తెచ్చుకోవడమే తప్పు. అందులో నాన్‌కో ఆపరేషన్‌దాన్ని తెచ్చుకుంటే, యింకా యిబ్బందులు తటస్థిస్తాయి.'' అని నవ్వేది. అత నొప్పుకునేవాడు కాడు. ఆమె వస్తానన్న సంగతి జ్ఞాపకం చేసేవాడు.

"మరి దేశమంతా యిట్లా గోల గోలగా వుంటే, అందరూ త్యాగం చేస్తూ వుంటే, అనేక మంది అన్నం లేక అల్లాడుతూ అనేక మంది స్త్రీల భర్తలు జైల్లోకి వెడుతూ వుంటే, నేను వచ్చి నీతో సౌఖ్య మనుభవించనా ? వచ్చినా నాకేమి మనస్థిమిత ముంటుందని ? డిశంబరు 31 వ తారీఖు అయిపోనీ, మాకు స్వరాజ్యమూ వొస్తుంది, నీకీ పనీ వూడుతుంది; మన యిద్దరికీ పనే వుండదప్పుడు. బ్రతికున్నన్నాళ్లూ వొకళ్ళ నొకళ్ళం చూసుకుంటూ, యెదురుగా కూచోవచ్చు.

నారాయణప్పగారు వొచ్చారు. సుశీల సులేమాన్‌కి కనపడ్డమే మానేసింది. పొరుగూళ్ళకి వెళ్ళేది. ఖద్దరమ్మడానికి. సులేమాన్ ఆ వూళ్ళకి కూడా వెళ్ళేవాడు. యెందరితోనో, మొగవాళ్ళతోనో ఆడవాళ్ల తోనో వుంటే, ఆమె ఆ వేవు వొచ్చిందాకా రోడ్డుమీద నుంచుని, తనని చూసి ఆమె చిరునవ్వు నవ్వితే యెంతో గొప్పగా సంతోషించి, మోటారు సైకిలెక్కి వెనక్కి వొచ్చేసేవాడు. నాన్ - కో-ఆపరేషన్ పార్టీ లెక్ఖ లెక్కడ తిరుగుతున్నా సులేమాన్ హాజరు. సుశీల వూళ్ళో వున్నప్పుడు స్వరాజ్యాఫీసు గుమ్మంలో కావిలి. మొదట మొదట తమని కనిపెట్టడా నికి వస్తున్నాడని అందరికీ కోపంగా వుండేది.

''పోలీసువాడు''

''గవర్నమెంటు బానిస''

''దేశ ద్రోహి''

''సై్పై, సై్పై''

ఇట్లా అనేవాళ్ళు. కొద్ది రోజులలో అతని సంగతి కనుక్కుని నవ్వుకునేవాళ్ళు.

సుశీల యెప్పుడో వొకప్పుడు అతన్ని వొంటరిగా కలుసుకునేది. "సులేమాన్ ! నీ కేం కిలాఫత్తుమీద అభిమానం లేదూ ?"

"ఎందుకు ?"

"నువ్వీ గవర్నమెంటు చాకిరీ యెందుకు మానవూ ?"

"ఆ కిలాఫత్తు తగలపడనీ, నాకేం కావాలి ? నాకు కావలసిందల్లా నువ్వు. నువ్వే నా మతం; నువ్వే నా కిలాఫత్; నువ్వే నా దేశం."

"నేను మానెయ్యమంటే మానేస్తావా యీ నౌకరీని ?"

"ఈ నిమిషం. కాయితం కలమూ తీసుకురా. అదంతా యెందుకు ? నువ్వు యిక్కడికి వొస్తేచాలు. యింక పని ప్రస్తావనే వుండదు. నేనూ నీ వెనక ఖద్దరు మూటలు మోసుకు తిరుగుతాను."

కాంగ్రెసునించి వచ్చిన పదిహేను రోజుల్లో నారాయణప్పగారిని అరెస్టు చేశారు. వూరంతా చాలా గోలయింది. మూడు వేలు జామీను యియ్యాలి, లేకపోతే మూడు నెలలు ఖైదు. మొదటినుంచీ నారాయణప్పగారి శ్వాసకోశాలు బలహీనమైనవి. ఈ వుద్యమంలో యెడతెరిపి లేకుండా పని చెయ్యడంతో ఆయన చాలా బలహీనమైనారు. డాక్టరు ఖైదులోనికి వెళ్ళవద్దనీ, అపాయకరమనీ అన్నాడు. యే కారణంచేత తను మానినా, దేశంలో తనమీద నింద పడుతుందని తెలుసు ఆయనకి. ఇన్నాళ్ళూ అందరినీ పురికొల్పి, చివరికి తాను సమయం వచ్చేటప్పటికి తప్పుకున్నట్లుంటుంది. అందువల్ల జామీ నియ్యకుండా వుండడానికాయనకి ధైర్యం చాలిందికాదు. నారాయణప్పగారిని జైలుకు పంపారు. అందరూ ఆ ఛార్జీ అన్యాయమన్నారు. సుశీలకీ అట్లానే తోచింది. అన్యాయంగా ఆయన్ని శిక్షించినందుకు గవర్నమెంటుమీద చాలా కోపం

వచ్చింది. నారాయణప్పగారిమీద జాలి కలిగింది. తనుకూడా ఆయన మాటాడిన మాటలే మీటింగులో మాట్లాడి తననికూడా అరెస్టు చెయ్యమని అడిగింది.

దినదినమూ సుశీలకి, సులేమానుకి ప్రేమ యెక్కువవుతోంది. సుశీలకి పని యెక్కువైనకొద్దీ, ఆటంకాలు యెక్కువైనకొద్దీ, వాళ్ళకి వొకరి నొకరు కలుసుకోవాలనే కోర్కెకూడా యెక్కువవుతోంది. సులేమాను సుశీలని తనతో వుండిపొమ్మని అడుగుతున్నాడు. ఇంతలో డిశంబరు 31 వ తారీఖు వొచ్చింది; పోయింది.

"స్వరాజ్యం పని యింక మానెయ్యి మరి; ఈ ప్రచారం, ఈ ముతక బట్టలూ" అన్నాడు సులేమాన్.

"సులేమాన్ ! దేశంలోంచి వుద్యమం పోతే పోవచ్చు కాని, నా హృదయంలోంచి పోదు. దీనితో నా వూహలు, నా బతుకు, నా వాంఛలు అన్నీ మారిపోయినాయి. ఇదివరకటి మనిషిని కాను. ఈ వుద్యమం, ఈ త్యాగం అంతా వృధా కావొచ్చు. దేశంలో యేమీ వుపయోగం లేక పోవచ్చు. కాని ఒక జీవితానికన్నా గొప్ప వుపకారం జేసింది. కొత్త ఆదర్శాన్నీ, ఆనందాన్నీ, ఆసక్తినీ యిచ్చింది. నిజం చెపుతున్నా ఏమనుకోకేం. నీమీద యెన్నటికీ పోని ప్రేమవుంది నాకు. నన్ను మింగేస్తున్న ప్రేమ, నా దేహాన్ని, ప్రాణాన్ని, నీవి చేసిన ప్రేమ. అంతేకాని యిదివరకువలె నీ హోదా, నీ వుద్యోగం చూస్తే నా కేమీ గౌరవం లేదు ఇప్పుడు. నా అభిప్రాయం అదంతా తిండికోసం కాని సత్వమని. ఆ యూనిఫారం చూస్తే నాకు పంజాబు వధలూ, నిరాయుధుల్ని కాల్చడం జ్ఞాపకమొస్తాయి........."

జైలులో నారాయణప్పగారికి జబ్బుగా వున్నట్లు తెలిసింది. సుశీలకి చాలా విచారంగా వుంది. ఆనాడు రాత్రే సుశీల తోటలో

వొంటరిగా ఆలోచిస్తూ కూచుంది. తన భర్తజబ్బూ, జబ్బుచేస్తుందని ముందే తెలిసికూడా ఆయన వెర్రిగా జైలుకు వెళ్ళిన సంగతీ, వుద్యమం స్థితీ, తన ప్రేమా అన్నీ తలపుకు వొస్తున్నాయి. ఇంటిముందు మోటారుసైకి లాగింది. సులేమాన్ లోపలి కొచ్చాడు. కూచుని సుశీల మెడచుట్టూ చెయ్యివేసి.

"దొరికావు చివరికి. యెవరూ లేరేం ?"

"తప్పించుకొచ్చేశాను."

"నాకోసమే ! మరి అక్కడికి రాలేదేం ?"

"కాదు. ఆలోచిస్తున్నాను."

"యేమిటి ?"

"అంతానూ. ఈ వినోదమంతా."

"నాకు వినోదంగా లేదు. చెప్పు మరి, మళ్ళీ నిన్ను విసికిస్తా గావును ? కాని నా కిదే తలంపు. ఆహారం, నిద్రా, వదిలాను. సుశీలా, యెన్నాళ్ళు చెప్పు ఇట్లా ? యెన్నటికీ రావూ ?"

"సులేమాన్ ! ఒక మాట చెపుతా, నీకు కోపం రాకూడదు. ఏమీ దాస్తున్నా ననుకోకు. నన్ను ప్రేమిస్తానంటున్నావా, నా హృదయాన్ని అర్థం చేసుకునే శక్తి యివ్వాలి నీకా ప్రేమ. లేకపోతే వృథే ! నీ మీద చెప్పలేని ప్రేమ నాకని నీ కిదివరకే చెప్పాను. రోజూ రోజూ అది యెక్కువవుతోంది. నా కిక్కడ ఒక్క నిమిషం కాలు నిలువడం లేదు. అంతా నీ దగ్గిర వుండిపోవాలనే ! నాకేం భయం లేదు. నాకీ లోక మక్కర్లేదు, నువ్వు లేకండా. ఇంక నేను బతకడం వ్యర్థమని నాకు పూర్తిగా తెలుసు. కాని నారాయణప్పగారు జైలు కెళ్ళింది మొదలు నేను ఆ విధంగా నీతో సంతోషంగా వున్న నిమిషమల్లా నాకు సిగ్గేస్తోంది. అందులో విన్నావుకదూ, ఆయనికి జబ్బుగా

కూడా వుందిట ! ఆయన ఈ దేశం కోసం, నీకోసం, నాకోసం జైలుకు వెడితే ఆయన్ని వొదిలి ఆయన లేకుండా చూసి నేను నీతో సౌఖ్య మనుభవించనా ! నిన్ను చూడకముందు నారాయణప్పగారికీ, నాకూ యెట్లాంటి ప్రేమవుండేదో నీకు తెలుసునా ? నీ ప్రేమవొచ్చి నా జీవితం లోకి దాన్నంతనీ ఒక్కసారి కూలతోసింది. నాకు దిగులనుకోకు. పోయిన ప్రేమకోసం నేను పశ్చాత్తాప పడటంలేదు. నీ పాదాలదగ్గిర కూచోగలిగితే చాలు. ఆ పెద్ద చేతుల్లో ఊపిరాడకుండా బిగిసిపోయి చచ్చిపోవాలని వుంటుంది. కాని మన ప్రేమవల్ల ఆయన పడ్డ బాధ నువ్వెప్పుడన్నా తలుచుకున్నావా ? ఆయన హృదయం యెట్లాంటిదో నీకు తెలీదు. నిన్ను బతిమాలుకుంటా, సులేమాన్ ! నారాయణప్పగారు వొచ్చిందాకా నన్ను ముట్టుకోవద్దు. ఆయన రాగానే ఆయనతో చెప్పి నీ దగ్గరికి అసలు యెప్పటికీ వచ్చేస్తాను. సరేనా ?''

''సరే. యింక నే ననేదేమిటి ? నీకు తెలుసు కాదూ ! ఈ పది హేను రోజులు యెట్లా వుంటుందో నాకు ! కాని నాకు భయంగా వుంది. సంగతులు చూస్తే మన ప్రేమకి యేదో వొక ఆటంకం యెప్పుడూ వచ్చేటట్టే వుంది. ఈ నాన్ కో-ఆపరేషన్ యిప్పుడే రావాలీ ? అందులో యెన్నడూలేనిది ఆడవాళ్ళమీదకూడా భార మిప్పుడే పడాలీ ? సరే, తక్కిన వన్నీని. నిజంగా వొస్తావుకాదూ ! ఇంక యేమీ అభ్యం తరం చెప్పకుండా, ఎన్నాళ్ళమట్టి యిట్లా దూరంగా వుంచుతున్నావు ? కథలో రాజకన్య వ్రతమని వంకబెట్టి పోలిశెట్టిని దూరాన వుంచినట్టు. అక్కడయితే ప్రేమలేదు. యిక్కడో......''

''ఇక్కడా ? ఇక్కడంతా నీదే ! ఈ హృదయమంతా నీదే ! సులేమాన్ ! నామీద యింకా సందేహమా ! నీ సంగతి అట్లా వుంచు. నీ దగ్గిరికి రాక యింక నాకేముంది ?......''

నారాయణప్పగారు జైలులో విడుదలై యింటి కొచ్చారు. చాల జబ్బుగా వున్నారు. డాక్టర్లు యిదివరకే క్షయరోగపు చిహ్నాలన్నారు. ఇప్పుడు బాగా పరీక్షచేసి అది క్షయ రోగమేననీ, జైలులో పట్టుకుందనీ, కుదరదం చాలా కష్టమనీ మదనపల్లి మొదలైన స్థలాలలో వుంచితే రోగి చచ్చిపోదుగాని, బతికున్నన్నాళ్ళూ మంచం మీదనించి లేవడనీ చెప్పారు.

మూడు రోజులయింది. సాయింత్రం అయిపోయి మెల్లిగా చీకటవుతోంది. సులేమాను తన బంగళా గదిలో బల్లముందు కూచుని, అవసరమైన కాగితాలు చూస్తున్నాడు. చేతిలో సిగరెట్టుంది. బల్లమీద పెద్ద టేబిలు లైటు వెలుగుతోంది. సుశీల వచ్చి గుమ్మం దగ్గిర నుంచుంది. సులేమాను చివాలున లేచి పరుగెత్తుకు గుమ్మం దగ్గిరికెళ్ళాడు.

"సుశీలా! వొచ్చావా చివరికి!"

"నువ్వు నన్ను ముట్టుకోకుండా దూరంగా కూచుంటేనేగాని నేను లోపలికి రాను."

"ఏమిటి!"

"చెపుతాను. ముందు అట్లా కూచో"

సుశీల కంఠం కన్నీళ్ళలో వొణుకుతోంది. ఇముడ్చుకోలేని ఆదే శాలు ఆమెని కదలించేస్తున్నాయి. తెల్లబోయిన మొహంతో కుర్చీలో కూచుని, సులేమాను సుశీలవేపు వొంగాడు. సుశీల కూచుంది. ఇద్దరి మొహాలమీదా వెలుతురు పడుతోంది. సులేమాను చేతులోంచి సిగరెట్టు జారి కిందపడ్డది. వొణుకుతున్న వేళ్ళతో ఇంకొకటి వెలిగించుకున్నాడు. సుశీల బల్లమీద చేతులు వేసి, తలనానించి, యేడుస్తోంది. సులేమాను చూడలేకపోయివాడు. లేచివొచ్చి ఆమె తలమీద చెయ్యివేసి,

"సుశీలా......" అన్నాడు.

సుశీల లేచి,

"అట్లా కూచో; యాదవను. చెపుతా....... నేనింక యిక్కడికి రాను. నీకు తెలిసిందికదూ? నారాయణప్పగారి స్థితి: ఆయన్నెవరు చూస్తారు? నేను కాకపోతే యింక దిక్కెవ్వరు?" సులేమాను ఆలోచించాడు.

"అతనికి తమ్ముళ్లెవరో వుండాలి కాదూ?"

"వుంటేమాత్రం? వాళ్ళు నేను చూసినట్లు చూస్తారా? యిన్నాళ్లూ వాళ్ల సంబంధం లేకుండా అవసరం వొచ్చేటప్పటికి వాళ్ళ మీద పడెయ్యనా? ఎట్లా వుంటుంది ఆలోచించుకో, యెవళ్ళన్నా ఆయన్ని జాగర్త తీసుకున్నా ఆయన్ని వొదిలి నేను సంతోషంగా వుండనా? నా కొస్తే ఆయన చేసేవారు కారూ? నేనంత హృదయం లేనిదాన్నయితే నీకు నన్ను చూస్తే గౌరవ మేముంటుంది? నీకే యిట్లాంటి జబ్బుచేస్తే, వొదిలేస్తే?



"సరేలే. అనుకున్నట్లే అయింది. అతను నిన్ను తనకి కట్టేసుకోడానికి యీ జబ్బు తెచ్చుకొన్నట్టుంది. పోనీ నేనే వొస్తూవుంటాలే. వీలున్నప్పుడే వొస్తోవుండు, ఏం చెయ్యను?



"ఆలోచించి అన్ని సంగతులు చెపుతాను. నాకీ దెబ్బతో మతిపోయినట్టుంది. ఇటు నీ ప్రేమా, అటు కర్తవ్యం; నా ప్రాణాలు చీలుస్తున్నాయి.........."



సుశీల మళ్ళీ సులేమానుకి కనపడలేదు. వారం రోజుల్లో నారాయణప్పగారిని తీసుకొని మదనపల్లి వెళ్ళిపోయింది. సులేమాను రెండు నెల్లు చూశాడు, జవాబు లేదు. చివరికి తనే వెళ్ళాడు. పొద్దున్న తొమ్మిదింటికి వాళ్లున్న వార్డు దగ్గరికి చేరుకున్నాడు. ఒక చెట్టు కింద వున్న

మంచం మీద నారాయణప్పగారు నిద్రపోతున్నారు. మంచం పక్కన గుడ్డ కుర్చీలో సుశీల చదువుకుంటూ కూచని వుంది. వెనక బల్లమీద మందు బుడ్లూ అవీ వున్నాయి. ఆమెని చూసేటప్పటికి అతని కాళ్ళు వొణికాయి. కళ్ళ వెంబడి నీళ్ళొచ్చాయి. ప్రేమంతా వొక్కసారి తిరగ పెట్టింది. అట్లానే అక్కడ నించునిపోయినాడు. నారాయణప్పగారు కొంచెంగా కదిలారు. సుశీల పుస్తక మక్కడపెట్టి, లేచి, దగ్గిరికివెళ్ళి దిళ్ల సరిగా పెట్టింది. రోగంతో బాధపడుతున్న చంటిపిల్లని అత్యంత ప్రేమ గల తల్లి కూడా అంత శ్రద్ధతో చూసి వుండదు. ఆమె కళ్ళ లోంచి ప్రేమా, దయా వొలికిపోతున్నాయి. సులేమానుకి సిగ్గేసింది. వెనకాలకి తిరిగి పోవాలనిపించింది. సంపూర్ణమైన నిరాశ కలిగింది. ఈ ప్రయాస అంతా వ్యర్థమని తెలిసింది. సుశీలతో వొక్కమాట మాట్లాడకుండా వెళ్ళడమెట్లా ? దగ్గిరికి నడిచాడు. ఆమె కళ్లెత్తి చూసి, మెల్లిగా చప్పుడు కాకుండా వొచ్చింది రహస్యంగా.

"దూరంగా రా. రాత్రంతా నిద్ర లేదు. ఇప్పుడే కళ్ళుమూశారు" అంది. దూరంగా వెళ్ళిన తరువాత. "ఎందుకొచ్చావు ?" అని అడిగింది.

"ఎందుకు ! యెక్కడ నిలుస్తుంది నా ప్రాణం ?"

సుశీల కళ్ళ వెంబడి నీళ్ళు కారాయి.

"పాపం ! ప్రతి నిమిషం నీ సంగతే తలుచుకుంటాను. నిన్నెంత కష్టపెడుతున్నాను ? నేను లేకుండా నువ్వెట్లా వుంటావో నాకు తెలుసు నిన్ను......"

"నాతో చెప్పకుండా వొచ్చేశావుకదూ ?"

"యేం లాభం ? మళ్ళీ నిన్ను చూస్తే నా మనోబలమంతా మాయమవుతుందని భయమేసింది. చెయ్యకూడ దనుకొన్నది, యేదో వొకటి చేస్తాను. అందుకని......"

"పోనీలే... ఆలోచించి చెపుతానన్నావు......"

"సుశీం! నన్ను మరచిపోలేవూ? పెళ్ళి చేసుకో. నా మాట విను. ఇట్లా యెన్నాళ్లంటా?"

"ఇదా నువ్వు చెప్పేది? యెట్లా మరిచిపోను? యెక్కడున్నా నీ రూపమే కనబడుతుంది. నీ కంఠమే వినబడుతుంది. నీపనులే జ్ఞాపక మొస్తాయి."

"యేం చెయ్యను? అట్లా చూడు. వదిలిపెట్టి రమ్మనడానికి నీకు నోరొస్తుందా?"

"వొద్దు. నేను నా పని మానేసి యిక్కడే వుంటాను. వుణ్ణియ్యి."

"కాని ఇదివరకు రకంగా వుండను, సుశీం అంతా ఆలోచించా."

"యేం? నా మీద ప్రేమ లేదూ?"

"వుంది. చాలా వుంది. కాని ఆయన మీద అపరిమితమైన ప్రేమ వొచ్చింది. యేదో జాలి కాదు, నిజంగా ప్రేమ. అట్లా చూస్తావేం? ఆశ్చర్యంగా వుందా? ఆ బొమికల కుప్పమీద ప్రేమ యేమిటనిపిస్తోందా నీకు? అవును. అట్లాంటి ప్రేమకాదు, నీ మీది ప్రేమ రకం కాదు. ఆ పాదాల దుమ్ము, నెత్తిన వేసుకోడానికి తగననే భక్తితో కూడిన ప్రేమ. నా దేశం కోసం, నా ప్రజల కోసం, అట్లా అయినారు. తన ఆరోగ్యాన్నర్పించారు. వ్యర్థమయినదానికి, యేమాత్రమూ జయము ఆశలేని దాని కోసం అంత త్యాగం చేశారు. తెలిసి వొద్దని డాక్టరు లంటున్నా, చేతులారా తెచ్చుకున్నారు. ఆ మహా గౌరవంతో నా ఆత్మ ఆయనదయింది. ఈ శరీరం, ఈ మనస్సు, శక్తి అన్నీ ఆయనవే! వాటిల్లో యింకొకళ్ళకి భాగం యివ్వడానికి వీల్లేదు. నీకు కూడా. క్షమించు మనమిద్దరం కూడా ఆ కాళ్ళని తల మీద ఆనించుకోడానికి పనికిరాము."

"నా సంగతేమిటి సుశీలా ? యింక......"

"నన్ను క్షమించు, వెయ్యిసార్లు క్షమించు. నా కెంత విచారంగా వుందో నీకు తెలీదు. నీ హృదయాన్ని లాగుకొని, నిన్నిట్లా యేడిపించడం నన్నెంత విచార పెడుతుందో ? యేం చెయ్యను ? అట్లాకాకుండా యింకెట్లానయినా నీ సేవ చెయ్యగలిగితే, నీ దుఃఖం పోగొట్టగలిగితే...

"సుశీలా ! యిదంతా నువ్వు తెచ్చిపెట్టుకున్నావు. ఆయన ఏదో మహా త్యాగం చేశారనీ, గొప్ప అపాయంలో వున్నారనీ..."

"సులేమాన్ ! నీ కర్థంగాదు. ఆయన సేవకి యీ చేతులు నిర్మలంగా వుంచకపోతినే అని నా కెంత బాధగా వుందో యేం చెప్పను ?"

"ఇంక ఆశపడకు. వుత్తరాలు రాశీ, నువ్విక్కడికి వొచ్చీ, యేం ప్రయోజనం లేదు. వెళ్ళు. వెళ్ళమనడానికి నోరు రాదు. కాని యేం చెయ్యను ?"

"సుశీలా......

"వెళ్ళు. నీకు నమస్కారం చేస్తా. నా నిశ్చయాన్ని చెడగొట్టడానికి చూడకు, చెడదు. అన్నాళ్ళూ నిజంగా నిన్ను హృదయపూర్వకంగా ప్రేమించా, యెంతో ఆనంద మనుభవించా, అయితే —"

"ఆయన వొకవేళ పోతే ?"

"అనకు, ఆ మాట అనకు, అది తలవను కూడా తలవను. నాకు చాలా కష్టంగా వుంటుంది. ఆయన లేకపోతే నేనుంటానా ?..."

దూరంగా సులేమాను కొండ దిగి వెడుతున్నాడు. సుశీల మంచం దగ్గర కుర్చీలో చప్పుడు కాకండా యేడుస్తోంది. వెనకాల ఆమె వీపు మీద నారాయణప్పగారు చెయ్యేశారు.

"సుశీలా ! చూస్తునే వున్నా; యెట్లా వుంటావు ? వెళ్లు, నీ కానందం అక్కర్లేదూ !"

"ఆ సంగతి మాట్లాడకండి, అదంతా అయిపోయింది."

"నిజంగానే ? నీకు దిగులు లేదూ ?"

"వుంది. అతను నా కోసం పడే బాధకోసం దిగులేస్తోంది."

"నీ కోసమో ?"

"నా కోసము నాకేమీ దిగులు లేదు. నేనే పవిత్రురాలినై, మీ సేవ చెయ్యడానికి తగివుంటే ఎంత బాగుండేది అనే దిగులు తప్పా యింకేమీ లేదు. మీ దగ్గిరుండడం, మీ సేవ చెయ్యడం, నాకు స్వర్గతుల్యంగా వుంది. ఎవరికి లభిస్తుంది యిట్లాంటి అదృష్టం ? నా వంటిదాన్ని మీ సేవకు అంగీకరించినందుకు నాకు యెంతో... .."

"నిజం ?"

"నిజం. నేను జరిగిందానికి యేడ్చాను. అంతే."

# 7. సంఘం పంతులు

—సురవరం ప్రతాపరెడ్డి

అది కృష్ణాతీరము. పల్నాటి సరిహద్దు. నిజాం యిలాకా గ్రామము. పేరు రామసాగరం. ఆ గ్రామములో సుమారు 500 ఇండ్లు; 30 వర్తకులవి, 80 కాపువారివి, 100 మాదిగవారివి, తక్కినవి యితర జాతుల వారివి. ఆ వూర్లో సర్కారీ నాకా (Police Station) వున్నది; 12 జవానులు, జవాను జవానుకు ఒక గుర్రము, ఒక అమీన్, ఒక జమేదారు. అమీనుకు రెండు పెద్ద గుర్రాలు. అమీను కచ్చేరి ప్రక్కనే అమీనిల్లు. పోలీసు వారెన్నడున్నూ చేతి నుండి పైకమిచ్చి వస్తువులు కొనేది యెరుగరు. పాపము! వెట్టికి మాదిగలున్నారు. సప్లైకి కోమట్లున్నారు. అయితే 30 కోమట్ల యిండ్లలో వక్కడే దుకానుదారుడు. మిగిలిన వారంతా స్వయంగా కృషిచేసుకొని బ్రతికేవారు. అయితే యేం, వారి కులము కోమటి కులం కాదా? ముప్పై యిండ్ల వాండ్లంతా పోలీసువారికి కోరిందంతా సప్లై చేయవలసిందే. కోళ్ళు, గుడ్లు, కట్టెలు మాదిగ వాండ్ల జిమ్మా.

ఇట్లా వ్యవహారం మజాగా జరుగుతావుంది. రైతు లొకరిలో వకరు లేరు. కృష్ణ ఆవతలి తీరము చూస్తారు. అది అంగ్రేజీ యిలాకా, అక్కడి జనులు సుఖంగా వున్నారు. ఏ యెట్టీ లేదు, ఏ దండుగలూ లేవు, ఏ తన్నులూ లేవు. కానీ ఈ రామసాగరంవారు పెద్దలు సంపాదించిన భూములు, ఇళ్ళు, వాకిళ్ళు వృత్తులు వదలుకొనిపోతే వారికింక జీవన మెట్లు?

ఒకనాడు ప్రొద్దున్నే ముసలి మాదిగది 70 ఏండ్లది చచ్చిందని వూరంతా వుడికిపోయింది. ఏం చస్తే? ముసలిదానికి చావు రాగూడదా అంటారేమో, ఆనాడు అమీన్‌సాబు పెండ్లాము (అమెను బేగం సాహేబా అంటారావూరివారు) ముసలిదానిని వంటకు రేల కట్టెలమోపు తెమ్మన్నది. ముసలిది అడివంతా తిరిగింది. రేల కట్టెలు దొరకలేదు. తంగేడి కట్టెలు కొట్టుకొన్నది. మోపు చేసుకొన్నది. బేగం సాహేబా వద్దకి వచ్చేవరకు సాయంత్రమైంది. పొద్దున్నుంచీ కూడులేదు. ముసలిది ఎండకు కష్టించింది. మోపుతెచ్చి యింట్లో పడవేసింది. 'ఛినాల్, రేల కట్టెలు తీస్కొని రమ్మంటే యిదేమి పుల్లల్ తెచ్చినావ్' అని డొక్కమీద నాలుగు తన్నులు తన్నింది. ముసలిది సీల్గింది. 'నికాలో ఈ పీనుగును' అంది బేగం. దాని శవాన్ని ఈడ్చి మాదిగ గేర్లో పారేసినారు నలుగురు జమాన్లు.

* * * *

'లావ్ బాదాం అక్రోట్ పిస్తా. కెవ్ఁ లేదూ అంటావ్, హరామ్! ఏమ్‌రా నాలుగు జూతాలు' అన్నాడు అమీను సాహెబ్. వెంటనే వక జవాను తన హైద్రాబాదు జూతాను చేతబట్టి నాలుగు బదులు ఎనిమిది 'ఏక్, దో' అంటూ యెంచి వునుకమీద వాయించినాడు. కోమటికి కోపం వచ్చింది. ఏడ్పుగూడా వచ్చింది. ఏమిస్నీ జవాబు లేదు. కోమట్లందరూ మాట్లాడుకున్నారు. కృష్ణ అవతలి అంగ్రేజీ యిలాకానుండి వక కోమటిని పట్టుకొని వచ్చినారు. 1200 రూ. సాలీనా వానికి దుకాణము గుత్తా కిచ్చినారు. పోలీసువా రడినగిది యియ్యవలెను. వచ్చిన కొత్త కోమటి 2 నెలలు వ్యాపారం సాగించి లెక్క చూచుకునే వరకు 1000 రూపాయలు ఖర్చు అయింది. రాత్రిపూట ఎవరికీ చెప్పకుండా కృష్ణ దాటుకున్నాడు. తుదకు పట్నమునుండి ఒక

మార్వాడీని 1000 కు మాట్లాడుకొని తెచ్చి గ్రామములో నిలిపినారు. వాడు వచ్చి నాలుగు నెలలైంది. అట్లే పోరాడుతూ వున్నాడు.

* * * *

ఒకనాడు చీకటి వుండగానే పక్కవూరినుండి బండి కట్టుకొని వక పెద్దమనిషి రామసాగరం వచ్చినాడు. వూరిబయట మాదిగవారి యిండ్లు. ఎవడో ఎదురైనాడు. 'ఎంత పొద్దు అయుండవచ్చురా' అన్నాడు. పెద్దమనిషి. 'అప్పుడే కుక్కలు మొరిగినాయయ్యా; ఇంకా రెండు జాముల పొద్దుంది' అన్నాడు వాడు. 'కుక్కలు మొరిగితే పొద్దెట్ల గుర్తు పడుతుందిరా?' అన్నాడు పెద్దమనిషి. 'అయ్యో, మా వూర్లో కోళ్ళన్నీ పోలీసు వాళ్ళ ఫలారాలకే సరిపోయినవి. నెల్లాళ్లైంది. మా వూర్లో కోళ్ళు కూయవు. ఆ మారాజులు కుక్కలు తినరు. లేక పోతే అవిగూడా మొరుగుతుండెవా! సామీ, మీ రేడికి పోతున్నారు?' అన్నాడు వాడు. 'పటేలు పుల్లారెడ్డి యిల్లు ఎక్కడుంది?'

'ఈడ్నే వుందయ్యా! అదో అట్లా పోండి, వూర వాకిలివద్దనే పెద్దది, రెండంతస్తులదుండే, అదే రెడ్డిగారి యిల్లు. పోండి, మీరేమి ఆయనకు చుట్టాలా స్వామీ?'

ప్రొద్దున్నే వూరంతా తెలిసిపోయింది. ఎవరో పట్నంనుంచీ సంఘం పంతులు వచ్చినారంటా అని. ఆయన ఎత్తైన మనిషి, మందంగా వున్నాడు, ఖద్దరు వేస్తాడు. వకీళ్ళలాగ రుమాలు కడ్తాడు. వెంట తోలుపెట్టె తెచ్చుకున్నాడు. దాని నిండా పుస్తకాలు తెచ్చినాడు. పట్నంలో గొప్ప గొప్ప వాళ్ళంతా ఆయనకు పరిచయమంట. మన కష్టాలన్నీ నివారిస్తారంట; మన పాలిటి దేవుడు వచ్చినాడని అందరూ అనుకున్నారు. జనులకంతా యెన్నడులేని ధైర్యము, ఉత్సాహము, ఇంటింటా అదే ముచ్చట. వూరంతా పెద్ద దేవర చేసినట్లు వుల్లాసము

లతో నిండిపోయింది. ఆ వచ్చినాయన కదేమోకాని అందరూ సంఘాల పంతులూ అనబట్టినారు. సాయంత్రం పటేలు ఇంట్లో మీటింగు. కోమట్లంతా వచ్చినారు. వారికి సంఘాల పంతులు 'వర్తక స్వాతంత్ర్యము' అనే పుస్తకాలు ఇచ్చినాడు. 'మీరేమి మనుషులేనా? కృష్ణ అవతలిగట్టు చూడండి. వారెట్లున్నారో, మీ కెందుకు భయము? సర్కారువారు మిమ్ము రక్షించుటకా, లేక భక్షించుటకా ఈ పోలీసులను పెట్టింది?' అని ఏమేమో చెప్పినాడు. కోమట్లకు ధైర్యం వచ్చింది. ఒరే, మనలో మనకు ఐకమత్యం లేనందున యీ గతి పట్టినాము. సరే అంటే సరే అన్నారు. వర్తక సంఘము స్థాపనైంది. అందరూ 'మెంబర్లే'. 500 రూపాయిలు నగదు వసూలు. మార్వాడీకి నోటీసు. ఇక ముందు గుత్తా యిచ్చుటలేదు. మర్నాడే మార్వాడి 1 రూపాయికి 5 శేర్లు బియ్యం జవాను సాయెబూ అన్నాడు. 'అరే నిన్న 15 శేర్లు, ఈవాళ అయిదు సేర్లు. ఖబర్దార్' అన్నాడు. 'ఖబర్దార్ లేదు, గిబర్దార్ లేదు. ఈ వూళ్లో సంఘము ఏర్పాటయిందోయ్. సంఘాల పంతులు వచ్చినాడు. నీకూ తెలుసూలేదూ?' అన్నాడు మార్వాడి. 'సంఘం! అరే మాకీ సంఘం! ఏమీ సంగం, అచ్ఛా; చూస్తాం' అనుకొంటూ జవాన్లు పోయినారు.

* * * *

మర్నాడు ప్రొద్దున్నే సంఘాల పంతులు బహిర్భూమికి పోయి వస్తున్నాడు. ఒక మాలది దూరంనుంచే సాష్టాంగ దండంచేసి గోడు గోడున యేడ్చింది.

'ఏం? ఏమి కష్టం వచ్చింది చెప్పమ్మా?'

'అయ్యా! ఏమి చెప్పను! నిన్న బేగముగారి పాయిఖానా బాగా సాపుచేయలేదని ఆమె మా అక్కను చెంపమీద వాతవేసింది.

మొన్న జమేదారు మా ఆయనను బాగా కాళ్ళొత్తలేదని డొక్కమీద తన్నినాడు. ఇంకా మంచం పట్టినాడాయన. మేము బతుకలేము. మా గతేమి ?'

'సరే, యివాళ సాయంత్రము. మీ పల్లెలోని మందిని అందరినీ పిలుచుకొని ఊరు ముందుండే రాగిచెట్టుకిందికి రమ్మను. నేను వచ్చి అంతా ఏర్పాటు చేస్తాను...'

'సరే, మీరే మా దైవము. మీరే నారాయణమూర్తి. నాయనా, చల్లగా నూరేండ్లు బ్రతుకు' అంటూ ఆ 60 ఏండ్ల మాలెత దండాలు పెడ్తూ, దీవనలిస్తూ పోయింది.

* * * *

సాయంత్రము అయిదారునూర్ల మంది జమా అయినారు ఊరి ముందు. సంఘాల పంతులు వారి కందరికీ వెట్టిచాకిరీ తత్వము బోధించినాడు. ఫర్మానులు వినిపించినాడు. కూలి యియ్యంది వెట్టి చేయకూడదని చెప్పినాడు. ఇట్లా చెప్పుతూ ఉండగానే అమీన్‌సాబు గుర్రమెక్కి ఎనిమిదిమంది జవాన్ల వెంటబెట్టుకొని ఠీకుఠాకునవచ్చి కూర్చున్నాడు. 'పంతులూ, గష్తీనిషాన్ 53 (నిజాం రాష్ట్ర వాగ్బంధన శాసనము) తెలుసునా ?'

'ఓ తెలియకేమి ? అది సియాసీ జల్సాల (రాజకీయ సభల) కొరకేర్పడినది.'

'సియాసీ అంటే ?'

'సర్కారును దూషించుట, ఫర్మానులకు వ్యతిరేకముగా నడచుకొనుట.'

'మరి నీవు చేసేది అదే పనిగదా ?'

'నేనుగాదు, నీవు చేసేది. ఫర్మానులలో వెట్టి కూడదని వున్నది. కూలియిచ్చి పని చేయించుకోమని వున్నది. నీ వెన్నడైనా కూలి యిచ్చినావా ? మరి నీ బేగం సాహెబాకు ముసలివాండ్ల తన్ని చంపుటకు, పడుచువాండ్ల చెంపలు వాతలు పెట్టుటకు, పాయిఖానా లూడ్పించు కొనుటకు ఏ ఫర్మానులో హక్కిచ్చినారు ?'

'నీవు ఖానూను చాలా మాట్లాడుతావు. అచ్చా, నీకు తగిన ప్రాయశ్చిత్తము చేస్తాన్ చూడు' అంటూ లేచి పోయినాడు.

*　　*　　*　　*

వారము దినములైంది. బేగం సాహెబా పాయిఖానా వూడ్చే వారు లేరు. వెట్టిచాకిరీ మనుషులు రారు. కోళ్ళు అసలే లేవు. బియ్యము రూపాయికి 4 పళ్ళే అయినవి. గుర్రాలకు గడ్డి చిక్కదు. పోలీసులకు కాలిమంట తల కెక్కింది. కల్లు మాత్రం వారికి సమృద్ధి. గ్రామస్థు లందరు కల్లు త్రాగము అని వట్టు పెట్టుకున్నారు. ఇదివరలో అమీను కచ్చేరికి ఒక కుండెడు కల్లే ఉచితముగా సప్లై అవుతుండెను. ఇప్పుడు మూడు కుండలు సప్లై. జవాను లందరూ అమీన్‌గారి అధ్యక్షతలో మీటింగు వేసుకున్నారు. సంఘాల పంతులను కచ్చేరికి పిలిచినారు. సంఘాల పంతులు పోయిన తర్వాత 30 మంది కోమటి యువకులు, 40 మంది మాదిగలు లాఠీలతో బయలుదేరి నాకా వెనుకభాగములో కూర్చున్నారు. వారిట్లు తయారైంది పంతులుకు తెలియదు. జవాన్లకును తెలియదు. సంఘాల పంతులు లోపలకు పోయిన వెంటనే కైపెక్కిన జవాన్లకు మరింత కోపము వచ్చింది. 'అరే పట్టండి బొమ్మన్‌కు !' 'డాలో హత్కడీ, గోలీసే ఉడాదో, సంగెం సంగెం ఏం పంతులూ ?' 'నీది యేవూరుబే ?' 'నీకీ ఫాన్సీ వెయ్యాలా?' 'అరే వీడూ మనకీ నోట్లో మన్నూ వేసినాడ్, రూపాయికి బియ్యం నాల్గు పళ్ళూ, మా తాతలనాడు

గూడా యిట్లా లేకుండే బే ?' 'వాడూ హుసేన్‌గాదు బేగారీ వుండలే, వాడికీ కట్టెల్ తెమ్మంటే కూలీ లావ్ అంటాడు.' 'క్యా దేఖ్తారే పకడ్ సంగాల పంతులీ్కి.'

ఇట్లా కలకలము బయలుదేరింది. పంతులు శాంతముగా చూస్తూ నిలుచున్నాడు. ఏమిన్నీ జవాబీయలేదు. జవాన్లు పట్టుటకు దగ్గర వచ్చిరో లేదో బయటి సైన్యము లోపల ప్రవేశించి, టోపీలు ఎగురునట్లుగా, కైపు దిగునట్లుగా జవాన్‌లను, అమీనును మోదినారు. 'అరే మర్గయా' 'అరే, మాఫ్‌కరో.' 'అరే అల్లా, ఇంక మీ జోలికి రాంబే.' 'పంతులూ, నీవన్నా చెప్పు'. ఇట్లు ప్రార్థించినా వినక వారికి దేహశుద్ధి అయ్యేను. 4-5 గురికి మంచి గాయాలు తగిలెను. అమీన్ మంచము కింద దాగుకున్నాడు. బయటకు లాగినారు. కట్టెలతో కొట్టితే లావు శరీరము నొచ్చునని తన్నులు తన్నినారు. కల్లుతిత్తివలె దొర్లినాడు.

వారము దినములకు మొహతెమీం వచ్చినాడు. పోలీసువారు తమకైన అవమానము చెప్పుకోలేదు. కానీ సంఘం పంతులు వచ్చి అరాచకము చేసినాడనీ, పోటీ ప్రభుత్వము సాగిస్తున్నాడనీ, ఫౌజు పంపకుంటే గొప్ప ప్రమాదము జరుగుననీ వ్రాసుకున్నారు. మొహతమీం వచ్చిన వెంటనే రైతుల పిలిపించి విచారించినాడు.

'అయ్యా, యీ చిట్టీలు చూడండి. వందల కొలది వున్నవి. ఎన్నడూ పైక మియ్యలేదు.'

'సర్కార్ ! మాదిగెది ముసలిది బేగం సాహెబా తంతే చచ్చింది.'

'మారాజా ! మా అక్కకు ఇదిగో యీడ వాత వేసింది.'

'మేము దేశమిడిచి పోతామయ్యా, యీ యెట్టి మాతోగాదు.'

అని వందల కొలది షికాయతులు చేసిరి. మొహతమీ మంతయు గుర్తించెను. అమీన్ బర్తరఫ్ (Dismiss), జమాదార్ తనజ్జుల్ (Degrade) జవాన్లందరికీ 6 నెలలు మోతల్ (Suspend), ఠానా బర్ఖాస్త్ (ఎత్తివేయుట). ఆ వూల్లో యింక నాకా (Police Station) అవసరము లేదని హుకుం అయిందని వింటూనే జనుల ఆనందానికి మేరయే లేదు. ఇంకా వారము దినాలకు హోలీ పండుగ. అరే పండుగ చేస్తాం అని తీర్మానించుకున్నారు. వారము దినములా గ్రామంలో జల్సాలు (విందులు) జరిగినవి. ఏటి కవతల వారికికూడా దావత్.

# 8. గులాబీ అత్తరు

—శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

ఒక్క అడుగు వేస్తే దివాన్జీ కనపడతాడు.

అతగా డొక్కమాటు తమకేసి చూస్తే చాలునని ఆత్రపడు తూనూ, అతని కటాక్షం ఆశించీ, అతని అనుగ్రహం యెదురు చూస్తూనూ, అతని ఆలంబనం నమ్ముకునీ, అతని చేత "సరే" అని పించుకోడానికి తగ్గ యెత్తు లాలోచించుకుంటూనూ, అయినా, అతని లోభగుణం మాత్రం లోపల్లోపల గర్హించుకుంటూనూ, ఆ గదిలో పరి వేష్టించి వుండిన ఆశ్రితులూ, పౌర ప్రముఖులూ, రాజ బంధువులూ, రాజ పురుషులూ కొందరక్కడికే కనపడుతున్నారు.

వారిలో కొందరు తనకేసిన్నీ చూశారు.

అలాంటి చోట నుంచుని, మొదట వొక్కమాటు గదిలోకి తొంగి చూసి, తరవాత నిటారుగా నుంచుని, నుంచున్న వెంటనే తాపీగా రెండు చేతులూ చాపి, గభీమని బిరడా తీసి సీసా గాలి వాటాన పెట్టాడు షుకుర్లీఖాను, తల వెనక్కి విరుచుకుంటూ.

బిరడా తీశాడు, అంతే, వెంటనే బిగించేశాడు.

కాని ఆ క్షణ మాత్రానికే అతని చుట్టూ వుండిన జవానులు తుళ్ళిపడి మత్తెక్కుతున్నట్టయిపోయారు.

లోపల వుండిన పెద్దమనుష్యులు ఉలిక్కిపడి యెగ వూపిరి తీసుకుంటూ యిటు చూశారు.

దివానుకి పక్కగానూ కొంచెం వెనకవాటుగానూ నుంచుని వుండి, అతని రాతలు ఓరకంట చూస్తున్న ఠాణేదారున్నూ చకితుడై "వచ్చాడా?" అన్నట్టొకమాటు గుమ్మం కేసి చూసి, మళ్ళీ మొగం వంచుకున్నాడు, సాలోచనగా.

అప్పటి కప్పుడే చర్రున మొగం పైకెత్తి "ఏయ్! ఏమిటీ కంపు?" అంటూ గద్దించాడు దివాన్జీ, దగ్గుకుంటూనూ తీక్ష్ణంగా చూస్తూనూ.

దీంతో పండు వెన్నెట్లో కటిక చీకటి రేఖ విరిసినట్టయింది.

కొంచెం ఘాటుగానే వుండినా, హృదయంగమమైన వట్టివేళ్ళ అత్తరు కమ్మదనం దివాన్జీకి కంపుగా తట్టడం చూసి లోపలివారందరూ మొగమొగాలు చూసుకున్నారు, ఉబికిన నవ్వు కళ్ళల్లో కుక్కుకుంటూ.

"అరే, అరే" అనుకుంటూ మొగం పక్కకి తిప్పుకుని, ఠాణేదారు పెదవి కరుచుకున్నాడు. తన రసికత గుర్తించమన్నట్టొక రాజబంధువు కేసి బెల్లించి చూస్తూ.

జవానులున్నూ అందుకు వింతపడి, అపవారించి పెదవులు కరుచుకున్నారు.

ఖాను కొయ్యే అయిపోయాడు.

కంపు అన్నమాట అపశ్రుతిగా కనపడిందతనికి.

మాంచి పరువమైన యాభై యేళ్ళ వయస్సున, అత్తరు సౌరభం కంపుగా వెలవరించుకునే మనిషి కనపడడం అతనికిదే మొదటిసారి.

మొన్న మొన్ననే — రెండు మాసాలపాటు నానాపాట్లూ పడి గాని గోలకొండ కోటలో అడుగు పెట్టలేకపోయాడతను.

అసలు, వజీరు దర్శనమే కాలేదు నెలా పదిహేనుదినాలు పడిగాపులు పడి వుంటేనే గాని.

ఆ ప్రయత్నంలో, నిజంగా, తల ప్రాణం తోకకు వచ్చిం దత నికి; కాని దర్శనం యిచ్చాక మాత్రం యీ వట్టివేళ్ళ అత్తరుకే ఆ వజీ రెంత ముగ్ధుడయిపోయాడు !

అప్పుడక్కడ వున్నవారున్నూ ఎంత సంబరపడ్డారూ !

తరవాత, నవాబున్నూ యెంత మెచ్చుకోలేదూ !

మరి యిక్కడ, పెద్దాపురంలో, అడుగు పెట్టిననాడే కావలసిన లోగట్టా అంతా దొరికిపోయింది.

మర్నాడు తాణేదారు ప్రసన్నుడయిపోయాడు.

మూడో నాడే కోటలో ప్రవేశం దొరికింది.

అయితే, అంత సౌలభ్యానికి చివరికిదా పరిణతి ?

హిందువులలో విభ్రమ విలాసాలకు తగినంత విలవ లేకపోవడం అతనెరుగును.

పోనీ, అందే నిర్లిప్తత కూడా అంతంతగానే వుండడమున్నూ అతనెరుగును.

అయితే మాత్రం యింత తల్లకిందులా !

ఇంతకీ అత్తరు సువాసన చెడుకంపుగా బాధపడే మనిషి, రాజు తరువాత రాజంతవాడయి వుండడమా ?

రాచ తీవికి ఇది ప్రశంసావహమా ?

దీనివల్ల, మహారాజు ప్రాభవం విషయమూ, వైభవం విష యమూ దివాన్జీకి లక్ష్యం లేదనుకోవాలా ? లేక, మహారాజు ప్రవృత్తి గా యిలాంటిదే అనుకోవాలా ?

ఇది మిక్కిలి అసంభావ్యంగా కనబడిందతనికి.

"చివరి కేది యెలా సంభవిస్తుందో ?" అని అనుమానమున్నూ పట్టుకుంది.

ఇంత మాత్రాన నిరాశ చేసుకోలేదుగాని చేసుకోక తప్పదేమో అన్నట్టు జవాన్లకేసి అభావదృష్టులు పరిపాడతను.

ఈ స్థితిలో "ఏయ్ జవాన్ ?" అని పిలిచాడు ఠాణేదారు, ద్వారంకేసి చూస్తూ.

"చిత్తం బాబయ్యా" అంటూ వెంటనే లోపలికి వెళ్ళి జవాను "ఢిల్లీ నుంచి అత్తరు వర్తకు డొకడు వచ్చి దర్శనం కోరుకుంటున్నా రండి" అని విన్నవించాడు.

దీని మీద "అతనే, నేను మనవి చేసుకున్న సాయిబేనండి" అన్నాడు ఠాణేదారు, మెల్లిగా: కాని దివాన్జీ, మొగం పైకెత్తలేదు.

పైపెచ్చు "దివాణంలోనే అంగడి తెరుస్తా డటనా సాయిబు ?" అని ముదలకించాడు, కొంచెం కటువుగా.

ఇది విని ఖాను తెల్లపోయాడు.

జవానే కాదు, ఠాణేదారు కూడా జంకి పోయాడు, అందుకు ప్రత్యుత్తరం చెప్పడానికి.

కాని "చిత్తగించారూ ?" అంటూ వొక బోసినోటి శాస్త్రిలు మాత్రం అందుకున్నాడు, తన ప్రతిభ చూపించడానికి మాంచి అవకాశం దొరికిందన్న ఉత్సాహంతో, నలుగురికేసీ చూస్తూ.

అయితే, అప్పుడు కూడా దివాన్జీ మొగం పైకెత్తి చూడకపోగా, అతణ్ణి మాత్రం వుద్దేశించి, ఒక్కొక్క మాట కొక్కొక్క పెద్ద మనిషి కేసి చూస్తూ "దివాణంలోనే అంగడి తెరుస్తాడటనా ? అంటే చెప్పలేను గాని, అతను చేసిందాల్లో మంచి భావుకత మాత్రం కనపడుతోంది. ఏమంటే, ఠాణేదారుగారి పరిచయ వాక్యాలవల్ల అతను ఫలానా అని మాత్రమే తెలుస్తుంది. అతని సామర్థ్యం అజ్ఞాతంగానే వుండిపోతుంది.

ఆ విషయం తనకి తానై చెప్పుకోడం యెవరికీ రసికతాముద్ర కాదు. అందుచేత, తన అత్తరు సువాసనతోనే తన విషయం యావత్తూ విశద పరుచుకున్నా డతను. ఇది చాలా గొప్పగా వుంది. ఢిల్లీలో మసులు కుంటున్న మనిషి కిదొక లెక్కా_మరి? అక్కడ యెంతంతలేసి ఉమ్రావు లున్నారు! వారి దగ్గిర మసులుకునే మనిషి సామాన్యుడయి వుంటాడా? చాలా బాగుంది. తప్పకుండా చూడతగ్గవాడతను'' అన్నాడు శాస్త్రులు, చివరిమాట ఠాణేదారు కందచేస్తూ.

అయినా, దివాన్జీ మాట్లాడలేదు.

చూడనే లేదు.

రాస్తూ రాస్తూ వుండిన కలం మాత్రం కింద పెట్టేసి పొడుం కాయ అందుకున్నాడతను, అంతే.

౨

"ప్రవేశపెట్టు" అన్నాడు ఠాణేదారు, సరే అనేమాట దివాన్జీ ప్రకటపరచే పద్ధతి అది అని తెలుసు కనక.

ఈ మాట మీద దివాన్జీ కనుబొమ్మలు ముడిపడ్డాయి.

ఏదో వొక గంభీరాలోచన అతని బుర్రలో ప్రవేశిస్తూ అది కళ్ళల్లో తళుక్కుమంది.

తన రసజ్ఞత అంతా వ్యర్థం అయిపోయినందుకు కించపడుతున్న శాస్త్రులు అది చూసి ఉలిక్కిపడ్డాడు.

అప్పటి కప్పుడే వొక్క అంగలో లోపలికి వెళ్ళి ''దివాన్జీ వారికి కోటి సలాములు. నేను ఢిల్లీ నుంచి వచ్చానండి, ఏలిన వారి పాదాలు వెతుక్కుంటూ" అన్నాడు ఖాను, చేతులూపుకుంటూనూ, మూడు మాట్లు వంగిలేస్తూనూ.

''ఏమి పని ?'' అనడిగాడు దివాన్జీ దర్పంగా, అతని సలాములు కళ్ళతో అందుకుని.

''నేనత్తర్లు తయారు చేస్తాను మహాప్రభూ ! దక్షిణ దేశంలో, గోల్కొండ తరవాత పెద్దాపురం వొక్కటే చూడతగ్గది అని విన్నాను, రెక్కలు కట్టుకువచ్చి వాలాను, తమరు కటాక్షించాలి'' అని వేడుకున్నాడు ఖాను.

''రెక్కలుండడమే వస్తే యెక్కడో వొకచోట పెళ్ళివాలక, ముడుచుకూర్చుంటాడా మరి యెవడయినా ?'' అని ముదలకించాడు దివాన్జీ.

అందులో వున్న దెబ్బ ఖాను గుర్తించకపోలేదు; కాని ''తమరు సరిగా సెలవిప్పించారు మహాప్రభూ ! ఏమంటే, రెక్క లున్నందుకు వినియోగం, యెక్కడ సరసులుంటే అక్కడ వెళ్ళి వాలడమే. కనకనే నాలుగు తరాలనాడు, మా కుటుంబం, పారశీక దేశం విడిచి ఢిల్లీ వచ్చి వాలింది. వచ్చాక కూడా సైన్యంలో చేరడానికెన్ని అవకాశాలు తటస్థపడినా, పేరు తెచ్చిన కళాజీవిక విడిచి పెట్టలేక అత్తరులే తయారుచేసి ఢిల్లీ పాదుషాల ఆదర గౌరవాలు పొందుతోంది'' అన్నాడు, ధోరణి మార్పించ దలిచి.

దీంతో ''కావచ్చు'' అన్నాడు దివాన్జీ, కొంచెం వడిమళ్ళి; కాని చూపుల్లో మాత్రం సారళ్యం అంకితం కాలేదు.

''మా నాయనగారి సెలవు పొంది, నేను, దక్షిణదేశ ప్రభువులను సేవించుకోడానికి వచ్చాను. గోల్కొండ నవాబుగారూ, అక్కడి వజీరూ మా పరిశ్రమ గుర్తించి మిక్కిలి ఆదరించారు.''

''ఇంకేం ?''

"ఇంకేమంటే మనవి చేసుకున్నాను గదా, గోల్కొండ తర వాత పెద్దాపురమే చూడతగ్గదని విన్నానని ? ముందు తమరిది చిత్త గించకోరుతున్నాను."

ఇలా అని, ఖాను, మూతతెరిచి వొక చిన్న పెట్టె దివాన్జీ సందుకా పెట్టిమీద వుంచాడు.

లోఖాగాన, ఎర్రని మఖమల్‌గుడ్డ అతికించిన చక్కని పెట్టె అది.

అందులో ఒక చిన్న సీసా.

చక్కని నగిషీ పనితో యెంతో ముచ్చటగా వుందది.

సీసాలో సగానికి పైగా అత్తరు వుంది.

అది చూసి అక్కడి వారందరూ గుటకలు మింగారు.

"అది మల్లె అత్తరు మహాప్రభూ ! అందులో వున్నది రెండే తులాలు; కాని రెండు వసంతాలకు తయారయిం దది"

"వోస్."

"మా వస్తువు మర్యాద మాకు మేమయీ చెప్పుకోడం ధర్మం కాదు, చిత్తగిస్తే తమకు తెలియందీ కాదు. అయితే మొగం కొంచెం యెడంగా వుంచి మరీ మూత తీయించండి మహాప్రభూ"

దీని మీద, అక్కడి వారందరూ తమ ఘ్రాణేంద్రియానికి ఏకా గ్రత అలవరుచుకున్నారు; కాని "మాట్టాడేటప్పటికి ముందు మూత తియ్యడమే పనా మాకు ?" అనడిగాడు దివాన్జీ, దురుసుగా.

ఖాను మళ్ళీ కుతకుత లాడిపోయాడు.

అయితే, అధికార దర్పం వొకొ్కక్క మనిషిలో ఎలాంటి పశు ప్రవృత్తి రేకెత్తిస్తుందో అతనికి తెలుసు.

లక్షల కొద్దీ అధికారులతో నిండి వుండిన ఢిల్లీ నగరంలో, అతను, మొదట ఆర్జించింది యీ పరిజ్ఞానమే.

ఇలాంటి వాటికి నసాళం అంటేటట్టు బదులు చెప్పడమూ అతనికి చేతనవును.

మరొక పనిమీది వచ్చివుంటే అతనందుకు సందేహించకాపోవును.

కాని, యిప్పుడలా చేస్తే కార్యం భంగపడుతుంది.

పారితోషికం కంటే, తన అత్తర్లకు దేవదుందుభులు మోగడం అతనికి మిక్కిలీ అగత్యం.

అది, రాజు యెదట పడగలిగితేనే సిద్ధిస్తుంది,

రాజసభలు కంటభూయిష్ఠాలూ, హింస్రక మృగాకీర్ణాలున్నూ.

పాలకోసం రాయి మొయ్యాలి.

అంచేత, అతనోపికపట్టాడు.

ఇంతే కాదు.

అలాంటి దురుసు మనిషిని, అందుకు తగ్గట్టు మాట్టాడి అంత కంటే యెక్కువగా నొప్పించడం కంటే, తగ్గి మాట్టాడి, దారికి తెచ్చుకుని, పిడికిట పట్టుకుని ఆడించడం కూడా వ్యవహర్తల లక్షణమే.

ఈ నిశ్చయంతో అతను "ఏలినవారి–" అంటూ ప్రారంభించాడు; కాని, మాట సగంలోనే కలగజేసుకుని, ఠాణేదారు "దివాన్జీవారు అది సావకాశంగా చిత్తగిస్తారు, ముందు నువ్వు వచ్చిన పనేమిటో మనవి చేసుకో" అని అందించాడు.

"చిత్తం, చిత్తం" అంటూ మరో పెట్టె తెరిచి దివాన్జీ యెదుట వుంచాడు ఖాను, ఠాణేదారు సమయస్ఫూర్తికి కళ్ళతో మెప్పు చూపిస్తూ.

లోభాగాన ఆకుపచ్చ మఖమల్ గుడ్డ అతికించిన చక్కని పెట్టె అది.

ఎఱ్ఱని అత్తరుతో, అపురూపమైన నగిషీపని చేసిన చిన్న సీసా వొకటి, కోటి కిరణాల జాతి రత్నం లాగ మెరిసిపోతోంది, అందులో.

అక్కడివారు దాని చక్కదనానికి ముగ్ధులయిపోయారు; కాని దివాన్జీ అటు చూడనే లేదు.

అందుకున్నా నరాలు తోడేసినట్టయిపోయాడు; కాని యేమీ యెరగనట్టు "ప్రభువులకు తెలియంది లేదు" అంటూ ప్రారంభించాడు, ఖాను.

"పెద్దాపురం ప్రభువులకు నజరు పెట్టుకుందామని తయారు చేశా నది. గోల్కొండ నవాబుగారికి వట్టివేళ్ళ అత్తరు మిక్కిలీ ప్రియం అని తెలిసి ఆదెంత శ్రద్ధగా తయారు చేశానో, పెద్దాపురం మహా రాజులుంగారికి గులాబీ అత్తరు మిక్కిలీ ప్రీతిపాత్రం అని తెలిసి యిది అంత శ్రద్ధగానూ తయారుచేశాను. ఆ సీసాలో ఉన్నది వొక్కటే తులం - దాని నిమిత్తం కాశ్మీరం జాతి పువ్వులు వాడాను. ఢిల్లీ పరి సరాల్లో పారశీకజాతులే యెక్కువ. కాశ్మీరజాతి చాలా అరుదుగా దొరుకుతుంది. అంచేత, ఆ కాస్త అత్తరూ తయారు కావడానికి ఖరాగా రెండేళ్ళు పట్టింది మహా ప్రభూ" అని వివరించి చెప్పాడతను.

ఇది విని అక్కడివారు దాని విశిష్టతా, విలవా వూహించుకుని చాలా ఆనందించారు; కాని "ఆశ్చర్యమా?" అనడిగాడు ముందు దివాన్జీ మెల్లిగా.

"గొప్ప వస్తువులు తయారు చెయ్యాలంటే గడియల్లో సాగు తుందా మరి?" అంటూ ఖాను పరిశ్రమ మెచ్చుకున్నాడు తరవాత.

కాని "యెంతకి కిట్టింది పాపం?" అనడిగాడు చివరికి, జాలి పడుతున్నట్టు బెల్లించి చూస్తూ.

ఖాను నిర్విణ్ణు డయిపోయాడు.

అది గు_ర్తించి, కళ్ళంతా గర్వం చేసుకుని, తల పంకించుకున్నాడు, దివాన్జీ.

అతగాడి నిర్విణ్ణతా, ఇతగాడి గర్వరేఖా చూసి అక్కడి పెద్ద మనుష్యు లందరూ చకితులయిపోయారు.

అనేక రాజసభలూ, ఎన్నో నవాబు దర్బారులూ చూసి, సమస్త మర్యాదలూ అనుభవించిన షుకురల్లీఖాను, అనేక శోధనలకు తట్టుకో గలిగిన ఆ కళాశీలి. యీ కొ_త్త దెబ్బకు వూగిపోయిన్నీ, మహారాజు మిక్కిలీ సరసుడని విని ఉన్నాడు కనక, రాజదర్శనంతో యీ మనో వైకల్యం అంతా పోతుందని ఆశించుకుని, అ_త్తరు సౌరభం కంపుగా భావించిన అధికారి దగ్గిర యింతకంటే రసికత ఉంటుందనుకోడం తనదే తప్పునీ తనకి తానే మందలించుకుని, అప్పటికి చేసేది లేక, యీ నిర్విణ్ణతా, దీంతో పుట్టిన కోపమూ, ఆ వెంటనే వచ్చిన యేవగింపూ అణుచుకుని, వినయమున్నూ తెచ్చుకుని, "అది నజరు వస్తువు మహా ప్రభూ ! దక్షిణ దేశాని కంతకీ జాతిరత్నం శ్రీ వత్సవాయి ప్రభువు నిమిత్తం ఉద్దిష్టమైనదిన్నీ. ఈ కారణాల వల్ల దాని కిట్టింపు ధర అడగడం మాకు మన్నన కాదండి'' అన్నాడు, కళ్ళలో బాధ కనపరుస్తూనే.

దీని మీద "మరి మా ప్రభువులను మీ రెంతగా గౌరవిస్తున్నారో మాకు తెలియడం యెలాగా ?" అనడిగాడు దివాన్జీ అమాయికత్వం నటిస్తూ.

"పెద్దాపురం రాజసభలో యిలాంటి వస్తువుల విలవలు కట్ట గల వారులేరని నే ననుకోగలనా మహాప్రభూ ?"

మా ప్రభువు కోసం ఉద్దిష్టమైన వస్తువు వారి సెలవు పొందకుండా విప్పి చూడడం మాకు ధర్మమే అనుకోనా నేను మరి ?

"మరి ప్రభువుల సన్నిధికి..."

"అది సరే నయ్యా ! మేము వారి భృత్యులం కదా, మేమూ కొన్ని విధులు నిర్వర్తించుకోవాలేమో ?"

ఎగిసిపడి "ఇదా విధి నిర్వహణం ? అన్నట్టు చురుగ్గా చూశాడు, బోసినోటి శాస్త్రిలు, క్రీగంట.

అదలా జరుగుతూ ఉండగానే "నేను మనవి చేసుకునేది అదే మహాప్రభూ'' అన్నాడు ఖాను.

''ఒకరితో మనవి చేసుకోడానికీ, సొంతానికి సత్యం గుర్తించడానికీ చాలా అంతరం ఉంది. మీ ఢిల్లీలో, వజీర్లు, ఎవరే వస్తువు తెచ్చినా దాని మంచి చెడ్డలు తెలియకుండా అది పాదుషా సన్నిధిని ఉంచనిస్తారా ?"

తల తాటించుకుంటూ దివాన్జీ యిలా అడిగాదప్పటికి. ఖాను, నిలువునా నీరయిపోయాడు.

వట్టివేళ్ళ అత్తరు సౌరభంతో అతని యెడల మిక్కిలీ అనురక్తులయి వుండిన పెద్దమనుష్యులు యీ మదత పేచీ గుర్తించి నిర్విణ్ణులయినారు.

రాజ బంధువులలో వొకాయన, అపవారించి, దివాన్జీ యెడల నిరసనభావం కనపరచగా, బోసినోటి శాస్త్రిలు నుదుట ''రాత" అన్నట్టు వేలితో పాముకొని మొగం వంచుకున్నాడు.

తాణేదారు ఇదంతా గుర్తించాడు.

వెంటనే ఖానుణ్ణి సంబోధించి "దివాన్జీవారిప్పుడు చాలా తొందర పనిలో వున్నారు. ఇప్పటికి వెళ్ళిపో, మరో మాటు దర్శనం చేసుకుందువుగాని'' అన్నాడతను.

"ఇది బాగుంది" అన్నట్టందరూ తల లూపుకున్నారు.

అంత మంది పెద్ద మనుష్యులకు తన యెడల సానుభూతి ఉండి నందుకు తృప్తిపడి, మళ్ళీ సలాములు చెప్పి, బుర్ర వంచుకుని వెనక్కి అడుగులేస్తూ బయలుదేరాడు ఖాను.

గుమ్మం దాటేటప్పటికే రెండు పెట్టెలూ తెచ్చి వొక జవాను అతని చేతిలో వుంచాడు.

## 3

ఆ రాత్రి తెల్లవార్లూ కంటికి నిద్రలేదు, ఖానుకి.

నోటికి ముద్ద కూడా పోలేదు.

బుద్ధిస్నీ మందగించి పోయింది.

కళ్ళు మూసుకున్నా తెరుచుకున్నా దివాన్జీ చికిలింపు చూపులే కనపడసాగాయి.

కిట్టింపుధర చెప్పమనడం ఒక్కటే జ్ఞాపకం రాసాగింది.

దీంతో, క్షణక్షణమూ యీ చెపోట్లు తింటున్నట్టే బాధపడిపోయా డతను.

ఐతే, లోక ప్రవృత్తి యేకముఖంగా వుండదు, సత్యమే.

ముక్కుకు సూటిగా వెడదామంటే యెవరికీ సాధ్యమూ కాదు, నిజమే.

దీనికి సాయం, ప్రతిఘటనలు తటస్థించితేనే జీవితానికి పరిణతి.

ప్రతిఘటనలు అతిక్రమించగలిగితేనే జీవితానికి విజయమున్నూ. కాని, వొక్కొక్క జీవితానికి హృదయమే పునాది అయితే, మరొ క్కొక్క జీవితానికి మేధస్సు ప్రధానం అయి వుంటుంది.

ఎక్కడ మేధస్సు ప్రధానమో అక్కడ అనుభూతి తక్కువయి పోతుంది.

అక్కడ సానుభూతిన్నీ పూజ్యమే.

ఏ జీవితానికి పునాది హృదయమో అది కళాబంధురం.

అక్కడే కళలకు పరిణతి.

అక్కడే కళలకు వినియోగం.

అక్కడే తన్మూలంగా ఆనందానుభవమున్నూ.

అలాంటి ఆనందం తా ననుభవించాలన్నా. ఇతర్లకు కలిగించాలన్నా ఆ కళాశీలి మహామేధావి అయివుండాలి.

మహాతపశ్శాలిన్నీ అయివుండాలి.

కళావేత్తృతలోనే - కళాసాధనలోనే తన జీవితం పరిపక్వం చేసుకుంటూ వుండాలి.

ఏమంటే ?

ఎవరి సంకల్పం విశుద్ధమో, ఎవరి హృదయం కళామయమో, ఎవరిదీక్ష అలోకసామాన్యమో, ఎవరి ప్రాప్యం లోకకళ్యాణమో ఆ కళాశీలుల నిర్మాణాలే ద్వంద్వ భూయిష్ఠమైన భౌతికజగత్తులో ధ్రువ తారలయి మెరుస్తూ వుంటాయి.

నిజంగా ఖాను అలాంటి కళాశీలి.

అతని అత్తరు లలాంటి ధ్రువతారలు.

అయినా "అక్కర్లేదు", అని చేప్పేస్తే, వెంటనే అతనర్థమూ చేసుకోగలడు, సులభంగా నిరాశా చేసుకోగలడు, నిర్విచారంగా వెళ్ళిపోనూగలడు; కాని యిదేమిటీ యీ వాలకం ?

తన అత్తర్లకు విలవ కేవలమూ డబ్బే అయితే అందుకోసం అత నింత దూరం రానక్కర్లేదు.

ఉన్నవూరే కదలనక్కర్లేదు.
అసలు, ఢిల్లీనగరమే వొక మహాదేశం అంత.
అక్కడే యెందరో ప్రభువులూ, సంపన్నులూను.
వారిలో, ఎందరో రసికులు.

అతని అత్తర్లు కళ్ళకద్దుకునేవారు, వారిలో మళ్ళీ వందలూ వేలూను.

అయితే, పెద్దాపురం ప్రభువు, శ్రీ శ్రీ శ్రీ శ్రీవత్సవాయి చతుర్భుజ తిమ్మ జగపతిమహారాజు రసికత ఢిల్లీలో గుబాళించింది.

ఢిల్లీపాదుషా రసికతకు వంకలు దిద్దింది.
ఖాను ఆగలేకపోయాడు.
దీక్షపట్టాడు.
తపస్సులో కూచున్నాడు.
అపూర్వసాధన చేశాడు.
తహతహ లాడిపోయాడు.
రెక్కలు కట్టుకువచ్చి వాలాడు.

కాని, షష్టి గడియలూ పువ్వులతోనే కాలంగడిపే అతనికి, ఇక్కడ, ప్రభుదర్శనం గగనపుష్పం అయిపోయింది.

అపూర్వమైన జాతిరత్నం గులకరాళ్ళలో కూరుకుపోయి వుండినట్టనిపించిం దతనికి.

వచ్చివచ్చి ముళ్ళకంచెల్లోనూ, మురికి గుంటల్లోనూ పడిపోయి నట్టు బాధపడ్డా డతను.

"అంత ఢిల్లీలో కూడా - అంతంతలేసి వజీర్లయినా చెయ్యలేని కుట్ర యిది'' అని పరితపించా డతను.

బయటవుండగా పెద్దాపురం యెంత ఆశకొలిపిందో, వచ్చి ప్రవేశించాక అంత దిగగుంజేసినట్టనిపించిం దతనికి.

దక్షిణదేశానికి దక్షిణదేశమే దుష్టమృగసంకీర్ణం అయిన కీకారణ్యంలా తోచిం దతనికి.

దీంతో "ముక్కూ మొగమూ యెరగనిచోటికి రావడం మనదే బుద్ధితక్కువ'' అని విసుక్కున్నా డతను.

కాని, తన భృత్యుల చేతిలో వొక కళాశీలి ఎంతక్షోభ పడుపోతున్నాడో మహారాజు కెలా తెలుస్తుంది?

లోకంలో, యెక్కడా కూడా యిలాంటి అంతరువులు తప్పవంటే సమ్మతమే.

అయితే, ఎంతెంతలేసి ధర్మరాజ్యాలలోనూ, మహోదారులైన యెలాంటి ధర్మప్రభువుల పరిపాలనలోనూ అసంతృప్తి కలిగిందంటే - ఏవగింపు పొటమరించిం దంటే - విరోధభావం పుట్టుకువచ్చిందంటే - కల్లోలాలు చెలరేగాయంటే అక్కడి కార్యనిర్వాహకుల యిలాంటి అతిలౌక్యాలవల్లనే.

కాని, యేది యేమయినా, ఎంతచూసినా ఖాను కిక్కడ వొక్కటే ఫలితం.

అంచేత "సన్మానం మాట దేవు డెఱుగును, మర్యాదగా అయినా యిక్కణ్ణుంచి వెళ్ళగలమా?'' అని బెంగ పట్టుకుం దతనికి.

ఇలా వుండగానే కోళ్ళుకూశాయి.

పనిలోపని కాకులు కూడా కూసేశాయి.



తెల్లవారడం తడవుగా వెళ్ళి ఠాణేదారు పాదాలమీద వాలాడు ఖాను.

ఇంతవరకూ అంత గొప్ప అత్తర్లు పెద్దాపురం కోటకు రాలేదు. ఠాణేదారుకి తెలుసు.

ఖానుకి మంచి సమ్మానం జరగడం దివాన్జీకి సుతరామూ యిష్టంలేదు, ఇదీ తెలుసు అతనికి.

బుర్ర యెగిరిపోడానికి కయినా వొప్పుకుంటాడు; గాని, ఖాను, కిట్టింపు ధర చెప్పడు, ఇదిన్నీ తెలుసు అతనికి.

చూశాడంటే, మహారాజు, ఖాను అత్తర్లు విడిచిపెట్టడు. ఇది, ఆ సమయంలో, దివాన్జీ దగ్గిర వుండినవా రందరూ గుర్తించేశారు.

ఠాణేదారు ఆలోచించాడు.

ఉండుండి "సాహసించగలవా?" అనడిగా డతను.

"మానం నిలిచేటట్టు లేదు. ఇక ప్రాణా లెందుకూ? ఆజ్ఞాపించండి" అంటూ ప్రాధేయపడ్డాడు ఖాను.

"ఇక నువ్వు కోటలో ప్రవేశించడం అసాధ్యం. ప్రవేశించినా ముందుకు వెళ్ళగలగడం అబద్ధం. వెళ్ళినా నిలిచి వుండడం దుర్ఘటం. ఇన్నీ జరిగితే మాత్రం నీకోరిక సఫలం అవుతుంది, తప్పదు"

"సెల విప్పించండి"

"మహారాజు, దినమ్మా నాలుగ్ఘడియల పొద్దువేళ పంచకల్యాణి మీద కొండల్లోకి షికారు వేంచేసారు"

"సెల విప్పించండి"

"కోట ప్రాకారం దాటకుండా నువ్వు వారి కళ్ళబడాలి. కనీసం నీవట్టివేళ్ళ అత్తరు వయినా వారి నాకర్షించాలి"

"సెల విప్పించండి"

"దివాన్జీవా రిదివరకే యిది వూహించి వుంటారు. ఇందుకు ప్రతిక్రియ ఆలోచించి వుంటారు. ఆజ్ఞలు మాత్రం యింతవరకూ పుట్టలేదు.

"సెల విప్పించండి."

"నీకు అదృష్టం వుంటేనే ఆయన కిది మరుపు వస్తుంది. మహా రాజు పెట్టిపుట్టినా మరుపువస్తుంది. లేదూ, నువ్వుకోటలో ప్రవేశించలేవు"

"సెల విప్పించండి"

"నావల్ల కాతగ్గ దింతే. ఇక యేది కద్దపడు"

ఖానుకి ఊపిరి తిరిగింది

"నిన్న నేను దాఖలుచేసుకున్నది చందినీ అత్తరు. ఇదిగో యిదిన్నీ స్వీకరించండి. దివాన్జీవారికి నామీద అనుగ్రహమూ లేక పోయింది. యిది వాడుకునే యోగ్యతా లేకపోయింది. యెవ రేమి చెయ్యగలరూ? తమరు చివరి ఉపాయం చెప్పారు. బతికిఉంటే నేను తమమేలు మరవను"

అలా చెప్పి, మాడుమాట్లు వంగి సలాములున్నూ చేసి ఖాను వెళ్ళిపోయాడు.

౨

ఖాను, కోటలో ప్రవేశించాడు.

వంకదార దాటి అనుమానిస్తూనే పదడుగులున్నూ వేశాడు; కాని యింతలో "అరే, అరే" అని నాలుకలు కరచు కుంటూనూ, "ఎక్కడి కెక్కడి" కంటూనూ వచ్చి నలుగురు సిపాయీలు అతణ్ణి అటకాయించారు.

ఖానుకి, వెంటనే రక్తం వుడుకెత్తిపోయింది.

చూపులు చెదిరిపోయాయి.

కాని, సప్రయత్నంగా నిలవరించుకొని "నేను దివాన్జీ వారి దర్శనానికి వెడుతున్నాను, నన్నెందు కడ్డుకుంటారూ?" అనడిగా డతను.

''ఇప్పుడు వీలులేదు పో పొ" మ్మన్నారు సిపాయీలు.

''నేను పాతవాణ్ణే నయ్యా! నిన్న సాయంత్రం వొక పనిమీద మాట్లాడే వున్నాను. ఆ వ్యవహారం పూర్తిచేసుకోడానికే వెడుతున్నాను"

"అయితే, వెళ్ళి వారి లోగిటి దగ్గిరే కనిపెట్టుకుని వుండు, లోటేం ?"

''పోనీ, ఠాణేదారుగారి కచేరీకి తీసుకువెళ్ళండి''

''వా రిప్పుడు దివాన్జీగారి సన్నిధిని వున్నారు, నీకు కనపడరు"

''వారు వచ్చేదాకా కనిపెట్టుకుని వుంటాను.''

''ఆ పని వారి యింటి దగ్గిర, కోటలో వల్లకాదు."

ఇలాగ యుక్తులమీద యుక్తులు కురిసిపోయాయి.

వాటిని ఒరుసుకుంటూ కాలంకూడా గడిచిపోయింది.

''ప్రాకారంలో నిలవగలిగితేచాలు'' అని ఖానుకి సలహా.

లోపల్లోపల అతను ధన్యవాదాలు చెప్పుకుంటూనే వున్నాడు.

ముందు కడుగు పడనివ్వ వద్దని సిఫాయిలకు దివాన్జీ ఆజ్ఞ.

అందుకు వారున్నూ మురిసిపోతూనే వున్నారు.

ఇంతలో, ఆ చుట్టుపట్ల పనిచేస్తున్నవా రందరూ వచ్చి మూగారు.

వచ్చేపోయేవారున్నూ నిలిచిపోయారు.

చూస్తూ వుండగానే, మహారాజు చదరంగ సహచరులూ, దశావతారీ స్నేహితులూ వచ్చారు.

వారున్నూ నిలిచిపోయారు.

పాటకజనమే కాక, పెద్దమనుష్యులున్నూ పోగయినందుకు ఖాను సంతోషించాడు.

"ఏమి టేమిటి?" అన్నారు కొందరు.

ఖాను తన అవస్థ అంతా చెప్పుకువచ్చాడు.

దానిమీద, సిపాయీలు, తమ అసహాయస్థితి చెప్పారు.

ఇలాగ వొక్క గడియ గడిచింది.

''ఇంకో అరగడియ'' అని యెవరో అన్నట్టయింది ఖానుకి.

కాని, అంతవరకూ అతణ్ణి అక్కడ నిలపగలిగినందుకు ఆనందిస్తున్న సిపాయీలు, మరొక్కడు పరుగుపరుగున వచ్చి యేదో చెప్పగా "ఇక దయచెయ్యి'' అనడం ప్రారంభించారు,

"రాజు బయలుదేరుతున్నాడు. అందుచేతనే వీళ్ళుపొమ్మంటున్నారు. ఇక గెంటుతారు'' అని గ్రహించాడు ఖాను.

చిరవాంఛా, దీర్ఘశ్రమా యిలాగ వ్యర్థం అయిపోతున్నందుకు చాలా చాలా కుమిలిపోతున్నా డతను.

చివరి కతను, వుండిన వారిలో పెద్దమనుష్యులుగా కనపడుతున్నవారి నుద్దేశించి "పెద్దాపురం రాజ్యంలో కళాకారుల కిదా సన్మానం?" అని నిక్కచ్చిగా అడిగాడు.

అంతే.

దాంతో అతని శరీరం వొణికిపోయింది.

కళ్ళెర్రబడ్డాయి.

చూపులు నిశితబాణా లయిపోయాయి.

ఈ స్థితిలో చర్రున గులాబీ అత్తరు పైకి తీశా డతను.

అందరూ చూపు లప్పగించేశారు.

"ఇది పెద్దాపురం ప్రభువుకోసం తయారుచేశాను," అంటూ ముందు, సీసా చేతబుచ్చుకొని పెట్టె కిందికి విడిచి పెట్టేశా డతను.

తరవాత "నిద్రాహారాలు మాని తయారుచేశా" నంటూ మళ్ళీ అందుకుని "ఢిల్లీ పాదుషావారు అటూ, పెద్దాపురం ప్రభువ్వారు ఇటూ అన్న గౌరవ భావంతో నాశక్తి అంతా వినియోగించి బొట్టుబొట్టుగా కూడబెట్టానిది. ఒక్కరాకతో దక్షిణ దేశంలో నా పేరు నిలిచిపోతుం దన్న పేరాసతో నారక్తం అనుకుంటూ కూడ బెట్టానిది. అయితే, 'పెద్దాపురం ప్రభువు ఎంత సరసులో వారి పరివారం అంతవిరసమైనది' అని నేను ఇక్కడికి వస్తేగాని తెలుసుకోలేకపోయాను. గులాబీపువ్వు సౌరభం ఎంతదూరమో వ్యాపిస్తుంది; కాని దాని ముళ్ళప్రభావం ఉన్న చోటనేగాని వెల్లడికాదుగా? ఇది నాకు కాదు అమర్యాద. ఇది నా గులాబీ అత్తరుకున్నూ కాదు అగౌరవం. ఇది పెద్దాపురం మహారాజు కందించ డానికి నా కిక మార్గాలులేవు. అయితే, యిది వెనక్కి తీసుకువెళ్ళడం నాకే కాదు, మా కుటుంబానికే శిరచ్ఛేదం. ఇక నాకుండుకున్న తృప్తి వొక్కటే. దివాన్జీవారి అతిలౌక్యంతో కనుమూసే మహారాజులుంగారి స్వచ్ఛకీర్తి, ఢిల్లీ నివాసి షుకురల్లీఖాను గులాబీ అత్తరు సౌరభంలో కలకాలమూ గుబాళిస్తూ వుంటుంది. చాలు నా కిది" అంటూ వూర్ధ్వ శ్వాసతో కోట గోడకి విసిరి కొట్టా డతను సీసా.

సీసా భళ్ళుమంది.

సీసా పెంకులు ఘళ్ళున చెదిరిపడ్డాయి.

రాజసభుల హృదయాలు ఝుల్లుమన్నాయి.

ఆ ప్రదేశం అంతా అత్తరు సౌరభంతో గుమ్మ మంది.

అందరూ ఆ పరిమళానికి మత్తెక్కుతున్న ట్టయారు.

ఒక్క క్షణానికి తెలివివచ్చి అందరూ కళ్ళెత్తి చూశేటప్పటికి, హఠాత్తుగానూ అప్రయత్నంగానూ వెనక్కి తిరిగిచూసి ఖాను కొయ్యయి పోయాడు.

అదేమిటో అని అందరూ వెనక్కి తిరిగి చూడగా, పంచ కల్యాణిమీద, శ్రీశ్రీశ్రీ శ్రీవత్సవాయి చతుర్భుజ తిమ్మ జగపతి మహా రాజు అరకంట చూస్తూ సొక్కి వున్నాడు.

మోర పైకెత్తుకుని వుండి, పంచకల్యాణి, ఉండుండి స్రప్రయత్నంగా ఊపిరి తీసుకుంటోంది.

* * * *

ఇప్పటి; ఆ ప్రదేశంలో, గులాబీ అత్తరు సౌరభం గుబాళిస్తూనే వుంటుం దంటారు చూసివచ్చినవారు.

# 9. సర్వమంగళ

— మల్లాది రామకృష్ణశాస్త్రి

నిన్ను వెదుక్కుంటూ వచ్చానమ్మా!

ఇంతదూరం, ఎక్కడో కృష్ణా తీరాన్నుంచీ, ... చల్లని తల్లివి...కష్టాలన్నీ విని, కడుపులో పెట్టుకు ఆదరిస్తావని, నీలో కలిసిపోదామని వచ్చానమ్మా!

సహించారు; మనసులో ఎంత అసహ్యపడుతున్నా, బయటికి కనబరచకుండా, ఆదరంతో చూస్తూ, తమ ఔదార్యాన్ని ప్రకటించుకుని, లోకంచేత 'ఆహా' అనిపించుకుని, కోటి యజ్ఞాల ఫలం దక్కినట్టు, మురిసిపోయినారు. కాని, అర్థం చేసుకుని, అనుతాపంలో పాలు పంచుకోలేని, ఈ లోకానికి... ఎంత దూరమైపోతే మాత్రం ఏమమ్మా.

నావాళ్లే నాకు కానివాళ్లైనప్పుడు... పంచప్రాణాలూ, మమకారం నిల్పిన వాళ్ళే, వంచనచేసి తూలనాడినప్పుడు... కోరికలు, ఇక ఈ జన్మకు తీరవనే నిరాశ కుదురుకుపోయిన తరువాత... బ్రతికి మాత్రం ఫలమేమున్నదమ్మా!

తీరా... ఇక ఎన్నటికీ కనపడనని తేలిపోయిన తర్వాత... అన్నయ్య, పాపం, తల్లితోడూ కనుక... విచారపడతాడు. నా జీవితం అంతా అడవికాచిన వెన్నెల అయిపోయినప్పటికీ... నా బాధలన్నీ నేను భరించుకుంటూ, ఇంట్లో చేదోడు వాదోడుగా ఉండి, అక్కరకు అడ్డుపడుతూన్నన్నినాళ్ళూ... ఆయనకేమీ చీమంత అయినా నా గొడవ పట్టలేదు; ఇప్పుడు మాత్రం, ఇబ్బంది వచ్చినప్పుడు, ఆదుకునేందుకు

మనిషి లేకపోయిందికదా అని నన్ను తలుచుకుంటాడేమో; అదైనా ఎంతసేపులే... వదిన కౌగిలిలోకి వెళ్ళిపోయిన తరువాత లోకాన్నే మరచిపోతాడు.

మా చెల్లెలు, జానకా, అర్థం శుభం దానికి ఏం తెలుసు ? దాని పెనిమిటి నాకు చేసిన అపకారం... కాదు, ఉపకారం... దానికి తెలిస్తే... ఓర్చుకుని, భరించగల జాణతనం... ఆ అమాయకురాలికి, పసిపాపకు... ఏదమ్మా!

'వయసు మళ్ళుతూన్నవాడు...కొరకరాని కొరివి... ఆ నికృష్టుడికి బంగారంవంటి పండువంటి తల్లిని కట్టిపెట్టవద్దు...ఇది సుతరామూ కూడదు... రెండో పెళ్ళివాడితో అది బావుకునేది ఏమిటి ?' అని, నేను పట్టుబట్టి, ఆ సంబంధం మానిపించాలని, శాయశక్తులా అన్నయ్యతో పోరుపెట్టాను; కాని, నా మాట వింటాడా, పిల్ల సుఖపడుతుందట !... ఆ మాటకు అర్థం ఉన్నదా ? ఆడది సుఖపడటం అంటే ఏమిటో, ఆ మొగరాయుడుకు తెలుసునా ? ముద్దినుసు నగలూ చీరెలూ, ఇనప పెట్టెలో నిండు సంచూలూ చూసుకుంటే కడుపు నిండిపోతుందా ?— పైగా, నేను యింకా ఏమన్నా అనిపోతానేమోనని... 'మొదటి పెళ్ళివాడని... పిల్లవాడు చిన్నవాడని... నిన్ను ఇస్తే... ఏమైంది చెప్పు... ఆయుర్దాయం ఉండాలి, సుఖపడి అనుభవించే యోగం ఉండాలి కాని...' ఈ మాటలకు నా నోరు కట్టుబడింది... మనసు చిల్లులు పడిపోతే మాత్రం... అతనికేం ?

మూడు ముళ్ళూ పడ్డాయి. పడ్డ ఆరుమాసాలకే పిల్ల ఈడేరింది. వడసార్థం, పదమూడో ఏడు సగపాలైనా గడవలేదు. పిల్ల ఏపరికాదు. కాకపోతేనేం, మూడు ముచ్చట్లూ తీరిన తరువాత, ఒక్క క్షణం ఉండనిచ్చాడా పిల్లను నట్టింట ! గద్ద తన్నుకుపోయినట్టే - నేను మళ్ళా

నోరు చేసుకున్నాను. అప్పుడుగూడా... అన్నయ్యతో, నెమ్మదిగా... ఇంకో సంవత్సరమన్నా ఆగితే మంచిదని, బావగారితో ఎలాగైనాచెప్పి ఒప్పించు; పిల్ల కొంచెం రెక్కొంచేగాని, ఇప్పటినుంచీ కాపురం ఏం దిద్దుకుంటుంది? ఇంకో దిక్కులేదు, వంటరి గాణ్ణాయెను...' అని బ్రతిమాలుకున్నాను. అన్నయ్యకే ఈ ఊహ తట్టవలసింది... పోనీ, విన్నైనా హర్షించడా అనుకుంటే, అలా కాకపోగా, పైపెచ్చు ఎదురు తిరిగి... 'ఎంతకాలం నోట్లో వేలువేసుకు కూర్చుంటా దనుకుంటావు. ఆడదిక్కు లేకనే, గూట దీపంపెట్టేవాళ్ళు లేకనేగా... వెంటనే పెళ్ళి చేసుకుంది... ఏం, తీవెళ్ళిందా ఏం... దాని ఈడుకు నేను అమ్మకు కడుపున పడ్డానుట... ఇంకా ఆయన పుణ్యమా అంటూ మంచివాడు కనుక, ఇంతకాలం ఆగాడు. మనం చూడటంలేదూ, లోకంలో... వెంటనే... పసుపు బట్టలతోనే తీసుకువెళ్ళి కాపురం పెట్టుకున్నవాళ్ళు ఎంతమంది లేరు? - అలా చేస్తే మాత్రం, వద్దనగలిగేవాళ్ళమా? నీ మాటలకేంలే? నట్టింట కనబడుతూన్నన్నాళ్ళూ... ఎంత వయసు వచ్చినా, మనకు పసిపిల్లే... అవతలవాళ్ళ కష్టసుఖాలుకూడా కొంచెం యోచించవద్దూ...' అంటూ నన్ను గదమాయించి, బావమరిదిని వెనక వేసుకువచ్చాడు. నేను అనేదేముందీ ఇక...అన్నింటికీ తల ఊపవలసిన దాన్నే నాయెను; పోనీ, చెప్పిచూసే వాళ్ళెవరైనా ఉన్నారా అంటే ఇరు పార్శ్వాలా నా అన్నవారు లేరు... ఇటు మా అన్నయ్యా... అటు మా జానకి మొగుడు పూర్ణయ్య శాస్త్ర్లూ... ఎవరి యింటికి వారే పెద్దలు!

సరే, ఆ కాస్త మొక్కుకూడా తీరిపోయింది. గది అలంకారా లన్నీ ఇరుగమ్మా, పొరుగమ్మా ఎవరో చెయిచేసుకుని కానిచ్చేశారు. నాకు, ఒకసారి తొంగిచూడ్డానికైనా మనసు ఒప్పలేదు. పిండివంట దగ్గర కూర్చున్నంతసేపూ, కంట నీరుపెడుతూనే ఉన్నాను. పొగ

పోయి కళ్ళు ఎర్రబారిన వనుకున్నారు... పేరంటాళ్ళు... మనసు ఎంత కుమిలిపోతూన్నదో ఎవరూ గ్రహించలేదు... నయమే అదీని!

ఇక... ఆ కాపురం ముచ్చట్లు ఏమని చెప్పేది. మూడు నిద్దర్లూ కాగానే, తెల్లవారితే మంగళవారమైనా, నిమిషం నిలవకుండా తర్లించుకు వెళ్ళిపోయినాడు... తీసుకువెళ్ళి కత్తులబోనులో ఇరికించాడు. మెదల డానికి వీలులేదు. కూరనార అమ్మేవాళ్ళతోనైనా మాట్లాడకూడదు. మగపురుగు కంటపడరాదు... మా పక్కవీధిలోనే ఉన్నా... పోయి ఒకమారు కంటనైనా చూద్దామంటే, నాకు అసలు పారాగత్తెం ఉందీ? ఇక, బండిలో కాలుపెట్టబోతూ, నేను మడిగట్టుకుని, ఊరగాయలు సర్దుతూంటే, ఎదురుకుంటూ వచ్చి, నన్ను కావలించుకుని .. 'ఒక్క రైనూ ఉండలేనే, రోజూవచ్చి చూసి వెళుతూండవే అక్కయ్యా!... మిమ్మల్నందర్నీ విడిచి వెళుతూంటే, ఏమిటో తగని దిగులుగా ఉందే...' అని గావురు మన్నది. నేనూ, అధైర్యపడితే కుర్రది మరీ బెగ్గటిలి పోతుందని, రొమ్ముకు అదుముకుని... సముదాయించాను. చెపుదా మనుకున్న నాలుగు మాటలు చెప్పకముందే... అన్నయ్య, బండీవాడు తొందర పడుతున్నాడని వచ్చి మా కిద్దరికీ ఎడబాటులు చేశాడు. ఆ తరువాత వాడన్నా తిరిగి చూశాడా... నేను అనుక్షణం పోరుతున్నా... 'ఏముంది చూసేందుకు... వాళ్ళ కాపురం వాళ్ళు చేసుకుంటున్నారు. చీటికీ మాటికీ... ఇట్టే అట్టే మనంగనక వెళు తూంటి మాయెనా, తనమీద ఏం నేరాలు చెపుతూందో... మనకేం దోచిపెడుతూందో అని ఆయన అనుమాన పడవచ్చును... లేనిపోని కలతలు తెచ్చిపెట్టడం ఎందుకూ...' ఇలా సాకులుచెప్పి తప్పించు కుంటూండేవాడు.

వారం రోజులైంది. వాకిట్లో...ప్రొద్దున్నే ముగ్గు వేస్తూండే వేళకు శాస్తుర్లు వీభూతి పెండెకట్టుతో ఊడిపడ్డాడు...'అంబయ్యా ఇంకా

నిద్రలేవ లేదుటమ్మా...' అని రోడ్డుమీద నిలుచునే ఓపొల్లు కేక పెట్టాడు. పలుదోముపుల్ల తిరితిప్పి నములుకుంటూ, అన్నయ్య, కేక విని, లోపలినుంచి వచ్చి ... ఆయన్ను రమ్మని తలవిసిరాడు. మెట్లు ఎక్కుతూ, నావంక మోరపెట్టి...'దానికి కొంచెం నలతగా ఉందమ్మా ...చెయ్యి తీరికఅయిన తరువాత ఒక్కసారి వచ్చి చూసిపో...' అని, అన్నయ్యతో ఏదో ఈమాటా ఆమాటా ఆడి వెళ్లిపోయినాడు.

వినేటప్పటికే నాకు కాళ్లూచేతులూ ఆడలేదు. ముగ్గుబుట్ట అక్కడే పారేసి పరుగెత్తాను. పోయిచూద్దును గదా, పిల్లది బొత్తిగా లోజెర్దది. గడపలో కాలువెట్టి నప్పటినుంచీ మూసిన కన్ను తెరవడం లేదుట... ఆయన, ఒంటిపూట ఇంత ఉడకేసుకు తింటూ....దానికి జావ కాచి పడేస్తూ...వ్యవహారం ముదిరేదాకా...తీసుకు వచ్చాడు. నన్ను చూసే టప్పటికి...జానకికి ప్రాణం లేచి వచ్చింది. ఏముందీ, ఒకరినొకరు కావిలించుకుని...దాన్ని చూసి నేనుఏడవా...నన్నుచూసి అది ఏడవా: ఇంతలో అన్నయ్య కూడా వచ్చాడు. స్థితి గతులు తెలిసిన తరువాత వాడికీ వెఫ్టబుట్టింది. ఆ పాళంగా పోయి డాక్టరును తీసుకొచ్చాడు టైఫాయిడ్ అని తేలింది.

మాయింటికి తక్షణం తీసుకువెళ్దా మన్నాను. ఆ పిసినారికి ఖర్చు తగ్గడమే కావాలిసింది... వెంటనే సరే అన్నాడు. కాని, ఒక చిక్కువచ్చింది. మావదిన, కార్యం అయిపోయిన మర్నాడే పురిటికి వెళ్లింది. అన్నయ్య ఆ సాయంకాలమే దొరతో సర్కీటు వెళ్లాలట... సెలవు దొరికే నౌకరీ కాదాయెను. మళ్లీ తిరిగి రావడానికి ఏ ఇరవై రోజులో పడుతుంది... అంతవరకూ. రెండోదిక్కు లేకుండా నేను నిభాయించడం ఎలా? ఏమిటీ చేయడం ఇప్పుడు? నాకు ఎంతమాత్రమూ ఇష్టంలేక పోయినా, ఆ మానవుడు, ఉండమని అనకపోయినా, తప్పింది కాదు. అది, మళ్లాలేచి ప్రజల్లో పడేదాకా అక్కడే నాకొలువు.

తిరిగి వచ్చి, మడి ధోవతులు పట్టుకుని వెళ్లి... వేగిరం స్నానం చేసి వంటచేశాను. అన్నయ్య, మొగమాటం చంపుకుని ఆ పూట అక్కడే భోజనం చేసి సాయంత్రం బండికి వెళ్లిపోయినాడు.

క్రమంగా, ఆ రోజు కారోజు ముసలాయన రుసరుసలు మాని, కొంచెం ముఖం విప్పారి ఉండేవాడు. షడ్రసోపేతంగా చేసి పెడు తూంటి నాయెను; ఏం తీపెళ్లిందా... వేళకు అన్నీ అమరుస్తూంటే; మొదటిలో మాటా పలుకూ లేకపోయినా, అనాటి కానాడు, అదీ ఇదీ కనుక్కోడం... భోజనం ముందర లోకాభి రామాయణం వేయటం... ఆషామాషీలాడటం... నన్ను నవ్విస్తూండటం... మొత్తానికి, నాచేత అక్కరకు వచ్చినట్టే ఉంది: మనిషి కవళికలో కొంత మార్పు కని పించింది. నాకుకూడా, మొదట ముళ్లమీద వున్నట్టుండి, ఎప్పుడు ఇవ తల పడదామా అనిఉన్నా... పోను పోను, కొంత బెరుకు తీరింది.

మూడువారాలు గడిచిపోయినవి. జానకి జబ్బు మళ్లుముఖం పెట్టింది. పథ్యంపెట్టి, నేను మాయింటికి వద్దామను కుంటున్నాను. కాని, మనయత్నమా, తానొకటి తలిస్తే దైవ మొకటి తలచిందని... కావలసిన కారణార్థం వేరుగా ఉండగా... ఇంతకూ, అన్నీ అల్లా ఒన గూడాయి. అన్నయ్య ఇంకో పదిరోజుల దాకా రానని, టపా తీసుకు వెళ్లే జవానుచేత కబురంపించాడు. అందాకా అక్కడే ఉండమని జానకి పట్టు పట్టింది. మా మరిది కూడా... ఏకళనున్నాడో... బలవంతం చేశాడు. పోనీలే, వాళ్లు అంత ప్రాధేయ పడుతూన్నప్పుడు... అక్కడ మాత్రం మించి పోయేదేముంది, ఒంటరిగా ఉండాలిసిందే కదా, అన్న య్య వచ్చేదాకా ; పోనీ, ఈలోపుగా పిల్లకు జవపట్టేదాకా ఉండవచ్చు నని... అట్టే బెట్టు చెయ్యకుండా మెత్తపడ్డాను.

పడిలేచిందా, అప్పుడే పొయిలాకటకు రానియ్యడానికి నేను ఒప్పు కోలేదు. ఏం గంపదాకిరీ ఉందని ? ముచ్చటగా ముగ్గురికి వండి వార్చ

దం అధోపనా? పైగా, మాతల్లి, లేచి తిరుగుతూండటమే నాకు కొండంత సత్తువ తెచ్చింది. జిహ్వచచ్చి ఉందేమో కావలసినవి అడిగి చేసిపెట్టే దాన్ని...

తిన్నది వంట పడుతూన్నకొద్దీ... బాగా తెప్పిరిల్లి కోలుకుం టూంది జానకి : సంధ్యపడగానే, ముందు దానికి అన్నం పెట్టేసే దాన్ని ... అంగట్లో మెతుకులు అంగట్లో ఉండగానే, చెయి కడు క్కోడం వ్యవధానం పక్కమీద ఒరిగేది... పగలు కునకడానికి వీలులేదేమో ... మళ్లా పొద్దు పొడిచేదాకా ఆదమరిచి నిద్రపోయేది. నేను, ఆయన కోసం కనిపెట్టుకొని ఉండి, తిన్న తరువాత ... పిండో, పాడో నోట రొట్టుకుని ... మూతలు పెట్టేసి ... వసారా అంచున మాలతీ పందిరికి దగ్గరగా పక్క వేసుకునేదాన్ని ; జానకి పక్కగదిలో పడుకునేది ... కటకటాల తలుపు కనుక ... పిలిస్తే పలకడానికి అందుబాటు. ఆయన ... ఇంటి ముందు ... ఆరు బయట పడుకునే వాడు.

—అర్ధరాత్రి ... చప్పున మెళకవ వచ్చింది. పిండారబోసి నట్టు వెన్నెల... అలకించి చూశాను; అవతలపక్క, రుని సందులో... కొంచెం అలికిడి వినపడ్డది : నాళ్లనడుమ : దొంగా తోడుమోతూ రావ డానికి వీలులేని స్థలం ! ఏమిటో చూద్దామని... లేచి; మెల్లిగా ఆ వేపుకి వెళ్లాను :

మందారచెట్ల నీడలు పడుతూ నేలంతా, చీకటీ వెలుతురూ మాసి కల చదరంగ పాళీలాగాఉంది. మొదట ఏమీ కనిపించలేదు. మళ్లా పరకాయించి చూశాను : చెట్లచాటున ఎవరో ఉన్నట్టుంది... కాళ్లు చూచాయగా కనిపించినవి. ఒళ్లు ఝల్లుమన్నది : గుండె గొంతుక లోకి ఎగదట్టి కెక్కుమని... దగ్గు, అరుపు కలిసి... కేకపెట్టాను

నోట... అరవడానికైనా... మాటరావడం లేదు : కాళ్లు పాతుకుపోయి నాయి... వెర్రి భయంలో... రెప్ప ఆడలేదు : గుడ్లు అప్పగించి చూస్తూ నిలబడి పోయినాను.

—మనిషి తొందరగా నడచి పోతూన్నచప్పుడు... దొడ్డితలుపు ఠపేలున పడ్డది : మామరిది, చెట్టుమాటు నుంచీ, నిదానంగా, నా దగ్గరికి వచ్చాడు. నన్ను చూసి... పోల్చుకోక ముందు ఉలికిపడి.... అంతలో తెప్పరిల్లాడు : భార్య ఏమోననుకుని భయపడి ఉంటాడు మొదట : అవతల మనిషిని నేను గుర్తించాను : మాయింట్లో పనిచేసే ముత్యాలు.

'ఇక్కడ నిలుచున్నావేం... నిద్రలో నడిచి వచ్చావా'. ఆయన ఏమీ చలించకుండా... మామూలుగా అడిగాడు : నేనేమీ సమాధానం చెప్పకుండా ఊరుకున్నాను. ఒక్కనిమిషం నన్ను పరకాయించి చూసి: 'పోయి పడుకో' అని, ఏదో గొణుగుకుని వెళ్లిపోయినాడు.

నేను, వెళ్లి, మళ్లామంచం మీద పడుకున్నాను, నిద్రరాదు... ఆలోచనలన్నీ సముద్రకెరటాల లాగా నన్ను అవరించి ఊపివేసినవి. పక్కకుదరక చాలాసేపు అటూ ఇటూ దొర్లాను. ఏంతో సేపటికికాని, ఎటోఅటు పాలు పోయిందికాదు. నిశ్చయాని కంటూ వచ్చిన తరువాత కూడా... తలచు కోవడం, దద్దరిల్లి పోవడం! — ఎలాగైతేనేం, మనసును ఒప్పించాను : జయించానన్న ఉత్సాహంలో... చిరునవ్వు పెదవులపైన మొలకలెత్తుతూండగానే...జోగి పోయినాను :

ఎంతోసేపటికి మళ్లా మెలకువ వచ్చింది : తట్టి... గిలిగింత పెట్టి లేపినట్లైంది : కళ్లు తెరిచాను ! వెన్నెల మసకవారింది... చుక్క పొడవ బోతూంది : చూపు... మరల్చి... ఆ... వేపుకు... సారిం చాను : నాకాళ్ల దగ్గర... పాదం పట్టుకుని కదుపుతూ... మా మరది

కూర్చుని ఉన్నాడు : నాకు, తెలుసును... ఆయన వస్తాడని... అలా అవుతుందని : నాకు, ఇష్టమే కాదూ...

నేను మసలడం కనిపెట్టి... ఆయన, ధైర్యం చాలక...చట్టున లేచి నిల్చున్నాడు. ఎక్కడ మనసు మార్చుకుని... బెడిసిపోతాడో నని... నోరు మెదల్చకుండా... ఆవంక చేతులుజాచి... బలవంతంగా పొదువుకున్నాను... ఆయన్ని సుఖపెట్టడంలో... ఆయన కోసం... నేను లోకం... నన్నే నేను మరచిపోయినాను.

ద్వితీయ విఘ్నం కాలేదు... అలా అవుతుందేమోనని...ఆయన కుందపలసిన ఆదుర్దా అంతా నేను పడ్డాను : వారం రోజులు... వరుసగా —

పొరబాటు కాదు... తెలిసి చేసిన పనే... నన్ను మోసగించ లేదు... ఆయన... మొగమాట పడకపోతే... నేనే బలవంతం చేసే దాన్ని... అవునమ్మా... ఆ పరిస్థితి అలాటిది ! ఏం... నీకు కూడా, ఈ మాటంటే ఆశ్చర్యం వేస్తూన్నదా ? కళ్ళు కానరాని కండకావ రంతో... అప్పుడు పోతరించిపోయి... ఇప్పుడు ఇంకో వేషం వేస్తూంది... ఇది... ఎంతకైనా తగిందే... తెంచిపోయిన తరు వాత... అని అనుకుంటూన్నావా ? – కాదమ్మా కథ సాంతం విను...

వారం రోజులు దాటిన తరువాత... అనుకున్నదానికన్న ముందరగానే, అన్నయ్య తిరిగి వచ్చాడు : నేను... మళ్ళా మా యింట్లో... గృహప్రవేశమైనాను : అప్పటికి జానకి బాగా లేచి తిరు గుతూ, దానిపని అదే చేసుకునే ధోరణిలో పడ్డది.

నెల్లాళ్ళయింది... కొంచెం బెంగగా ఉంది :

రెండోనెల... అనుమానంగా... అవునా, కాదా అని...ఏలాగో మనసు కుదుటపరుచుకుంటూ తిరిగాను :

మూడోనెల... నిశ్చయమయింది: కొంప నిలువునా కూలి పోయింది. అన్నయ్యకు కూడా ఆ చోకీ తెలిసింది:

ఏం చేస్తాడు, పాపం....నన్నా గద్దించి అడగలేదు... ఎవరితో నన్నా చెప్పడానికా... ఇంకా ఏమన్నా ఉందా... వాడలో ఉండ నిస్తారా... తలఎత్తుకు తిరగనిస్తారా... దాచడమా... ఎంతకాలమని? ఎప్పుడో ఒకప్పుడు పాపం బద్దలుకాక తప్పుతుందా?

అయిదోనెల జొరబడేదాకా... ఏం చేయాలో తోచక... కాలు కాలిన పిల్లిలాగా... నిలిచినచోట నిలవకుండా... నానా హైరానా పడ్డాడు. ఇక, ఒక క్షణం తామసించడానికి వీలులేదు... అప్పటికే అమ్మలక్కలందరూ ఏళ్లాగో పసికట్టి.... గుసగుసలు పోతున్నారు: అవి ఏమన్నా చెవిని పడ్డవో ఏం కర్మమో... ఎన్నడూ పల్లెత్తు మాట అననివాడు... ఆనాడు ఇంటికి వచ్చి రావడంతోనే రుద్రుడై పోయి నాడు... ఒకటని, ఒకటి అనలేదా: అన్నిటికీ ఒడిపట్టి ఊరు కున్నాను.

ఊరుకున్నానన్న మాటేగాని... పైకి, నాకూ తరతర బుట్టింది. అంతవరకూ.... ముంచుకు వస్తున్నా... మనసు.... తుడిచిన పలక లాగా.... ఏ ఊహా కనపడకుండా... అదోమాదిరి మైకంగా... ఏదో ఫలానా అని చెప్పలేని బాధగా... సంతోషంగా... ఉంటూ వచ్చింది. అన్నయ్య ధూకుడు చూసిన తరువాత ఒక్కమారి అయోమయంలో పడిపోయినాను... ఏది దారి?... అంతటితో ఊరుకుంటాడా? పెచ్చు మీరిపోయి... రెక్కపట్టుకు వాకిట్లోకి ఈడ్చివేస్తే... నేను ఏంకావాలి?

అనుకున్నంతా అయింది.... గెంటడం తరువాయి... కాని: మా మరది... అయన్ను మా అన్నయ్యే సలహా అడిగాడట, ఏం చేయా లని... అవును, గొర్రె కటికవాణ్ణే నమ్ముతుంది!... అడ్డుపడి, ఏదో హితబోధచేసి... అన్నయ్య మూర్ఖం విడవకపోవడంచేత.... తానే

ఖర్చులన్నీ భరించే పద్ధతి మీద... ఆ రాత్రికి రాత్రే... పట్నం బండికి పంపించాడు :

రైలు దిగగానే... నన్ను తీసుకువెళ్ళడానికి స్టేషనుకు వచ్చిన దొరసాని వెంట ఆస్పత్రికి వెళ్ళాను. మా మరది... వాళ్ళకు, నేను బండి ఎక్కగానే టెలిగ్రాం ఇచ్చాడట...

మళ్ళా ఏడు నెల్లకు... ఇవతల పడ్డాను... నా బంగారు తండ్రిని వాళ్ళు...ఏం చేసుకున్నారో... ఎవరికి పెంచుకోనిచ్చారో... భూమి మీద పడగానే...వాడికీ నాకూ ఈ జన్మకు రుణం తీరిపోయింది!

ఎల్లకాలం... వాళ్ళు మాత్రం ఉండనిస్తారా ? నాకు మళ్ళా మా ఊరు వెళ్ళాలంటే.... మొగం చెల్లడంలేదు. ఎప్పుడు బయలుదేరు తావని అన్నయ్య ఉత్తరం వ్రాశాడు... నేను మెదలకుండా ఊరుకు న్నాను. అప్పుడు, ఆయనే స్వయంగా వచ్చి... తీసుకువెళ్ళి యింట్లో దిగవిడిచాడు.

వదినె... నెల్లాళ్ళ క్రితమే పిల్లనెత్తుకుని వచ్చింది. అన్నయ్య వెళ్ళి భారసాల చేసుకుని... నెల వెళ్ళకముందే... తీసుకువచ్చాడట. వచ్చినా... నాతో, మా వాడూ మాట్లాడలేదు... సరే, మా వదినె నన్ను చూడగానే మొగం పక్కకు తిప్పుకుని గదిలోకి వెళ్ళిపోయింది. చెప్పరానిదానికన్నా కనాకష్టం అయిపోయాను... తెల్లవారి లేవగానే కంటబడితినాయెనా, ఇద్దరి ముఖాలూ మటమటలాడిపోయేవి. అయితే అన్నీ అమర్చిపెడితే...విస్తరి ముందుకువచ్చి...ఎంచులు పెడుతూ... సుష్టుగా భోంచేయడానికి... అప్పుడు మాత్రం... ఏ అడ్డంకూలేదు: అందుకు పనికివస్తాను.

నా మీద దయదలచి ఉంచుకున్నారా ? చాకిరీకి మనిషి తేరగా అమిరింది గనుక.... ఏలాగో సరిపెట్టుకుంటున్నారు. మా వదినె... ఆ

రాణీ... అసలు మంచినాడే అంతంతాయెను.... ఎన్నడూ అవతల చెంబు ఇవతల పెట్టిన పాపాన పోయిందా... అందులో, బాలింతరాలు? అన్నయ్యకు ఆవిడ కాలు క్రింద పెడితే ఎక్కడ అరిగిపోతుందోనని... ఎంత భయం?

నేనూ... బాలింతరాలినే కదూ... కాని... నా ముద్దుముక్కలు చేసేది ఎవరు? ఆమాట తలపడానికైనా ఉందా? ఒళ్ళు భారకించినా... ఎంత ఓపిక లేకపోయినా .. వేళకు లేవనుండా, కొంచెం బద్ధకించి మూలిగానో, ఇక అవి దెప్పుళ్ళుకావు... సాధింపులుకావు... నా తల్లో గుండెచిబ్బెం కట్టిపోయింది. ఎంతకైనా తలఒగ్గవలసిన దాన్నే కా:

'నా కంట నరుడు పడరాదు. నరుడి కంట నేను పడరాదు'... ఇలా రెండు నెలలపైగా... రాణివాసమైపోయింది నా బ్రతుకు. వెలుపల సావిడిలోకైనా వచ్చేదాన్నికాను. అన్నాయ్యా గడప దిగితే ఒట్టు!

ఇక, లోకం...

పాడులోకం... వేలుపెంచడానికి సందుదొరికితే ఊరుకుంటుందా? గోరంతలు కొండంతలు చేసి, దుయ్యపట్టుకోకమానుతుందా: ఒక కంట్లో సున్నం... రెండో కంట్లో కారం...

అన్నయ్యను... పరమయోగ్యుడికి ఇంత కష్టం వచ్చిందా? అయ్యో పాపం... అని ఊరడించింది.

ఇంతకూ కారకురాలినికదా అని... ఈ కులనాపకురాలిని పడ దిట్టింది!

తిడుతూన్న ఆ నాలికే... మా మరది... మహానుభావుడు, ఆపత్తులో అడ్డపడ్డాడని...ఆయన్ను అందలాన పట్టింది: అయినా, అది ఎంత వరకు నిజమోలే... నోరు మాటాడుతూంటే నొసలు వెక్కిరిస్తూన్నప్పుడు... దేన్ని నమ్మడం?

ఇలా... ఈ అగచాట్లమారి బ్రతుకు... ఎప్పటికి తెల్లవారనూ అని నాగుండెల్లో రాయిపడ్డది. కాని, ఇంతలో ఏం జరిగిందనుకున్నావూ-

మా జానకికి... నెలలు నిండాయి. సుఖంగానే చెంబెడు నీళ్ళు పోసుకుని... తల్లీ పిల్లవాడూ గట్టెక్కి ఇవతల పడ్డారు. నక్షత్ర దోషం ఏదో రవంత ఉందట, పోవడానికి నూనెలో మొగం చూసుకున్నారు. నేను రానన్నా, ససేమిరా కాదు కూడదని, పట్టు బలవంతాన పీకెళ్ళారు.

మా అమ్మడు పీటలమీద కూర్చుని ఉండగా, చూడముచ్చటై ఒక్కమారు చెయి తీరిక చేసుకుని, గుమ్మంలోకి తొంగి చూశాను.... ఎన్నాళ్లయిందో దాన్ని చూసి...

అది నావంక చూసేసరికి... ముఖం వెనక్కు లాక్కున్నాను. దానికంట పడలేక పోయినాను.

ఆశీర్వచనాలైన తరువాత... పాపణ్ణి పొత్తిళ్లలో పొదివి... నా దగ్గరికి తీసుకు వచ్చింది జానకి. నేను తలుపుకు చేయిబార జాచి, జారగిలబడి... కంట నీటి బొట్టు పొడమకుండా, పళ్ల బిగివిని నిలుచుని ఉన్నాను. నా వాలకం ఏం కనిపెట్ట గలదు... పిచ్చపాదగట్టు... పిల్లవాణ్ణి నా చేతుల్లో పెట్టబోతూ... 'వెళ్లు నాయనా... అమ్మ! ... చూడవే... నిన్ను చూసి నవ్వుతున్నాడేవ్ అక్కయ్యా !... ఇక నిన్ను వదలడేమోనేవ్... తీసుకోవే... పోనీలే నేను పనికి రాకపోతే... మీ అమ్మ దగ్గరకే వెళ్లుబాబూ...' అని తన ఉబలాటం కొద్దీ... ఏమేమో పలుకుతూంది. నాకు... ఏలా ఉందని చెప్పనూ?...

పక్కను చోద్యం చూస్తూఉన్న పెద్ద ముత్తైదువ ఒకావిడ... 'అవునే, జానకీ... వీడిని మీ అక్కయ్యకు ఇచ్చేసి... నీవు ఇంకో కొడుకును కనుక్కోవే...' అని... ఆమెకు తోచినట్లు... హాస్య

మాడింది. వింటూన్నవాళ్ళు నవ్వారు : నా మనసులో భగభగమన్నది... జాస్తూన్న చేతులు వెనక్కునెట్టుకుని... సీరోడుతున్న కళ్లతో వెనక్కు తిరిగాను : అందరి పాయసాల్లోనూ నెయ్యి ఒలికి నప్పుడూ... నా వంతుకు దక్కేది... పచ్చివిషమేనా ?

'కంట్లో నిప్పులు పెట్టుకుంది... చూసి ఓర్చే నేర్పుకూడానా...' జానకి... మా జానకే... ఈ మాటలు... నావెనకాల అన్నది... అనసీ. నిండా మునిగిన వాళ్ల కేంచలి ?

అంతటితో ఆకాంద అయిపోయింది : అన్నం నోటికి పోలేదు : మెతుకు ముట్టకుండా... ఊరికే విస్తరి ముందర కూర్చుని లేచాను. దానికేంలే, కడుపునిండే ఉంది కాదూ, ఇవన్నీ చూసుకుంటూ !

ఓ విధంగానా, నాకు వంచన ! పులిమీద పుట్రరేగింది ! రాత్రి భోజనాలైన తరువాత, ఒంటిపాటున... మా మరది నాకు, అడ్డం వచ్చాడు : మరి, అధమం ఏ మూడు నెలలైనా... గదిలో పక్క వేయించు కునేందుకు పీలులేదుగా... ఎదురుగుండా నేను కనబడు తూంటిని, ఊరుకో వలసినంత కర్మం ఏంవచ్చింది ? ఒకమారు లోకు వైన తరువాత... ఇక... ఛీ... మగపురుగులు !

ఎంత స్వాతంత్ర్యంతో నాచెయి పట్టుకున్నాడను కున్నావు ? ఊరుకున్నాను : ఇంకా ముదరనీ...

రెండో చెయ్యి... నా భుజంమీద వేసి... మెద మీదుగా వాల్చి నన్ను దగ్గిరకు లాక్కునే .. గృహస్థ మార్గంలో... ఉన్నాడు.

జానకి... గుమ్మంలోకి వచ్చింది. మమ్మల్నిచూసి... గుడ్లు వెళ్లకొచ్చి... తూలుతూ వెనక అంగవేసి.... తలుపు రపీమనిపించి, లోపలపడి కెవ్వుమన్నది.

—మా ప్రబుద్ధుడు, తన ధోరణిలో తానున్నాడు కాని...
వెనుకా ముందూ చూడటం వుందా ? రానిచ్చాను... మెదలకుండా...
అసహ్యించుకుని ముఖం తిప్పేసు కోకుండా... మరీ దగ్గరకు రాని
చ్చాను. మా యిద్దరి పెదవులకీ, నూలు వాసికూడా ఎడంలేదు. అందాకా
వచ్చిన తరువాత, పిడికిలి ఇనుపగుండు లాగాచేసి, ఎగువకు, గురిగా
పళ్ళు కరుచుక పోయేటట్టు... గడ్డం చెక్కలయేటట్టు... విరగబొడి
చాను. తగిలీ తగలడంతోనే, మళ్ళా కిక్కురుమనకుండా, చాపచుట్టగా
పడి పోయినాడు... మా మరిది... అంత సత్తువ ఎక్కడి నుంచి
వచ్చిందో నాకు !

వెనక్కు తిరిగి చూడకుండా... దూసుకువచ్చి... చూడకుండా
రావడంలో... పారిజాతం చెట్టు మీదపడి, లేచి... ఏలాపోయి పడ్డానో,
మాయింటిదగ్గర పిలవగా, పిలవగా ఓ పట్టుకు, మా వదినె... పమిటె
సర్దుకుంటూ... వచ్చి తలుపుతీసి... నిలవకుండాపోయి, గది తలుపు
గడియ వేసుకున్నది —నాకు, ఊరిన పుండుమీద ఉప్పూకారం చల్లి
నట్టయింది—అందరికీ నేను భారమే !

అప్పటికి ఈ ఆలోచనలేదు సుమా. మతిచెడి... మనస్సంతా
పాడై పోయి క్షోభపడుతూ... సావడి నాలుగు మూలలా కలయ దిరుగు
తూండగా... వంకెన, బరువుగా... అన్నయ్యకోటు... జేబు కని
పించింది. చూడగానే... అప్పుడూ, ఈ ఆలోచన తోచింది...
చూస్తూన్నకొద్దీ అది పాతుకు పోయింది. ఒక్క క్షణం ఇక ఆలస్యం
చేయకుండా, పర్సుమెల్లిగా తీసి... కావలసినంత అందులో ఉందోలేదో
చూసుకుని, చేతబట్టుకుని... పిల్లిలాగా అడుగులో అడుగు వేసు
కుంటూ, ఆ యింటికీ... యింటివాళ్లకూ... అంతటితో ఋణం తీర్చు
కుని... వచ్చేశాను.

ఎవరికంటా పడకుండా... రైల్లోపడి... రెండుసార్లు, ఎక్కడ మారాలో తెలియక, దోవతప్పి... వెనుకాముందూ అయి... చివరకు ...ఇవాళ ఆసుర సంధ్యలో... ఇక్కడదిగాను.

దిగి యకాయకిని వచ్చేశానమ్మా! నాలిక పిడచ బారిపోతూంది: మా గంగమ్మ తల్లిని చూడందీ... పచ్చినీళ్లన్నా ముట్టకూడదనుకుని... తీర్థోపవాస ఫలం దోవలోనే దక్కించుకు వచ్చాను:

చిరుకెరటాల మీదుగా... అనుమానాలన్నీ ఒడ్డుకు పరిగెత్తిస్తున్నావా? నాకు అంతమాత్రం తెలియ దనుకున్నావమ్మా! చెప్పనా?

మా మరిదిని ఎందుకు లోబరచు కున్నాననా? నా కోసంకాదు. ....నాచెల్లెలికోసం: వెలిరుచులు మరిగి, ఇకదానికి దక్కకుండా పోతాదేమోనని... దానిజీవితం ధ్వంసం కాకుండా, నన్ను బలియిచ్చుకున్నాను: నాకే కోరికఉంది, చెడి పోవాలనుకుంటే... ఆ ముసలితాతేనా... దొరికింది. దేశం గొడ్డుపోయిందా? తనను వలచి వచ్చాననుకున్నాడు.... యిష్టం వచ్చినప్పుడు, వీలు చిక్కినప్పుడల్లా... లోకువ చేసుకోగల... ప్రజ్ఞ ఉందను కున్నాడు... పాపం... పిచ్చిబ్రాహ్మడు: ఆజన్మ అంతేలే! బుద్ధి వచ్చిందంటావా, ఏమో, నాకునమ్మకం లేదు: బుద్ధే ఉంటే, నీతీ నియమం అనేదే ఏమూలైనా ఉంటే-చేసిన పాడుపని ఆసరాతో ప్రతిష్ఠ సంపాదించు కునేందుకు పెనగు లాడుతాడా?— కన్ను తెరవని పసికూనను కటిక వాళ్లకు అప్పగించనిస్తాడా?

జానకి.... నేను విరగడైపోయిందే చాలునని... సంతోషిస్తుంది: పోనీలే, నామీద జాలితలవడం... నాకోసం బాధపడడం కన్న... ఇదేమంచిది: నామీద కోపం అల్లా దానికి మొగుడిమీద ప్రేమను పుట్టిస్తుంది: మామిడిపళ్ళు అందుబాటులో లేకపోయిన కొద్దీ.... మెద మరీ పెరుగుతుంది: ఇంకొకరికి దక్కి పోతున్నాడని తెలిసి నప్పుడుకాని,

ఆడదానికి.... మగవాణ్ని తానే సర్వాపోశనం పట్టాలనే తహతహ పుట్టదు : అలాజరిగిందో... అంతకన్నా నాకు మరి కావలసినదేముంది?

కన్న తరువాత... నెలలు మోసినందుకు ఫలం దక్కకుండా చేజారి పోయిన తరువాత కాని... కడుపు తీపంటే ఏమిటో తెలియ లేదమ్మా. పోనీలే... ఒంటరిగా మాయమై పోవడంకన్న, తీరని కోరిక లన్నా, వెంట తీసుకు వస్తూన్నాను : అదీ కొంత మేలే కాదూ ?

ఎవరిమీద పగ సాధించను... ఎన్నింటికని ఏడ్వను... నాకు లేకపోయినా... ఇంకోరన్నా... నా మూలాన కుదటపడి బాగుండడమే పదివేలు !

అన్నయ్య అంటావా— 'పోయి గంగలో కలవనీ— దానికిలాటి విపరీతపుబుద్ధి పుట్టినప్పుడే అది మాకు కానిదై పోయింది'... అని మొండిగా అనేస్తాడు : ఒకవేళ... అనలేక ఊరుకున్నా, నేర్పనెరజాణ, మావదినె ఉండనే ఉన్నదిగా !

నేను ఎవడి వెంటనోపడి దేశాలుపట్టి పోయినాను అనుకుంటారు ...అంతేకాని... వాళ్ల నోటివాక్యమే ఫలిస్తూన్నదని... ఏలా అను కోగలరు ?

ఇక... వాళ్లెవరికీ నేను కలలోనైనా కనపడను కాదూ—

'నీది ఇంత దొడ్డమనసా' అని ఆశ్చర్యపడుతున్నావా ! నీ వొక్కతెవేనా, మరి, ఈ ఏడేడు పధ్నాలుగు లోకాల్లోనూ ?

మీచెల్లెలు పార్వతి కోసం... మహేశ్వరుడితో నీవు ఆడిన నాటకమే—నేనూ వర్ణించానమ్మా : నిన్నుచూసి నేర్చు కున్నదేనమ్మా.

మన ఇద్దరి మనసూ ఒకటి. మనకోరికలు ఒకటి. మన ఇద్దరి పేరూకూడా ఒకటే... అందుకనే... నిన్ను వెదుక్కుంటూ వచ్చా నమ్మా.

(నవంబరు 1937)

# 10. పళ్లపండగ

—వేకుమళ్ల కామేశ్వరరావు

ఎప్పటిలాగే ఎరుకయ్య రోజల్లా పచ్చజొన్నచేలో ఆలోచనల తోటే పని చేశాడు. సాయంత్రం ఆలోచనలతో నిండి చింతలగూడా నికి వచ్చాడు. కాళ్ళూ, చేతులూ కడుక్కున్నాడు. గుడిసె వెనకాల రావి చెట్టు చుట్టూఉన్న దిమ్మెమీద కూచున్నాడు. ఆలోచనలో మునిగిపోయాడు. కొంతసేపటికి నెమ్మదిగా ''మాకిక్కడేమీ పులుల బాధలేదు, ఎలుగ్గొడ్ల బాధాలేదు, చేలకి అడివి పందుల బాధ కూడా కనబడదు. మా పశువులు సుఖంగా పడుక్కుని నెమరు వేస్తున్నాయి. నాలుగు తరాల కిందటే కొండల్లో ఉన్న గూడేన్నీ, దానితో మాబాధల్నీ విడిచిపెట్టి వెల్లడి ప్రదేశం వచ్చి చేరుకున్నాం. పాలగడ్డ జీవనది. మాకు నీళ్ళకిలోటులేదు; మా పంటలకేమీలోటులేదు. ఇన్ని సౌఖ్యాలు ఉన్నా మా అడివిజాతిని—కాదు, అడవులూ, కొండలూ విడిచిపెట్టేశాము కదా !— మా వెల్లడి జాతిని తలుచుకొంటూంటే నా మనస్సులో చద రంత కారుమబ్బు బయలుదేరి లోపలంతా ఆవరించి మెరుపులతోటీ, ఉరుములతోటీ బైటికివచ్చి బ్రహ్మాండమంతా బద్దలుచేసి, నన్ను బాధ పెడుతుంది. మావాళ్లు చేసే పనులు ఏమని తలుచుకోను ! ఆడవాళ్ళకి అందం కోసమని పళ్లు ఊడకొడతారు. దాన్ని 'పళ్ల పండగ' అంటారు. ఆ విషయం తలుచుకొంటూంటే నాకు ఏడుపు వస్తూంది. ఏడుపేకాదు నవ్వుకూడా వస్తూంది. ఎంత అజ్ఞానం ! ఎటువంటి జాతిరా దేవుడా ! మాకు ఎటువంటి పండగ కల్పించావు గంగమ్మ తల్లీ !'' అని విచా రంతో అనుకున్నాడు. కొంత సేపటికి చటాలున జాగ్రత్తపొంది,

"మా తమ్ముణ్ణి అడిగిచూస్తాను. వాడు ఏమంటాడో" అనుకొని కొంత ఉత్తేజం పొందాడు.

గుడిసెలోంచి చంద్రయ్య రాకకోసం ఎరుకయ్య చూశాడు. కొంతసేపటికి, చంద్రయ్య, చేత్తో పూరిడి పిట్ట పంజరం పట్టుకుని ఇవతలకి వచ్చాడు. ఎరుకయ్య "చంద్రయ్యా !" అన్నాడు.

"అన్నయ్యా!" అంటూ చంద్రయ్య దగ్గరికి వచ్చాడు. పంజరం కిందపెట్టాడు.

ఎరుకయ్య పూరిడి పిట్టను గురించి రెండు మూడు ప్రశ్నలు వేశాడు. తర్వాత చంద్రయ్య యోగక్షేమాలు ప్రత్యేకంగా అడిగాడు. పిమ్మట "ఒరే తమ్ముడూ ! పళ్లపండగని గురించి నీ అభిప్రాయ మేమిటి, అది మంచిదా, చెడ్డదా ?" అన్నాడు జంకుని కనపరచక.

చంద్రయ్య "అది మన ఆచారం. పెద్దం దగ్గిరనుంచీ వస్తూంది. పెద్దలు ఎంతో ఆలోచించి చేసినపని. అద్భుతమైనది, అంద మైనది, అవసరమైనది. దాంట్లో ఇంకా ఎన్నెన్నో సుగుణాలు ఉన్నాయి" అన్నాడు వేరే ఆలోచన లేకుండా.

ఎరుకయ్య దిగ్భ్రమ చెందిపోయాడు. తాను నిలుచున్నాడో, కూచున్నాడో, ఏమిటి చేస్తున్నాడో అతనికి తెలియలేదు. తర్వాత తనలో "ఈరకం ఆలోచనలు వీడికి ఎవరు నేర్పారు.... అసలు పళ్ల పండగలో ఆలోచన ఏదీ ? ఆలోచన లేకపోవడమే అందులో వున్న విశేషం పెద్దల దగ్గరినుంచీ ఈ ఆచారం వస్తూంది. నిజమే ! ఆలోచన లేకుండా అనుసరిస్తున్నాం. ఇలాగ ఇలాగని దానిని గురించి ఆలో చించిన వాడెవడు ? తర్కించిన వాడెవడు ? ఎవడేనాదాని విషయమై తర్కించి దాని మంచిచెడ్డలు చెబితేమండి పడతారు." అని అనుకొని చంద్రయ్యతో "అబ్బాయీ ! నువ్వుదాని మంచి చెడ్డలు ఆలోచించు

బాగా ఆలోచించు. నాకు ఎల్లుండి చెప్పు, తొందరలేదు. నేను అడిగిన ప్రశ్నకి ఉన్నపాటున జవాబు చెప్పవలసిన జరూరులేదు. నువ్వు నిష్పక్షపాతంగా ఎలాగ చేప్తే అలాగ నడుచుకుంటాను. విన్నావా?" అన్నాడు ప్రశాంతంగా. అందుకు చంద్రయ్య "ఆలోచించకుండా చెప్పాననుకున్నావేమిటి?" అని కుంద బద్దలయినట్టు నవ్వాడు. ఎరుకయ్య తనలో "వీడు చెయ్యాని పని చేసినట్టుగా ప్రశంసించు కుంటున్నాడు" అనుకుని, విరుచుకు వచ్చే చిరునవ్వు ఆపుకుని "అలాగ కాదు. ఎల్లుండి వరకూ అక్కర్లేదు. నువ్వు రాత్రల్లా ఆలోచించి రేపు నాకు చెప్పు. అంతే నేనడగడం ఇంకనాకు మారు చెప్పవద్దు" అన్నాడు ఖచ్చితంగా. చంద్రయ్య చిరునవ్వు ఆపుకొని, మరి కాస్సే పటికి పంజరం తీసుకొని వెళ్ళిపోయాడు.

ఎరుకయ్య మనస్సు చాలా కలతగావుంది. అతడు ఏ పని చేసినా ధ్యానం మరొకచోట ఉంచుకునే చేస్తున్నాడు. తన భార్యతో కాని, లేక అంతకంటే ప్రియమైన తమ్ముని కొడుకుతో కాని మాట్లాడే టప్పుడు కూడా అతను అనవలసిన మాట ఒకటీ, అనే మాట ఇంకొ కటీగా ప్రవర్తిస్తున్నాడు. అతను తెల్లారకుండానే ఉట్టినే పొలం వైపు వెళ్ళి, మబ్బుతో నిండిన ఆకాశం కింద చిరుచీకటిలో నిద్రిస్తూన్న చేల వైపు చూసి, చప్పుడు చేస్తూన్న పంటకాలువ ధ్వనీ, రివ్వున ఎగిరి పోతూన్న కొంగల చప్పుడూ విని కూడా మనస్సు మారక తిరిగి వస్తూ "భగవంతుడు యిచ్చిన పళ్ళని, అందమైన పళ్ళని, నమలడానికి అవసరంలేని పళ్ళని లేనిపోని మంత్రాలు, పూజలు చేసి, ఏడుస్తూంటే, ఆడదానికి పెళ్ళిముందర, అనగా పదహారేళ్ళప్పుడు— విలవిల తన్ను కుంటూంటే, కాళ్ళూ చేతులూ పట్టుకుని, ఉలి రాళ్ళతో ఊడకొడతారు. పాపం! పళ్ళు పూర్తిగా ఊడక సగం విరిగిపోయిన వాళ్ళు కొందరు, పక్క పళ్ళు కదిలి జన్మంతా బాధపడేవాళ్ళు కొందరు. ఏమి అందం

చెప్మాయిది ! బోసినవ్వు అందమా ! మేము మునిపళ్ళతో కొరికేది వాళ్ళు కుక్కలలాగు, పందులలాగు, పిల్లులలాగు దంతాలతో నము లుతూ వుంటే అందమా ! మా మొగాళ్ళు నవ్వుతూంటే, నల్లని మబ్బులో మెరుపులాగ, మల్లెపువ్వుల తీగలాగ, ముత్యాల సరంలాగ మెరిసిపోతాయి పళ్ళు. ఆడవాళ్ళునవ్వుతూంటే వికారపు రాక్షసి నవ్వు లాగ నాకంటికి కనపడుతుంది. అందరి కళ్ళూ భగవంతుడెలాగు చేశాడోకాని ! భగవంతుడు చేసినకళ్లో, ఆచారం చేసిన కళ్ళో వాళ్లవి !'' అని తీవ్రంగా ఆలోచన సాగించాడు. మరికొంత సేపటికి బాగా తెల్లారింది. తూర్పున మబ్బు చెదరిపోయింది. నీరెండ ప్రపం చాన్ని తేజోవంతం చేస్తూంది. మంచుకి తడిసిపోయిన గుడిసెల మీద సూర్యుని లేత కిరణాలు పడగా గుడిసెలు తెల్లమేఘాల లాగ మెరు స్తున్నాయి. ఎరుకయ్య గుడిసెకు వస్తూ ఆందోళనగా ''తమ్ముడు ఏమిటి చెప్తాడో ఏమిటో ?'' అని గాబరాపడుతున్నాడు. అతని తల వేడిగావుంది. రాత్రింబగళ్ళూ ఆలోచనలతో నిండి ఉండడం వల్లా, రాత్రిళ్ళు తిన్నగా నిద్ర లేకపోవడం చేతా, అతను వస్తుండగా కాళ్ళూ, చేతులూ మొహం చెమటలు పోస్తున్నాయి.

చంద్రయ్య కాలకృత్యాలు తీర్చుకుని, చెవుల్లో మందార పువ్వులు పెట్టుకుని, వెదురుపేళ్ళ పళ్ళెంతో గన్నేరు పువ్వులు, పారిజాతాలు, మందార పువ్వులు, బంతి పువ్వులు తెస్తున్నాడు. ఎరుకయ్య చంద్రయ్యని చూసి హఠాత్తుగా ఆగిపోయాడు. ఎరుకయ్య రావడం చూసి చంద్రయ్య నిలబడ్డాడు. ఎరుకయ్య కంగారుగా బయలుదేరాడు. చంద్రయ్య దగ్గరికి వచ్చి పళ్ళెంలో పువ్వులు తీసుకుని చెవుల్ని ధరించి ప్రశాంతమైన మొహం కనబరిచి "ఏమంటావు ?" అన్నాడు.

చంద్రయ్య ఊరుకున్నాడు.

మెరుపులాంటి ధైర్యం పుట్టి మాయమైంది ఎరుకయ్యలో ఆతను "మనస్సుకి తోచిన విషయమే నాకు కావాలి" అన్నాడు ప్రయత్నం లేక.

చంద్రయ్య ఊరుకోగా ఎరుకయ్యకి ధైర్యం కలిగింది. "ఆలోచిస్తే ఆలాగే వుంటుంది అబ్బాయీ!" అన్నాడు.

చంద్రయ్య మళ్ళీ ఊరుకున్నాడు.

తన తమ్ముడికి కూడా తనకి తోచినట్టే తోచిందనే ఉత్సాహం మనస్సుని ఊపి వెయ్యగా ఎరుకయ్య "జాతి అంతా ఇలాగ ఉండడం ఆశ్చర్యం వేస్తూంది." అన్నాడు గంభీరంగా.

చంద్రయ్య ధ్యానం ఎరుకయ్య మాటల మీద ఉన్నా, రంగు రంగుల పువ్వులమీద దృష్టి మారుతూంది.

"ఎవరికి వాళ్ళు ఆలోచించుకుంటే చూశావా?" అని చంద్రయ్య ఆత్మస్తుతి కలిగేటట్లా అని, ఉత్సాహం పట్టలేక "మనం కొండయ్యని అడుగుదాం పద" అని అడుగు వేశాడు ఎరుకయ్య.

"భోజనం చేశాక" అన్నాడు చంద్రయ్య.

ఇద్దరూ చల్దన్నం తిన్నారు. తింటూన్నంత సేపూ మనస్సులు అక్కడలేవు. ప్రపంచమంతా దిగ్విజయం చేసి వచ్చినట్టుగా ఎరుకయ్య మనస్సు ఉత్సాహపడుతూ ఉంది. కాని బైటికి ఆతడు కనబరచడం లేదు. చంద్రయ్య పరధ్యానంగా భోంచేసి, లేవడం మాటే మరిచిపోయి కూచున్నాడు. ఎరుకయ్యలేచి తమ్ముణ్ణి లెమ్మన్నాడు.

* * * *

కొండయ్య గుడిసె ఇవతల ఊరికే చల్లగాలికి నిలుచున్నాడు.

"కొండయ్యా!"

"ఏం ఎరుకయ్యా! తమ్ముణ్ణి వెంట పెట్టుకు వచ్చావు?"

"చల్దన్నంతిన్నావా ?"

"అయింది. పొలంమీదికి వెళ్ళబోతున్నా."

"మేము గూడా వస్తాంపద."

"పని అట్టేలేదు, మరెందుకు?" అని కొండయ్య వెనక్కి తగ్గబోయాడు.

"సరదాగా పోదాం" అన్నాడు ఎరుకయ్య.

కొండయ్య గుడిసెలోనికి వెళ్ళి కఱ్ఱ చేత్తో పట్టుకుని, జోడు తొడుక్కొని పై మీద గుడ్డవేసుకొని వచ్చాడు. అంతా నడుస్తున్నారు.

"కొండయ్యా!" అన్నాడు ఎరుకయ్య.

"ఓహో!"

"కొండయ్యా! నీ పళ్ళు ఎలాగ మెరుస్తున్నాయో ఆ లేత సూర్యుని కిరణాలకి. అలాగే చూడాలని ఉంది సుమా!"

చంద్రయ్య మాట్లాడకుండా వింటున్నాడు.

"ముత్యాల పేరు లాగా ఉంటాయి నాపళ్లు, ఇంకా ఇప్పుడు వన్నె తగ్గిపోయాయి కాని."

"తళతళమంటున్నాయి నక్షత్రాల లాగ"

"పళ్ళకుండే అందం దేనికుంది?"

"పళ్ళే అందమంటావు?"

"కాకపోతే!"

"పళ్లు ఊడకొట్టుకుంటే నో ?"

"అందంగిందంలేదు, పిల్లకాకి నోరులాగ."

"అయితే, కొండయ్యా! ఆడవాళ్ళ పళ్లు ఊడకొట్టిస్తామేం?"

"ఆడవాళ్ళకి అలాగ ఉంటేనే అందం!"

ఎరుకయ్య నవ్వా, కోపం ఆపుకొని "అదేమిటయ్యా, అలాగ మాట్లాడతావు? ఇప్పుడే కాదూ అన్నావు, పళ్లుంటే అందమని, పళ్లు ఊడకొడితే అసహ్యమని?"

"ఔను, మొగాళ్ళ సంగతి చెప్పాను. ఆడవాళ్ళ సంగతి చెప్ప లేదు."

"పళ్లులేకపోతే ఆడవాళ్ళకి మట్టుకు అందం ఎలాగయ్యా?" అన్నాడు ఎరుకయ్య.

"అబ్బెబ్బే! ఎంతమాట! అందమంటే అదే! ఆ విషయం తెలిసే మన పూర్వులు ఆడవాళ్ళకి పళ్లు రాలగొట్టారు. వాళ్లు తెలివి తక్కువ వాళ్లుకారు, మనలాగ."

"అయితే పళ్లుంటే అందం అనే మనమే తెలివి తక్కువవాళ్ళం. ఏమంటావు?"

నిస్సందేహంగా! వాళ్ళెంత ఆలోచించి ఏర్పాటు చేశారో ఆ ఆచారం."

"అయినా ఆలోచిద్దూ!"

"ఆలోచించినా తేలేదంతే"

చంద్రయ్య అందుకున్నాడు: "ఆలోచించి చూడు."

"అయితే ఇప్పటి వరకూ ఆలోచించనే లేదంటావేమిట్రా" అన్నాడు కొండయ్య.

"నేను ఏమీ అనను. నేను అనేది ఒకటే. ఆలోచించి చూడమన్నాను" అన్నాడు ఎరుకయ్య.

"నేనూ అనేది అంతే" అన్నాడు చంద్రయ్య.

"ఆలోచిస్తే మరింత అవుననిపిస్తుంది. ఆ సంగతి ఎరిగే మొట్టమొదటే చెప్తున్నా" అన్నాడు కొండయ్య తన తెలివితేటలు 'గమిస్తూ.

''నేనడిగేది నిన్ను మరేంలేదు. నాకు ఏ విషయమైనా రేపు చెప్పు. నేను నీకు నచ్చ చెప్తున్నాననుకుంటున్నావేమో? నాకు చేత కాదు నేను అడిగేది ఇంతే. నువ్వు ఆలోచించుకో. నీ మనస్సునడుగు. ఏది న్యాయమో అది తేల్చుకో తేలిన విషయం రేపు నాకు చెప్పు" అన్నాడు ఎరుకయ్య. కొండయ్య ఏదో చెప్ప బోయాడుకాని, చంద్రయ్య కూడా ''రేపు చెప్పు. ఇవాళ ఏమీ అనవద్దు. అనుభవం మీద నేను చెప్తూన్న మాటలు ఇవి. నా మాట విను'' అన్నాడు.

ఎరుకయ్య అనేకసార్లు ఎంతమందికో నచ్చచెప్పబోయి వేగి పోయాడు. మనుష్యులు వాదనకు ఒప్పుకోరనీ, తమంతట తాము ఆ విషయమై ఆలోచించినప్పుడే వారు దారికి వస్తారనీ ఎరుకయ్య అను భవం

ఎరుకయ్య కొండయ్య దాపుకి వచ్చాడు కొండయ్య తన మనసులో వుండే అభిప్రాయం రహస్యంగా చెప్పాడు. కాని ఆచారం, పెద్దల ఆచారం, పూర్వులు గొప్పవారు, మన సంప్రదాయం, మన మతం అని ఏమేమిటో దానికి అడ్డుగా చేర్చబోయాడు. ఎరుకయ్య అన్నాడు. "నాకు కావలసింది నీ మనస్సు చెప్పే న్యాయం కాని మరేమీకాదు. నీ మనస్సు నువ్వు విప్పి చెప్పినందుకు సంతోషి స్తున్నాను'' అతను మనస్సులో ఎంతో ఆనందపడ్డాడు.

ఎరుకయ్యా, చంద్రయ్యా తిరిగి ఇళ్ళకు వస్తుండగా చలమయ్య ఎదురయాడు. పళ్ళ పండగని గురించి ఎరుకయ్య చలమయ్యని అడి గాడు. అందుకు అతను నేను ఆలోచించనన్నాడు. ఎరుకయ్య ఏమీ చెయ్యలేక పోయాడు. చలమయ్యతో మాట్లాడుతూన్నప్పుడు దగ్గర చింతయ్యగూడా వున్నాడు. చింతయ్య గూడెంలోని పెద్ద మనుష్యు లలో లెక్క. అతనంటే ఎరుకయ్యకి ఇష్టం. చింతయ్య ఎరుకయ్య చెప్పిన విషయాలు మనస్సుకి పట్టించుకున్నాడు.

ఎరుకయ్య యోచిస్తున్నాడు : "ఈ మోస్తరుగా ప్రతివారికీ బోధ పరచడం నా తరమా? ప్రతి వాడికీ బోధపడుతుందా? బోధ పడనివాడివల్ల సంఘానికి అపకారం జరగ వలసిందేనా? అందరికీ బోధ పడేవరకూ మనం ఆగితే ఎన్ని పురుషాంతరాలు పడుతుంది? ఎన్ని శతాబ్దాలు పడుతుంది? అన్ని శతాబ్దాలకైనా ఈపని జరుగుతుందనే నిర్ధారణ ఏమిటి? క్రమేపీ ఈ విషయమై ప్రజ ఆలోచన మానెయ్య గూడదా? ఇందరికీ నచ్చ జెప్పి వారిచేత పని చేయించడానికి పూను కోడం సబబైన పనా?"

చింతల గూడెంలో చిన్నా పెద్దా వెయ్యిమంది ఉన్నారు. కుల పెద్ద ఉన్నాడు. అతని పేరు జాలయ్య. జాలయ్య మాటే గూడె మంత టికీ శాసనం. అతనేరాజు. అతనే మతాధికారి. అతను చెప్పిందే వేదం.

జాలయ్యకి ముందు మేలయ్య కులపెద్దగా ఉండేవాడు. అతని కాలంలో జాతికంతా బోలెడంత ఉపకారం జరిగింది. గూడెం మీదికి ఒక అడవిజాతి వారు దండెత్తి వచ్చారు. మేలయ్య వారిని ఓడించి తరిమివేశాడు. జాలయ్యకి అటువంటి బాధలేమీలేవు. దేవతలకి జాత రలు చెయ్యడం, గూడెంలో వచ్చిన తగవులు తీర్చడం, పంటల విష యంలో శ్రద్ధ కనబరచడం—ఇదే అతను చేస్తూన్న పనులు.

ఎరుకయ్య అనేక మందికి తన ఊహలు తెలియ పరుస్తున్నాడు. ఆలోచించ మంటున్నాడు.

ఎరుకయ్యకి పిల్లలు లేరు. చంద్రయ్యకి మాత్రం ఒక కొడుకు. తన ఇంట్లో తన అభిప్రాయం ఆచరించే అవకాశమే లేకపోయింది. కొండయ్యకి కూతుళ్ళున్నారు. ఇద్దరు పెళ్ళీడు పిల్లలు.

ఒకరోజు సాయంత్రం ఎరుకయ్య కొండయ్య గుడిసెకి వెళ్ళాడు.

"తమ్ముడూ! విశేషాలేమిటి?"

''ఉంటే నువ్వుచెప్పు''

"పిల్లల పెళ్లిళ్ల మాటేమిటి ?''

"చెయ్యకపోతే ఎలాగ ? వాళ్ళుఇంకా ఏ విషయం నాతో చెప్పడం లేదు.''

"మరి పళ్లపండగ మాటేమిటి ?''

''చేద్దాం అదీను"

''చేద్దాం !'' అని ఆశ్చర్యపోయాడు ఎరుకయ్యా. "చెద్దదనుకున్నాం కాదుటయ్యా !'' అన్నాడు.

''మనమొక్కళ్లమే కాదుకదా చేసేది"

''మనం దారితీస్తే అందరూ తీస్తారు"

''అందరూ ఎప్పుడూ తియ్యరు. ఎవడిదోవ వాడిదే. తొందర పడి చేసినందుకు మనమే అనుభవిస్తాం. కులపెద్ద వెలివేస్తాడు. చచ్చేమన్నమాటే. అంచేత దేనిదోవ దానిది. ఆలోచనకీ, ఆచారానికీ సంబంధం లేదు.''

"అంతే ?'' అని అణుచుకున్న ఆశ్చర్యంతోటీ, కోపంతోటీ అన్నాడు ఎరుకయ్య.

"సందేహం లేకుండా !"

''ఇన్ని తెలిసిన వాడివి నువ్వు ఇలాగ చేస్తావను కోలేదు'' అన్నాడు శాంతం తెచ్చుకుని ఎరుకయ్య.

''తెలిస్తే మట్టుకు చేస్తానని నిర్ణయమేముంది ? వెనక మనలాంటి వాళ్ళు ఎంతమంది మనలాగ అనుకొని ఉందరు ! వాళ్లంతా చేశారా ఏమిటి ?

''మంచిపని చెయ్యడానికి స్వతంత్రం లేదంటావు ?''

''సంప్రదాయంకంటే సాధ్యమైనదేదీ లేదు.''

''నీ మనస్సులో పళ్లపండగంటే అభిప్రాయమేమిటి ?''

వెనకే చెప్పాను. మళ్ళీ ఎన్నిసార్లు చెప్పిస్తావు ?''

కొండయ్య అభిప్రాయం మారనందుకు ఎరుకయ్య సంతోషించాడు. "అనుకున్నది చెయ్యడానికి ధైర్యంలేదు మనకి" అనిపైకి అన్నాడు.

''చేస్తే అందరం చెయ్యాలి. లేకపోతే అందరం మానెయ్యాలి"

''అందరం ఎలాచేస్తాం ? ఆలోచించమంటే ఆలోచించని వాళ్ళు ఎంతమంది లేరు ? ఔనంటావా ?''

"నిజమే''

''మరి అందరూ ఎలాగచేస్తారు ఒక్కమాటు ?''

''నిజమేనయ్యా ! నేనా విషయమై ఏమీ చెప్పలేను గానీ నేను మట్టుకు చేసేదేమిటో చెప్పాను''

''అది రావలిసిన మార్పే అంటావు''

''అక్షరాలా. అయితే నేను మట్టుకు చెయ్యలేను''

కొండయ్య అభిప్రాయానికి ఎరుకయ్య సంతోషించాడు. ఎరుకయ్య రహస్యంగా ఒక విషయం చెప్పాడు : ''అబ్బాయీ ! నువ్వు చేసినా చెయ్యకపోయినా న్యాయమని తోచిన నీ అభిప్రాయాన్ని మట్టుకు వ్యాపింపచెయ్యి ''

"అవశ్యం'' అన్నాడు కొండయ్య.

ఒకరోజున ఎరుకయ్య కోనయ్య దగ్గరికి వెళ్ళాడు. వెనక అతనితో పళ్లపండగ విషయం ముచ్చటించి అతని అభిప్రాయం తెలుసు

కున్నాడు. ''కోనయ్యా! మీ అమ్మాయి మ్రరయ్యగారి నానయ్యని పెళ్ళాడతా నంటూందట ?" అన్నాడు.

"ఔను. తొందరలోనే శుభకార్యం జరుగుతుంది"

''పళ్ల పండగ జరగదన్నమాటేనా ?''

''ఎవరన్నారు ?''

ఎరుకయ్య నిర్ఘాంత పోయాడు. కోనయ్య తన అభిప్రాయం అప్పుడలా వెలిబుచ్చి ఇప్పుడిలాగ మాట్లాడడం ఎరుకయ్యకి ఆశ్చర్యం వేసింది. "అదికాదు కోనయ్యా ! మీ అమ్మాయికి పళ్లపండగ చెయ్యవు కదా అంటున్నా" అన్నాడు.

"అదే, ఎవరన్నారని అలాగంటున్నావు ?"

''నువ్వుమరి అప్పుడు అదిమంచి ఆచారం కాదన్నావు కాదూ?"

''అప్పుడు తెలివి తక్కువగా అన్నాను. అంతకంటె మంచి ఆచారంలేదని ఆ ఉత్తరక్షణమే అనిపించింది. మరొక క్షణం నువ్వు ఉండేవుంటే నీతో అప్పుడే చెప్పేవాణ్ని అది గొప్ప ఆచారమని."

ఎరుకయ్య జాగ్రదవస్థని నమ్మలేకుండా ఉన్నాడు. ''ఆచారానికి ఎదురు వెళ్ళలేక కోనయ్య ఆ పళ్లపండగని గొప్పదని కూడా పొగుడుతున్నాడు." అని మనస్సులో అనుకున్నాడు, పైకి ''నువ్వు ఎలాగ చేస్తే చేశావు. కాని పళ్ల పండగని గురించి నీకు మనస్సులో ఉన్న అభిప్రాయం చెప్పు'' అని విస్పష్టంగా అన్నాడు.

''నేనిప్పుడు చెప్పేది నా అభిప్రాయమే. నాకు మరొక అభిప్రాయం లేదు.''

కోనయ్య మాటలు అబద్ధమని ఎరుకయ్య ''నువ్వు నీ ఇష్టం వచ్చినట్టు చెయ్యిగాని నీ అంతరాత్మ అనే మాటలేమిటి ?'' అన్నాడు.

"నా అంతరాత్మ అనేదా, అందరూ ఎలాగచేస్తే అలాగ చెయ్యమని. అంతేగాని మరొక దోవకి వెళ్ళకు అని."

కోనయ్య మనస్సు ఎరుకయ్యకి బోధపడింది. అతనితో వాదించి లాభం లేదను కొన్నాడు. "అయితే మరివెళతాను. ఇంకా ఆలోచించు. తొందరపడవద్దు. మనపక్షం వాళ్ళం చాలామంది ఉన్నాం. ఒంటరి గాణ్ణయిపోతానని నువ్వు భయపడ నక్కర్లేదు" అని ధైర్యం చెప్తున్నట్టు పలికాడు. కాని కోనయ్యకి వేరే ఆలోచనలేదు. ఎరుకయ్య లేచి వెళ్ళిపోయాడు.

ఎరుకయ్య, అతని బృందం గూడెంలో అనేక మందికి తమ ఉద్దేశాల్ని వ్యాపింపజేశారు. మనస్సులోంచీ ఒప్పుకున్న వాళ్ళుకొందరు, ఎరుకయ్య పలుకుబడికి హడిలి ఔనన్న వాళ్ళు కొందరు, లోపల మంచి దనుకొని పైకి ఆ మాట అనడానికి భయపడేవాళ్ళు కొందరు, సంప్రదాయం కంటే మెరుగైనది లేదనే వాళ్ళు కొందరు, ఏ పద్ధతైతే మన కేమిటి. ఇలాగ జరిగిపోనిద్దురూ అని తలంచేవాళ్ళు కొందరు – ఇలాగ నానావిధాలుగా ఉన్నారు.

ఎరుకయ్య సంస్కరణోద్దేశం కులపెద్ద జాలయ్య నోటీసులోకి వెళ్ళింది. జాలయ్య మండి పడ్డాడు. గూడెంలో ముఖ్యుల్ని కొందరిని రప్పించాడు. ఎరుకయ్య వ్యవహారం చెప్పి అతనికి శిక్ష విధించవలసిందనీ, ఆ నేరానికి అతన్ని చెట్టుకి తలకిందులుగా కట్టి వారం రోజులుంచాలనీ చెప్పి, ఎరుకయ్యని తన దర్శనానికి రమ్మని కబురు పంపించాడు.

ఎరుకయ్యకి అన్ని విషయాలు తెలిశాయి. అతను జాలయ్య దర్శనం తొందరలోనే చేస్తానని వర్తమానం పంపాడు. ఎరుకయ్యకి

జరగబోతూన్న ఆపద విని అతని అనుచరులు అతని దగ్గరకు వచ్చారు. మార్గాంతరం తెలియజేయ వలసిందన్నారు. జాలయ్యమీదికి యుద్ధానికి వెళ్ళడానికి సిద్ధంగా ఉన్నామని చెప్పి, పొదులలోంచి బాణాలు తీసి విల్లు లెక్కపెట్టి, అతని ఆజ్ఞకోసం ఎదురుచూస్తున్నా మన్నారు. ఎరుకయ్య సంతోషించాడు. తొందరలోనే తన ఉద్దేశం తెలియజేస్తానని చెప్పాడు. ఆలోచన పరుల్ని పన్నెండుమందిని ఎంచి ఎరుకయ్య వారితో మంత్రాంగం జరిపాడు. యుద్ధం ప్రకటించవలసిందే అని వారు ఆలోచన చెప్పారు. కాని ఎరుకయ్య "మనం రహస్యంగా ఒక పని చెయ్యాలి. అది రెండోవాడికి మీవల్ల తెలియగూడదు. జాలయ్య యుద్ధానికి సిద్ధపడి వుంటాడు. కాని మరొకరకమైన అపకారం జరుగుతుందని తలచి ఉండడు. మీరు రహస్యంగా అతన్ని బందీచేసి దూరంగా ఏ అడవుల్లోనో, కొండల్లోనో దాచెయ్యాలి. జాతికి అధికారిని నేనవుతాను. జాతికి మంచి అని తోచిన ఆజ్ఞలు అమలులో పెడదాము" అని గంభీరంగా చెప్పాడు. ఎరుకయ్య బుద్ధి విశేషానికి మంత్రులు ఆశ్చర్యపోయారు.

* * * *

జాలయ్య ఏమయిందీ ఎవరికీతెలియదు. గూడెమంతా ఆట్టుడికినట్టు ఉడికిపోతోంది. జాలయ్య న్యాయంగా ఉండనందుకు దేవతలు అతన్ని నాశనం చేశాయని కొందరూ, న్యాయంగా ఉండినందువల్ల దేవతలలో కలిసిపోయాడని కొందరూ, ఎరుకయ్య తన అనుచరులచేత చంపించాడని కొందరూ-అందరూ తలో విధంగానూ చెప్పుకుంటున్నారు.

ఎరుకయ్య గూడేనికి రాజయ్యాడు. ఉత్తరక్షణంలోనే పళ్ల పండగ ఉండకూడదని శాసించి, ఉల్లంఘించిన వారిని చెట్టుకి తల

కిందగా నాలుగు రోజులపాటు వేళ్ళాడకడతానని గూడెమంతా చాటిం పించాడు. కొందరు ఏమయినాసరే పళ్లపండగ చేస్తామన్నారు. మరి కొందరు అధికారి ఆజ్ఞ మీరమన్నారు. కొందరు తాము కోరుకుంటున్న మార్పు వచ్చిందన్నారు. ఇంకా కొందరు భూలోకం నాశనమయి పోడానికే ఈ ఆజ్ఞ వచ్చిందన్నారు.

కొండయ్య తన కూతుళ్లకి పళ్లపండగ చెయ్యడానికి పూను కున్నాడు. ఎరుకయ్య భటులువచ్చి కొండయ్య రెక్కవిరిచి కట్టితీసుకు వెళ్ళి చెట్టుకి తలకిందులుగా కట్టారు. తనని రక్షించ వలసిందనీ, తప్పు చేసినందుకు క్షమించకోరుతున్నానని కొండయ్య బతిమాలుకున్నాడు. కొండయ్యయొక్క వెనుకటి పరిచయం ఆలోచించి ఎరుకయ్య క్షమిం చాడు. కొండయ్య తాను బతికి ఇవతల పడడం రెండోజన్మగా భావించాడు.

ఎరుకయ్య తన దగ్గరికి రావలసిందని ప్రత్యేకంగా కోనయ్యకు కబురు పంపించాడు. అతనురాగానే అతని కూతురు విషయమై అడి గాడు. కోనయ్య తాను సంప్రదాయం తప్పితేనే తనకి భయం కాని మరి దేనికీ భయంలేదని నిర్భయంగా చెప్పాడు. ఎరుకయ్య భటులకి ఆజ్ఞ ఇచ్చాడు. కోనయ్యని చెట్టుకి వేళ్ళాడగట్టారు. ఒక్కపూటలోనే కోనయ్య తన నిర్ణయం మార్చుకొని శిక్షనుంచి విడుదల పొందాడు.

ఊళ్ళో ఇద్దరు ఆసాములు పళ్లపండగ ఆజ్ఞని ఉల్లంఘించారు. ఉత్తరక్షణంలో వాళ్ళిద్దరినీ చెట్లకి వేళ్ళాడగట్టారు. ఇద్దరూ మర ణించారు. ఈ కృత్యంతో ఊళ్ళో గుసగుసలు బయలుదేరాయి. కాని బహిరంగంగా అభిప్రాయం చెప్పిన వారుకాని ఆజ్ఞని, తప్పినవారుగాని లేరు. ఎరుకయ్య పలుకుబడి విస్తరిస్తూంది. ఇంక జాలయ్య తిరిగి

గూడేనికి వచ్చినా ఏమీ ఫర్వాలేదనే ధైర్యం ఎరుకయ్యకి కలిగింది. అతను జాలయ్యని రహస్యప్రదేశం నుంచి తెప్పించాడు. జాలయ్య తన పక్షం వారు లేరనీ, తను ఎదురు తిరగడం వల్ల మరణించడమేగాని మరొకలాభంలేదని తలచి అందరితోపాటే ఉండడం మొదలెట్టాడు.

నాలుగేళ్ళయింది. ఆడవారి నవ్వులలో ఉండే అందాన్ని గురించి కవీశ్వరులు రకరకాల కవిత్వం చెబుతున్నారు. చంద్రుడిలో ఉండే నలుపు ఎప్పటికైనా కన్నెనవ్వుల తళుకుల వల్లే పోవాలిగాని మరొక మార్గంలేదని వారిలో గొప్ప కవీశ్వరుల అభిప్రాయం.

(మార్చి 1941)

# 11. మడత పేచీ

—భమిడిపాటి కామేశ్వరరావు

ఒకసారి చందనబస్తీ పత్రికలో ఒక చాటింపు పడింది : ''లషా రావుగారు ప్రమాదంవల్ల పడిపోయారు. వారి నడుం మడతపడి పోయింది. చిట్టిచిట్టి ఉపాయాలవల్ల గుణం లేకుండా ఉంది. ఇక్కడికి వచ్చి కుదర్చగల వైద్యుడికి వెయ్యి రూపాయలు పైగాఉండే బహుమతీ ఇస్తారు. ప్రజ్ఞగల వైద్యులు కావాలి. స్వయంగావచ్చి మాట్లాడుకో వచ్చును. వివరాలకి వ్రాయవచ్చు—చిరునామా, పత్రికాధిపతి : చందన బస్తీ" అని.

ఆ బస్తీకి ఒకపూట నాటు ప్రయాణంలో కరూరు అనే పట్నం ఉంది. ఆ ఊళ్ళో వైద్యాభ్యాసం చేస్తూన్న డాక్టర్ ధనాధన్‌గారు కూడా, అందరికి మల్లేనే, పత్రికలోపడ్డ ఘోషణ చదివి చప్పరించి ఊరుకున్నాడు. కాని, ఆ మర్నాడే పత్రికాధిపతి దగ్గిర్నించి ఆయనకి ఓ పెద్ద ఉత్తరం వచ్చింది. అందులో రోగిగారిని గురించిన వివరాలన్నీ ఉన్నాయి. ఆయనకి ఆశ్చర్యం వేసింది. ఇంతమంది ఘనవైద్యులు ప్రపంచంలో ఉంటూంటే తనపేరు అప్పుడే పత్రికాధిపతికి ఎట్లా తెలిసిందోగదా అని అనుకుని, లోపల సంతోషించుకుని, భార్యని కేకేసి, మీసం ఉండవలసిన చోట తర్జన్యంగుష్ఠాలతో గాల్ని మెలిపెడుతూ, "చూశావా. మనతఢాఖా !'' అంటూ ఆవిడికి ఆ ఉత్తరం చూపెట్టాడు. తక్షణం ఆవిడ నవ్వేసి, ''తడాఖాలానే ఉంది. మొన్న నేను పత్రికాధిపతి పేర రాయగా, ఆయన తలిసీళ్ళు రాశాడుగావును. ఇంత మాత్రా

నికే పొంగిపోకండి మరి" అంది. ఆయనికి కొంచెం చిన్నతనం వేసినా, మాట్లాడ్డానికి వీల్లేక ఊరుకున్నాడు. బహుమతీ ఆశ ఎవడికుండదూ? అయినా నిలబడ్డపాట్న ఆ కేసు అంగీకరించి ఉండేవాడే కాని, అతనికి ఆ ఉత్తరంలో చాటింపులో లేని షరతు ఒకటి మహాపాపిష్ఠిది కనిపించింది. ఏమంటారా, వైద్యానికి కుదురుకున్నవారు వంద రూపాయలు ధరావతు కట్టింతరవాతే వైద్యం ప్రారంభించవలసి ఉంటుందని. ఎక్కడేనా చక్కటి బజానా ముందు పుచ్చుకుని పని ఒప్పుకుంటారుగాని ఇవ్వడం ఏమిటి అన్నాడాయన. పెద్దవాళ్ళతో వ్యాపారం ఆమాత్రం బరువుగానే ఉంటుందని గ్రహించుకోవాలి అందావిడ. ఆ బహుమతికి ఓ అరుదణ్ణం పెట్టి మనపని మనం చూసుకుంటే నయం అని ఆవిడతో నయాన్నా, భయాన్నా చెప్పిచూద్దాం అని ఆయన యత్నించాడు. ఆవిడ ససేమిరా వినిపించుకోలేదు. సరిగదా :

భార్య— మనకి బ్యాంకిలో నిలవ ఎంతుంది ?

డాక్టర్— నూరు పైనే ఉంటుంది.

భార్య— రేపొద్దున్న అది పుచ్చేసుకుని వెళ్ళి మీరు ఈ బేరం అచ్చుకోండి.

డా— అక్కడ ఎంతమంది ఉన్నారో పోటీకి ?

భా— ఏకాళ్ళోపట్టుకుని బేరం చేచిక్కించుకోవాలి దాటిపెట్టుకుంటే ఓరికేసి ఓరు చూస్తూ కూచోవాలి.

డా— నాకింకా వైద్య పరంగా చెయి తిరగలేదు, అర్థపరంగా గుక్క తిరగలేదు : మన స్థితి కింకా ఎక్కడా గాలి తిరగలేదు.

భా— మృతనష్టపు కేసులు ఎన్నని చేసి సంపాదిస్తే అంత అవుతుంది ?

అని వాదించింది. డాక్టర్ ధనాధన్ పనివాడేగాని, మాటకారుడు కాడు. అందులో, ఇవతల మనిషి భార్యగాని, మరొకరూ మరొకరూ

కాదు. అందుకని, మర్నాడు దబ్బారవాలీ కట్టి, బ్యాంకికెళ్లి దబ్బు తెచ్చి జాగర్త చేసుకుని, ఆ రోగి కాస్త మార్గంలో పడడం చూసుకుని ఒక వారంలో మళ్ళీవస్తానని చెప్పి, ఆయన చందనబస్తీ వెళ్ళిపోయాడు. ఆయనవెళ్లగానే, ఆవిడ స్నేహితురాలి ద్వారా ఆవిడ దగ్గరకి ఒక బంగారపు గొలుసు— పాతిక్కాసుల్ది— బేరాని కొచ్చింది. మషాగతు కలిసి రావడంవల్ల కొంచెం రాహితుగా వస్తువు దొరుకు తుందనిపించి, బహామతీ రాగానే పూర్తిగా సొమ్ము గిరవాటెయ్య వచ్చుగదా అనే ధైర్యం చొప్పున, ఆవిడ, మాసవాయిదాల మీద దబ్బు చెల్లించే షరతుకి ఆ గొలుసు పుచ్చుకోడానికి ఒప్పుకుని బజానా ఇచ్చింది.

కాని, డాక్టర్ ధనాధన్‌గారు వారం లేదు, గీరంలేదు. మర్నాడు సాయంత్రానికి ఇల్లు వెతుక్కుంటూ వచ్చి పడ్డాడు. అంత పెందరాళే ఆయన వచ్చేయడం ఆవిడికి కొంచెం ఆశ్చర్యం తయింది. అయినా ఆవిడ, "చూశారా! ఈ గొలుసు ఎంత ఇంచక్కా ఉందో" అంది. 'ఇంచక్కానే వుంది', అని ఆయన కూలబడి చెప్పుకొచ్చాడట:

ఆ ఊళ్ళోఉన్న సత్రంలో రాత్రి మకాంవేశాను. ఉదయాన్ని కాఫీ కానిచ్చుకుని వచ్చి, మరి ఆ రోగిదగ్గరికి ఎల్లాగా వెళ్ళపడడం అని నేను గుంజాటన పడుతూండగా, కోర్టుపనిమీద ఆవూరొచ్చి అక్కడ బసగాదిగిన ఒకాయన సాయంచేశాడు. ఆయన నన్ను వెంటబెట్టుకుని తిన్నగా లక్షారావుగారి గుమాస్తాకి అంటించి వెళ్ళాడు. మొదట్లో, ఆ గుమాస్తా, రేగటి బెడ్డల్లాగ మహగుచ్చుకొనేటట్టు మాట్లాడాడు. కాని, కాస్త తడితగిలించే సరికి, అతడు ఎక్కడలేని మెత్తదనం కన పరిచి, తక్షణం నన్ను వెంటేసుకుని రోగిగారింటికి తీసికెళ్ళాడు. రోగి గారిది పెద్దమేడ. ఒకగదిలో ఒక సాగుడు మంచంమీద ఆయన శాలువ కప్పుకుని పడున్నాడు. ఆయన బాధతోనే నాతో ప్రసంగించాడు.

రోగి— కూచోండి. తమదే గ్రామం?

నేను— కరూరు. మీకు ఒంట్లో ఎట్లావుంది?

రో— ఒంటికేమండీ - పిక్కలావుంది. నడుమే!

నే— అసలు సంగతేమిటండీ?

రో— మాబస్తీ ప్రముఖులు ఈమధ్య రోడ్లమీద పిల్లకాలవలు తవ్వారు.

నే— ఎందుకూ?

రో— మంచినీళ్ల గొట్టాలకనీ, మురుగునీటి తూములకనీ, చెట్లు పాతడానికనీ, స్తంభాలు స్థాపించడాని కనీ, బళ్ళవాళ్లమీద కసి కొద్దీననీ, హెచ్చుతగ్గు లొచ్చినప్పుడు దూరభారం వెళ్ళక్కర్లేకుండా ననీ జనం చెప్పుకున్నారు. ఆ వయినం ఇంకాతేల్నే లేదు.

నే— సరిపోయింది. మీరల్లాంటి గోతులోగాని పడ్డారా ఏమిటి?

రో— మరే.

నే — పోన్లెస్తూరూ, మీ అజాగర్తా మీరూనూ! కాస్త కిందూ మీదూ చూసుకుని నడవక్కర్లేదుటండీ, మీరెంత సామంతులైనా! చిన్నవారూ చితగవారూ గనకనా ఇదవడానికి.

రో— అయ్యో! అయ్యో! అబ్బ! అబ్బ!

నే— ఏం ఏం? నెప్పా? తగ్గిస్తాగా! వెధవనెప్పి!

రో— మరేనండి. గట్టిగామాట్టాడేసరికి ఖరేలు మనదమూనూ అక్కణ్ణించి ధనువాయి పోటూనూ! కదులుదాం అనుకునే సరికి కలుక్కుమంటుంది.

నే— అయితే పోన్లెండి. కాస్త నిమ్మళించుకుని మరిచెప్పండి.

రో—ఒకనాడు నేను రాత్రి షికారెళ్లి కార్లోవచ్చాను.

నే— మీరు రాత్రెళ్ల కారుషికారు వెడతారా?

రో— రోజూకాదు. తోచినప్పుడు వెడుతూంటాను. ఆవేళ కారుదిగి ఇంట్లోకివస్తూ, ఈపక్కా ఆపక్కా కనిపించే పాతాళపుగొయ్యి లాంటిది చూసి కళ్ళుతిరిగిపోయి పడిపోయాను. ఆ పడిపోడంతో ఆ తవ్వినకాలువకి సరీసుగా అడ్డంగా దాము వంతెనలా పడ్డానేమో, నానడుం మడతబడిపోయింది. అసలు విరిగి ముక్కలై పోవలసినమాటే. ఆ తరవాత ఏం జరిగిందో నాకు తెలియదు. కాని కిట్టని కుంకలకి పన్లేక నాకు పడడానికి పూర్వమే స్పృహలేదనీ, నేనేదో తాగొచ్చి పడి పోయాననీ, లేనిపోని అపవాదులు నామీద వేశారనీ మా గుమాస్తాకి తెలిసిందట : నడుం సర్దుకోడంతోటే, నడుంకట్టి వాళ్ళపని పడతాను

నే— పోన్లెండి, అదంతా ఎందుకిప్పుడు ? తక్షణంమీరు తోమిం చక పోయారా ?

రో— అయ్యో ! తోమించాం.

నే— ఏదేనామందు పామించకపోయారా ?

రో— అయ్యో ! పామించాం.

నే— బెణుకువైద్యులకీ, యిరుకు వైద్యులకీ చూపించారా ?

రో— చూపించాం.

నే— కాపించారా ?

రో— కాపించాం. ఉప్పు, నిమ్మకాయి...

నే— పట్లు ?

రో— పట్లూ వేయించాం.

నే— లోపలికి మందు ఏమన్నా కుట్టించారా ?

రో— ఆఁ కుట్టించాం

నే— పథ్యం ఏమన్నా చేస్తున్నారా ?

రో— అక్కర్లేదన్నారు. సరేగానండి. తమది కూనీవైద్యం కాదుగదా !

నే— అంటే ?

రో— అంటే కూనీయే.

నే — ఛఛ. తమకి తెలియదు. అది 'హైడ్రోపతి'. నాకు అదీ తెలుసు.

రో— అయితే తమరు దయచెయ్యండి. ఇల్లా ఉండనీ బాబూ, పోయినప్పుడు పోతాను. కూనీకావడం ఎందుకొచ్చింది ?

నే — అది జలవైద్యమయ్యా ! అది కర్రపేరు.

రో— పేరా ? అయితే మాత్రం. ఏమిటంతమరీ నిర్మొహ మాటప్పేరు.

నే— పైగా నాకది అట్టే బాగారాదు. సరా !

రో— మీది సీసామందు వైద్యమా ?

నే— "అలోపతీ'' తెలుసు.

రో— "ఉమాపతీ" తెలుసా ?

నే— దాన్ని 'హోమియోపతీ' అనాలి.

రో— ఈ కాలంలో 'ఉమాపతి' అంటేనే పుణ్యం. మీకేం తెలుసు ?

నే— పోనీలెండి. ఉమాపతీ తెలుసు.

రో— ఇంక మరేమీ తెలియవుకద, ఇన్నింటి తాలూకు పథ్యాలూ చెయ్యాలేమో ?

నే— నాకు 'లక్ష్మీపతి'. 'వనస్పతీ' తెలుసు. 'ఎలక్ట్రోపతీ' తెలుసు. కొన్నిచోట్ల దాన్ని 'న్యాయతీ' అనికూడా అంటున్నారు.

రో— అయితే మీరు ఎక్కువ ఇష్టంగా వాడేరకం ఏది ?

నే— నాది 'బృహస్పతీ' వైద్యం అంటాను.

రో— అంటే ?

నే— మిక్కిలి గొప్పది.

రో— సరే. మీరు గుమాస్తాగారికి అడ్వాన్సు చెల్లించండి.

నే— ధరావతు ముట్టినట్టు రసీదు రాసి యిప్పించండి. కుదరదం తోటే నా బహుమతీ నాకు స్వాధీనపరిచే అంగీకారంతో కాగితం కూడా నాకు పారేయించండి. నేను ఈవేళే ప్రారంభిస్తాను.

రో— ఇన్నాళ్ళకి నాకుధైర్యం వచ్చింది. సరే, మీరు భోజనం చేసుకుని రండి. వైద్యానికి ఇక్కడ బాగుండే టట్టులేదు. అవతల వీధిలో నామేడ మరోటి ఖాళీగా ఉంది. నేను అక్కడికి మారతాను. వసతి మారుస్తే రోగం సహంమట్టుకు తమాయిస్తుందని శాస్త్రం. మీరు దగ్గిరుండి, నన్ను ఎల్లాగా జాగ్రత్తగా కార్లోకి ఎక్కించాలి. కారు సున్నితంగా నడవాలి. ముందు కోటదాకా వెళ్లిరావాలి.

నే— కోట ఏమిటి ?

రో— ఈ ఊళ్ళో కచేరీలన్నీ ఉండేచోటు.

నే— అక్కడి కెందుకూ ?

రో— ఈవేళ కోర్టులో వాయిదా వుంది. ఆ తరవాత నన్ను ఎల్లానో ఆ మేడలో దింపాలి.

నే— సరేలెండి. వస్తాను.

అని నేను వచ్చేస్తూంటే గుమాస్తా, దేవతార్చనకి నన్ను తన యింటికే లాక్కెళ్ళాడు. ఎక్కడి కక్కడికే అనుకుని, నేను రానని బెట్టు చెయ్యలేదు. భోజనం అయివచ్చాం. ఆయన్ని ఆ పళంగానే ఒక బల్లచెక్కమీదికి జరిపి ఆ బల్లచెక్క పళంగానే ఆయన్ని కార్లో ప్రతి

క్షించాం. ఆ రోజున కారు డ్రైవరు కార్యాంతరంమీద వెడతానని సెలవు అడిగితే లేదన్నారట, కొరకొరలాడిపోతూ ఉన్నాడు. నేను ఎదటికెళ్ళి డ్రైవరు పక్క కూచోబోయాను. అతడు నన్ను వెనక్కివెళ్ళి దయ చెయ్యమన్నాడు. అధికారవర్గంలో వాళ్ళు కిరాయిబస్సు డ్రైవర్లని బెదిరించి, వాళ్ళచేత బస్సులు ఖాళీచేయించి, స్వంత పనిమీద ఫ్రీగా ఎక్కినప్పుడు వాళ్ళకి సరియైన సమ్మానం జరగడానికి డ్రైవర్లు వాళ్ళని వీలైనంత వెనకే కూచోపెడతారులే.

కారు బయల్దేరేటప్పుడు పెద్ద సింహగర్జన చేసింది. డ్రైవరు వాలకంచూస్తే అతడేదో అవాంతరం తెచ్చిపెట్టేటట్టు కనబడింది. నిమిట్లో పెద్దరోడ్డుమీంచి తప్పకుని కారు పక్కవీథిలో పడింది. అది సందులాఉన్నా పసందుగాకూడా ఉంది. వెనక కతకల పోటీలో ఒక రోడ్డుకి మట్టి 'షీల్డు' బహుమతీ యిచ్చారని విన్నాం. అల్లాంటి రోడ్డది. గాలీ, వానా, వాహనాలూ, అధికార్లూ, మధ్యవర్తులూ అంకినంతవరకు రక్తం పీల్చేసుగుని మాంసం నల్చేసుగుని వొదిలేసిన శల్యాల్లాగ కంకరరాళ్ళూ, కతకలూ, గోతులూ, కయ్యలూ, గాళ్ళూ, రొంపీ, దిబ్బలూ, దిరుగుండాలూ, మట్టీ మశాణం, పెంట దబ్బా — దానిచుట్టూ శాఖోపశాఖలుగా వ్యాపించిఉన్న తుక్కు సంతానం - ఇల్లాగా భయ మేస్తూ ఆ రోడ్డు జీభూతంలా ఉంది. ఆ డ్రైవరు తెలివి ఏమిటోగాని, కారు, వెనక్కి ముందుకికూడా నడిచింది. అది ఒక్కొక్కసారి కప్పలా దాటేది. ఒక్కొక్కసారి పీతలా నడిచేది. ఉండి ఉండి పొట్టేలు లాగ కొన్ని గజాలు వెనక్కి పోయేది. మరొకసారి తూటాలాగ ఉన్న చోటే గిజగిజా కొట్టుకునేది. నేను పచ్చడై పోయాను. పచ్చడీ మెతుకులూ నోట్లో కొచ్చాయి. రోగిమాట అల్లా ఉండగా నా నడుం విరిగేట్టు కనబడింది. రోగి, ఏకమూలగడం, కుయ్యడం, అరవడం, ఏడపడం, ఓమాటు రోగి డ్రైవరుమీదికి ఒరిగాడు, మళ్ళీ యథాస్థానంలో పడ్డాడు.

మరో మాటు మేం యిద్దరం డ్రైవరుమీద పడి వెనక్కొచ్చాం. ఇంతలో నేనున్న వేపు గాడిలో దిగడి రోగివచ్చి నాపొట్టమీద పడ్డాడు. పడ్డ వాడు ఊరుకోకూడదూ, రోగమా ? 'బాబో, బాబో' అని ఏడుపు. ఆపళంగా అతడు అసలు చోటికెళ్ళి పడేటట్టు ఒక్కగెంటు గెంటాను. మరికాస్సేపట్లో రోగివేపు చక్రాలు రొంపి లాంటిదాట్లో కూరుకుపోయే సరికి డ్రైవరు 'గేరు' మీద కార్ని లాగించాడు. దాంతో నేనున్న వేపు పైకి లేచిపోయి, నేవెళ్ళి అమాంతంగా రోగి మీద పడ్డాను. కారుబోల్తా వేసింది. రోగి 'చచ్చాను, చచ్చాను, నీతాడు తెగా, నామీద పడకు రోయ్' అనిగోల. నాశక్యమా ? డ్రైవరు జాగ్రత్తపడి ముందే దూకే శాడు. చాలా మంది జనం పోగైనన్నూ రోగినీ పైకి తీశారు. ఈ గలాభాలో నాకు మోకాళ్ళు మోచేతులూ కొంచెం కొట్టుకుపోయాయి. కాని, ఆరోగి నడుం బాగుపడి నిట్టాడులా అయి ఊరుకుంది. వీడి అదృష్టంకాలా ! అతడు. 'అమ్మయ్య' అనుకుంటూ సాగి వెళ్ళిపో బోయాడు. 'నాబహుమతీ నాకిచ్చెయ్యండీ' అని నేనడిగాను. 'నువ్వే కుదిర్చిందేమిటి ? ఇంటికెళ్ళి ఇచ్చేస్తాలే' అన్నాడు. తన డ్రైవింగు మహత్యంవల్ల ఆయనకి నడుం కుదిరింది గనక, బహుమతీ ఛీదాగా తనకే రావలసివుంటుందని డ్రైవరు మొదలెట్టి నన్ను అటకాయించాడు. నేను కొంచెం తెల్లపోయి ఆగిపోయాను. ఆ స్థలానికి ఒకవేపున ఇల్లు ఉల కూచయ్య తన యింటి యెదట లక్షారావు నడుం కుదిరింది గనకే తనకే ఆ బహుమతీ రావాలన్నాడు. రెండోవేపు కాపురం వున్న మాచయ్య వచ్చి, తన యింటికి కూడా ఆ స్థలం మొట్టమొదటిదే గనక, తనకి చెరి సహమేనా వాటా ఉండాలన్నాడు. దాంతో కూచయ్య లక్షారావు తన యిల్లున్న పక్కనే కార్లోకూచుని ఉండడంవల్ల తనకే యావత్తు బహుమతీ గాని, మాచయ్యకి పూచిక పుల్లేనా వెళ్ళ గూడదన్నాడు. ఆ స్థలం పేరుకి కూచయ్య వేపుదయినా, పగలు తన

పిల్లలూ, రాత్రి తన పెద్దలూ జాహ్యానికి భుక్త పరుచుకుంటూండడం వల్ల తనదే బహుమతీ అని మాచయ్య కేకేశాడు. అక్కణ్ణించి ఓ పోలీసు "బీటు" కనిస్టీపు వచ్చి, ఆరోడ్డు అక్కణ్ణించి ఎడపెడా వంద గజాలు తనదే గనక, తనకే బహుమతీ రావాలన్నాడు. వెంటనే, ఎక్కడ తెలిసిందో, వెనక ఆరోడ్డు వేయించిన కంట్రాక్టరువచ్చి 'అయ్యా! ఈ రోడ్డు ఇంత మహత్యం గలిగి ఉండేటట్టు తయారు చేయించింది నేను. ఇల్లా రోడ్డు లేకుండా ఉంటే కారు ఇన్ని పిల్లి మంత్రాలు వేసివుండదు, అది అల్లా వేసి వుండకపోతే మీకు నడుం కుదిరి ఉండదు. అందుకని బహుమతీ నాది' అన్నాడు. ఆ రోడ్డు స్వయంగా తవ్వి చేసిన వాళ్ళొచ్చి తమకి బహుమతిలో వాటా ఉంద న్నారు. కాస్పేపటికి బస్సీపాలక సంఘంవారు మనుష్యుల్ని పంపి, రోడ్డు తమదే గనక బహుమతీ తమదే అన్నారు. ఇది పబ్లిగ్గా జరిగిన పని గనక, డీ. పీ. డబ్లుయూ వారు రాకుండా ఉంటారా అని కొంద రన్నారు. ఈ లోపల కొందరు బోర్డువారికీ, ప్రభుత్వానికీ, చక్రవర్తికీ టెల్లిగ్రాపులు కొట్టి వార్నొచ్చి బహుమతీ కోసం దెబ్బలాడమని సలహా యిస్తాం అన్నారు. ఈ దెబ్బలాటలో లక్షారావు చాల దూరం వెళ్ళి పోయాడు. నన్ను కదల్నికుండా వీళ్ళంతా పిశాచాల్లా పట్టుగున్నారు. "మీ వాటాలు ఇదైపోనూ, అల్లానే చూడచ్చు లెండర్రా! పోనీ, ఇంకా ఎంతమందికి బహుమతీలో వాటాలున్నాయో కనుక్కుని మధ్య వర్తుల్ని పెట్టి వ్యాపార పరిష్కారం చేయిత్తాం, ముందు అసలు మనిషి దాటి పోకుండా పట్టుకుందాం నడవండి" అని నేను గట్టిగా అన్నాను. అతడు కోటవేపుకు వెళ్ళాడని కొందరన్నారు. కార్ని ఆ రోడ్డు మీంచి గెంటి, పెద్ద రోడ్డు మీదికి ఎక్కించి, అంతా కిటకిట లాడుతూ కార్లోనూ, కారుమీదా ఎక్కికూచున్నాం. క్షణంలో కారు కోటదగ్గిర వాలింది. లక్షారావు ఏ కోర్టులోకో వెళ్ళి అప్పుడే తిరిగి వచ్చేస్తున్నాడు.

క్రిందరెళ్ళి వాకబుచేశారు. వాడి కోర్టు చల్లగా ఉండా, అది దివాలాల కోర్టుట. వాడి వాయిదా అక్కడట.

అని డాక్టర్ ధనాధన్ వైద్యవృత్తాంతం చెప్పి ఆగాడట. 'పోసీ మీరు అద్వాన్నంగా కట్టిన సొమ్ము తెచ్చుగున్నారా ?' అని ఆయన భార్య అడిగిందిట. ఆ సంగతి తను అప్పట్లో మరిచాననిన్నీ, మళ్ళీ వెళ్ళి తెచ్చుకోవాలనిన్నీ ఆయన అన్నాడట.

(జనవరి 1939)

# 12. బద్ నసీహత్

—మునిమాణిక్యం నరసింహారావు

''ఇవ్వాళ ఇంత పెందరాళే వచ్చేశారేం'' అంటూ మా ఆవిడ నాకెదురుగా వచ్చి తలుపు తీసింది.

"యకాయకీని వచ్చేశాను'' అంటూ లోపలికి అడుగు పెట్టి "కాఫీ ఏమైనా ఉందా" అని అడిగాను.

''ఆ, ఉంది. రెడీగా ఉంది. మరే, మీకోసం ఎవరో పెద్ద మనిషి వచ్చారు. పైన ఆఫీసు గదిలో కూర్చున్నారు అమటా" అని చెప్పింది మా ఆవిడ.

సరేననుకొని, నేను గదిలోకి పోయి, కోటూ చొక్కా విడిచి, ముఖం కడుక్కొని, లుంగీకట్టుకొని పైన తువాలావేసికొని, పైకెళ్ళాను వచ్చిందెవరో చూద్దామని.

ఆ కూర్చున్న పెద్దమనిషి కాస్త వయస్సు మళ్ళినవాడు లాగున్నాడు. ఉంటే యాభై ఏండ్లు ఉండవచ్చు. కాని శరీరం ముదలు పడ్డ ముసలివాడు. యౌవన శేషం యింకా అతని అవయవాల్లో కొద్ది కొద్దిగా కనిపిస్తూ ఉంది. మీసం, తలా చాలా వరకు నెరిసినా అదో అందంగా ఉంది. మనిషి అమాయకుడులాగా, చాలా సౌమ్యుడు లాగా కనిపించాడు.

నన్ను చూసీ చూడ్డంతోటే ఆయన లేచి నమస్కారం చేశాడు. "తమరు ఎవరో నాకు జ్ఞాపకం లేదండీ క్షమించాలె'' అన్నాను నేను.

ఆయన కుర్చీలో కూర్చుంటూ అన్నాడూ— "అయ్యా, మీకు నేను పరిచయుడ్నికానూ నన్ను మీరెప్పుడూ చూడనూ లేదు. మాది అసలు విజయనగరం. నా పేరు సన్యాసిరాజు. మేము రాజుపేటలో కాపురం ఉన్నాము. తమ దర్శనార్థమై వచ్చాను'' అని.

"అయ్యో, అంతపెద్దమాట ఎందుకండీ, నేనెంతపాటి వాడ్ని'' అన్నాను నేను నవ్వుతూ.

"అల్లాక్కాదండోయ్, తమకు మా ప్రాంతాల్లో మా చెడ్డ పేరుం దండోయ్'' అన్నాడు ఆయన తమాషా విజయనగరం యాసతో.

''చెడ్డ పేరాండీ ?'' అన్నానేను వింతగా చూస్తూ.

నేను ఇల్లాగ అనటం జూచి ఆయన నొచ్చుకొని "క్షమించా లండి. చెడ్డపేరూ అంటే మహా దొడ్డ పేరుందని మనవి చేస్తున్నాను'' అన్నాడు. ''అల్లాగనాండీ" అని ఒక చిరునవ్వు నవ్వి నేనూరు కొన్నాను. ఆయన మళ్ళీ ఇల్లాగ అన్నాడు : ''తమరి కథలూగట్రా చదివి మేము ఊ, ఆనందిస్తూ ఉంటామండి. మా చెడ్డ తమాషాగా ఉంటాయి సుమండీ"

ఈ మాటలు విని, సంతోషించి, నేను ఊరుకొన్నాను. ఓ నిముషం అయిన తరువాత ఆయన నా వంకజూస్తూ మళ్ళీ అన్నాడూ— ''తమర్ని తమ కాంతాన్ని, తమ సంతానాన్ని చూచి ఆనందించాలనే ఉద్దేశంతో ఇల్లా వెళ్ళి పోవచ్చానండీ ' అని.

"ఏదో తమకు మాయందు అల్లాగ అభిమానం కలిగింది" అని నేను అంటూ ఉండంగానే ఆవిడగారు వచ్చింది, వెండి పళ్లెంలో నాల్గు కాల్చి నెయ్యి రాసిన అప్పడాలు పెట్టుకొనీ, చేత్తో ఫ్లాస్కు పట్టుకొనీ. ఆవిడను చూడటంతోనే నేనన్నానూ— ''అదిగో రానే వచ్చారు. ఆవిడేనండీ కాంతాయమ్మారావుగారు'' అని.

సంతోషం, ఆశ్చర్యం కనపరుస్తూ ఆ పెద్దమనిషి లేచి నిలబడి, "ఓహో, తమరేనా అమ్మా. సీతా అనసూయా చూశారూ, అల్లాంటి కోవలోని వారు తమరు" అంటూ కూర్చున్నాడు.

కాంతం ఒక్క క్షణం విచిత్రంగా చూచి "బాబుగారూ, నన్నంతగా పెద్ద చేయటం కేవలం మీకు మా యందుండే అభిమానం తప్ప మరోటికాదు ... ఇల్లా దయ చేయండి, ఫలహారం పుచ్చుకోండి" అని ఆపళ్లెంలో నుంచి రెండు అప్పడాలు తీసి నాచేతికిచ్చి, మిగిలిన రెండు అప్పడాలతో పళ్లెం ఆయన ముందు పెట్టింది. మేమిద్దరం అప్పడాలు కరకరా నమిలేసి, చేరో కప్పు కాఫీ తాగుతున్నాము.

ఇంతలో నేనన్నానూ— "మా కాంతం మహా యోగ్యురాలండి. ఆ మహా ఇల్లాలి యొక్క యోగ్యత వల్లనే మాకుటుంబానికి ఏలోటూ లేకుండా జరుగుతున్నది" అని. "మరేటండీ, ఆ మహా ఇల్లాలి పాతి వ్రత్య మహాత్యం చేతనే మీకు ఇంత సిరీసంపదా ఏర్పడ్డది. మరి సందేహం లేదండి" అని అన్నాడు ఆయన.

"ఇంకొంచెం కాఫీ అండీ" అన్నది కాంతం, ఆయనను ఉద్దేశించి. ఆయన అక్కరలేదన్నాడు. మరో క్షణం అయిన తరువాత "పిల్లలు స్కూలునుంచి వచ్చే వేళైందండి, నేను సెలవు పుచ్చుకుంటానండీ బాబుగారూ" అని చెప్పి కాంతం మేడమెట్లు దిగి వెళ్ళిపోయింది.

ఫలహారం కూడా అయిపోయింది. ఇంట్లో ఉడకపోస్తున్నది. షైటికి ఎక్కడికైనా వెడితే బాగుండును అని అనిపించింది నాకు. కాని ఆ పెద్ద మనిషితో ఏం చెప్పాలో తెలియక కూర్చుని, రెండు నిముషాలైన తరువాత నేనే అన్నానూ— "తమరేమైనా పనిమీద వచ్చినట్లా అండి" అని.

"ఎబ్బెబ్బే వృత్తినే వచ్చానండీ, మరేం పెద్ద పనీలేదూ..." అని ఆ వాక్యం పూర్తి చేయకుండానే ఉండిపోయినాడు ఆయన.

ఇల్లాంటి పెద్ద మనుష్యులతో చాలా బాధ. వాళ్ళు వచ్చిన పనేదో చెప్పనూ చెప్పరూ, మనలను పోనీయనూ పోనీయరూ! ఎంతసేపూ అల్లాగ చూస్తూ కూర్చుంటారు. అందుకనే, నేను మళ్ళీ అన్నాను— "చెప్పండి, ఏదైనా పనుంటే, సందేహిస్తున్నట్టున్నారు. చేయగల సాయం ఏమైనా ఉంటే చేస్తాను" అని. ఆయన అప్పటికీ మాట్లాడలేదు! జవాబుకోసం కాసేపు నిరీక్షించాను. టైము చూశాను. ఊఁహు, ఎన్ని చేసినా ఆయన నోట్లో నుంచి మాట పెగల్లేదు!

సాధారణంగా నా కోసం వచ్చే వాళ్లు రెండు రకాలుగా ఉంటారు: "కథ ఏమైనా వ్రాసి మా పత్రికకు ఇవ్వండీ" అని అడిగే పత్రికాధిపతులు ఒక రకం. ఈయన వాలకం చూస్తే ఆ రకం మనిషి కాదని తెలుస్తూనే ఉంది. అది కాకపోతే "మా అబ్బాయికి నాలుగు మార్కులు వేసి ప్యాసు చేయించండీ" అంటూ వచ్చేది రెండో రకం.

ఈ పెద్ద మనిషి ఆ రెండో రకంవాడు అయి ఉంటాడని తోచింది. నిజంగా అంతే అయి ఉంటుంది. లేకపోతే అంతసేపు నీళ్ళు నమలటానికి అవసరం ఏముంటుందీ అనుకొని "అయితే తమకు పిల్లలెంతమంది బాబూ" అన్నాను. "అయిదుగురండీ" అన్నాడు ఆయన. "ఊఁహూ, అయితే తమ పెద్ద అబ్బాయి ఏక్లాసూ?" అన్నాను, సంగతేదో తెలుసుకొని చెప్పాలిసిన మామూలు మాటలు చెప్పి తొందరగా పంపిద్దామని. ఆయన కొంచెం విచారంగా అన్నాడు— "నాకు మొగపిల్లలు లేరండీ, అయిదుగురూ ఆడపిల్లలేనండీ" అని.

ఈ జవాబు విన్న తరువాత ఆయన ఎందుకొచ్చాడూ అన్న ప్రశ్న మరీ క్లిష్టమైపోయింది. నిర్మొగమాటంగా "అయితే మరి

సెలవ —'' అని చెప్పి పంపివేయటానికి మనస్సు ఒప్పలేదు. పిల్లల పెండ్లిళ్ళ విషయంలో కూడా మాస్టర్ల సహాయాన్ని ఇట్లాంటి పెద్ద మనుష్యులు అపేక్షిస్తూ ఉండటంకద్దు. ఒకవేళ అల్లాంటి పనిమీద ఏమైనా వచ్చాడేమోనని "పిల్లల పెండ్లిళ్ళు అయినాయా అండీ'' అని కుశల ప్రశ్న వేశాను.

''ఆ, పెద్ద పిల్లలు ముగ్గురి పెండ్లి అయింది. వాళ్ళు కాపరానికి కూడా వెళ్ళారు. మిగిలిన ఇద్దరికీ సంబంధాలు సిద్ధంగానే ఉన్నాయండీ, మీదయవల్లా'' అన్నాడు. ఇక ఇల్లాంటి పిచ్చి ప్రశ్నలతో కాలం గడపటానికి ఇష్టంలేక, కుర్చీలోనుంచీ పైకి లేస్తూ ''చిత్తం, అల్లాగ వెళ్ళాలిసిన పనుందండి. మళ్ళీ ఎప్పుడైనా తమ దర్శనం చేస్తాను'' అన్నాను.

ఆయన తెల్లపోయి ''చిత్తం, చిత్తం, అల్లాగేనండి. కాని, ఒక్క చిన్న విషయంలో తమ సలహా కావాలని వచ్చాను'' అన్నాడు.

''అల్లాంటి దేమైనా ఉంటే చెప్పండి మరి" అని నిలబడి పోయినాను.

''మరేం లేదండీ. చూశారూ, తమరు కథల్లో సంసారాన్ని స్వర్గధామంగా వర్ణించారు'' అంటూ మొదలుపెట్టాడు. నాకథలు మెచ్చుకుంటున్నాడు కాబట్టి నేను కూర్చోక తప్పిందికాదు.

మళ్ళీ అన్నాడు ఆయన— "ఘోటక బ్రహ్మచారులకైనా కాంతం కథలు చదివిన మీదట పెండ్లాడాలని బుద్ధి పుడుతుంది" అని.

"మీకు పూర్తిగా నాయందు అభిమానం'' అన్నాను నేను.

''అల్లాకాక్కాదండోయ్. ముఖప్రీతికోసం అంటూన్న మాటలు కావండయ్యా... 'సంసారం సాగరం దుఃఖం' అన్న మాటలు వ్యర్థ

పదాలని అనిపించారు తమరు'' అంటూ ఆయన నన్ను మెచ్చుకొన్నాడు.

నేనూ సంతోషించి ''అయితే తమరేదో చిన్న పనిమీద వచ్చారన్నారూ?'' అన్నాను ఆతురతతో.

''చిత్తం చిత్తం, మనవి చేస్తా. మరి, నాకూ పెండ్లాం బిడ్డలూ ఉన్నారండి. నాకు ఇల్లు జూస్తే నరకకూపంలా ఉందండి!! పిల్లలు చూద్దామా, అల్లరి! పెళ్ళాం చూద్దామా, గయ్యాళి! నేనూ ఆమే కజ్జా ఆడని రోజు లేదండి ప్రతిరోజూనూ ఏదో ఒక విషయమై తగాయిదా వస్తూనే ఉంటుందండి'' అంటూ ఆయన కళ్ళు తేలేసి చూడటం మొదలు పెట్టాడు.

''అయితే... నన్నేమి చేయమంటారూ?'' అన్నా నేను నవ్వుతూ.

''తమరు మాకు ఏదైనా ఓ తరణోపాయం చూపెట్టాలె. ఎల్లాగ ప్రవర్తించాలో, సాంసారిక జీవనం సుఖప్రదం కావటానికి రహస్యం ఏమిటో తమరు సెలవిస్తే తెలుసుకొందామని కొండంత ఆశతో తమ దగ్గరికి వెళ్ళిపోవచ్చానండి. ఈ విషయంలో... కొద్దిగా,.... నాకు మీరు ఉపదేశం చెయ్యాలె'' అంటూ ఆ పెద్ద మనిషి ప్రాధేయపడ్డాడు.

''ఉపదేశం చెయ్యటానికి ఇదేమన్నా వేదాంతమా మంత్రశాస్త్రమా అండీ?'' అన్నాను, నేను నవ్వుతూ. ''మీరు అల్లాగ అంటే కాదు బాబూ, ఏదో మార్గం చూపా'' అంటూ ఆయన ఒక్క తీరున బలవంత పెట్టాడు.

ఆయన మాట తోసేయటానికి వీల్లేకపోయింది. సరే, నాకు తోచిన ముక్కలు చెబుదాం, ఇందులో తప్పేముందీ అనుకోని ''సరే,

అసలు సంగతి... మీ భార్యను మీరు ప్రేమిస్తున్నారా" అన్నాను. "అయ్యో, ప్రేమించ కేమండీ, అయిదుగురు పిల్లల తండ్రినీ" అన్నాడు ఆయన. "అయితే పోట్లాటలు ఎందుకొస్తయ్యో" అన్నా.

ఆ పెద్దమనిషి నావంక తెల్లపోయి చూచి, ఒక్క క్షణం ఆలోచించి "బాబూ, చూశారూ, ఇదీ కారణం అంటూ చెప్పలేనండీ, అసలు ఒక కారణం అంటూ ఉండదండీ! ఉత్తినే, జైమంటూ లేస్తుందండీ. నేను అవును అన్నదానికల్లా ఆమెగారు కాదు అంటుంది. ఎల్లాగండీ!" అంటూ ఆయన ముఖం చిట్లించుకొన్నాడు.

"అల్లా అయినట్లయితే మీరే ముందుగా కాదూ అనండీ" అని అన్నాను నేను వేళాకోళంగా.

ఈమాట, పాపం, ఆయనను కష్టపెట్టింది. దీనంగా చూస్తూ అన్నాడు ఆయనా— "తమరు అల్లాగ సెలవిస్తేగాదు. సిన్‌సియర్‌గా చెపుతున్నాను. ఈ దిక్కుమాలిన పోట్లాటకు అంతు లేకుండా ఉంది. తమరు... ఏదో... తరణోపాయం చెప్పాలె" అని.

ఆయన్ను చూస్తే నాకు జాలేసింది. కాసేపు ఆలోచించి, చివరకు అన్నానూ— "అయితే సరే, ఒక చిన్న రహస్యం చెబుతాను వినండి. దాంతో మీకూ... మీకూ... పోట్లాటలు లేకుండా పోతవి" అని.

ఆయన పాపం, ముఖం చేటంత చేసుకొని, "అదేనండీ అల్లాంటి చిట్కా రహస్యాలు చెబుతారనే... తమ దర్శనానికి వెళ్ళి పోవచ్చానండీ" అన్నాడు. "నేను చెప్పేదయినా అంత గొప్ప విషయం కాదు, స్వల్ప విషయమే అనుకోండి" అంటూ నేను ప్రారంభించాను. "తమరు చెప్పే విషయమున్నది చూశారూ, అది ఎప్పటికీ స్వల్ప విషయం కాదనుకోండీ! సెలవియ్యండి" అంటూ ఆయన

కుర్చీని నాకు దగ్గరగాలాక్కొని అత్యంత శ్రద్ధతో వింటానికి తయారైనాడు.

నన్ను ఆరాధించే భక్తుడు ఇన్నాళ్ళకు దొరికినందుకు నేనూ సంతోషిస్తూ, గొప్ప స్త్రీ వశీకరణమంత్రాన్ని ఉపదేశిస్తున్నవాడి లాగా "చూడండీ, మీ విషయంలో చెప్పదగిన రహస్యం ఏమిటీ అంటే... ఆవిడగారు అవును అన్నదానికి మీరెప్పుడూ కాదనబోకండి. మీ భార్యగారు ఇది బాగుందీ అంటే మీరు బాగుంది, బాగుంది అని తాళం వెయ్యండి. ఆమెగారు దేన్ని చూచి అయినా బాగుండలేదూ అన్నదా, మీరూ ఛీ, ఛీ, ఏమీ బాగుండ లేదు అనండి. సంసార స్వర్గ ధామానికి ఇది ప్రథమ సోపానం. తెలిసిందా అండీ ?" అన్నాను.

పాపం, ఆయన తలఊపి, "చిత్తం, చిత్తం. అయితే బాబూ, కొన్ని విషయాల్లో చూడండీ. డబ్బా గట్రావాడే విషయాల్లో ఆమెగారు చెప్పిందానికల్లా తల ఊపితే సంసారం గడవదు, ఏమంటారు ?" అన్నాడు.

"అవునండీ, ఆ సంగతి నాకు తెలుసు. మరీ..."

"అహహహహా. తమకు తెలియదనికాదు. ఉట్టినే మనవి చేశాను" అన్నాడు ఆయన ఎంతో నొచ్చుకుంటూ.

"ఇప్పుడు పండగా పబ్బం వచ్చిందా అంటే, మన తాహతు తెలుసుకోకుండానే అవికావాలె, ఇవికావాలె అంటారు ఆడవాళ్లు. వాళ్లు చెప్పినదానికల్లా మనం సరే అన్నామూ అంటే అప్పుల పాలుకావలిసిందే. అదేకదూ మీరనటం ?" అన్నాను నేను.

ఆ బ్రాహ్మడు కుర్చీ మరింత దగ్గరసా లాక్కుంటూ "అద్గది బాబూ. అదీ అసలు సంగతి. వేధించుకు తింటూన్నదంటే నమ్మండీ ! ఏం జేయమని సెలవు ?" అన్నాడు.

"ఇప్పుడేం జేస్తున్నారూ ?" అన్నా నేను.

"ఏం జేస్తున్నానూ, నా దగ్గర మదుపులేదూ, నేను తీసుకురాలేనూ అని బుర్ర నొక్కుంటాను బాబూ. మరేటి చేసేది" అని జవాబిచ్చాడు.

"అదే తప్పుపని" అన్నానేను, ఠీవిగా, అధికారిలాగా. "మరేం జేయమని సెలవు" అంటూ ఆయన నమస్కరించాడు. ఆయన అల్లాంటి భక్తివిశ్వాసాలు చూపటం మూలాన, నాకు తెలియకుండానే నాలో ఒక గర్వంతో కూడిన భావం పరుగెత్తింది.

ఇహ నేను మొదలుపెట్టాను భార్యా వశీకరణ సూత్రాన్ని : "చూశారూ, అల్లాంటి సమయాల్లో, భార్య కావాలన్న వస్తువును తీసుకరానూ అని మీరెప్పుడూ అనకండి. విషయాన్ని మీకు ఇప్పుడు సూత్రప్రాయంగా చెప్పానన్నమాట. అంటే తెస్తానూ అంటూనే మనం ఆడవాళ్ళను బురిడీ కొట్టించాలె. ఈ వ్యాఖ్యానంతో తమకు బోధ పడిందను కొంటా, ఏమంటారు ?"

ఈ మాటలు ఆయన శ్రద్ధగా విని తన జన్మ తరించిందన్నంత సంతోషాన్ని పొందినట్లు చూశాడు. "అదీగాక... ఆమెను లోంగ తీసుకొంటే ఆమె ఎప్పుడూ మీ ఇష్టానికి వ్యతిరేకమైన కోరికలు కోరనే కోరదూ !" అని మరొక మహత్తరమైన గుప్తరహస్యాన్ని గూడా బయలు పెట్టేశాను.

"అదే ! అదేనండి ! ఆ లోంగ తీసుకొనేది ఎల్లాగో తెలియకే ; దాని కేద్దైనా మార్గం సెలవియ్యాలె" అని మళ్ళీ ఆయన ప్రాధేయ పడ్డాడు.

రెండు కళ్ళనూ వేళ్ళతో నొక్కుకొన్నాను, ఒకక్షణం. తళుక్కున నా కళ్ళముందేదో మెరిసినట్లు తోచింది. దీర్ఘ తపోదీక్షానంతరం

జ్ఞాన సంపన్నుడైన తథాగతునిలాగ చూస్తూ అన్నాను ; "అల్లా అయితే నే చెప్పినట్లు చేయండి; రోజుకు మూడు సార్లు..."

''ఏదయినా క్రియా అండీ ?" అన్నాడాయన గుడ్లు పత్తికాయ లంత చేసి ఆశ్చర్యంగా చూస్తూ.

"చెపుతా... రోజుకు మూడుసార్లు... అంటే అధమపక్షం మూడు సార్లుఅయినా ముద్దు పెట్టుకోవాలె'' అన్నాను నిమీలిత నేత్రాలతో.

ఈ మాటలువిని ఆయన, అరజౌన్సు ఆముదం గుటుక్కున మింగిన వాడిలాగా వికారంగాచూస్తూ "నాకు నలభై ఎనిమిదో ఏడండీ! మా ఆవిడకు నలభైదాటి ఉంటై ! చికిత్సకు ఇల్లాంటిది కాక మరోరకం అనుపానం చెప్పటానికి..."అని ఏమో అనబోతుంటే ఆయనను పూర్తిగా మాట్లాడ నీయకుండానే నేనన్నానూ— ''ఇటువంటివిషయాల్లో, చూశారూ, వయస్సుతో నిమిత్తంలేదు'' అని.

"చిత్తం, సరే, అల్లాగే అనుకోండి. అయితే.... మా ముసలి దాన్ని రోజుకు మూడుసార్లు— అంటే... త్రికాలములయందూ ముద్దు పెట్టుకోమని సెలవాండీ ?'' అన్నాడు. నేను తప్పదన్నట్లుగా తల ఊపాను.

కొంచెంసేపు తలవంచుకొని ఊరుకొని తరువాత మళ్ళీఅన్నాడూ —''చిత్తం, ఇంకా, ఎల్లాంటి ఎల్లాంటి పనులు చెయ్యాలో సెలవిచ్చే సెయ్యండి'' అని నిస్పృహతో.

''ముద్దు పెట్టకోటం మొదటి విషయం. అది చెప్పానాండీ ! ఇకరెండోది ; అధమ పక్షం రోజుకు నాలుగైదు సార్లయినా, నిన్ను ప్రేమిస్తున్నాను. నిన్ను ప్రేమిస్తున్నాను అంటూభర్త భార్యకు తెలియ జెప్పాలె." అన్నాను.

"నే నెప్పుడూ, నాజన్మలో అల్లాంటి మాటలు ఎరగనండీ" అని దీనంగా అంటూ ఆయన నావంక చూశాడు. జాలిలేకుండా కఠిన పథ్యం చెప్పేవైద్యుడి ధోరణిలో "తప్పదండీ, నిష్కామ కర్మ చెయ్యాలె. పోనీ, పాఠంలాగ ఒప్ప జెప్పేసెయ్యండి" అంటూ పెదవి విరిచాను.

ఆయన కళ్ళు మూసుకొని, ధ్యానంచేసుకొని "అల్లాగే ఇంకా" అన్నాడు.

అంతవరకూ తలొంచుకొని ఆలోచిస్తున్న నేను తలెత్తి "ఇంకా ఏమిటీ అంటే, ఆమె సుగుణాలను ఎక్కువగా పొగడండి, ఇల్లాంటిదీ అల్లాంటిదీ అంటూ" అన్నాను.

మెదలకుండా వింటూ కూర్చున్నాడాయన. మరో నిమిషం అయింది. "ఇంకా దేముడు మేలుచేస్తే ఆమె సౌందర్యాన్ని గురించికూడా ఎక్కువగా మెచ్చుకోండి... ఉఁ... అంతే... మరేంలేదు." అని చెప్పాల్సిన విషయాన్ని పూర్తిచేసినట్లుగా తలఊపాను.

ఆయనకు నాయందు విశ్వాసము పూర్తిగాఉంది. నేను చెప్పినట్లు ప్రవర్తించటానికి ఆయన నిశ్చయించుకోనూ నిశ్చయించుకొన్నాడు. కాని "పొగడటం నాకు అలవాటు లేదు, తెలియదు. మరి ఏమిటండీ కీలకం ?" అని ఆయన నిట్టూర్పు విడిచాడు.

"తెలియటానికే ముందఁడీ ? చూశారూ, అవిడ పేరేమన్నారూ" అన్నాను.

"చంద్రమ్మగారు" అన్నాడు.

"అయితే... మీరు ఆమెను చంద్రా అని... పిలుస్తారా ?"

"ఎబ్బే, అసలు పేరుపెట్టి పిలవనండి"

"అవునులెండి. పేరుతో పిలవకూడదు కాబట్టి, జటాజూట శిరోమణి అనిపిలవండి."

"చిత్రం''

''పిల్చీ, ఆ పళంగా పొగిడేసెయ్యండి. ముందు ముఖం తీసు కోండి. నీ ముఖారవింద అవలోకితాపేక్ష ...''

''ఉండండి, ఉండండి, లాభంలేదు. కాస్తతగ్గు సాయిలో ఉండాలె. రాసుకోమని సెలవా ?''

''అఁహ. పోనీ, ఇల్లాగ అనండి. 'నీ శరీరం పదారు వన్నె పసిమితో మిసమిస లాడుతూఉంది. నీ మధురాధరం బింబ ఫలారుణి మను సేకరించు కొన్నది. నీ నాసికాపుటాలు నువ్వుపువ్వులను పోలి యున్నవి' తెలిసిందా ? ఏమంటారు ? ఈ ధోరణిలో వెళ్లిపోండి. ఆమె సౌందర్యాన్ని వర్ణించటానికి మీకు మాటలు దొరక్కపోతే ఏమను చరిత్రో, పారిజాతాపహరణమో తిరగెయ్యండి'' అని సలహా చెప్పాను.

నా మాటలన్నీవిని బిక్కముఖంతో ఆయన సెలవ అని వెళ్ళి పోయినాడు.

౨

ఆయన మేడమెట్లు దిగివెళ్ళి పోవటంతోనే మా కాంతం వచ్చి నా ఎదట నిలబడి చురచురా చూస్తూ'' పాపం, పెద్దవాణ్ని పట్టుకొని ఏమిటా వేళాకోళం ?'' అన్నది. నిజానికి ఆయనను వేళాకోళం చేయా లని నాకు ఏ కోశానాలేదు. నేను సిన్సియర్‌గానే చెప్పాను.

''లేదు కాంతం ! నేను వెక్కిరింతకూ, వేళాకోళానికీ అన్న మాటలు కావుఅవి. అట్లా ప్రవర్తిస్తే గృహకలహాలు ఎప్పుడూ ఉండవని నా నమ్మకం. నేను అల్లాగ ప్రవర్తిస్తున్నానా... నే జేస్తున్న పనినే ఇంకొకర్ని చేయమన్నాను. ఇందులో నేను ఒకరిని ఫూల్‌చేసిం దెక్కడా!'' అన్నాను.

''అయితే, మీరుచేసే పిచ్చి చేష్టలన్నింటినీ అందరినీ చేయమంటారేం ఖర్మం! నేకాంగా భరించి ఊరుకొంటున్నాగాని ఏ ఇల్లాలు ఊరుకొంటుందండీ'' అంటూ ఆమె నవ్వసాగింది.

''నీవు పొరబడుతున్నావు. భర్త అల్లాగ ప్రవర్తించటం భార్య అయిన ప్రతిస్త్రీకి ఇష్టమే. ఇప్పుడు నే జెప్పిందంతా కూడా అనుభవం మీద ఆధారపడిఉంది. అంతేకాకుండా ఆడదాని మానసికతత్వం తెలిసిన పండితులు కూడా ఒప్పుకొన్నదే. పొగిడితే ఎంతవాడైనా మెత్తపడతాడు. ఆడదానిమాట చెప్పక్కర్లేదు. ఏమంటావు?''

కాంతం ఏమీ మాట్లాడలేదు. ఆమెగారికి నామాటలయందు ఏమీ విశ్వాసమున్నట్లు కనబడలేదు. అందుకని మళ్ళీ అన్నాను. ''నీకు తెలియదు. చాలా పరమ రహస్యాలను ఆయనకు బోధించాను. చూస్తావుగా, ఇంకోవారం రోజులకు ఆయన మళ్ళీ నా దగ్గరకువచ్చి 'బాబూ, మీదయవల్ల నా కష్టాలు గట్టెక్కినై. మా భార్యా భర్తలమధ్య పోట్లాటలు అంతరించినై. స్వర్గసౌఖ్యం అనుభవిస్తున్నాము' అంటూ చెప్పకపోతేనూ'' అన్నాను గర్వంగా.

''అయ్యో! అయ్యో!'' అంటూ మా ఆవిడ మూతీ ముక్కూ విరిచింది, పతాకహస్తాన్ని అధోముఖంగా పెట్టి అటూ ఇటూ ఆడిస్తూ.

ఆవిడ అల్లాగఅన్నా నాకుమటుకూ తృప్తిగానే ఉంది. నిజానికి నేనేం జేశానూ! భార్యను కొట్టమనలేదు. తిట్టమనలేదు; భార్యను ముద్దెట్టుకో మన్నాను. ఇందులో తప్పేమిటో నాకుతోచలేదు. అయినా ఆవిడ అల్లాగ విరుపుగా మాట్లాడటం నాకు కష్టమేసింది.

అందుకని కాంతాన్ని పిలిచి మళ్ళీ అన్నానూ ''చూడూ, నే చెప్పిందాట్లో తప్పు ఏమీలేదు. తప్పు అని ఎవరు అంటారో అనమను. నీవు ఒక్కదానివి బయలుదేరావు ఇవిపిచ్చి చేష్టలని చెప్పటానికి. అదీ

గాక ఇవి నీకు తెలియనివిషయాలు. వీటిని సైకలాజికల్ ఎక్స్పెరిమెంట్సు అంటారు. మనస్సులో అద్భుతమైన మార్పులు వస్తవి'' అని ఆవిడకు నామనఃస్థితిని విపులంగా చెప్పాను.

అప్పటికీ ఆవిడకే మాత్రం నమ్మకం కలుగలేదుగాని నేను మాత్రము ఒక్క కుటుంబాన్ని గృహచ్ఛిద్ర పంకంలోనుంచి పైకెత్త గలిగాననీ, నరక సదృశమైన ఒక ప్రదేశాన్ని స్వర్గఖండంగా మార్చ గలిగాననీ, ఒక దంపతిపూజ చేయగలిగాననీ, ఒకజోడు ఆత్మలకు తృప్తినీ, ఆనందాన్నీ ఇయ్యగలిగాననీ నాలో నేను ఉప్పొంగి పోయినాను.

ఆయన మళ్ళీవచ్చి, తాను నేజెప్పినట్లు ప్రవర్తించిన మీదట తన భార్యలో కలిగిన అద్భుతమైన మార్పును గూర్చి నాకుచెప్పి కృతజ్ఞతతో నమస్కరిస్తాడని నాకుగట్టి నమ్మకం. కంటక పరివృతమైన తన జీవిత పథము ఎట్లా మృదుమనోహర కుసుమవిరాజితమైందో, ఇతఃపూర్వం అపశ్రుతి రాగకఠోరమైన వృద్ధ దంపతుల జీవితరాగం ఇప్పుడు ఎల్లాగ మనోహరైక శ్రుతిని మేళవించిందో, వికల శిలాశకల భయంకరమైన వారి కఠినజీవితశయ్య ఏరీతిని మృదుమనోహర సుమశయ్య అయిందో, కాక ఘూకారవ వ్యాకులమైన ఘోరజీవిత కాంతారము ఎంత చిత్రంగా శుకపిక కోకిలారవ నందనోద్యానంగా మారిందో, ఝంఝూ మారుతోద్ధూతోత్తుంగ తరంగములచే చీకాకు పడిన తన సంసార సాగరం ఎల్లాగ వైకుంఠవాసా వాసవటపత్రశయ్యా పయఃపయోధిగా మారిందో ఆయన నోటితో ఆయనే చెపుతూఉంటే వినాలని నేను కుతూహలపడ్డాను.

అందుకని రోజూ సాయంత్రం స్కూలునుంచి రావటంతోనే "ఏం, కాంతం, ఆయనే మన్నావచ్చాడా" అనేవాడ్ని. ఆమెగారు ముక్కు విరిచి "ఇంకా రావలసిందే'' అంటూ వెక్కిరించేది.

# 3

ఇల్లాగ నాలుగురోజులు గడిచినై. అయిదో రోజున ప్రొద్దున్నే కాంతం నా దగ్గరకొచ్చి "మీకోసం ఎవరో అవ్వగారు వచ్చా"రంటూ నన్ను నిద్రలేపింది. నేను కళ్ళునలుపుకుంటూ లేచి క్రిందికెళ్ళాను. హాల్లోనుంచి వంటింటికి పోయే గుమ్మంలో నుంచునిఉంది ఒకావిడ.

యాభై ఏండ్ల వయస్సులోవున్న మనిషిలాగా కనిపించింది ఆవిడ. శరీరం దబ్బపండుఛాయ. ముఖాన కానీడబ్బంత కుంకపు బొట్టుంది. మామిడి చిగురు జరీచీర కట్టుకొంది. కొప్పులో మందార పువ్వుఉంది. కొద్దిగా, ముఖ్యంగా ముఖంపైన నెరిసింది. నలభై ఏండ్ల క్రింద నన్ను భూమిమీద పడేసి వెళ్లిపోయిన మాఅమ్మే మళ్ళీ మాఇంటి కొచ్చినట్లుంది. లోపల ఈ మాతృమూర్తిని నమస్కరిస్తూ నిలుచున్నాను.

"ఈ ముసలమ్మగారే మీకోసం వచ్చారండీ" అన్నది కాంతం. "ఏమిటండీ పిన్నిగారూ" అన్నానేను. ఆమె నన్నుజూచి "ఏంనాయనా, నువ్వేనా మా కాంతం మొగుడివి" అంది,

"నేనేనండీ" అన్నాను నవ్వుతూ.

"ఏం నాయనా, నీవు... మా ఆయనకేదో ఉపదేశం చేశావుట కాదూ" అన్నది ఆవిడ. "నేనేమిటి! ఉపదేశం చేయటమేమిటి? మీరు ...నేను ఎవరని భ్రమపడు తున్నారోనూ" అన్నాను. "కాదు నాయనా, నువ్వేచేశావుట" అన్నది ఆవిడ మళ్ళీనూ.

"నేకాందడీ పిన్నిగారూ, నేను ఇంగ్లీషు చదువు కొన్నాను. నాకు మంత్రాలు గింత్రాలు రావండీ పిన్నిగారూ" అన్నాను.

"ఆ ఇంగిలీషు మంత్రాలే ఉపదేశించావుట లేదంటావేమిటి. నువ్వే: కాంతమ్మ మొగుడని ఆయన చెప్పారుకారూ?" అన్నది.

''మొన్న మీదగ్గరకు రాలేదూ, ఆయనండీ'' అని కాంతం ఎక్సు ప్లెయిన్ చేసింది.

అప్పుడు నేనన్నానూ. ''ఓహో, అదాసంగతి? పెద్ద ఉపదేశం ఏమిటిలెండి. ఇంట్లో పోట్లాటలు లేకుండా ఉండడానికి కొన్ని మంచి సంగతులు చెప్పాను. మరేంలేదండీ అన్నాను సంతోషంగా. పూర్వము మోస్తరుగా వాళ్లుపోట్లాడు కోకుండా హాయిగా శాంతంగా జీవిస్తూ ఉంటారు. ఆ విషయమై చెప్పడానికే ఆవిడవచ్చి ఉంటుంది.

ఇల్లా అనుకొంటూ నుంచున్నాను నేను. ఆవిడ నా దగ్గరరావటం నేను చూడనేలేదు, వచ్చి ఆమెగారు "నీవు ఉపదేశించిన మంత్రమే బెడిసి కొట్టిందినాయినా'' అని రహస్యంగా చెప్పేదానిలాగ చెప్పింది.

"బెడిసి కొట్టటానికి నేనేమీ మంత్రం ఉపదేశించ లేదండీ'' అని ఆశ్చర్యపోయినాను.

''రాకేం నాయినా, నీకొచ్చిన మంత్రాలు నీ కొచ్చు. ఇంగిలీషులో మటుకు మంత్రాలు లేవంటావా?". కాంతంవేపు తిరిగి ''మంత్రాలురావూ అంటారేమిటి నీ మొగుడు... నేను ఇల్లాగఉంటే పిచ్చిది అనుకుంటు న్నారు కామోసు. నాకు అన్నీ... తెలుసునాయనా. కోయమంత్రాలు లేవమ్మా. అల్లాగే ఇంగిలీషు మంత్రాలు ఎందుకు ఉండవూ? ఏవమ్మా'' అంది.

మా కాంతంచూడండి, ఆవిడ పక్షంచేరి "ఎందుకు ఉండవండీ పిన్నిగారూ ఉంటాయి" అని ఆమెగారి వైపుచూస్తూ ''వచ్చునండీ. అబ్బో, ఈయనకు ఇంగ్లీషులో ఎన్నో మంత్రాలు వచ్చు'' అని కళ్ళు ఎగరేసింది.

''అయ్యో ఖర్మమా, ఇదేమిటండీ, నాకేం మంత్రాలూరావు! నేనుఏమీ ఉపదేశమూ చెయ్యనూలేదు.'' అన్నాను నేను విచారంగా.

''అల్లా అంటాడేమిటమ్మా నీ మొగుడు ?'' అన్నది ఆవిడ.
''ఆయనంతే" అన్నది మా ఆవిడ.

ఈ ఇద్దరూ ఇల్లాగ అంటూంటే నేనేమీ అనలేకపోయినాను. నన్ను తగలెయ్య, నా కిన్నిమంత్రాలు ఎల్లాగు వచ్చినయ్యా అని నాలో నాకే ఆశ్చర్యం కలిగింది.

మళ్ళీ ఆ ముసలమ్మగారు ఇల్లాగ అన్నది : ''లేదంటా వేమిటి నాయినా. మొన్న ఆయన ఇంటికి రావటంతోనే కాంతం మొగుడుగారి వల్ల నేను ఉపదేశం పొందానూ, ఇక నీకూనాకూ పోట్లాటలుండవు అమటా'' అన్నారు. ఏమిటో అను కొన్నాను. కృష్ణా రామా అను కుంటారు. కామాలునను కొన్నాను. అసలు ఆయన వట్టి పిచ్చిబ్రాహ్మడు! అమాయకుడు !''

''అయితే ఇప్పుడు ఏం జరిగిందేమిటండీ'' అన్నాను, నేను.

"ఆరాత్రి, అంటే శుక్రవారం రాత్రినుంచే మొదలు నాయినా, పిచ్చిచూపులూ, పిచ్చిమాటలూనూ" అన్నది విచారంగా.

"నేనేమి పాపం ఎరగనే, ఇదెక్కడి అవస్థరా బాబూ !'' అని నాకూ ఖంగారు పుట్టింది. ''అయితే పిన్నిగారూ, ఏమిటీ ఆ పిచ్చి మాటలూ'' అన్నాను.

ఆ భాగ్యశాలి నా మాటలు వినిపించుకోకుండానే మా ఆడవితో ఇల్లాగ అంటున్నది. "పిచ్చి మాటలు ఏమిషి కాంతమ్మ తల్లీ. చెప్ప టానికి వీల్లేదు. అల్లాంటి మాటలు మనం ఎప్పుడూ వినము. నీవైనా చెప్పు తల్లీ నీ మొగుడితో ఆ మంత్రానికి విరుగుడు ఏమైనా చేయమని'' అని కాంతాన్ని కాళ్ళూ వేళ్ళూ పట్టుకొని బ్రతిమిలాడటం సాగించింది.

''ఊరుకోండి పిన్నిగారూ. ఉన్నవారు ఊరుకోక ఉపదేశం చేయటం ఎందుకు చెప్పండీ ఈయన ?'' అంటూ మా ఆవిడ,

ముసలమ్మగారి యందు సానుభూతి చూపటం మొదలెట్టింది, అక్కడికి నేను నిజంగా ఏదో మంత్రం ఉపదేశం చేసినట్టు !

"మా ఆవిడ కొంటెతనం చూస్తే నాకు కోపం వస్తున్నది. ఆ ముసలమ్మగారిని చూస్తే జాలి కలుగుతున్నది. ఇంతకూ నాకు అసలు సంగతి ఏమిటో తెలియక "అయితే పిన్నిగారూ, ఏమిటా పిచ్చి మాటలు, ఎల్లాంటివి?" అన్నాను.

"ఒకలాంటి వేమిషి నాయినా, చిత్రచిత్రాలుగా మాట్లాడు తున్నారు" అన్నది ఆవిడ.

"ఎవరినైనా తిడతారా, ఏమిటీ సంగతి?" అని మళ్ళీ అడిగా నేను.

"తిట్టటమేకానీ, దీవించటమే కానీ, ఎల్లాగయినా అవి పిచ్చి మాటలు మటుకు అవును. మనబోటి సంసారుల కొంపల్లో అనుకునే మాటలు కావు" అంటూ ఆ ముసలమ్మగారు కళ్ళను పమిట చెంగుతో అద్దుకొంది.

"అదిగాదండీ పిన్నిగారూ, ఆయన అన్న మాటలు ఒకటి ండు చెప్పండి. సంగతేమిటో తెలుస్తుంది" అన్నాను నేను.

"చెప్పండి బామ్మగారూ. చెప్పండి. సంగతేదో తెలియొద్దూ యనకు, విరుగుడు మంత్రం వేయటానికైనా" అన్నది.

"చెప్పాలిసిందే నా కాంతమ్మ తల్లీ! ఇంత బతుకూబతికి ఇంటి వెనకాల చచ్చినట్టైంది. నా కర్మం కాలితే నానోటితోనే అనాలి సొచ్చింది ఆ మాటలు!" అంది ఆవిడ మా ఆవిడతో. ఆ ముసలి కళ్ళలోనుంచి రెండు కన్నీటి చుక్కలు రాలినై.

మా తల్లిలాంటి మనిషి అల్లాగ విచారపడటం చూచి నేనూ ఎంతో కష్టపడ్డాను. అసలు ఆమె కొచ్చిన కష్టం ఏమిటో నాకు బోధ

పడలేదు. ఏం జెపుతుందో అని ఆ వృద్ధురాలి వంక చూస్తూ నిలు చున్నాను.

ఆవిడా కళ్ళ నీళ్ళు తుడుచుకొని రుద్ధ కంఠంతో ఇల్లా అన్నది: "నాబతుకంతా కడిగి పోస్తున్నారు నాయినా. నా ముఖంష... చంద్రుడిలాగ ఉంఛూన్న దష—" అని ఆవిడ దుఃఖం ఆపుకోలేక భొళ్లున ఏడ్చింది.

దుఃఖం కొంచెం ఆపుకొని ఇల్లాగ అన్నది మళ్ళీ, జాలిగా చూస్తూ : "నా గొంతు పట్టుకుంఛారు నాయినా.... పట్టుకునీ, నీగళం శంఖం లాగ ఉన్నదీ అంఛారు, నా గొంతుకొయ్య ! ఇదీ వరస, ఇల్లా అయింది నా బతుకు" అంటూ ఆ అవ్వగారు మళ్ళీ దుఃఖ పడ్డది.

నేను చెప్పిన నసీహత్‌కు ఇది ఫలితం కదా అని అప్పటికి తెలి సొచ్చింది. నిజానికి నవ్వవలసిన విషయమే. కాని ఆమె స్థితిని జూచి మేమిద్దరం కూడా నవ్వలేకపోయినాము. మా ఉభయులకూ ఆవిడ యందు జాలికలిగింది. బిక్క ముఖాలతో నుంచున్నాం.

పిన్నిగారు తలుపు దగ్గరే ఒక మూలకు ఒత్తిగిలి "తెలిసిందా నాయినా, ఇదీ వరస. ఇంకా, ఇంకా ఛండాలపు మాటలు అంటారు బాబూ ! కొడుకులాంటి వాడవు కాబట్టి చెపుతున్నాను. నా జుత్తుషా చమరీ వాలాల్లాగో, ఏదో నా పిండం, అల్లా ఉన్నదష !" అన్నది. ఆ తరువాత ఒక క్షణం ఆమె మాట్లాడ లేకపోయింది, నేను ఆవిడ దుఃఖం చూడలేక అన్నానూ "సరేలెండి. ఎందుకూ ఇహ తెలిసింది."

నా మాటకు అడ్డొచ్చి ఆవిడ మళ్ళీ అన్నదీ— "చెపుతా, చెపుతా నాయినా. అంతా విను మరీ. నన్ను ఎగాదిగా చూస్తారు. పోనీ అని ఊరుకుంఛాం. అయిందా, మడి కట్టుకున్నాసరే వచ్చి ముట్టు

కుంటారు. ముట్టుకొని నీ శరీరం శిరీష కోమలమే అంటారు, నన్ను తగలెయ్య!''

ఆ తరువాత రెండు నిముషాలదాకా ఆవిడ కంఠం పెగలలేదు. మేము ముగ్గురం కూడా నిశ్శబ్దంగా నుంచున్నాము. కాసేపటికి ఆవిడ మా ఆవిడ బుజం మీద చెయ్యివేసి ''కాంతమ్మ తల్లీ, నేను చెప్పలేను ఆ మాటలన్నీ. నన్ను బట్టుకు ఇల్లాంటి మాటలు అంటూ ఉంటే నిలువునా నీరైపోతున్నాను. కాంతమ్మ తల్లీ, ముప్ఫై ఏళ్లు సుఖంగా కాపరం చేశాను. ఎప్పుడూ ఇల్లాంటి పిచ్చి మాటలు ఆయన అనగా నే వినలేదు!'' అని చెప్పుకొన్నది. చివరకు మళ్ళీ అన్నది— ''ఏం తల్లీ, ఎవరో కిరస్తానీలూ అప్రాచ్యులూ అనుకుంటారషగా అల్లాగ! ఏమోళే ఎల్లా ఏడిస్తే మన కెందుకు? మాగతి ఇల్లా ఐంది గదా'' అని దుఃఖపడ్డది.

ఈ సంగతులన్నీ విని నేను నాలిక కొరుక్కున్నాను. మా ఆవిడ ముక్కుమీద వేలేసుకొంది. ఆవిడా కాసేపు ఊరుకొని ఏదో జ్ఞాపకం వచ్చినట్లు తెప్పరిల్లి అన్నది— ''అయితే, ఇంకోటి నాయినా! ఇల్లాగ పిచ్చిగా నానా మాటలు అంటున్నా, రోజల్లా ఇల్లాగా మాట్లాడరు. మధ్య మధ్య బాగానే ఉంటారు. గుబులు కింద వస్తూందో ఏమో, రోజుకు నాలుగైదు సార్లు ఇల్లా అంటూ ఉంటారు. ఈ తిక్క లేనపుడు మళ్ళీ బాగానే ఉంటారు''

ఆ ముసలమ్మ ఇల్లాగ విచారపడి ఆఖరుకు కాంతం చెవిలో అన్నది: ''ముసలిదాన్ని పట్టుకొని, పైగా, ముద్దు ముద్దు అంటారమ్మా, ఎక్కడ చచ్చేదే—''

ఈ మాటలన్నీ విని నేనేమీ అనలేకపోయినాను. కాంతం మటుకు నవ్వు ఆపుకోలేక పోతున్నది. ''నేనేమీ ఎరగనండీ పిన్ని

గారూ'' అన్నాను నేను చివరకు. "నువ్వేమీ ఎరగక పోవటం ఏమిషి ? నువ్వే చేశావు ఇదంతానూ !! విరుగుడు మంత్రం ఏదైనా ఉచ్చాటన చెయ్యి బాబూ మా తండ్రివి కదూ'' అంటూ నా గడ్డాన్ని మునివ్రేళ్ళతో తాకి బ్రతిమి లాడటం మొదలుపెట్టింది.

ఆమె దుఃఖం కాస్త తగ్గటం చూచి కాంతం అన్నది: ''పిచ్చి గాదండీ, అవ్వగారూ, మీ ముసలాయనకు పిచ్చిగాదది ! మీయందు ప్రేమ కనపరుస్తున్నాడు.''

''పోనీ నీ మాటే నిజమనుకో. అల్లా అయితే మటుకు ముప్ఫై ఏళ్ళనుంచీలేనిదీ... ఇప్పుడు ఇల్లాగ వికారం కలగటం మంచే అంచావా ? అయినా పిచ్చి కాకపోవటం ఏమిషి ?'' అంటూ ఆవిడ మళ్ళీ విచారపడ్డది. నేనూ, మా ఆవిడా ఒక్కసారి నవ్వు కొన్నాము.

"మీరు ఇల్లాగ నవ్వితే నా బ్రతుకు ఏం కావాలి చెప్పు. తండ్రీ ! పోనీ, ఏ భూతవైద్యుడి దగ్గరకైనా పోయి ఇంత విభూతి పట్టు కొద్దామా అంటే, నీవు చెప్పిన ఇంగ్లీషు మంత్రానికి అది పని చేస్తుందో చేయదో !! నా బాబుకదూ. ఎట్లాగయినా నువ్వే దీనికి మళ్ళీ ఇంగ్లీషులోనే ఉచ్చాటన చేసి నన్ను బైట పడెయ్యాలె'' అంటూ ఆవిడ మళ్ళీ బ్రతిమిలాడింది.

ఆవిడను తృప్తి పరచటానికి ఒకటే మార్గం ఉందని తోచింది, అదేమిటీ అంటే సరేననటం. అందుకని నేనన్నానూ "పిన్నిగారూ, పొర బాటే జరిగింది. నేను మళ్ళీ ఇంగ్లీషులో ఉచ్చాటన చేసి, ఇదంతా పోగొడతాను. మీరేమీ భయపడకండి'' అని.

ఆమెగారు ఈ మాటలు విని అమితంగా సంతోషించింది. "మా నాయనే. నీకు ఆడపిల్ల పుడుతుంది నాయనా తప్పకుండా చెయ్యి'' అని నన్నూ, మా ఆవిడనూ దీవించి వెళ్ళిపోయింది.

ఆవిడ వెళ్ళిపోయిన తరువాత కాంతం నవ్వు ఆపుకుని నాతో అన్నది— "మీరు పొరబాటు చేశారు. ఈమెగారికి కూడా ఉపదేశం చెయ్యాలిసింది" అని.

"ఏమని'' అని అడిగాను నేను.

"ఏమనా? ఆయనకు చెప్పినట్లుగానే, మొగుడి గుణసంపదనూ, సౌందర్యాన్నీ మెచ్చుకోమని''

నేను మాట్లాడలేదు.

ఆవిడ మళ్ళీ ఎత్తుకొని ఇల్లాగ అన్నది. ''మొగుడితో ఆవిడ ఇల్లాగ అనాలె— ఓ ప్రాణనాథా, ఓనవ మన్మథా, మీ మోన మూర్తి సందర్శనమే నాకు తన్మయత్వం కలిగిస్తుంది. మీ ముఖ చంద్రబింబ సందర్శనమే నా హృదయ గభీర సాగరాన్ని పొంగు లెత్తిస్తుంది. మీ మధురమైన పలుకులే...''

''చాలించు'' అన్నాను విసుగ్గా.

''ఏం ?'' అన్నది నవ్వుతూ,

''వెక్కిరిస్తే సహించే స్థితిలోలేను నేను. ఇప్పటికే చాలా విచారపడుతున్నాను. అసలు ఇల్లాగ అవుతుందని అనుకోలేదు'' అంటూ మేడపైకి గబగబా వెళ్ళిపోయాను.

(1941)

# 13. ఆ వాడిన ఆకులు

—బుచ్చిబాబు

ఎందుకో ఆ గులాబి మొక్కని చూసినప్పుడల్లా హృదయంలో వేళ్ళు పాతుకున్నట్లు సూర్యకాంతమ్మ శరీరంలో నరాలు కదలిక మాను కుంటాయి. ఆ మొక్కని చాలారోజుల కిందట ఆమె చెల్లెలి మొగుడు చంద్రకాంతం పంపించాడు. మొక్కవేళ్ళెమో పాతుకుందికాని ఎదుగూ బొదుగూ లేదు. జాగ్రత్తగా పెంచినా లాభం లేకపోతోంది. ఆ మొక్క తాలూకు గులాబీని తల్లో పెట్టుకోడంకోసం చాలా రోజు ల్నుంచి పూలు కొనడంకూడా మానేసింది. రాత్రంతా దాన్నిగురించే ఆలోచనలు, కలలు. సూర్యోదయంకోసం ఎదురుచూస్తూ, ఆలోచిస్తూ, ఆవులిస్తూ, భర్త గుర్రుని పరీక్షిస్తూ, నిద్రలేక మొహం వాపుతో, కళ్ళ మత్తుతో దొడ్లోకొచ్చి, ఎంతెదిగిందో చూసేసరికి, అంతేవుంది - ఎదుగూలేదు, బొదుగూలేదు. రోజూ ఉదయం గంటసేపేనా దాని కోసం బాధపడడం ఆమెకి అలవాటై పోయింది. ఆ వాడిపోతూ, లేవ లేకపోతూన్న లేత ఆకులు అతని నిద్రతో బరువెక్కి, బద్ధకించి వాలి పోయిన కనురెప్పలలోని స్థిరత్వాన్ని స్ఫురింపచేస్తూ ఎంతకాలం ఆమెని కలవర పెట్టడం?

"ఆ మొక్క పీకెయ్యించు. దానికేదో జాడ్యం పట్టింది. అది పాకిందంటే మిగతా మొక్కలుకూడా చస్తాయి తెలిసిందా? పంపినవాడు మంచివాడైతే అది నిక్షేపంలా ఎదుగును. మిగతావన్నీ బతకలా? నీ చెల్లెలి మొగుడు తాలూకు విషం దానికీ పట్టింది" అని రెండుమూడు

సార్లన్నాడు ఆమె భర్త బసవయ్య. ఈ గుడ్డి నమ్మకాన్ని గెంటేసి శాస్త్రీయ సమ్మతమైన కారణం తెలుసుకోవాలని నవలలు చదవడం మాని, 'హార్టీ కల్చర్' గ్రంథాలు చదవడం మొదలెట్టింది. తోట్లోకి బసవయ్య చక్కా వొచ్చాడు. అతను బకాసురుడులాంటి పెద్ద విగ్రహం. శరీరం ఆకారంలేని మాంసం ముద్దలకి చర్మం తొడిగినట్లుగా వుంటుంది. జుట్టుకీ కనుబొమ్మలకీ మధ్య సరిహద్దులాగ కాస్తంత నుదురు. కనుబొమ్మలు పొదలా ఎదిగి చెవులదాకా పాకినట్లుంటాయి. కందిరీగ కుట్టినట్లుగా కుడికంటికింద వాపు. తేనెటీగల పట్టుమాదిరి అర్థంలేని వొంకరలు తిరిగి వృథాగా అల్లుకున్న క్రాపింగు. గాలికి వూగులాడే మునిలివృక్షం కొమ్మలలాంటి చేతులు నవ్వినప్పుడు నవ్వునే వెక్కిరించే వెడల్పు పెదవుల వెనక ఐక్యతలేని పళ్ళవరస. ఇంటర్ కాగానే, భార్యలాగే చదువు చాలించి 'ఇన్స్యూరెన్స్' ప్రపంచంలో కృషిచేసినందుకు అధికారులు మెచ్చుకుని, తుదకి మేనేజర్ పదవి - దాంతోపాటూ కారూ యిచ్చారు. ఆ కారుకి సరిపడ్డ నిండైన విగ్రహం.

"ఈ మొక్క యింకా పీకలా ? దీనికేదో పురుగట్టింది. మీ చెల్లెలి మొగుడిలో కుళ్లు దీనికి పట్టుకుంది.''

ఇట్లా చంద్రకాంతంపై భర్త ద్వేషం ప్రకటించటం ఆమెకి మొదటిమాటు కాదు. అతనితో ఎప్పుడో పెళ్ళిలోతప్ప, బసవయ్యకి పరిచయంకూడా లేదు. లేమివల్ల జనించిన అసూయ బురదలా ఎక్కడపడితే అక్కడే వుంటుంది. భర్తద్వేషానికి అసూయ కారణం అవడానికి అవకాశాలు లేవు. చంద్రకాంతం గొప్ప హోదాలో లేడు; అతని కసలు ఉద్యోగమేలేదు; అతనంత ఆస్తిపరుడూ కాడు; గొప్ప పండితుడూ కాడు - వొందలమందిమాదిరి అతనూ వోగ్రాడ్యుయేట్;

కాంగ్రెస్‌లో పావలా మెంబరుకూడా కాదు. మరెందుకు ద్వేషం? భర్త మనస్సు కాంతానికి అర్థం కాలేదు.

"ఎప్పుడూ చెల్లెలి మొగుడేనా? మీకు తోడల్లుడన్న విషయం మరచిపోకండి. పాపం, అతనేం చేశాడు? వాళ్ళ వూర్నుంచి ఎవరో వస్తే యీ పూలమొక్కని మా చెల్లెలితో చెప్పి పంపించాడు." అంది సమర్థిస్తూ. కాంతం బ్రహ్మచారి గుండెలో తుపాను లేవగొట్టేటంతటి చక్కంది కాదుగాని, మాట్లాడేటప్పుడు ఆకర్షణీయంగా వుంటుంది. చాయనలుపే - పూర్ణిమనాటి మెత్తటి, మెరిసిపొయ్యే నలుపు. మాటలతో ప్రకటించలేని భావాలని పెద్ద కళ్ళ కదలికలో చూపిస్తుంది. 'ప', 'వ', 'ఎం' మొదలైన గొంతుముందు భాగంలోంచి వొచ్చే అక్షరాలని వుచ్చరించినప్పుడు పెదవులు కొత్త పొందికను తెచ్చుకుంటాయి. మాట్లాడినప్పుడే ముక్కు పక్కని గీత బుగ్గని కెరటంలా లేవదీసి, తెరచాప చుక్కానీ లాగ పెదవులకీ, బుగ్గకీ లయ కల్పుతుంది! మొహంలోని అమాయకత్వానికి నాజూకైన బట్ట, వేషధారణ కొంత కుటిలత్వం కల్పిస్తాయి. 'ప్రీమియమ్‌లు', 'బోనస్సులు', 'డివిడెండ్లు'- యీ లోకంలోంచి భర్తని విముక్తి చేసే శక్తి గులాబీ మొక్కకి వుందని ఆమెకి తెలుసు అదీ కొంత మెరుగే.

"తోడల్లుడని చెప్పుకోడం నాకు సిగ్గుగావుంది. ఏదేనా ఉద్యోగంలో ప్రవేశించరాదూ?"

"లా, కెడతాడుట ఏదీ— మొన్ననేగా బి.ఏ. పూర్తి చేసింది? అందరికీ పుట్టగానే ఉద్యోగాలొస్తాయా?"

"లా కాదు, బల్ల. నా ఆఫీసులో గుమాస్తా పనికోసం లక్ష మంది గ్రాడ్యుయేట్లు సిద్ధంగా వున్నారు. వీళ్ళంతా దేశానికి బరువు చేటు."

"అతని ఉద్యోగం సంగతి మన కెందుకు లెద్దురూ? వాళ్ళ తంటాలు వాళ్ళు పడతారు" అంది కాంతం. చంద్రకాంతాన్ని గురించి భర్త మాట్లాడడం తనకి కొంత సంతోషం యివ్వకపోలేదు. ఇన్‌స్యూరెన్సు డబ్బామోతకంటె బోలెడునయం. ఉద్యోగంలో పడ్డ తర్వాత మొగాడికి ఆ ఉద్యోగం గొడవే. చంద్రకాంతం లాంటి నిరుద్యోగి ప్రపంచానికి అధికారి. వాళ్ళకి ప్రవర్తనా స్వేచ్ఛ, మానసిక వైశాల్యం వున్నాయి.

"మన కెందు కేమిటి?— మనకే. ఫలానా ఆయన తోడ ల్లుడు సందులమ్మట తిరుగుతున్నాడంటే, నాకే నామర్దా. ఊరికే పగలంతా ఊరమ్మటా, రాత్రంతా సినిమాల చుట్టూ తిరిగి, వున్న రెండెకరాలూ సిగరెట్ల ద్వారా ఊదెయ్యడం బదులు-నన్నడిగితే ఏదో తంటాలు పడి 'ఖాళీ' చెయ్యిస్తాను. నా ఆఫీసులో గుమాస్తాగా చేరడం మంచిదంటాను."

"ఇప్పుడు మిమ్మల్ని ఎవ్వరూ అడగలేదు. వెళ్ళండి, ఎవరో వొచ్చినట్లున్నారు"— అంతటి మనిషినీ తన గుప్పెట్లో వుంచుకుని, గాలిలో వూదెయ్య గలనని కాంతానికి తెలుసు. ఆ నమ్మకం ఆమెలోని ఆకస్మిక చైతన్యానికి, మార్పులకి కారణం.

భర్త బైటి కెళ్ళిన కారు చప్పుడైంది. కాంతమ్మ లోపలి కొచ్చి హార్టికల్చర్ పుస్తకం బీరువామీద గిరవాటేసి, చెల్లెలి పెళ్ళిఫోటో ముందు పెట్టుకుని కూచుంది. అందులో భర్తలేడు. ఆ కారణం చేతనే దాన్ని చూడడానికి యిష్టపడొచ్చు. అల్లా అనిపించినందుకు నీరసంగా నవ్వుకొంది. ఈ చంద్రకాంతంలో భర్త ద్వేషించేటంతటి విశేషం యేముందో తెలుసుకోవాలనుకుంది. పెళ్ళినాడే అతన్ని గురించి అంతా చిత్రంగా చెప్పుకున్నారు; తనూ ఎన్నోవింది; చెల్లెలికి ఏమీ తెలీదు, అమాయకురాలు. అడిగితే ఏమీ తెలీదంటుంది. ఈ గాథల పుట్టు పూర్వోత్తరాలు భావికాలంలో మరుగుపడ్డాయి. వాటిని తవ్వి చూపేం

దుకు ఎవ్వరూ— భర్త కూడా సాహసించలేదు. ఈ గాథల సారాంశం ఏమిటి? అతను తుంటరి; చెడ్డవాడు; స్త్రీలోలుడు; నైతిక నియమాలు లేవు; సంఘకట్టుబాట్లు, బాధ్యత మొదలేలేవు; రోగాల పుట్ట; మహాపాపి. వీటికి తార్కాణ అతను నిరుద్యోగి కావడమే. ఇవేవీ ఆమె అతనిలో చూడలేదు ఆరోగ్యమంతా అతని మొహంలోని వెలుగులోనేవుంది అతని ముందు నిలబడ్డ కాసేపూ వాతావరణం చీకటై మైమరుస్తారు. ఒక్కరపని చెయ్యడు. అతనితో చెప్పేటందుకు మాటలు కనిపించవు. కుట్ర, కల్మషం, నీతి, సంఘం, మతం— అన్నీ వాటి నిరంతర యుద్ధాలని ముగించి, శాంతి కోసం తడుము లాడి, అతని నేత్రాలలో ఐక్యం అవుతాయి. అతను మితభాషి. గుర్రం పిల్లలోని శక్తి చాంచల్యం, మూగబలం— అన్నీ అతనిలో చూడ గలిగింది. ఏవో పుస్తకాలు చదువుకునేవాడు; ఏవో బొమ్మలు గీసు కునేవాడు. సైకిలుమీద వెళ్ళి రాత్రి పదింటి కొచ్చేవాడు అత్తా రింట్లో దరఖాస్తు పెట్టమంటే. నవ్వి సరే అనేవాడు కాని పెట్టేవాడు కాడు. తనకి తెలియకుండా అతన్ని ఆదర్శ పురుషుడుగా ఎంచుకుంది కాంతం. వెనక, ఆమె చెల్లెలు ఏదో బొమ్మ తీసుకొచ్చి "బాగుందా, మా ఆయన వ్రాశాడు" అంది. ఆ బొమ్మ తనదేనని తెలుసుకుంది, నమ్మింది. "ఎవరే యీ బొమ్మ?" "నాదే" అంది చెల్లెలు. పిచ్చిది. వెర్రిబాగుల్ది ఎప్పుడో, ఎక్కడో తనకీ, అతనికీ మూగ బాంధవ్యం కుదిరివుంటుంది. అతన్ని అర్థం చేసుకుంది. అర్థం చేసు కొన్న వాళ్ళే అనుభవించడానికి అర్హులు.

భర్త అతన్ని గురించి చూపిన అసూయలోనూ, ద్వేషంలోనూ హేళన భావం, తాత్కాలిక హాస్యం పైకి వున్నా, వాటివెనక నిజమైన వుద్రేకం. 'కసి' వుంది. దానికి కారణం ఏమిటి?- ఈ ఆలోచనలు ఆమెను బాధిస్తున్నా ఆ బాధలో ఆనందం కూడా వుంది. కాని దానికి

ఆకారంలేదు, పరిపూర్ణతలేదు. ఎవళ్ళకీ చెప్పుకోడానికీ లేదు. అవి ఏకాంతాన్ని కోరతాయి; రహస్యాన్ని కాపాడతాయి. ఎంతకాలం యీ చీకటి, రహస్యం ? ఆ మోహం ఆమెని పదేపదే కలవర పెట్టడానికి కారణం ఆమెదాని నిజాన్ని గురించి నిర్ధారణకు రాకపోవడం. ఏదో ఓ నిముషం అనుకోడం, దాన్ని తోసెయ్యడం, బలవంతంగా మరచి పోవడం, అది మళ్ళా గంటలోనే వొత్తిడి కలిగించడం. సగం సగం సాగించిన ఆలోచనా, నిర్ధారణకురాని కార్యం— యివి మనుష్యులని పీడించుకు తింటాయి. ఇందులోనించి బైట పడాలంటే బాధించే విష యాన్ని పూర్తిగా వొకేసారి బ్రద్దలు కొట్టడం వొక్కటే సాధనం. ఆ ఫోటోలోని మోహాన్ని బాగా పరీక్షించింది. దానిలోని లోపాలు, చెడ్డ లక్షణాలు ఏరి వల్లె వేస్తే అతని ప్రతిమ వొత్తిడి కలిగించదు. గడ్డం బాగాలేదు. బుజాలు బాగాలేవు. చెవులేం బాగున్నాయి ? మీసాలు తీసేసి— ఆడదాని లాగా— అసలు బాగ లేదు. ఇది నిజం, దీన్నే గుండెకు నొక్కి, నిబ్బరం చేసుకోవాలి. కాంతం నిట్టూర్పు విడి చింది— ఎడారి లాగ మారింది మనస్సు. ఫోటో గోడని తగిల్చి, గూట్లోనించి హక్స్లీ రాసిన "ఆ వాడిన ఆకులు" అన్న నవల తీసింది మళ్ళా ఆకులు, వాడిపోవడం... తన మీద కోపం వచ్చింది. బైట సాయిబు 'గులాబీ పువ్వులో' అని కేక వేస్తూ అమ్ముకుంటూ పోతున్నాడు. పుస్తకం గిరవాటెట్టి తలుపు తీసి, మళ్ళా చప్పుడయ్యే ట్టు మూసింది. మళ్ళా ఆమె మనస్సు ప్రాచీన శక్తుల వైషమ్యాలకి నిలయం ఐపోయింది.

* * * *

చంద్రకాంతం భార్యని ఆస్పత్రిలో పరీక్ష చేయించడం కోసం విశాఖపట్నం రావాల్సి వచ్చింది. అక్కగారింట్లో దిగుదామని అతన్ని భార్య చంపుకుతింది. సంఘంలో తనకి స్థానం స్థిరపడేంత వరకూ

బంధువులూ, మిత్రులూ లేరని అతనెంత చెప్పినా ఆమె వినిపించుకో లేదు. పైగా ఆ ఊరొస్తున్నారని తెలియగానే బసవయ్య తప్పకుండా వాళ్ళింట్లోనే దిగాలని ఉత్తరం వ్రాసి, వొచ్చే సమయం తెలుసుకుని స్టేషనుకి కారుకూడా పంపించాడు.

భార్యని ఆస్పత్రిలో చేర్పించిన తర్వాత అతను రోజంతా అక్కడే. గడిపేవాడు డాక్టరు రోజుకి నాలుగు గంటలు మాత్రం భార్య దగ్గర వుండేందుకు వొప్పుకున్నా, ఎల్లాగో అక్కడే గడిపేసి, సాయంత్రం బీచివొడ్డున తిరిగి, క్లబ్బులో చీట్లాడి, రాత్రి పదిగంటలకి యింటికి చేరుకునేవాడు. అతనికి మేడమీద మారుమూల గది ఇచ్చారు. భోజనాల దగ్గర మాత్రం అందరూ ఆస్పత్రి సంగతులు మాట్లాడుకునే వారు. భోజనం కాగానే బసవయ్య కారుమీద వెళ్ళిపోతూ, చంద్ర కాంతాన్ని ఆస్పత్రి దగ్గర దించేవాడు. ఇట్లా ఐదురోజులు గడిచాయి.

కాఫీతీసుకుని మేడమీద గదిలో కొచ్చింది కాంతం. చంద్ర కాంతం మంచం మీదనుంచి తటాలున లేచి కుర్చీలో కూర్చున్నాడు. తెల్లటి పైజమా, కంటిమెద చొక్కా, పెద్ద తువ్వాలూ, చిందర వందర జుట్టూ — అప్పుడే కమ్యూనిష్టుల సమావేశం నుంచి వొచ్చినవాడిలా వున్నాడు.

"నాకూ్కడా తేవాలా కాంతం ?'' అంటూ కాఫీకప్పు బల్లపైన పెట్టింది. అతనేమీ మాట్లాడలేదు. సిగరెట్ ఆర్పేందుకు 'అష్ట్రే' కనిపించక అటూ, ఇటూ చూస్తున్నాడు. కాంతం తలవొంచింది. గుమ్మంలోంచి గిరవాటెట్టాడు.

''కాఫీకిముందే కాల్చాలా ఆ వెధవసిగరెట్టు !''

అతని పెదవులకేసి చూసింది. సిగరెట్లు కాల్చకుండా వుండే అవి నిజంగా గులాబీరేఖలలా వుండుననుకుంది.

"సిగరెట్టు నాపాలిటి దైవం, అదిలేకపోతే నాగరిక ప్రపంచంలో క్షణం బ్రతకలేం—''

"ఎందువల్ల ?"

''పొగ, దుమ్ము, క్లోరోఫారం, తారువాసన - నేటి లోకంవేగంతో సమంగా వెళ్లలేక క్రుంగిపోతున్న నరాలకి జీవంపోసే నిప్పుకణం."

"సరే— యివన్నీ నీ వొక్కడికేనా యేమిటి ? మావారు కాల్చరేం ?''

కాఫీ చప్పరిస్తూ ఆమెకేసి కోలగాచూశాడు.

''మీ ఆయన మహానుభావుడు. మానవీనత్వం అనే జబ్బు తగల్లేదింకా. అతనికి సమస్యలులేవు. సందేహాలు లేవు. నోరులేని బాధలూ లేవు. సంసారం, హోదా, సంఘంలోస్థానం, మంచిపెళ్ళాం, కారు, ముఖ్యంగా డబ్బూ— అన్నీవున్నాయి. అవి నాకులేవు కాబట్టి, సిగరెట్టుతో తృప్తిపడతా—"

కాంతాని కిట్లాంటి మాటలువిని చాలాకాలమైంది. ఎప్పుడో కాలేజీలో ఉపన్యాసకుడి ద్వారా వింది. 'మంచి పెళ్ళాం' అనడంలో తను పెళ్ళాంగా మంచిదో— వ్యక్తిగా కోరదగిందో అతని తాత్పర్యం బోధపడలేదు ఆమెకి.

''మా బెల్లెలు మంచి పెళ్ళాంకాదూ ?"

''మొగుడు మంచివాడైతేనే పెండ్లాం మంచితనం లెక్కలో కొస్తుంది.

క్షవరదుకాణం దాపమీద పరిచాడు.

"మానవీనత్వానికివన్నీ వుపకరాలు." – కాంతంవెళ్లి గ్లాసుతో నీళ్ళు తెచ్చింది.

"మీ కెందుకీ శ్రమ? బంట్రోతు తెచ్చునుగా"...

"చంద్రం! నన్ను 'మీ' రనడందేనికి?"

"ఒదినగారు — అందులో చదువుకున్నవారు?"....

"చాల్లే—నీదంతా చిత్రం. ఐతే నీ నవీనత్వంలోకి నేనువస్తానా?"

"మీరట్లా అడిగితే చెప్పలేను. నవీనత్వానికి లక్షణాలు చెబుతాను, అందులో వున్నారో లేరో మీరేచూసుకోండి. మొదటిది — ఫలానపనీ అని వుండగూడదు. ఏ వొక్కదాంటోనూ సంపూర్ణమైన పాండిత్యం వుండగూడదు. మతం, దైవభక్తి అసలుపనికిరావు. సంప్రదాయాలు. ఆచారాలు, పెద్దలు, ఆధ్యాత్మికపిచ్చి— వీళ్లు మాకుశత్రువులు. చరిత్రను చింపిపారేశాము. పొందిన వస్తువుతో తృప్తిపడగూడదు, అనుభవించ గూడదు. మార్పు మా మతం. ఈనాడున్న ఆదర్శాలు రేపుండవు. జీవితపు విలువలులేవు. ఏదో ఆశిస్తాం— అదేమిటో నొక్కిచెప్పలేం. ఏదో బాధపడతాం ; అదెవ్వరికీ అర్థం కాకూడదు. తొందర, తమాషా తారుమారు, తాత్కాలిక తన్మయత,......"

కాంతం ఆవలించింది. నవ్వింది ఇది సిద్ధంచేసిన ఉపన్యాసంలా వుంది కాని, సహజమైన వాక్కా! అతని తెలివిని, చమత్కారాన్ని తను ప్రదర్శించాలని యత్నిస్తున్నాడా? అట్లా యత్నించడంలో వుద్దేశం? ఏదో ఆమెలో కొత్తఆశ వుద్భవించింది. ఈ ఆశాభవనానికి పునాదుల నిర్మాణం ప్రారంభించాలి. ఏంచెయ్యాలో ఆలోచించడానికి దిగి వెళ్లిపోయింది. అతను భోజనం కాగానే వెళ్లిపోయి, మళ్ళీరాత్రి భర్తవొచ్చిం తర్వాతకాని రాలేదు.

* * * *

మొన్నాడు ఉదయానేలేచి బసవయ్య రాత్రికి రానని చెప్పి వెళ్లిపోయాడు. కాంతం, ఏడింటికి కాఫీకప్పుతో మేడమీది గదికివెళ్లింది.

అప్పుడే స్నానం చేసినతడి ఆ తెల్లసిల్కు చీరలోంచి చల్లదనాన్ని వెద జల్లుతోంది, సూర్యకాంతి మధ్య పాపిడిగుండా నుదుటమీద గీతలా పడింది. ఆకలి, సంతృప్తి - రెండూ ఆ బాల్యపు సౌందర్యం మొయ్య లేని శక్తితో కళ్లద్వారా కలత కనపరుస్తున్నాయి. ముడుచుకున్న పెదవుల మరుగులో సంకల్పంవుంది.

"ఎప్పుడు తీసుకొస్తావు మా చెల్లెలిని ?"

"రేపే— ఏమీ భయపడవలసిన జబ్బుకాదన్నారు డాక్టర్లు"

"నువ్వింకా లేవలేదేం ?"

అతను మంచంమీదే వోరగాకూర్చుని దిండ్లమీద మోచెయ్యిఆనించాడు. నిద్రలేక బరువెక్కినకళ్ళు, యాత్రసాగించి, మోసపోయి, విరామం పొందిన మొహవర్చస్సు — అతను వ్యాధిగ్రస్తుడు.

"నా కివాళ వొంట్లో ఏమీబాగలేదు"

"అయ్యోపాపం ! హాస్పిటల్ నే వెళ్లి చూసొస్తాలే... ఏం, తలనొప్పా ?"

దగ్గరగా వొచ్చింది. మంచం బద్దీ మీద ఆనింది.

"ఫలానా అనిచెప్పలేను. మగతగావుంది— తిండిమాన్తే అదే పోతుంది లెండి"

కాస్సేపు నిశ్శబ్దం.

"ఆ కుర్చీమీద కూర్చోండి. మీరల్లా నిలబడ్డం నా కిష్టంలేదు" అన్నాడు. నీరసంగా కూర్చొంది. పాదాలపైకి లేచిన చీరకుచ్చిళ్లను కిందకిలాగింది. చెంపమీద చేయ్యేసుకుని అతని కళ్లల్లోకి దీర్ఘంగా చూసింది. అదిరిపాటుతో అతను దృష్టిని మరల్చుకున్నాడు.

"ఐతే చంద్రం... మా చెల్లెలు ఒక బొమ్మ చూపించింది. అది నాదే... నేను వెయ్యేదగ్గ— అబ్బ ! ఎల్లాఅనాలో రావడం లేదు—

వేసేటందుకు— కాదు — నే నంతటి — బాగావున్నానా ?'' సిగ్గుతో కనురెప్పలు వాల్చింది. అతను నవ్వాడు.

''ఆదా అది మీదికాదు. మీ చెల్లెల్ది వేద్దామనుకుంటే అట్లా తయారైంది."

"నువ్వు ఏ వుద్దేశంతో వేస్తే అల్లా తయారైందో"

''చెప్పాగా నా కుద్దేశాలూ, అభిప్రాయాలూ లేవని..."

''కాదు. నాదే వేద్దామని సంకల్పించావు.''

''కావొచ్చు. నాకు తెలీకుండా నా అంతరంగం అనేకపన్లు చెయ్యిస్తుంది. వాటిలో యిదీ వొకటి కావొచ్చు.''

''నీ అంతరంగికంలో అప్పుడు నేవుండి వుండొచ్చు...''

''సుప్రసిద్ధ మానసిక శాస్త్రవేత్త ఫ్రాయిడ్‌గారి శిష్యురాలి లావున్నారు''

''నాకు గులాబీ మొక్కను పంపించావు. ఈ రెండూ కూడితే ఏంతేల్తోంది ?'' అని ప్రశ్నార్థకంగా చూసింది.

"విషమపరీక్ష. డాక్టర్ వాట్‌సన్‌గారి నడగాలి... బొమ్మ నా సృష్టి, గులాబీ ప్రకృతి సృష్టి.''

"ఈ రెండూ నన్నుగురించి .... నాచే ఆకర్షింప బడ్డసృష్టి...''

అతను పక్కకితిరిగి సిగరెట్టు ముట్టించాడు. ఇదంతా నిజమై వుండవచ్చు నన్నట్లుగా తెల్లబొయ్యాడు. నీరసంతో మూలుగుతూ దిండు మీద తల ఆనించాడు.

''చంద్రం, నాకెందుకో తెలుసా యింత దిగులు?... నువ్విచ్చిన గులాబీమొక్క వాడిపోతోంది. అది యెదగడం లేదు. మొగ్గ వెయ్యడం లేదు... దానికేసి చూస్తే నువ్వేజ్ఞాపకాని కొస్తావు. నీ పూర్వపు

చరిత్ర వాడిపోయినట్లుగా... ఎంతోమంది నీకు నీళ్ళుపోశారు; దువ్వారు; లాగారు — లాలించారు... వాడిపొయ్యావు... నాకు దాన్ని, నిన్నూ బతికించాలని......''

అతను భయంతో కళ్ళుపెద్దవిచేశాడు. ఆమెలేచి అతని దగ్గరగా వెళ్లి నుదుటిమీద చెయ్యేసింది. అది కాలిపోతోంది నివిరింది.

''ఆ మొక్క ఎందుకు పుష్పించదో చెప్పవూ ?"

"కొన్ని కొన్ని గులాబీలు నీళ్లతో పుయ్యవు... దాన్ని రక్తంతో పెంచాలి..."

ఆమెవేళ్ళు అతని జుట్టులో దాచుకుంది. అతను వాటిని తొల గించాడు.

''మీరిట్లా చేస్తే మీ నౌకరీ పోతుంది..."

''నాకేం నౌకరీ ?"

"భార్యగా వుండడం. హిందూలా ప్రకారం వొకసారి స్త్రీని వుద్యోగంలోంచి తొలిగించిన తర్వాత మళ్ళా ఎవ్వడూ కుదుర్చుకోడా నికి వీల్లేదు. ఆ మొదటి యజమాని బ్రతికి వున్నంత వరకూ."

"నౌకరీ పొట్ట కోసం. కాని హృదయం, ఆత్మ ?"

''అవి మాకులేవు. బిహేవియరిస్టు వాట్సన్ దొరగార్ని అడ గండి. శరీరం ప్రమాదంనుంచి కాపాడుకునేందుకు వాటిని కల్పించు కుంది."

''నాకుంది."

''అది వున్నవాడినే చూసుకోండి. మీ భర్తగారికి చాలా విశాల మైన హృదయంవుండి వుంటుంది — శరీరం లాగే."

కాంతానికి కోపం వచ్చింది. భర్తంటే యితనికీ అసూయ; ద్వేషం. పురుషు లందరూ అంతే. ఎందుకో. కాని ఆ అసూయకు కారణం తను కాదు.

''కాదు చంద్రం – నీకు హృదయం వుందనుకున్నాను. నిన్ను నేను అర్థం చేసుకున్నాను.''

''అది భ్రమ. అర్థం చేసుకునేందుకు నాలో ఏమన్నా మహత్తర రహస్యం వుంటేగా. మాకు హృదయాలు లేవు – బుర్ర లున్నాయి. శరీరాలున్నాయి. బుద్ధి వుంది, జ్ఞానంలేదు. పావలోవ్ (Pavlov)ని అడిగితే అదీ లేదంటాడు. మేం అంతర్జాతీయ అజ్ఞాత వాసులం; రాజకీయ జంతువులం; ఆర్థిక పశువులం; సారస్వత చిల కలం; చరిత్రాత్మక గబ్బిలాలం; మరమనుషులం. నేను పెట్రోలు వాసన, సిగరెట్ పొగ, ఫ్యాక్టరీ రొద, ఐడోఫారం కంపు – నీయిష్టం, మానవుణ్ణి మాత్రంకాను...''

ఇదంతా ప్రగల్భంగా, వంచింపుగా తోచింది ఆమెకు. మరో రాయి విసిరింది: "ఇవన్నీ నువ్వు కావొచ్చు. మరినేను... నా ప్రేమ..."

''అవి భాషకి సంబంధించిన సమస్యలు. రిచర్డ్స్ (Richards), ఆగ్డన్ (Ogden) దొరగార్ల నడగాలి. ఆ మాటల్లో ఎంత యదార్థం వుందో, ఎంత విలువవుందో, ఎంత పరిణామంవుందో నాకు తెలీదు."

"నా సౌందర్యం.''

అతను లేచి కూర్చుని ఆమెకేసి తీవ్రంగా చూశాడు.

"మేం సౌందర్యానికి చలించం. దాన్ని పూర్వీకులు వర్ణించి వర్ణించి దుంపతెంచారు. నిజంగా చూసేప్పటికి దాన్లో కొత్తదనం పోయింది. నేను ప్రేమించడం మరిచిపోయి చాలాకాలమైంది. హెలెన్,

అనార్కలీ, క్లియోపాట్రా, శకుంతలా, గార్బోలాయ్ - వీళ్ళే మా కలలని బాధిస్తారు...'

కాంతానికి కోపం మరింత యెక్కువైంది. ఇవన్నీ నిజంగా అన్నవో, పరిహాసానికో తన కర్థం గాలేదు. ఈపిచ్చి ధోరణిని బట్టే, అంతా యితన్ని గురించి అట్లా అనుకుంటారనుకుంది, అతనితో వాదించింది, బతిమిలాడింది. జరిగిపోయిన సంగతులు తవ్వింది. అతను కత్తిమీద హాయిగా నడవసాగాడు. ఉడుకులోన్ సీసాకోసం కింది కెళ్ళింది. తెచ్చి గుడ్డమీద పోసి నుదుటిమీద వుంచింది.

"నన్ను మీరిట్లా తాకడం దారుణం. అందులో బాధలున్నాయి."

"నీకిట్లాంటి అనుభవం లేనట్టు మహా!"

"లేకకాదు, అవివేరు. అవి మూర్ఖాళ్ళ ముచ్చటకాదు. పిల్లలు లేని స్త్రీ నాతో కాలక్షేపం చెయ్యడంకాదు, సంస్థల్ని వెక్కిరించడం గాదు. మా పిచ్చిలో కూడా కొంత తర్కం, మార్గం లేక పోలేదు. మీ విషయం వేరు. ఇదొకమంట — జ్వాల. వేళ్ళు పెడితే మండి, భస్మమైపోతాను. పాపానికి వేతనం మృత్యువు. నాకు కొంత కాలం బతికి సూర్యోదయాన్ని చూస్తూ ప్రేమతో వాణికి పోవాలనుంది."

పక్కకి తిరిగి మూలగడం మొదలెట్టాడు. దారుకాచి తీసు స్తానని వెళ్ళిపోయింది కాంతం.

* * *

మధ్యాహ్నం మూడు గంటలైంది. ఓవల్టీన్ పట్టుకుని కాంతం మేడమీది కొచ్చింది. అతను నిద్రపోతున్నాడు. కళ్ళకింద తడి కనిపించింది. ఉడుకులోనుదో— అనురాగానిదో తెలీదు. హెలెన్, క్లియోపాట్రా, శకుంతల ఆమెను పీడించుకుతిన్నారు. ఏదో చెయ్యమని పురి

కొల్పారు. నిద్రలోవున్న శరీరానికీ, బుర్రకీ మహత్తరమైన యెడ బాటు. గాలిలేని ప్రకృతి మాదిరి నిశ్చల సౌందర్యాన్ని ప్రకటించు కుంటుంది. యుగాలనాటి కొండ శిఖరాలు, సెలయేళ్ళు, భూమిలో మరుగుపడ్డ మానవుడి ఎముకలు, వేళ్ళు పాతుకుని పుష్పించలేని గులాబీ మొక్క – కాంతాన్ని ఐక్యతకి రగిల్చాయి. సంసార సంస్థ సోడిబ్యాన్ని నిలబెట్టిన తెరచిరిగింది. ఆమె భార్యకాదు; వొదినగారు కాదు. అనంత వ్యక్తిత్వంతో మండి పోతున్న నరాలకుప్ప; అమరత కోసం అంతరాయాలని మంట గలిపిన సృష్టికర్త. అధరాలని అతని బుగ్గకి తగిల్చింది. రెప్పలు పైకి కదిలాయి. పక్కనుంచి మసక ప్రవాహంలా జారింది; ఇంద్రియాలలో రక్తం పిచ్చిగా తిరుగాడు తోంది.

"ఛీ, ఛీ ! సిగరెట్టు కంపు ;..."

అతని నోరు కప్పింది. పెనుగులాడాడు.

"కాంతం ! మాకు అమరత నిచ్చేది ఉడుకులోన్ కాని అధ రాలుకావు. అదిలేకపోతే యీ పాపపు పెదాల వాసనలో పెట్రోల్, తారువేగం, గొడవ, హోరు, రొద, టి.బి. దుమ్ము – వొక్క క్షణం వుండలేను."

కాంతం శరీరంలోని మూలలు, వొంకర్లు, కోణాలు అన్నీ ముక్కలై, యీడగిలపడిపోయాయి. తను ఏదో ప్రాచీన ప్రపంచం లోకి వెళ్ళింది – అక్కడినుంచి యీదౌర్భాగ్యుడు కిందికి గెంటాడు. అతన్ని మంటలో పడేసి చర్మం వొలవాలని పించింది ; కోసి రక్తం తీసి గులాబీ మొక్కకి పొయ్యాలని వుంది - ("కొన్ని కొన్ని గులాబీ లకి రక్తం పోస్తే కాని పుష్పించవు") పెనుగులాటలో ఓవల్టీన్ కప్పు కిందపడిపగిలింది.

"అయ్యో - సాయంత్రం బజార్లో మరోటి కొంటాం లెండి- మీ వారితో చెప్పొద్దు."

కాంతం కసితో చూసింది అతన్ని. ఆశాభవనం గాజు కుప్పలా కూలి ముక్కలైంది.

"మీ చెల్లెల్ని యివాళ తీసుకు వెళ్ళొచ్చునన్నారు. కారు సిద్ధంగా వుంటే యిప్పుడే వెళ్ళివొస్తా." అన్నాడు.

కాంతం చరచరా మెట్లుదిగి వెళ్ళింది. బైటకొచ్చింది. కారు డ్రైవరు ఎనమండుగురు పిల్లల్ని పోగుచేసి, 'చడుగుడి' ఆడిస్తున్నాడు. కారు సిద్ధం చెయ్యమని చెప్పింది. మరో కప్పుతో మళ్ళా పైకెళ్ళింది.

"ఏదో చప్పుడైందే?" అన్నాడు చంద్రకాంతం.

"నా చేతుల్లోనే అద్దం పడిపగిలింది." తను అద్దంలో మొహం చూసుకున్న విషయం చెప్పినందుకు పెదవి కొరుక్కుంది.

"ఫరవాలేదు. మావారి డబ్బంతా యింట్లో కప్పులకీ, అద్దాలకీ అవుతోంది."

"చాలామంది మొగాళ్ళకంతేలెండి. కోతిని పెంచుకునేవాడు అది పగలగొట్టే అద్దాలకేనా ఖర్చు పెట్టొద్దా— అని వొకాయనన్నాడు లెండి."

ఈ వాక్యం వినిపించుకోకుండానే దిగివెళ్ళిపోయింది కాంతం. హాస్పిటల్‌కి తనూ సిద్ధమైంది. కార్లో వెళ్ళారు. చంద్రకాంతం భార్యని కార్లో ఎక్కించుకుని సముద్రపు వొడ్డునే వొస్తుంటే బసవయ్య కనిపించాడు. అతనూ కార్లో ఎక్కాడు. ఎవ్వరూ మాట్లాడలేదు. బసవయ్య మాత్రం కార్ల ఇన్స్యూరెన్సుని గురించి డ్రైవర్‌తో గుక్కతిప్పకోకుండా లెక్చరిచ్చాడు.

"ఇదిగో – రేపు సముద్ర స్నానం చేద్దామా – చాలా కాల మైంది చేసి–?" అన్నాడు బసవయ్య.

"అమ్మో ! నాకు భయం" అంది మరదలు

"మీరొద్దు. మేం మొగాళ్ళం వెళ్తాం" ఎవళ్ళూ సమాధానం చెప్పలేదు. రాత్రి చాలా సేపు మాట్లాడింది సూర్యకాంతం భర్తతో.

* * *

మొన్నాడు ఉదయం ఆరు గంటలకి నలుగురూ కారుమీద సముద్రపుటొడ్డుకి వెళ్లారు. కారుదిగి దూరంగా యిసకలో ఫర్లాంగు దూరం నడిచి, చాప పరిచారు. తువ్వాళ్ళు, రెండు గొడుగులు తీసు కొచ్చి డ్రైవరు కారు దగ్గర కెళ్ళి పోయ్యాడు. ఎర్రటిముద్ద నీటి అంచు మీద లేచింది. మంచునుండి విముక్తి పొందడానికి యిసుక కణాలు కాంతిలో విప్పారుకున్నాయి. ప్రకృతి తన అలంకారాన్ని అలజడి లోనూ, పక్షుల పిచ్చి పాటలతోనూ ప్రమోగించుకుంటోంది.

బసవయ్య, చంద్రకాంతం నీళ్ళ దగ్గరకి నడిచిపోయ్యారు. కాంతం, చెల్లెలూ యిసుకలో దూదుంపుల్ల ఆడుకుంటున్నారు

"నాకీతరాదు, నీ కొచ్చునా ?" అని అడిగాడు బసవయ్య.

"సముద్రంలో ఈతేం ప్రయోజనం ? ఐనా నా జీవితానికి విలువలేదు. భీమా కూడా చెయ్యించలేదు."

బసవయ్య బిగ్గరగా నవ్వి చొక్కా తీసి నీళ్ళల్లోకి నడిచాడు. పదిహేను గజాలు వెళ్ళి మూడుసార్లు మునిగాడు.

"లోతులేదే - రా పరవాలేదు." చంద్రకాంతం దగ్గరగా వెళ్ళాడు. బసవయ్యని కెరటాలు కదల్చలేవు చంద్రం కాళ్ళకి యిసక తగలడంలేదు. నీళ్ళల్లోకి చూస్తూంటే చిత్రమైన అనుభవం కలుగుతుంది. మంచుకరిగి కొండ శిఖరం విరిగి పడ్తట్టూ, పాదాలకింద భూమిపీడి

ఎక్కడకో తీసుకెడుతున్నట్లూ లోకం గిరగిర తిరుగుతూ శూన్యత్వం లోకి గిరవాటెట్టినట్టూ భయమేస్తుంది. మానవుడి అల్పత్వం, అనావశ్యకత = అన్నీ తెలుస్తాయి సముద్రంలో మునిగిన వాడికి.

పెద్ద కెరటం చిన్నవాటిని నురుగుతోసహా లొంగ తీసుకొని ఇసిక గుహలను పెల్లగించి, వొడ్డున బద్దలై, కిరీటం లాంటి నురుగుని చీర మాదిరి ఆరేసింది కాని, బసవయ్యని అంగుళం కదపలేదు. కాని అతనికి లోపలకి జారుతున్నట్లు అనుమానం తట్టింది. ఒడ్డు వెంపు నడిచాడు. శక్తిని పోగొట్టుకున్న పెద్ద కెరటం ఇసుకతో దొర్లుకుంటూ అతన్ని పది గజాలు తీసి కెళ్ళింది. ఇంకా నడిచాడు.

"ఇక్కడ కూడా భూమి తగుల్తోంది..." అన్నాడు చంద్ర కాంతం నురుగులా తేలిపోతూ.

కెరటాలు అల్పగంతులు, నాట్యం మానుకుని, పెద్ద పెద్ద నీటి ఆవరణాలను పూరించుకుని, లోలోపల భయంకరంగా కదులుతున్నాయి. పాము పడగలా నాలుకలు చాపుకుంటూ క్రూరంగా బసవయ్య దృష్టిని తారుమారు చేస్తూ తీసుకుపోతున్నాయి. అతను ప్రపంచానికి దూరమైపోతున్నాడు. నీళ్ళు తాగుతున్నాడు. చేతులను రెక్కలు విరిగిన పక్షిలా కొట్టుకుంటున్నాడు. ఒడ్డు కనిపించదు. మనుషులు కనిపించరు. ఆకాశం, సముద్రం అంతా వొకటే - తన నిర్మూలానికి కలిసి పెనుగులాడుతున్నాయి.

"చం-ద్రం... దా-దా... అందు..." ఏవో ధ్వనులు చేశాడు. బాధలో వున్నవాడి మూగభాష - జీవం నిశీథంలో శ్మశాన వాటికలో అరిచే కడసారి అరుపు. చంద్రకాంతం వొచ్చి యితని దగ్గర పడ్డాడు. బసవయ్య జుట్టుని పళ్ళతో పట్టుకున్నాడు. చేతులతో అతని మెడ గట్టిగా బిగించి, అతనికళేబరాన్ని మీదేసుకుని వెల్లకిలబడి

పూపిరి బిగించి, గుప్పిళ్ళతో నీటి కన్య స్తనాలపై కొడుతుంటే, పొక పోకిరి కెరటం విప్లవం చేసి బైటపడి, ఆ వ్యక్తులని వొడ్డుకేసి ఐదు గజాలు పూపి గిరవాటెట్టింది. భూమి తగిలింది. ఒడ్డున పడ్డాడు బసవయ్య. అతని పొట్టమీద అడుగేసి తొక్కాడు చంద్రకాంతం శరీరాన్ని 'మాలీసు' చేశాడు.

సూర్యకాంతం దూరాన్నుంచి చూసి, గబగబ నడిచి చక్కా వొచ్చింది.

"ఏమీలేదు – ఆయనకి అలుపొచ్చింది" అన్నాడు చంద్ర కాంతం.

"అంతేకదా – ఏదో అని హడిలిపోయాను."

అతను తన భర్తని ఏమన్నా చేశాడేమోనని కాంతం భయ పడింది. అసూయతో బాధపడుతున్న పురుషుడు ఎంత ప్రమాదమైనా చెయ్యగలడు. చంద్రకాంతం సముద్రంలో కొట్టుకుని పోతే ఎంత బాగుండును ! ఏమిటి తనకీ ఆలోచనలు !

"చంద్రకాంతం లేకపోతే యీ పూట నాపని హుళక్కే" అన్నాడు బసవయ్య ఆయాసంతో.

అంతా యింటికి చేరుకున్నారు. ఆ సాయంత్రం వెడతానని చంద్రకాంతం భార్యని ప్రయాణం కట్టమన్నాడు. బసవయ్య బలవంతం మీద మొన్నాడు వెళ్ళడానికి నిశ్చయించుకున్నారు. రాత్రి భోజనానికి బసవయ్య కోసం కాచుకుంటూ చంద్రకాంతం హాల్లో కూర్చున్నాడు. అతని భార్య స్నానాకి కెళ్ళింది. తొట్టి స్నానం. గంటకి కాని రాదు. మల్లెపూలు కొప్పులో సర్దుకుంటూ కాంతం చక్కా వొచ్చింది.

"నువ్వు లేకపోతే మావారు కొట్టుకుపోదురటగా–"

"సర్లే–నేలేకపోతే ఆయన స్నానానికే వెళ్ళివుండడు..."

''ఆదయ నామీదా, ఆయన మీదా ?'' అంటూ వీధి తలుపులు మూసింది.

''నాకెవళ్ళమీదా దయాదాక్షిణ్యాలులేవు. ఆయన బతకడం వల్ల ఇన్స్యూరెన్సు ప్రపంచానికేనా వుపయోగం వుంది. నావల్ల ఏం ప్రయోజనం వుంది లోకానికి ?''

''నాకుంది''

"అది నీస్వార్థం పైగా ఆయన కొట్టుకు పొయ్యాడంటే నీ పని ఏమౌతుందో తలుచుకుంటే భయమేస్తుంది. అంతేకాని నాకు త్యాగంలోనూ, పరోపకారంలోనూ నమ్మకంలేదు....''

కాంతంలో రేకెత్తిన ఆశా పుష్పంవాడింది.

"చంద్రం... నువ్వు కావాలి— వొక్క నిమిషం నన్ను నీ చేతుల్లో పట్టుకోవూ ?''

''నువ్వు ఆట వస్తువ్విkకావు. స్త్రీవి. నాకుద్యోగం లేక పోవడం వల్ల కదా నాకీ పని కల్పించావు. లేదు. ఒదినగారూ. నాకు ప్రేమించే టందుకు తీరుబడిలేదు. ఆ విలాసం మీబోంట్లకు, ఉద్యోగం, ధనం, సంసారం; సంఘంలో స్థానం, పిల్లామేకా పోరూపొందూ లేక హాయిగా కావలసినంత విశ్రాంతి వున్న మీకు అదితగిన కాలక్షేపం. భారత దేశంలో తిండిలేదు నాగరిక ప్రపంచంలో ప్రేమలేదు. అందుకనే పీన యువకుడికి శాంతిలేదు.''

''ఈ దేశంలో నాగరికత లేదంటే నవ్వొస్తుంది. పోనీ నాకేనా లేదంటావా ?" అని అడిగింది కాంతం.

''ఆకలి తీరని దేశానికి నాగరికతతో నిమిత్తంలేదు. నాకాకలి తీరలేదు. బాధగా వుందని లోకానికి దగ్గరగా చెప్పుకునే వాడు నాగరీ

కుడు కావొచ్చు. ఆకలి బాధ తగ్గిం తర్వాత ధనవంతులు నాగరికతతో విలాసాలతో స్వేచ్ఛగా వ్యవహరిస్తారు. స్వేచ్ఛా జీవితం అవలంబిస్తేనే కాని నవీనులు కారేమోనన్న భయంవల్ల ధనవంతులు, ధనవంతుల భార్యలు నాగరికతని ఆచరణలో పెడతారు.

కాంతానికి ఒళ్ళుమండింది. భర్తతో చెప్పి యీ దౌర్భాగ్యుణ్ని సముద్రంలో ముంచలేక పొయ్యానన్న విచారం కలిగింది.

"చంద్రకాంతం, నేను నిన్ను పరిశోధించానే గాని నిజంగా నిన్ను ప్రేమించాననుకున్నావా?''

''నన్ను నువ్వు నిజంగా ప్రేమించావని నమ్మేటంతటి శుంఠని కాను. పైగా యీ వేగంగా కదిలి పొయ్యే ఆధునిక ఆర్థిక యంత్రం చక్రాల క్రింద ప్రేమ, సౌందర్యం, సత్యం - అన్నీ ముక్కలు ముక్కలై పొయ్యాయి. వాటిని అతికించాలంటే జిగురుబుద్ధి కొనేటంతటి డబ్బుకూడా లేదు నా దగ్గర. నీకది చేతకాదు.''

ఇంతలో వీధితలుపు చప్పుడైంది. అంత దిగ్గరగా తలుపుతట్టేది బసవయ్యతప్ప మరొకరుకారని కాంతానికి తెలుసు.

మొన్నాడు సాగనంపడానికి బసవయ్య, భార్యా కారులో స్టేషన్‌కి వెళ్ళారు. సూర్యకాంతం, చెల్లెలూ బండిలో కూర్చున్నారు. చంద్రకాంతం ఇంజన్ దగ్గరనిలబడి దాని పొగరుమోతు బలాన్ని పరీక్షిస్తూ నుంచు న్నాడు. బసవయ్య గార్డుతో మాట్లాడుతున్నాడు— బీమాచెయ్యమని చంపుకుతింటూ.

''ఏమే— మొన్న సముద్రంలో మీ బావ లేకపోతే నీ మొగుడు పని ఏం జరుగును...''

ఇంతలో బసవయ్య చక్కావచ్చాడు.

''ఇదేమిటి, తల్లక్రిందులు చేసి చెబుతున్నావు ? అతను లేకపోతే నేనేమౌదును ?...''

మళ్ళాగార్డు సంజ్ఞచేస్తే వెళ్ళిపొయ్యాడు. బండి కదిలేటైమయింది. చంద్రకాంతం పెట్టెదగ్గర కొచ్చాడు.

కాంతం బండిలోంచి దిగింది.

''ఇదుగో చూడూ" అన్నాడు చంద్రకాంతం, భార్యని సంబోధిస్తూ. "మీ బావతో యితర మొగాళ్ళను గురించి చెడ్డగా చెప్పొద్దని కొంచెం చెబుదూ."

"ఎవరితో" అంది అతనిభార్య.

''అదే, మీ అక్కతో. కొంతమంది స్త్రీలకి చెడ్డ మొగాళ్లంటే చాలామోజు కాబోలు."

రైలు కదిలింది. బసవయ్య తన అరటి బొందులాంటి చేతిని వూపాడు.

ఇద్దరూ కార్లో యింటికొచ్చారు. కాంతం కార్లోంచిదిగి గబగబా తోటలో కొచ్చింది. చంద్రంపంపిన గులాబీ మొక్కమీద వో మొగ్గ లేచింది. కాంతం ఆ మొక్కని వేళ్ళతో సహితంగా పెరికి, దూరంగా గోడకవతల గిరవాటెట్టింది. పాదంతో ఆ స్థలాన్ని చప్టాలా చేసింది. బసవయ్య ఆ పారేసిన మొక్కను చేత్తో తీసుకుని దొడ్డివేపు నుంచి చక్కావొచ్చాడు.

''ఇదేమిటి, యీ మొక్కని ఎవరు పారేశారే ? పువ్వుకూడా పూసింది ?''

"నేనే దానికేదో అతనిలాగే జాడ్యం, మీరు చెప్పినవన్నీ నిజమే స్మండీ— అతను చాలా..."

"ఏమీ లేదు చాలా మంచివాడు." అని బిగ్గరగా నవ్వుతూ ఆ మొక్కని మళ్ళా పాతటానికి సంకల్పించాడు.

"క్రాక్ అంటాను." అంది.

"క్రాక్ కావొచ్చు— కాని మంచివాడే."

(ఏప్రెల్ 1944)

# 14. సరే, కానివ్వండి

—గోపీచంద్

అత్తమామలు గుడిసె మధ్యన కూర్చుని ఏమో గుసగుస లాడు కుంటున్నారు. అత్తపేరు వెంకమ్మ; మామపేరు వెంకయ్య. వాళ్ళ పెళ్ళినాడు - "పేర్లు బలేబాగా కుదిరినై" అనుకున్నారు అంతా.

వాళ్ళ కోడలి పేరు సిద్దమ్మ; కొడుకు పేరు సీనప్ప. సీనప్ప ఆరునెలల కిందట ఇల్లువిడిచి పరారయ్యాడు. ఇంతవరకు పత్తాలేదు. ఆరు నెలల్నించీ పోలీసులు వెతుకుతూనే వున్నారు సీనప్ప కోసరం.

సీనప్ప పరారీ అవటానికి కారణం: ఆ వూరు కరువొచ్చింది. వర్షంమీద ఆధారపడ్డ సేద్యం. ఆ సంవత్సరం వర్షాల్లేక వేసిన పైరు వేసినట్టుగా మాడిపోయింది.

సీనప్ప తండ్రి చాలాకాలంగా మణేదారు రామయ్యగారి పొలం అయిదు ఎకరాలు కౌలుకి తీసుకొని చేస్తూండేవాడు. భుక్తికి లోటు లేకుండా జరుగుతుండేది. ఎప్పుడూ బకాయిపడి ఎరగడు.

ఈ సంవత్సరం ఒక్క గింజకూడా పండలేదు. బాకీ, వొచ్చే పంటలో తీర్చుకుంటానన్నాడు; వెంకయ్య. మణేదారు రామయ్య వొప్పుకోలేదు. వెంకయ్యకున్న ఎడ్లజతనీ, ఆవునీ, దూడనీ గేదెనీ, మరికొంత సామానూ జప్తుకితెచ్చి బాకీకింద జమకట్టు కున్నాడు మణేదారు రామయ్య.

చేతుల్లోవున్న పొలం పోయేటప్పటికి ముసలివాడు మంచం ఎక్కాడు. సీనప్ప కూలి కోసం తిరిగాడు.

పంటలు పండకపోతే కూలి ఎక్కడ దొరుకుతుంది?

క్రమేణా కరువు చుట్టు పక్కల గ్రామాదులన్నీ వ్యాపించింది. ఒకరోజు అనుకోకుండా వూళ్ళోవున్న బీద జనం అంతా మణేదారు రామయ్య ఇల్లు చుట్టు ముట్టారు. అందులో సీనప్ప కూడా వున్నాడు.

"ఏం కథ?" అన్నాడు మణేదారు రామయ్య.

"ఏముందీ?" అన్నాడు సీనప్ప.

"ఏం లేదేం?" అన్నాడు మణేదారు రామయ్య.

"ఉండబట్టే వొచ్చాం" అన్నాడు సీనప్ప.

"అయితే ఏమిటో చెప్పు?" అన్నాడు మణేదారు రామయ్య.

"చెప్పటానికేగా వొచ్చింది!" అన్నాడు సీనప్ప. అతనికి ఏం చెప్పాలో తోచలేదు.

ఇంతలో "అన్నం కావాలి" అని కేకవేశాడు ఒకడు జనంలో నుంచి.

నా దగ్గర ఎక్కడుందీ?" అన్నాడు మణేదారు రామయ్య.

"మరి సీతాత దగ్గర వుందా?" అన్నాడు సీనప్ప.

మాటలు జాగ్రత్తగా రానియ్" అన్నాడు మణేదారు రామయ్య.

"పురులు కోయిస్తావా?" అన్నాడు సీనప్ప.

సీనప్ప నోటినుంచి 'పురులు' అనేమాట బయటపడగానే జనం పురుల మీదకు ఎగబడ్డది. ఎక్కడనుంచి వచ్చారో పోలీసులు! టప టప టప టప తుపాకులు పేల్చారు: ఆ రోజు ఆరుగురు మరణించారు. అప్పటినుంచీ మణేదారు రామయ్య మీద సీనప్పకు అమిత కోపంగా వుంది. దానికి తగ్గట్టు రెండో రోజు మరొక సంఘటన జరిగింది. సిద్దమ్మకి దారేపోతూ కనబడి కావాలంటే దబ్బిస్తా రమ్మని ఇంటికి తీసుకు వెళ్ళాడట మణేదారు రామయ్య. తీసుకు వెళ్ళి ఏమిచేమిటోగా

చూశాడట. సిద్దమ్మ ఏడుస్తూ వచ్చి సీనప్పకి చెప్పింది. సీనప్ప వెళ్ళి మణేదారు రామయ్యని అడిగాడు.

''ఏం కథ?'' అన్నాడు సీనప్ప.

''ఏముందీ?'' అన్నాడు మణేదారు రామయ్య.

''ఏం లేకేం?'' అన్నాడు సీనప్ప.

"ఉంటే చెప్పూ" అన్నాడు మణేదారు రామయ్య.

''నూకల్ని పెడతామేకల్ని కాస్తా?'' అన్నాడు సీనప్ప.

''ఆఁ" అన్నాడు మణేదారు రామయ్య.

''పెద్ద పులి వొస్తే జడవకుండా వుంటా?'' అన్నాడు సీనప్ప.

''ఆఁ" అన్నాడు మణేదారు రామయ్య.

కర్రతో తలమీద ఒక్కవేటువేసి ''జడిశావేం?" అన్నాడు సీనప్ప.

దెబ్బకి మణేదారు రామయ్య క్రింద పడిపోయ్యాడు. చిల్లిపడి నెత్తురు కారింది. ఆ నెత్తురు చూసేటప్పటికి సీనప్పకి పోలీసులు జ్ఞాపకం వొచ్చారు: కొండల్లోకి పారిపోయాడు.

అప్పటికి సిద్దమ్మకి ఏడోనెల. సీనప్పకి జరిగింది మరిది ద్వారా విని అకాలంగా ప్రసవించింది.

సీనప్ప వెళ్ళిన దగ్గరనుంచీ కుటుంబం పని మరీ అన్యాయం అయింది. మాటిమాటికీ పోలీసు జులుం. ఊళ్ళో దబ్బున్న వాళ్ళెవ్వరూ ''రామ రామ" అనరు. మణేదారు రామయ్య పగబట్టాడు. ఈ విషయమే గుడిసె మధ్య కూర్చొని సిద్దమ్మ అత్తమామలు గుసగుసలాడేది.

''వాడు మనకి పుట్టలేదనుకో'' అన్నాడు వెంకయ్య.

''అనుకుంటే అవుద్దీ ?'' అన్నది వెంకమ్మ.

''అవకొ్కడుతుందా ?"

"కొట్టాలీ ?" అన్నది వెంకమ్మ.

"మరి ఎందుకు ఏడవాలీ ?"

''కన్న కడుపుగా మరి,'' అన్నది వెంకమ్మ.

''దాని సిగ తరిగిరి'' అన్నాడు వెంకయ్య.

"దేనిసిగా ?" అన్నది వెంకమ్మ.

''దానిసిగే !" అన్నాడు వెంకయ్య.

"నోటితో చెప్పరాదూ ?'' అన్నది వెంకమ్మ.

''కన్నకడుపు సిగ" అన్నాడు వెంకయ్య.

''రామయ్య తండ్రీ !'' అన్నది వెంకమ్మ.

"ఓరి మణేదారు రామయ్యా !" అన్నాడు వెంకయ్య.

''వెళ్ళిన వాడు రాడేం ?'' అన్నది వెంకమ్మ.

''ఎందుకు వొస్తాదే పిచ్చిదానా ?'' అన్నాడు వెంకయ్య.

"ఏం ?" అన్నది వెంకమ్మ.

"వొస్తే కూడెట్టొద్దూ ?"

ఈ గుసగుసలు వింటున్న సిద్దమ్మకి కోపం వొచ్చింది. నాలుగు రోజులనుంచి ఇంట్లో బియ్యంలేవు. తాను స్మశానానికి వెళ్ళి యింత ఉత్తరేణి ఆకు కోసు కొచ్చి వొండింది. ఏమీ తినకపోతే పిల్లవాడికి పాలు వుండవని భయం. అంతకు ముందు దాకా కదలకుండా కూర్చున్న అత్తమామలు ఆకు పొయ్యి మీదనుంచి దింపేటప్పటికి నాకు పెట్టమంటే నాకు పెట్టమని పోట్లాడారు. ఇప్పుడు సీనప్పని ఆడి పోసుకుంటున్నారు.

"అయిందా ?" అన్నది సిద్దమ్మ కోపంగా.

"అవకేం ?" అన్నాడు వెంకయ్య.

"బియ్యం పట్టుకురా" అన్నది సిద్దమ్మ.

"ఎక్కడ ?"— అడిగాడు వెంకయ్య.

"వల్లకాట్లో" అన్నది వెంకమ్మ.

"గవర్నమెంటు వాళ్ళు ఇస్తున్నారంట" అన్నది సిద్దమ్మ.

"పొద్దున్న వెళ్లిమే !" అన్నాడు వెంకయ్య.

"తీసుకురాలేదేం మరి ?" అన్నది సిద్దమ్మ.

"బియ్యం ఇచ్చేది—" నసుకుతున్నాడు వెంకయ్య.

"మణేదారు రామయ్యే !" చెప్పేసింది వెంకమ్మ.

ఈ మాట వినేటప్పటికి సిద్దమ్మకి అత్తమామలమీద కోపం వొచ్చింది. తిండి దొరకక్క పోవటానికి తనే కారణం అయినట్టు మాట్లాడతారు. మణేదారు రామయ్యని తన మొగుడు కొట్టబట్టే కరువు వొచ్చినట్టు నటిస్తారు. "ఏదో ఒకటి తీసుకురండి" అన్నది సిద్దమ్మ.

"ఏమిటే వెంకమ్మా ?" అన్నాడు వెంకయ్య.

"ఏమిటో—" అన్నది వెంకమ్మ.

"వెళ్ళరేం ?" అని గద్దించింది సిద్దమ్మ.

"మణేదారు—" అని మొదలు పెట్టాడు వెంకయ్య.

అప్పుడు ఆమెకు తట్టింది—" గంజేరాకు తీసుకురండి" అన్నది సిద్దమ్మ.

అత్తమామలకు ఆమెను చూస్తే భయం వేసింది.

"పద, ముసలాడా" అన్నది వెంకమ్మ.

"పదవే, భామా" అన్నాడు వెంకయ్య.

వాళ్లు వెళ్ళగానే పిల్లవాణ్ణి చేతుల్లో పెట్టుకుని కొండల మీదకు పరుగెత్తింది సిద్దమ్మ.

౨

ఈ ఆరు నెలల నుంచీ సీనప్ప కోసం వెతికి చూస్తూనే వుంది సిద్దమ్మ. కొడుకు పుట్టాడని కూడా తెలియదు, తన మొగుడికి. తెలిస్తే ఎంత సంతోషిస్తాడు! పైగా వూళ్ళో అంతా ''అచ్చగా సీనప్పే'' అన్నారు.

సీనప్ప ఎప్పటికైనా కొడుకుని చూసుకోటానికి తప్పకుండా వొస్తాడని సిద్దమ్మ నమ్మకం: అప్పటికి పిల్లవాడు చిక్కిపోకుండా బొద్దుగా వుండేటట్టు చూచుకోవాలి. మణేదారు రామయ్య ఆవునూ, గేదెనూ తోలుకు వెళ్ళాడు. ఇక తన పాలే పిల్లవానికి ఆధారం. అత్త మామలకు పెట్టకుండా అయినా సరే తన కడుపు నింపుకుంటూ వుండేది సిద్దమ్మ. ఇరవై రోజుల కిందట సీనప్ప ఆదవాని లంకలో ఎవరికో కనిపించాడని తెలిసింది సిద్దమ్మకి. వెంటనే తెలుసుక రమ్మని మరిదిని పంపింది. అప్పటినుంచీ రోజూ కొండ మీదికి ఎక్కి మరిదికోసం ఎదురు చూస్తూ వుంటుంది. ఇవ్వాళ కొండ ఎక్కేటప్పటికి మరిది కనిపించాడు. ''కనపడ్డాడా?''— అడిగింది సిద్దమ్మ.

"నేనెవర్ని ?" అడిగాడు మరిది.

"సీనప్ప తమ్ముడివి" అన్నది సిద్దమ్మ.

''కనపడ్డాడు'' అన్నాడు మరిది.

సిద్దమ్మకి ప్రాణం లేచి వొచ్చింది. ఎప్పుడో చిన్నప్పుడు గొర్ల కాడ బుడ్డాళ్ళు పాడుకుంటే వినేది. ఆ పాట ఇప్పుడు జ్ఞాపకం వొచ్చింది.

'గుజ్జాలా గోపిరెడ్డీ'
నీపేరే బంగార్ప కడ్డీ!
''బుల్లోడి సంగతి చెప్పావా?'' అన్నది సిద్దమ్మ.
"చెప్పేదాకానా?'' అన్నాడు మరిది.
"ఏం'' అడిగింది సిద్దమ్మ.
''తనే అడిగాడు'' అన్నాడు మరిది.
''ఏమన్నాడేంటీ ?'' అడిగింది సిద్దమ్మ.
''చెప్పేతలికి గంతేశాడు —''
''ఓలబ్బో!'' అన్నది సిద్దమ్మ.
''—ఎగిరి'' అని పూర్తిచేశాడు మరిది.
''సరి'' అన్నది సిద్దమ్మ.

మరిది మూలుగుతూ కూర్చోబడ్డాడు. అప్పుడు చూచింది సిద్దమ్మ. నడిచినడిచి అతని కాళ్ళు బొబ్బలెక్కివున్నై. పిల్లవాణ్ణి కాళ్ళ మీద పడుకోబెట్టి మరిదికాళ్ళు పిసుకుతున్నది సిద్దమ్మ. ''నేను బయలు దేరి ఎన్నాళ్ళయింది?'' అడిగాడు మరిది.

''ఇరవై రోజులు'' చెప్పింది సిద్దమ్మ.
''సరి'' అన్నాడు మరిది.
''ఎట్లా వున్నాడు?'' అడిగింది సిద్దమ్మ.
''చలిమంటలాగా'' అన్నాడు మరిది. ''దేశాన్ని తిరగ వేస్తా డంట.''
''ముదనష్టపాడు'' అంది మురిపెంగా సిద్దమ్మ.
''ఎటుపడితే అదే'' అన్నాడు మరిది.
''సరి'' అన్నది సిద్దమ్మ.

సిద్దమ్మ ఇంకొకవిషయం అడగాలనుకుంది. కాళ్ళు పిసకటం ఆపి మరిదిని తేరిపార చూసింది సిద్దమ్మ. తేరుకొని లేచాడు మరిది.

బుల్లోడు మరిదిని చూసి బోసినవ్వునవ్వాడు. అకస్మాత్తుగా 'రా' అని జ్ఞాపకం వొచ్చింది మరిదికి : "వొస్తా నన్నాడు" అన్నాడు.

"ఎప్పుడు ?" అడిగింది సిద్ధమ్మ.

"ఆదివారం" అన్నాడు మరిది.

"ఇవాళే !" అడిగింది సిద్ధమ్మ.

"మాపిటికి" అన్నాడు మరిది.

సిద్ధమ్మకి చిన్నప్పుడు విన్న తోలుబొమ్మల పాట జ్ఞాపకం వొచ్చింది : ఎప్పుడూ సీనప్ప పాడుతుండేవాడు.

'రాత్రి పన్నెండు గంటలకీ
రౌను తిరిగి నేను వొస్తే
రాను పొమ్మంటివే
రమణి ముద్దుల గుమ్మ !
గుమ్మా ! బలేగుమ్మా ! అరేగుమ్మా !'

"ముదనష్టపాడు !" అన్నది మురిపెంగా.

"ఎటు తిరిగితే అదే" అన్నాడు మరిది.

"సరి" అన్నది సిద్ధమ్మ.

౩

మరిదీ, సిద్ధమ్మా ఇంటికి వొచ్చేతలికి వెంకమ్మా వెంకయ్యా ఒకమూల వొదిగి కూర్చొని ఏదో నములుతున్నారు.

వీళ్ళని చూచి తాటించడం ఆపేసి పట్టుబడ్డ దొంగలకు మల్లే గుడ్లు మిటకరించారు.

"ఏమిటది ?" అన్నది సిద్ధమ్మ.

"నీళ్ళు—" అన్నాడు వెంకయ్య.

"ఏం చేస్తున్నారు?" అన్నది సిద్దమ్మ.

"నములుతున్నాం" అన్నది వెంకమ్మ.

వెంకమ్మ వొళ్ళోవున్న మూట సిద్దమ్మ చూచింది: లాక్కుంది: బియ్యం...

"ఎక్కడివి?" అడిగింది సిద్దమ్మ.

"తెమ్మంటివే?" అన్నాడు వెంకయ్య.

"తెచ్చాం" అన్నది వెంకమ్మ.

"ఎవరిచ్చారు?" అడిగింది సిద్దమ్మ.

"గంజేరాకు—!" అన్నాడు వెంకయ్య.

"కాదు, కాదు. మణేదారు" అన్నది వెంకమ్మ. సిద్దమ్మ బియ్యం మూట చేత్తో పట్టుకొని కొంచెంసేపు ఆలోచించింది.

"మణేదారు తలకాయ" అన్నది సిద్దమ్మ.

"మా నోట్లో కరక్కాయ" అన్నది వెంకమ్మ.

"కరిమింగిన వెలక్కాయ" అన్నాడు వెంకయ్య. సిద్దమ్మ బయటికివెళ్ళి కాకిగూడు పొడుచుకువచ్చి, పొయ్యి రాజేసి, బియ్యం పొయ్యిమీద పెట్టింది.

అన్నం వుడుకుతూవుంది. మరిది శోషవచ్చి కుక్కిమంచంలో పడుకున్నాడు. అత్తమామలు గుటకలు మింగుతూ కూచున్నారు.

పోలీసు వొచ్చాడు: "ఏం, కూర్చున్నారేం?" అన్నాడు.

అత్తామామలు నుంచున్నారు. సిద్దమ్మ తమకు అన్నం పెడుతుందో లేదోనని చిరాగ్గావున్న వెంకయ్యకి పోలీసువాణ్ణి చూచేతలికి కోపం వచ్చింది: పొయ్యిమీద వుడుకుతున్న కుండ బ్రద్దలుకొట్టి నోటి దగ్గర అన్నం కాకులకీ, కుక్కలకీ వేసేరకం.

"ఏం కథ?" అన్నాడు పోలీసు.

"కంచికి వెళ్లింది" అన్నాడు వెంకయ్య.

"ఎక్కడ నీ కొడుకు?" అడిగాడు పోలీసు.

"రంగం వెళ్లాడే—" అన్నాడు వెంకయ్య.

"నాయుడుబావా" అన్నది వెంకమ్మ.

పోలీసుకి ఏమీ తోచక తుపాకి మడతతో వెంకయ్యని పొడిచాడు.

"అబ్బ!" అన్నాడు వెంకయ్య.

"మరేమనుకున్నావు?" అన్నాడు పోలీసు.

"గాడిదగుడ్డనుకున్నానురా తండ్రీ" అన్నాడు వెంకయ్య. పోలీసు వంటింట్లోకి వెళ్ళాడు. పొయ్యిమీద అన్నం వుడుకుతూవుంది. పొయ్యిదగ్గర సిద్దమ్మ కూర్చొనివుంది. అన్నంమీదవున్న ఆశకొద్దీ వెంకయ్య పోలీసువెంట వెళ్ళాడు. పోలీసుని చూసేటప్పటికి సిద్దమ్మ కంగారు పడింది. మాపటికే సీనప్ప వచ్చేది: పసి కడతాడేమో...

"ఛీ ఛీ కర్రేది?" అని కుక్కని అదిలించింది సిద్దమ్మ. కుక్క లేదు. "అన్నం వొండుతున్నావే!" అన్నాడు పోలీసు.

"కొద్దిగా బియ్యం..." అన్నది సిద్దమ్మ.

"ఎక్కడివి?" అన్నాడు పోలీసు. "దొంగిలించావా?"

ఇకతరవాత పొయ్యిమీద కుండ పగలగొట్టటమే అని గ్రహించాడు వెంకయ్య.

"ఏయ్, పోలీసూ?" అన్నాడు వెంకయ్య.

"ఏం?" అన్నాడు పోలీసు.

"బియ్యం ఎక్కడివో తెలుసా?" అడిగాడు వెంకయ్య.

"ఎక్కడివి ?" అడిగాడు పోలీసు.

"గంజేరు—" అన్నాడు వెంకయ్య.

"కాదు, కాదు. మణేదారు" అంది వెంకమ్మ; అప్పుడే వొచ్చింది.

మణేదారు పేరు వినేటప్పటికి పోలీసు కుండజోలికి వెళ్ళటం మానేశాడు. సిద్దమ్మనిచూసి అర్థయుతంగా నవ్వాడు. సిద్దమ్మకి సిగ్గువేసింది. అదీ మంచిదే అయింది.

"వెళ్తున్నా, సద్దమ్మా" అన్నాడు పోలీసు.

వెడుతూ, వెడుతూ తుపాకి మడమతో వెంకయ్యని ఒకపోటు పొడిచి వెళ్ళాడు.

"నన్ను పొడవలేదే !" అన్నది వెంకమ్మ.

"నేను ఊరుకోనని భయం" అన్నాడు వెంకయ్య.

సిద్దమ్మ మరిదికి వేడినీళ్ళతోడి, వీపు తనే తోమి అన్నం వొడ్డించింది. మరిది సేదతీరి అన్నానికి కూర్చున్నాడు.

"ముసలోళ్ళకి చెప్పొద్దు" అన్నది సిద్దమ్మ.

"ఏమని ?" అడిగాడు మరిది.

"అతగాడొస్తాడని" అన్నది సిద్దమ్మ.

"చెపితే ?" అన్నాడు మరిది.

"గోలచేస్తారు" అన్నది సిద్దమ్మ : "పోలీసు వాళ్ళకి తెలుస్తుంది."

"సరి, సరి" అన్నాడు మరిది.

సిద్దమ్మ మరిది అన్నం తింటున్నంతసేపూ అత్తమామలు గుటకలు మింగుతూ కూర్చున్నారు : తమకేమీ మిగలనివ్వదేమోనని భయం.

"సిద్దమ్మా" అన్నాడు వెంకయ్య.

"ఏం ?" అన్నది సిద్దమ్మ.

"అహఁ, ఏంలేదు" అన్నాడు వెంకయ్య.

మరిది అన్నంతిన్న తర్వాత అతన్ని పడుకోబెట్టి పిల్లవాడికి పాలిస్తూ కూర్చుంది సిద్దమ్మ. ''నీ బాబు వొస్తాడ్రా'' అంది సిద్దమ్మ.

''ఉంఙ్ఞ, ఉంఙ్ఞ'' అన్నాడు పిల్లవాడు.

''మా బాబుకి అన్నీ తెలుసు'' అని ముద్దుపెట్టుకుంది సిద్దమ్మ.

పిల్లవాణ్ణి పడుకోబెట్టి సిద్దమ్మ వంటయింట్లోకి వచ్చి చూసేతలికి అత్తమామలు కుండలోని అన్నం మెక్కుతూ వున్నారు. వాళ్లనిచూచి గుక్కలుపట్టి నవ్వింది సిద్దమ్మ. తిట్టి పోస్తుందనుకున్న అత్తమామలు ఆమెనవ్వుచూచి బిత్తరపోయారు, ఆమెకు ఒక్కమెతుకుగూడా విడిచి పెట్టకుండా తిన్నందుకు వెంకయ్య కళ్లల్లో నీళ్ళు తిరిగినై.

''తిట్టవే, సిద్దమ్మా'' అడిగాడు వెంకయ్య.

''ఇవాళ తిట్టను'' అన్నది సిద్దమ్మ.

''ఎందుకనీ ?'' అడిగాడు వెంకయ్య.

''చెప్పనే చెప్పను'' అన్నది సిద్దమ్మ.

''చెప్పనన్నా చెప్పు, తిట్టనన్నా తిట్టు'' అన్నాడు వెంకయ్య.

''తిడితే నీనోటిముత్యాలు రాలిపోవులేవే'' అన్నది వెంకమ్మ.

సిద్దమ్మ డొక్కలు చెక్కలయ్యేట్టు నవ్వింది.

''వెంకమ్మా—?'' అన్నాడు వెంకయ్య.

''ఏంది ముసలాయనా ?'' అన్నది వెంకమ్మ.

''మన పెళ్లిఅయి ఎన్నేళ్ళయిందీ అంట?'' అన్నాడు వెంకయ్య.

''నలభై ఏళ్లవలా ? అన్నది వెంకమ్మ.

''ఎప్పుడైనా యిటువంటి విడ్డూరం చూశావా !'' అడిగాడు వెంకయ్య.

"చూడలేదు" అన్నది వెంకమ్మ.

"చూస్తే చెప్పవే?" అడిగాడు వెంకయ్య.

"చూడలేదు భగవంతుడా, చూడలేదు" అన్నది వెంకమ్మ.



చీకటిపడింది. సాయంకాలం వుతుక్కున్న చీర కట్టుకుని పిల్లవాణ్ణి పడుకోబెట్టి, సీనప్పకోసం ఎదురుచూస్తూవుంది. అత్తమామలు నిద్ర పోతున్నారు. మరిదికాళ్ళు లాగుతున్నాయని మూలుగుతూ పడుకున్నాడు. పడుకోబోయేముందు "అన్నయ్యరాగానే లేపు వొదినా" అన్నాడు. సిద్దమ్మ నవ్వింది.

"నవ్వుతావేం?" అన్నాడు మరిది.

"పడుకో" అన్నది సిద్దమ్మ.

"సరే, నీయిష్టం" అన్నాడు మరిది. కాని, పడుకోటానికి బదులు మూలుగుతున్నాడు.

"ఓ వొదినా!" అన్నాడు.

"ఏం మరిదీ?" అన్నది సిద్దమ్మ.

అన్నయ్యతో ఎంతమంది కుర్రాళ్ళున్నారను కున్నావు?" అన్నాడు మరిది.

"ఎవళ్ళు?" అన్నది సిద్దమ్మ.

"ఎవళ్లో!" అన్నాడు మరిది; "అంతాకలిసి దేశాన్ని తిరగ తన్నుతారంట. కరువులు రాకుండా చేస్తారంట."

"ముదనష్టపోడు!" అన్నది సిద్దమ్మ మురిపెంగా.

"అయితే పడుకోనా?" అన్నాడు మరిది.

మరిదెకి నిద్రపట్టింది. కిటికీలోనుంచి బయటకుచూస్తూ నిలబడింది సిద్ధమ్మ. దూరానవున్న కొండలు కనిపిస్తున్నై. కొంచెం సేపటికి బయట కుక్క 'బొంయి' మన్నది. గబగబా వెళ్ళి తలుపుతీసింది సిద్ధమ్మ. పోలీసువాడు గస్తీ తిరుగుతున్నాడు. సిద్ధమ్మకి వొళ్లు జలదరించింది. సీనప్ప పట్టుబడతాడేమో అని భయం వేసింది, ఎలాగైనా పోలీసువాణ్ణి పంపించి వెయ్యాలి.

"ఏమే, చెల్లప్పా?" అన్నది సిద్ధమ్మ. పోలీసు పేరు చెల్లప్ప.

"ఓహో, సిద్ధమ్మా!" అన్నాడు చెల్లప్ప.

"ఎక్కడా కనపట్టంలేదే? అన్నది సిద్ధమ్మ.

"కరువొకటి వొచ్చిందా. రాత్రింబగళ్ళుపనే" అన్నాడు చెల్లప్ప.

"పాపం?" అన్నది సిద్ధమ్మ.

"ఏం?" అన్నాడు చెల్లప్ప. డ్యూటీ అన్నాక డ్యూటీయే..."

"ఏందే అదీ?" అడిగింది సిద్ధమ్మ.

"ఏదీ?" అడిగాడు చెల్లప్ప.

"ఇప్పుడు నువ్వన్న మాట?"

"నేనేమన్నానే —" మురిపెంగా ఏదన్నామాట అందా మనుకున్నాడు. 'ముద్దులగుమ్మా!' బాగుండలేదు. 'చిలకలకొలికీ': బాగుండలేదు. "సిద్దీ" అని వూరుకున్నాడు. సిద్ధమ్మ సరసకు వెళ్ళాడు చెల్లప్ప.

"ఓలన్నా!" అన్నది సిద్ధమ్మ.

"అదేం మాట?" అన్నాడు చెల్లప్ప.

"వొదినె బాగుందా ?" అడిగింది సిద్ధమ్మ.

"ఇప్పుడు దాని సంగతి ఎందుకు, సిద్దీ" అన్నాడు చెల్లప్ప. చెల్లప్పకి మూడో పెళ్ళి – భార్యమీద అనుమానం.

(16)

"కాదు అన్నా, రాత్రిళ్లు నువ్విట్లా తిరుగుతూ వుంటే—" అన్నది సిద్దమ్మ.

"ఛుప్" అన్నాడు చెల్లప్ప.

"కాదే. మరి రామయ్యగారి కిట్టప్ప అనేవాడు వొకడున్నాడా..." అన్నది సిద్దమ్మ.

"ఛుప్ ఛుప్" అన్నాడు చెల్లప్ప.

"నీకు తెలియదు కామాలు: ఇవ్వాళే వొచ్చాడు వూళ్ళోకి" అన్నది సిద్దమ్మ.

"ఛుప్ చుప్ ఛుప్ ఛుప్" అన్నాడు చెల్లప్ప.

ఇక చాలు అనుకుంది సిద్దమ్మ. పొదచాటున నక్కి చెల్లప్ప చర్యలు గమనిస్తూ వుంది. చెల్లప్ప కొంచెం సేపు అటూ ఇటూ తిరిగాడు. చెల్లప్పకి చాలా కాలం నుంచీ రామయ్యగారి కిట్టప్ప మీద అనుమానం వుంది; ఆగలేక ఇంటికి వెళ్ళాడు.

సిద్దమ్మ సంతోషంగా ఇంట్లోకి వెళ్ళింది.

"ఓ వొదినా?" అన్నాడు మరిది.

"చుప్" అన్నది సిద్దమ్మ.

"ఎక్కడికి కెళ్ళావు?" అన్నాడు మరిది.

"ఛుప్ ఛుప్" అన్నది సిద్దమ్మ.

"అదేమిటి వొదినా?" అన్నాడు మరిది.

"ఛుప్ ఛుప్ ఛుప్ చుప్!" అన్నది సిద్దమ్మ.



సిద్దమ్మ సీనప్పకోసం కనిపెట్టుకుని కూర్చుంది. గది మళ్ళీ మళ్ళీ శుభ్రం చేసింది. అతను వొస్తే ఏం చెయ్యాలో తోచదు. ఎలా

వుంటాడో ! ఏం చేస్తాడో ! ఏమంటాడో ! అలికిడైతేచాలు గుండె దడదడ కొట్టుకునేది; వొళ్ళు వశం తప్పి మూర్ఛ వచ్చినట్టయ్యేది. "సీనప్పా!" అనుకుంది సిద్దమ్మ. సీనప్ప వొస్తున్నాడేమో అని రెండు మూడు సార్లు బయటికి వెళ్ళి చూచి వచ్చింది. ఒకసారి చీకట్లో రంయిన కొండల దాకా వెళ్ళింది. సీనప్ప కనపడలేదు. వెంటనే, మరొక దారిన ఇంటికి వొచ్చాడేమో అనుకుని వెనక్కి పరుగెత్తుకొని వచ్చింది సిద్దమ్మ.

సిద్దమ్మ ఇంటికి వొచ్చేటప్పటికి సీనప్ప రాలేదు. పిల్లవాడు మాత్రం లేచి గుక్కలు పట్టి ఏడుస్తున్నాడు. సిద్దమ్మ పిల్లవాడికి పాలిచ్చి పడుకోబెట్టింది.

లేచి వొచ్చి మరిదిని లేపింది సిద్దమ్మ.

"నిజం చెప్పయ్యా" అన్నది సిద్దమ్మ.

"బద్ధకంగా వుంటేనూ" అన్నాడు మరిది.

"చెప్పవూ?" అడిగింది సిద్దమ్మ.

"చెపుతా" అన్నాడు మరిది.

"అతగా డొస్తానన్నది ఇవ్వాళేనా?"

"ఏదో రోజు; అంటే ఇవ్వాళే. ఒకటి - రెండు - మూడు - నాలుగు - అయిదు - ఆరు - ఏడు" అన్నాడు మరిది.

"ఇంకా రాలేదు" అన్నది సిద్దమ్మ.

"చూడూ?" అన్నాడు మరిది.

"చూచా!" అన్నది సిద్దమ్మ.

"వొచ్చేముందు కొండమీద దీపం వెలిగిస్తా నన్నాడు" అన్నాడు మరిది.

"దీపమా?" అన్నది సిద్దమ్మ.

"దీపమే !" అన్నాడు మరిది.

"ముదనష్టపాడు !" అన్నది సిద్దమ్మ మురిపెంగా.

"ఎటు తిరిగితే అదే" అన్నాడు మరిది.

సిద్దమ్మా, మరిదీ కొండవైపు చూస్తూ కిటికీదగ్గర నిలబడ్డారు. ఎంతసేపు చూచినా చీకటి నలుపుకంటే కారునలుపుగా కొండే కనిపిస్తూ వుంది.

"ఆరిపోయిందేమో !" అన్నది సిద్దమ్మ.

"అహఁ !" అన్నాడు మరిది.

"గాల్లో దీపం" అన్నది సిద్దమ్మ.

"గుళ్లో లింగం" అన్నాడు మరిది.

చూచిచూచి కళ్లు చిల్లులు పడుతున్నై సిద్దమ్మకి. సిద్దమ్మకి కళ్ళల్లో నీళ్ళు తిరిగినై.

రైల్లో గుడ్డివాళ్ళు పాడుకునేపాట జ్ఞాపకం వొచ్చింది.

'ఎంతపని చేసితివి, రామా...
నిన్నేమనందును, సార్వభౌమా...'

"అదుగో" అన్నాడు మరిది.

"ఏమిటి ?" అడిగింది సిద్దమ్మ.

"కొండమీద దీపం" అన్నాడు మరిది.

సిద్దమ్మ రివ్వున కొండవైపు తిప్పింది తల.

నిజంగా కొండమీద దీపం ! సిద్దమ్మకి ఈ తడవ ఏ పాటా జ్ఞాపకం రాలా.

"ఓ మరిదీ ?" అన్నది సిద్దమ్మ.

"ఏం వొదినా ?" అడిగాడు మరిది.

"ఎందుకు దీపం అటూ ఇటూ వూపుతాడు ?" అడిగింది సిద్దమ్మ.

"వొస్తున్నా, వొస్తున్నా అనే గుర్తుకి" అన్నాడు మరిది.

"ముదనష్టపాడు !" అన్నది సిద్దమ్మ మురిపెంగా.

చటుక్కున కొండలమధ్య తుపాకి పేలింది. సిద్దమ్మ గుండె గుభేలు మన్నది.

"ఉంజ్ఞ, ఉంజ్ఞ" అన్నాడు పిల్లవాడు.

సిద్దమ్మ పిల్లవాణ్ణి గుండెలకి హత్తుకుంది.

"మరిదీ, మరిదీ !" అన్నది సిద్దమ్మ.

"ఏం వొదినా ?" అన్నాడు మరిది.

"కొండమీద దీపం ?" అన్నది సిద్దమ్మ.

"ఆరిపోయింది !" అన్నాడు మరిది.

"మరి నా సీనడో ?" అంది సిద్దమ్మ.

"ఉంజ్ఞ, ఉంజ్ఞ" అన్నాడు పిల్లవాడు.

మళ్ళీ కొండల మధ్య తుపాకి పేలింది: మరిది ఉప్పెనకు మల్లే రివ్వున వెళ్ళాడు కొండమీదికి. సిద్దమ్మకి అంతా అయోమయంగా వుంది. గుడ్లు అప్ప చెప్పి చూస్తూ నుంచుంది.

"ఉంజ్ఞ, ఉంజ్ఞ, అన్నాడు పిల్లవాడు.

"ఉందరా" అన్నది సిద్దమ్మ.

అత్తమామలు ఎవరి కళ్ళు వాళ్ళు నులుముకుంటూ వొచ్చారు. మామకి సిద్దమ్మని పలకరించటానికి భయం వేసింది.

అందుకని వెంకమ్మని పలకరించాడు.

"వెంకమ్మా ?" అన్నాడు వెంకయ్య.

"ఏంది ముసలాయనా ?" అన్నది వెంకమ్మ.

"మరిగ త్రే..." అన్నాడు వెంకయ్య.

"అడుక్కో" అన్నది వెంకమ్మ.

"ఆమోత ఎక్కడిదీ అంట !"

"ఏమోత ?" అన్నది వెంకమ్మ

"ఇందాకటిదే !" అన్నాడు వెంకయ్య.

"అదా ?" అన్నది వెంకమ్మ.

"అదేనే !" అన్నాడు వెంకయ్య.

"చెప్పనా ముసలాయనా ?"

"చెప్పవే, నా మొహిరీ !"

"చెవ్వేదీ ?" అన్నది వెంకమ్మ.

"ఇదిగో" అన్నాడు వెంకయ్య చెవ్వ అందిస్తూ.

"మరే ?——" అన్నది వెంకమ్మ చెవులో.

"కొరికేవే, భామా" అన్నాడు వెంకయ్య.

"ఆమోతే—" అన్నది వెంకమ్మ చెవులో.

"ఓసి లలనా, మగువా, సకియా, చెప్పవే" అన్నాడు వెంకయ్య.

"నేను చెప్పనా ముసలాయనా !" అన్నది వెంకమ్మ.

మళ్ళీ కొండల మధ్య తుపాకులు పేలినై. ఈసారి వొక్క సారికాదు. వరసనే ఆరుసార్లు. సిద్దమ్మ కళ్లు అగ్నిగోళాలయినై. సీనప్ప ఏమయ్యాడు ? మరిది ఏమయ్యాడు ? పిల్లవాణ్ణి గుండెలకు అదుముకొని కొండల వైపు పరుగెత్తింది సిద్దమ్మ. చీకటిలో కలిసి పోయింది సిద్దమ్మ.

"వెంకమ్మా !" అన్నాడు వెంకయ్య.

"ఏంది ముసలాయనా ?'' అన్నది వెంకమ్మ.

''ఇప్పుడు ఈమోత అనేది వొకటి వుంది చూశావూ" అన్నాడు వెంకయ్య.

''చూడకేం ?" అన్నది వెంకమ్మ.

''ఎవరు చేశారో నీకేమన్నా తెలుసటే ?'' అన్నాడు వెంకయ్య.

"తెలియకేం ?'' అన్నది వెంకమ్మ.

''తెలిస్తే చెప్పవే" అన్నాడు వెంకయ్య.

''కొత్త కొడుకులు కామాలు'' అన్నది వెంకమ్మ.

వెంకయ్యకి ఏమీ తోచలేదు. కొంచెం సేపు ఆగి మళ్ళీ అడిగాడు.

''సరేగాని, వెంకమ్మా—"

''అడుక్కో ముసలాయనా" అన్నది వెంకమ్మ.

"గంజేరాకు అంటే ఎందుకే నీకు అంత ఇష్టం ?'' అడిగాడు వెంకయ్య.

''మణేదారు రామయ్య మూలానే కామాలు'' అన్నది వెంకమ్మ.

''అంతే అంటావా ?" అన్నాడు వెంకయ్య.

''అంతే ముసలాయనా'' అన్నది వెంకమ్మ.

ఇంతలో ఒక పోలీసు రొప్పుకుంటూ వచ్చాడు. పోలీసును చూచి వెంకయ్యా, వెంకమ్మా మళ్ళీ మూలకి వెళ్ళారు.

పోలీసు భుజం మీద తుపాకి వుంది. నెత్తిన టోపీ వుంది. కళ్ళేమో చింత నిప్పులలాగా వున్నాయి.

ఇంట్లో అడుగు పెడుతూనే ''ఎవరక్కడ ?'' అన్నాడు పోలీసు.

"కిటిర్" అన్నాడు వెంకయ్య.

"కాదు, కాదు చీకటి'' అన్నది వెంకమ్మ.

''ఏదో వొకటి'' అన్నాడు వెంకయ్య.

''సీనప్ప తల్లి దండ్రులు మీరేనా ?" అడిగాడు పోలీసు.

''ఏమిటే అంటాడూ వెంకమ్మా ?'' అన్నాడు వెంకయ్య.

"ఏందో పాడూ" అన్నది వెంకమ్మ.

"చెప్పరేం ?" అన్నాడు పోలీసు కోపంగా.

''చెప్పవే'' అన్నాడు వెంకయ్య విసుగ్గా.

''అడుక్కోమను'' అన్నది వెంకమ్మ.

''అడుక్కో, పోలీసూ'' అన్నాడు వెంకయ్య.

పోలీసుకి కోపం వచ్చింది. భుజం మీది తుపాకి కిందికి దించాడు. నెత్తిమీది టోపీ చేత్తో పట్టుకున్నాడు. సరే, కళ్ళు చింత నిప్పులు.

"మీరేనా సీనప్ప...'' మొదలు పెట్టాడు పోలీసు.

వెంకమ్మకి తటాలున జ్ఞాపకం వొచ్చింది.

''అయ్యో మునలాయనా !'' అన్నది వెంకమ్మ.

''ఏమిటే వెంకమ్మా ?'' అన్నాడు వెంకయ్య.

''మన సీనప్ప, ముసలాయనా...'' అన్నది వెంకమ్మ. వెంకయ్యను కౌగలించుకొని బావురుమని ఏడ్చింది. వెంకయ్య కేమీ అర్థం కాలా.

''ఇదేమిటే ?'' అన్నాడు వెంకయ్య.

"సీనప్పని చంపారు'' అన్నది వెంకమ్మ.

''ఆఁ'' అన్నాడు వెంకయ్య.

''సీనప్ప తమ్ముణ్ణి కూడా, ముసలాయనా'' అన్నది వెంకమ్మ.

"ఊఁ" అన్నాడు వెంకయ్య.

"సిద్దమ్మ నీని" అన్నది వెంకమ్మ.

"అట్టాగదే, భామా" అని తనూ వెక్కి వెక్కి ఏడిచాడు. ఇక ఆయేడుపు కంతులేదు. ఏడుపు ఆపుకుంటారనే మరిచిపోయాడు వెంకయ్య. ఏడుపే ఏడుపు; ఒకటే ఏడుపు.

"మిమ్మల్ని అరెస్టు చేశాను" అన్నాడు పోలీసు.

"ఉంఙ్ఞ, ఉంఙ్ఞ!" అన్నది వెంకమ్మ.

"అదేమిటే పిల్లా?" అన్నాడు వెంకయ్య.

"సిద్దడు!" అన్నది వెంకమ్మ.

"పదండి" అని తుపాకి మడమతో పొడిచాడు పోలీసు. తుపాకి భుజాన వుంచుకున్నాడు. టోపీ నెత్తిన పెట్టుకున్నాడు.

పోలీసుకి కళ్లులేవు : ఉన్నవి చింత నిప్పులు.

# 15. పడవ ప్రయాణం

—పాలగుమ్మి పద్మరాజు

పొద్దు కుంకిన తరవాత లోకమంతా దిగులుగాఉంది. పడవ మెల్లగా నీటిమీద జారుతోంది. నీరు పడవపక్కని కలకలమంటూ రాసుకుంటోంది. చూపుమేరలో జీవ సంచలనం లేని ప్రపంచకం నిశ్శబ్దంగా ఝుమ్మంటోంది. ఆ ధ్వనిచెవులకు వినపడక దేహాన్నంతనీ తాకుతుంది. మనస్సులో లోపల అది నిండుగా కంపిస్తున్నట్టు ఉంటుంది. అప్పుడు ఏదో బ్రతుకుచివరి ఆఖరయిపోతున్న నిస్పృహ, ప్రశాంతమయిన నిరాశ మనస్సులో నిండుకుంటాయి. దూరంగా చెట్లు అస్పష్టంగా, మాయగా పడవతోకూడా నిశ్చలంగా ముందుకిసాగుతాయి. దగ్గరగా ఉన్నచెట్లు తలలు విరబోసుకున్న పెద్ద దెయ్యాల్లాగా జీబురుమంటో వెనక్కి నడుస్తాయి. పడవ కదలదు. కాలవగట్టు కదులుతుంది. నా చూపులు చొచ్చుకుని చొచ్చుకుని నీటిలోకి చూస్తాయి. అందులో ప్రతిబింబించిన చీకటిని చీల్చుకుని చూస్తాయి. నక్షత్రాలు మెల్లగా కెరటాల మీద వివశంగా ఉయ్యాలలూగుతాయి. కన్ను తెరచి నిద్రపోతాయి.

గాలిలేదు. పడవ లాగేవాడు, మునిగర్ర చప్పుడయి నప్పుడల్లా బిగువుగా, వొదులుగా అవుతోంది. పడవ వెనకభాగంలో పొయ్యిలో నిప్పుమండుతోంది. అప్పుడప్పుడు రప్పుమంటోంది. అప్పుడప్పుడు తగ్గిపోతుంది. లోపలికి ఊరిననీరు చేదతో తోడి ఒకకుర్రవాడు కాలవలోకి పారబోస్తున్నాడు. పడవలోపల ఏవేవో బస్తాలున్నాయి. ధాన్యం, బెల్లం, ఉప్పు, చింతపండు వగైరా. పడవటాపుమీద నేను వెల్లగిలపడు

కున్నాను. పడవలోపలనించి చుట్టపొగలు, ఏదో సంభాషణ కలిసి మెల్లగా తాపీగా అన్నిదిక్కులకీ వ్యాపిస్తున్నాయి. గుమాస్తా కూచున్న గదిలో గుడ్డిదీపం కొద్దిగా కునుకుతోంది. పడవసాగుతోంది.

"ఏయి పడవా ? ఈ గట్టుకిరానీ ! ఈ గట్టుకి !" అని ఎవరో పిలిచారు.

పడవగట్టుకి జేరడంతోనే ఇద్దరు ఎక్కారు. పడవ ఆ పక్కకి కొంచెం వొరిగింది.

"టాపుమీద కూకుంటాంలే !" అంది ఆడగొంతుక.

"ఇన్నాళ్ళూ ఏడపోయావే ? కనమట్టంలేదు" అన్నాడు చుక్కాని కాస్తున్న మనిషి.

"ఇజానగరం. ఇశాకపట్టణం, మావోడూ నేనూకలిసి తిరిగొచ్చాం. అప్పన్న కొండకెళ్లాం"

"ఏడబోతన్నా ?"

"మందపాక పోతన్నాం మరిదీ ! కులాసగున్నావా ? గుమాస్తా గారు పాతోరేనా ?"

"ఆ !"

మగవాడు టాపుమీద అడ్డదిడ్డంగా పడుకుని ఉన్నాడు. అతని నోట్లోచుట్ట పక్కకి పడిపోతే ఆడమనిషి తీసి ఆర్పేసింది.

"ఒరేయి ! నెగిసి కూకోరా !"

"నోరుముయ్యి.... నెంజా ! నేను తాగాననుకుంటున్నావా ? మక్కెలిరగ దంతాను." ఒక పక్కనించి ఇంకోపక్కకి తిరిగి పడుకున్నాడు. ఆడది అతని వొంటిమీద గుడ్డకప్పింది. తనోచుట్ట తీసి అంటించింది. అగ్గిపుల్ల రప్పుమన్నప్పుడు ఆమెముఖం చూశాను. నల్లగా వున్నముఖం ఎర్రగా వెలిగింది.

ఆమెగొంతుకలో మగజీర ఉంది. ఆమె మాట్లాడు తున్నప్పుడు చనువుగా ఒప్పిస్తున్నట్టుగా ఉంటుంది. ముఖం అందమయినది కాదు. జుట్టు చెదిరిపోయినా ముఖంలో ఏదో పెద్దమనిషి తరహా ఉంది. నల్లటి రవిక ఉన్నట్టు తెలియడంలేదు. చీకట్లోకూడా ఆమెకళ్లు మేలుకున్నట్టు మెరుస్తున్నాయి. అగ్గిపుల్ల వెలుగులో పక్కని పడుకున్న నన్ను చూసింది.

"ఈ పక్కనెవరో పడుకున్నార్రా!" అని మగవాణ్ణి తట్టి లేపింది.

"తాంగోమే నెంజా. గొరవెడితే దొక్కలూడదదంతాను" మగవాడు అతిప్రయత్నంమీద కొంచెం దూరంగా జరిగాడు.

ఇంతలో దీపంపైకెత్తి గుమాస్తా పడవపక్కని నిలబడిచూశాడు. "ఏమేరంగీ, ఈడెవడు?" అని అడిగాడు.

"మావోడండి, బాబ్బాబు, రిమార్కురాయించండి" అంది రంగి.

"పద్దాలే దింపెయ్యి! దొంగ తొత్తుకొడుకుని. నీకు బుద్ధి లేదూ! మళ్ళీ ఆణ్ణి పడవెక్కిందా? తాగుబోతోణ్ణి"

"నే తాగందే. ఎవరంట నే తాగానంటా?" అన్నాడు పద్దాలు.

"ఒరే దింపెయ్యండర్రా! ఎందుకెక్కనిచ్చారీణ్ణి! చిత్తుగా తాగున్నాడు."

"చిత్తుగానేదు. కొంచెం దావత."

"ఊరుకోరా! గుమాత్తాగార్రా! బాబ్బాబు, మండపాకాకాడ దిగిపోతాం."

"గుమాత్తాగారూ! దండాలండి! తమ దయండి. నేను తాగ నేదు బాబూ!"

''ఏమన్నా అల్లరిచేస్తే కాలవలోకి తోయించేస్తాను జాగ్రత్త !''
గుమాస్తా గదిలోకి వెళ్ళిపోయాడు. పద్దాలు లేచికూర్చున్నాడు. నిజానికి ఆట్టే తాగినట్టులేదు.

''కాలవలోకి తోయిం చేత్తాడంట ! నా కొడుకు'' అన్నాడు మెల్లగా.

''ఊరుకోరా ! ఇనమదద్ది''

''రేప్పొద్దున్న పడవ సూసుకోమను. యాసాలేత్తాడు. నా కొడుకు''

''ఉస్సు ! ఆ పక్కనెవరో పడుకున్నారు''

''ఎవరు ?... నిద్దరోతన్నారు'' పద్దాలు చుట్ట అంటించాడు.

పద్దాలుకి బొద్దు మీసాలు. కోలముఖం. చాతీ ఎప్పుడూ విరుచుకుని ఉంటుంది. వెన్నెముక ఉండేలు బద్దలాగ వంగి నిలబడుతుంది. మొత్తంమీద మనిషి కొంచెం సన్నంగా నిర్లక్ష్యంగా ఉంటాడు.

పడవ మళ్ళీ నిశ్శబ్దంగా సాగుతోంది. పడవ వెనక భాగంలో నిప్పురగల్తడంలేదు. సరంగులు తిండి తిన్న గిన్నెలు తాపీగా మాట్లాడుకుంటో కడుక్కుంటున్నారు.

గాలి చలిగా లేదు. అయినా నేను కండువా కప్పుకున్నాను. అనంతమయిన ఆ చీకటికి అసహాయంగా శరీరాన్ని అప్పగించడానికి నాకు భయం వేసింది. గాలి మాత్రం చురుకుగా ఉంది - మెత్తని స్త్రీ స్పర్శలాగ. పడవ నీటిమీద ఎంత మృదువుగా రాసుకు పోతోంది ! చెప్పలేనంత మృదుత్వం, విశాలమైన స్త్రీత్వం ఆ రాత్రిలో నిండుగా ఆవరించుకుని ఉంది. ఆ కౌగిలిలో నాకు చిరకాలం నాటి విషాద గాథలు మెల్లగా ఆప్యాయంగా జ్ఞాపక మొస్తున్నాయి— అనాదినుంచీ మగవాణ్ణి లాలించి పోషించిన స్త్రీత్వపు గాథలు.

నాకు కొంచెం దూరంలో రెండు చుట్టలూ ఎర్రగా కాలు తున్నాయి. జీవితం బరువుగా అక్కడ కూర్చుని ఆలోచించుకుంటూ చుట్టకాలుస్తున్నట్టు నాకు అనిపించింది.

"వొచ్చేదేవూరు ?" అన్నాడు పద్దాలు.

''కాల్దారి'' అంది రంగి.

"ఇంకా శానాదూరముంది"

''ఇయ్యాల జాగత్తుంద్రా. వొద్దు వొద్దు. ఈలుసూసుకుని తర వాత ? ఏరా నామాటినవూ ?" రంగి జాలిగా బతిమాలుతూ అడిగింది.

''బెదురు నెంజకి"- అన్నాడు పద్దాలు. అంటూ ఆమె పక్కలో వేలెట్టి పొడిచాడు.

''అమ్మో !" అందిరంగి. అని తన్మయంగా ఆకాశంలోకి ముఖ మెత్తి చీకట్లోకి చూసింది. ఆ స్పర్శ శాశ్వతంగా ఉండిపోవాలని కోరు తున్నట్టుగా ఆమె ముఖమెత్తింది.

నాకు క్రమంగా నిద్రపట్టింది. పడవంతా కూడా నిద్రపోతో, నీటివాలుకి మెల్లగా జారిపోతోంది. నాకు కొంచెం దూరంలో ఆ ఇద్దరు వ్యక్తులూ కొంతసేపు గుసగుస లాడుకున్నారు. నాకు నిద్రపట్టినా, పూర్తిగా పట్టలేదు. పడవ నడుస్తున్నట్టు, నీరు జారుతున్నట్టు, చెట్లు వెనక్కి పోతున్నట్టు తెలుసును. పడవ నెవరూ లాగడంలేదు. పడవలోపల అంతా కునుకుతున్నారు. రంగి నా పక్కనించి వదిలి చుక్కాని దగ్గరకు వెళ్లి కూచుంది.

''మరిదీ ! ఎల్లాగున్నా ?'' అంది.

''నువ్వెల్లాగున్నా ?'' అన్నాడు చుక్కాని కాసేవాడు.

"ఎన్నెన్ని సిత్తరాలు సూపించాడనుకున్నా మావోడు ! చినీమా కెళ్ళాం ! ఓడల్ని సూశాం ! ఓడంటే ఓడకాదు మరిదీ ! మావూరం

తుంది. మరి సుక్కాని నెక్కడుందోగాని!'' రంగి అల్లా ఏదో చాలా సేపు కబుర్లు చెపుతో కూర్చుంది. ఆ కబుర్లు నన్ను జోకొడుతున్నట్టున్నాయి.

"పిల్లా! నాకు నిద్దరొత్తందే!" అన్నాడు చుక్కాని కాసే మరిది.

"సుక్కాని నేసూత్తాలే నువ్వలా తొంగో మరిదీ!" అంది రంగి.

పడవ మళ్ళీ మెల్లగా జారిపోతోంది- నిశ్శబ్దంగా. రంగి ఆ నిశ్శబ్దాన్ని కదపకుండా తనగొంతు కెత్తి చల్లగా పాటపాడింది.

''యాడున్నాడో !- నావోడు- యాడున్నాడో!
కూడు గిన్నెలో యెట్టి- కూకుని సూత్తుంటే
నీదల్లె మాపెల్లి నిదరే కంటికిరాదు-యాడున్నాడో''
తెల్లల్లే కొండెత్తి- తెగకుట్టే సలిగాలికి
నాలోపలంతా బిగిసినాదో మరిదీ!
యెచ్చని నీ వొళ్లు నన్నొత్తితేగాని
సచ్చిపోతానేమొ......యాడున్నాడో''

రంగి గొంతుకలోని మగజీరలో సంగీతముంది. ఆ పాటలో పడుకుని ఉన్న అన్ని ప్రాణులూ ఒకసారి కునికాయి. గడిచిన యుగాల ప్రేమగాథలు వింతగా, మెల్లగా, విషాదంగా ఆ పాటలో కంపించాయి. ఆపాట నీటి వెల్లువై పొంగితే అందులో లోకం చిన్న పడవలాగ తేలిపోయింది. మానవ జీవితం ఈ ప్రణయంతోటి, ఈ విషాదంతోటి బరువుగా, మాయగా, వింతగా అనిపించింది.

నాకు కొంచెం దూరంలో పద్దాలు నెత్తినిముసుగు మూసుకొని కూర్చున్నాడు. కానీ అతనికీ రంగికీ మధ్య కొన్ని యుగాల అంతర మేదో ఉన్నట్టు తోచింది. అతను టాపుదిగి పడవలోకి పోయాడు.

నేను ఒంటరిగా వెల్లగిల పడుకొని చూస్తున్నాను. రంగి అల్లాగే పాడుతోంది.

"గుడియెనక సందులో గుంటున్నా దాని
సడి సెయ్యక నువ్వు దగ్గర జేరితే
గుడియెనక గుంటెవరు ? బావా ?
నడివయసులో నేను కానా!''

నాకు నిద్రపడుతోంది. రంగిపాట అల్లా లోకాలు తిరిగివచ్చి మళ్ళీ మెల్లగా నాగుండెల్లో తగులుతోంది. నాకు నిద్రపట్టింది. నిద్రలో ప్రాకృతికమయిన ప్రణయం నా ముందు గంతులువేసింది. పల్లెటూళ్లలో కాపు పడుచులు తమ ప్రియులతో దాగుడు మూతలాడుకుంటూ పాటలో కలిసిపోయారు. నేనెరుగని ఒకానొక స్వాప్నికలోకం నాముందు నిద్రలో తెరుచుకుంది. అందులో రంగి, పద్దాలు అనేక రూపాలతో తిరుగుతున్నారు. పాట క్రమంగా నా జ్ఞప్తిలోనించి పోయింది. నిద్ర నా మనస్సు తలుపులు మూసింది.

* * * *

పడవలో కొంచెం గొడవయింది. నేను కళ్లు నులుపుకుంటో లేచాను. పడవగట్టుకి చేర్చివుంది. రెండు లాంతర్లు పట్టుకుని సరంగులు కంగారుగా పడవఎక్కి దిగుతున్నారు. గట్టుమీద రంగిని ఇద్దరు గట్టిగా పట్టుకున్నారు. అందులో ఒకడు గుమాస్తా. అతని చేతుల్లో మడిచిన తాడుంది. రంగికి అప్పుడే దెబ్బలు తగిలుంటాయి. నేను చటుక్కుని పడవదిగి గట్టుమీదికి గెంతాను. ఏం జరిగిందని అడిగాను.

''ఆ దొంగనాకొడుకు పారిపోయాడు. సరుకు ఎత్తుకుపోయాడు. ఈ లంజ ఎక్కడో గట్టుకు తార్చింది పడవని. సుక్కాని పట్టుకుంది లంజ :'' గుమాస్తా కోపంగా, చిరాకుగా నిస్పృహతో అన్నాడు.

"ఏం పోయాయి ?" అని అడిగాను.

"రెండు బెల్లం బుట్టలు, మూడు చింతపండు బుట్టలు. నేనందుకే ఎక్కనివ్వొద్దన్నాను. యజమాని నాక్కడతాడు నష్టమంతాను. ఎక్కడ దింపుకుపోయాడే ?"

"కాల్దారి కాదండి ? బాబయ్యా !"

"ఛీ ! లంజా ! కాల్దారి కాద మేం మేలుకునుంటేనే?"

"అయితే నిడదోలు కాదేనండి !"

"ఇదిప్పుడు చెప్పదు. రేపు అత్తిల్లో పోలీసోళ్ల కప్పగిద్దాం ! ఎక్కు, పడవెక్కు."

"నన్నిక్కడొగ్గెయ్యండి. బాబ్బాబు !"

"అట్టే యేసాలెయ్యకు. ఎక్కెక్కు!" గుమస్తా ఆమెను పడవ్వే పుత్తోశాడు. ఇద్దరు సరంగులు ఆమెను పడవెక్కించారు. "నిద్దర మొకాలు ! జేరారు ! సూసుకోవొద్దూ ! దాని చేతుల్లో సుక్కాని ఎవ రెట్టమన్నారు ! బుద్ధిలేదూ ?" గుమాస్తా అందరిమీదా విసుక్కుని గది లోకి పోయాడు. రంగిని టాపుమీదికి ఎక్కించారు. ఒక సరంగు ఆమె పారిపోకుండా కాపలావున్నాడు. నేనుకూడా టాపుమీదికి ఎక్కాను. పడవ మళ్ళీ కదిలింది. నేను చుట్టముట్టించాను.

"అయ్యగోరో సుట్ట ఇప్పించరూ !" రంగి చనువుగా అడిగింది. నేనో చుట్ట, అగ్గిపెట్టి ఇచ్చాను. ఆమె చుట్ట ముట్టించింది "మరిదీ ! నన్ను పోలీసోళ్ళ కప్పగించి ఏం లాబం ?"

"గుమాస్తా వొదలడు !" అన్నాడు సరంగు.

"పద్దాలు నీ మొగుడా ?" అని అడిగాను.

"మా వోడు" అంది రంగి.

"దీన్ని నెగదీసుకుపోయాడండి! పెళ్ళాడలేదు. ఆడికి ఇంకో కత్తుంది. ఇప్పుడది ఎక్కడుందే?'' అన్నాడు సరంగు.

''కొవ్వూరులో ఉంది. రంగూ, పొంగూ బాగుందిప్పుడు. నేను తిన్నన్ని తన్నులు తింటే అదీ నా లాగే అవుద్ది. గుడిశేటినెంజ.''

''మరి నీ కింకా వాడితో ఎందుకు?" అన్నాను నేను.

''ఆడు నావోడండి!'' అంది. అంతా అందులో ఉన్నట్టుగా.

''మరి ఇంకొకత్తితో పోతున్నాడన్నావుగా?''

"నాదగ్గరికిరాకుండా ఎక్కడ పోతాడు? మొగోడి కెంత మందయితే మాత్రమేం? ఆడదండి, అయ్యగోరూ! మా రాజండి. అల్లాంటి మనిసిలేడండి మల్లీని.''

''బాబో! ఆడిసంగతి మీరింకా ఎరగరు. ఇదెంత రంగుగా ఉండేదనుకున్నారు? ఓటూరండి, దీన్ని గుడిసెలోపెట్టి గుడిసి అంటిం చేశాడు. మగ్గిపోయిందనుకోండి! ఇంకా దీనికి భూమ్మీది నూకలున్నా యిగాని'' అన్నాడు సరంగు.

''అయ్యగోరు! అప్పుడు ఆడు కనమడితే పీకి నులిమేద్దా మనుండేది. కాలిన గడోటి ఈపుమీద పడిందండి'' ఆమె వెనక్కితిరిగి రవిక కొంచెంపైకెత్తింది. తెల్లటిమచ్చ ఆ చీకట్లో కూడా స్పష్టంగా కనబడింది.

"మరి నిన్నిల్లా చేస్తుంటే ఇంకా వాణ్ణి పట్టుకు దేవులాడతావేం?'' అని అడిగాను.

''ఏం చెయ్యను? ఆడుకంటబడితే అన్నీ మరిచిపోయి కరగి పోతాను. ఎంతజాలిగా మాట్టాడతాడని! ఈ సందాల కొవ్వూరులో బయలుదేరాం. దార్లో నన్ను ఎంతోజాలిగా బతిమలాడాడు. ఈ

పడవలో ఎక్కి చేతికిచిక్కిన సరుకుదించి పారెయ్యాలని. నేనుంటేగాని సాగదు. అద్దదోవనినడిచి మడుగు జేరుకున్నాం...''

"ఎక్కడ దింపేశాడు సరుకు ?''

''ఎక్కడో నాకు గుర్తునేదండి''

"దొంగ నెంజ'' అన్నాడు నవ్వుతూ సరంగు. రంగి మొగం చూడాలని నాకు ఎంతో కుతూహలం వేసింది. కాని ఆకటికి చీకట్లో ఆమె మాయమనిషిలాగ అవ్యక్తంగానే ఉండిపోయింది.

పడవ మెల్లగా పాకుతోంది. నడిరాత్రి గడిచిన కొద్దీ గాలి చిరు చలిగా తగులుతోంది. చెట్ల ఆకులు కొద్దిగా కదులుతున్నాయి. మళ్ళీ పడవని సరంగులు లాగుతున్నారు. నా కింక నిద్రపట్టలేదు. కొంత సేప టికి కాపలా వున్న మనిషి కునికి ఒరిగి చివరికి నిద్రపోయాడు. రంగి మాత్రం ఇంక పారిపోయే ప్రయత్నం మానుకుంది. తాపీగా చుట్ట కాలుస్తూ కూర్చుంది.

"నీ కసలు పెళ్ళి అవలేదా ?'' అని అడిగాను నేను.

"లేదు. సిన్నతనంలోనే పద్దాలు నన్ను లెగేసుకొచ్చాడు''

''మీదేవూరు ?''

''ఈంద్రపాలెం.... అప్పుడు తాగుతాడని నాకు తెలదు........ ఇప్పుడు నేనూ తాగుతాననుకోండి. తాగితే తప్పులేదు. తాగి సావగొడ తాడు''

''మరి వొదిలి వెళ్ళిపోకపోయావా ?''

''తన్నులు తిన్నప్పుడల్లాగనిపిత్తది. అయినా అంతటి మనిషి లేదండి. మీరెరగరు. ఉత్తప్పుడండి, యెన్నలా కరిగిపోతాడు. వొంద మందితో పోయినా సరే ఆడు. నా కాడికొచ్చి తీరతాడు. నేను లేక పోతే గుండగిలి సచ్చిపోడూ ?''

నాకు వింతగా అనిపించింది ఆ అమ్మి తత్వం. వాళ్ళిద్దరికీ మధ్య ఉన్న అనుబంధం ఎల్లాంటిదో నాకు అర్ధం గాలేదు. రంగి మళ్ళీ చెప్పడం మొదలెట్టింది.

"మా కిద్దరికీ ఏ పనీ సరిపడింది కాదు, సిగురుకి ఇల్లా దొంగతనాల్లోకి దిగాం. మాయమ్మొండేది, మొన్న సచ్చిపోయింది. నన్ను తిడుతుండేది. ఓ నాడండి, నా గుడిసికి ఆ నెంజని తీసుకొచ్చాడు"

"ఎవరిని?"

"ఇప్పుడున్న గుంటని. నా యెదురుగుండా, నా ఇంటో దాంతో తొంగున్నాడు. నా కళ్లెదర! చిత్తుగా తాగొచ్చాడు. అదీ తాగింది. నా సయితి! దాని మీదపడి పీకాను. ఆడు నన్ను సావదన్నాడు. అర్ధ రేత్తిరికాడ దాన్నెక్కడకో తీసుకుపోయాడు. మళ్లీవొచ్చాడు. నేను తిట్టాను. ఇంటోకి రావద్దన్నాను. గుమ్మంకాడ కూకుని పిల్లోడికన్నా జాలిగా ఏడిచాడు. నా గుండె కరిగిపోయింది. నేను దగ్గరగా జేరితే నన్ను వొళ్ళోకి తీసుకుని నా నానుపేట ఇమ్మన్నాడు. ఎందుకన్నాను ఆ గుంట తెమ్మందన్నాడు. నాకు ఒళ్ళు తెలదు; నానా తిట్లు తిట్టాను. ఏడిచాడు. ఆ గుంటలేకపోతే బతకలేనన్నాడు. నాకోపం ఎక్కువయి పోయింది. గుమ్మంలోంచి గెంటి తలుపేసుకున్నాను. తలుపు గుంజీ గుంజి సివరికి ఎల్లిపోయాడు. నాకు శానాసేపు నిద్దరరాలేదు. కొంచెం కునుకు పట్టేతలికి ఇల్లంటుకుంది. తలుపుపైన గొళ్ళమేసి నడికొప్పంటించాడు. ఎవరూ రాలేదు. నడిరాత్తిరి. నా వొళ్ళంతా మగ్గిపోయింది. తలుపు గుంజీ గుంజీ ఇంక తెలివి తప్పింది. ఇంతలో ఎవరో అవతల్నించి తలుపు తెరిచారు. మన్నాడు ఆణ్ణి పోలీసోళ్ళట్టుకున్నారు. ఎవరి మీద అనుమానముందో నన్ను చెప్పమన్నారు. ఆడు మాత్రం గాదని కచ్చితంగా చెప్పేశాను. సందేల నాకాడకొచ్చి, ఎంతో జాలిగా ఏడి

చాడు. తాగినప్పుడల్లా ఏడుస్తాడు. ఉత్తప్పుడసలు ఏడుపేరాదు. నవ్వుతుంటాడు. సుక్కడితేసాలు; ఏడుపే. పిల్లోడికన్నా ఎక్కువగా ఏడుస్తాడు. నా నానుపేట లిచ్చేసాను."

"నువ్వింకావాడితో ఎందుకు దిగుతావు ఈ దొంగతనాల్లోకి?"

"ఏం జెయ్యమంటారు ? ఆడొచ్చి గోలెడితే?"

"మరి నిన్ను విజయనగరం అక్కడికి తీసుకుని వెళ్ళాడన్నావు?"

"వొట్టిది. ఊరికే అల్లా సెప్పాను. నేనంటే కొంచెం సరంగులికి నమ్మకం. ఇదిగాక రెండుతూర్లు ఈ పడవలో దొంగతనం జరిగింది."

"నిన్నుపట్టుకుంటే పోలీసులు ఏంజేస్తావు?"

"ఏమీ చెయ్యను. నన్నుపట్టుకుని ఏంజేత్తారు ? నాకాడ దొంగ సొమ్ము లేదు. ఏమో, ఎవరెత్తుకపోయ్యారో. ఓ రోజు కొడతారు. మన్నాడొగ్గేత్తారు."

"పద్దాలునిపట్టుకుంటే ? ఆ దొంగసొమ్ముతో దొరికిపోతే?"

"ఆడు దొరకడు. ఈ పాటికంతా అయిపోద్ది. ఆడుదొరక్కుండానే నేను పడవలో ఉండిపోతా."

ఆమె నిట్టూర్పువిడిచి మళ్ళీ మెల్లగా తనలోతను అనుకున్నట్టు చెప్పింది.

"ఈ సొమ్మంతా మళ్ళీ ఆగుంటకే దక్కుడు. దానిమీద మోజు తగ్గిదాకా దాన్నొదలడు. నేను ఈ కట్టాలన్నిని. దొంగనెంజ నా ఉసురోసు కుంటది."

ఆ మాటల్లో నిజంగా ఉద్రేకమేమీ లేదు. ఆమె అతణ్ణి ఉన్నవాణ్ణి ఉన్నట్టుగా అంగీకరించింది. పద్దాలు కోసం ఆమె ఎల్లాంటి పనన్నా చేయడానికి సిద్ధంగావుంది. అది ఒక ఆదర్శమూ కాదు, భక్తికాదు

ప్రేమా కాదు. ఎన్నో చిత్రమైన సంకీర్ణభావాలతో, ఈసులతో, అనురాగాలతో ఎన్నిటితోనో కలిసిన స్త్రీ హృదయం. అయినా ఆ హృదయం అన్నిటికీ ఫలితంగా ఒకేచోట లగ్నమయివుంది. తన మగవాడి కోసం ఆమె నిరంతరం తపిస్తుంది. కానీ అతడు నిర్దుష్టంగా, నీతిగా నడచుకోవాలని ఆమెకు పట్టింపులేదు. అతని సుగుణాలతో, అవగుణాలతో అతన్ని ఆమె అంగీకరించింది. నాకామె బ్రతుకు బరువనిపించింది. నిజానికి నా బ్రతుకే బరువేమో అంతకంటే.

గాలి అంతకంతకు బాగావీస్తోంది. పడవ కొంచెం వేగంగా పోతోంది. అలసట తీర్చుకున్నలోకం నిద్ర మేలుకోబోతోంది. అక్కడక్కడ పాలికాపులు పొలంగట్లని నడుస్తూ కనబడుతున్నారు. వేగుచుక్క ఇంకాపొడవలేదు. రంగిమోకాళ్ళు ముడుచుకుని ఎటోఅవ్యక్తంగా చూస్తోంది.

"ఆడునావోడు! ఎన్ని తిరుగుళ్ళు తిరిగినా నావోడు. నా దగ్గరకే వొస్తాడు." అని తనలోతను అనుకుంది. అందులో ఒకఆశ, ఒకధైర్యం ఒక విశ్వాసం తొణికిసలాడాయి. ఆ మాట ఆమెజీవిత సర్వస్వానికీ కేంద్రంలాగా అవుపించింది. నేను భయంతో భక్తితో, జాలితో ఆమాట విని ఊరుకున్నాను. అల్లాగ తెల్లవారీదాకా మేమిద్దరం కూర్చున్నాం.

నేను పడవ దిగిపోయేముందు జేబులోంచి ఒక రూపాయితీసి చటుక్కుని ఆమె చేతిలోపెట్టి తొందరగా ఊళ్ళోకిపోయాను. ఆమె జవాబు చెప్పేదాకా నేను నిలబడలేదు. ఆమె సంగతి తరవాత ఏం జరిగిందో నాకు తెలియదు.

(జనవరి, 1945)

# 16. అన్నదమ్ములు

—జమదగ్ని

'ఏమిటిరా ! ఈ తగూలు. నే చెప్పినట్టూ వినక, మీ అంతట మీరూ చూచుకోకపోతే ఎల్లా ఈ వ్యవహారం తెమలడం ? రాముడూ ! నువ్వన్నా ఒక దారికిరా' అన్నాడు గ్రామంలో కుల పెద్ద ముసలి పుల్లారెడ్డి.

'ఇల్లు అలా పంచితే నేనెందు కొప్పుకుంటాను తాతా ! గాలీ, వెల్తురూ వచ్చే దక్షిణపు భాగం వాడు తీసుకుంటే ఈ చీకటి కోణంలో నే ఉండాలీ ! వాణ్నే ఉత్తరపు భాగం తీసుకోమను' అన్నాడు చిన్నవాడు గోపాలం.

'సరే ! ఇంటి విషయంలో వాడు చెప్పినట్టే కానియ్యి తాతా ! పొలం మాట గూడా పరిష్కారం చెయ్యి !' అన్నాడు రాముడు,

'పొలానికి పెద్ద పంచేదేమున్నదిరా ! ఉన్నవి రెండెకరాలాయి. రెండూ నాలుగు మళ్ళుగా కిందనే ఉన్నాయి. ఇద్దరూ చెరో రెండు మళ్ళూ తీసుకోండి ?'

'మళ్ళీ అదేమిటి ! ఏఏ మళ్లు ఎవరెవరు తీసుకోవాలో గూడా ఖరాఖండిగా తేల్చేసెయ్యి !'

'అయితే నువ్వు ఎగువ రెండు మళ్ళూ తీసుకో ! దిగువ రెండు మళ్ళూ రాముడు తీసుకుంటాడు.'

'బాగానే ఉంది ! నీరు సమంగా పట్టి ఎక్కువ పంట పండే పల్లపు మళ్ళు రెండూ వాడి కిచ్చి ఎందుకూ పనికిరాని ఎగువ మళ్ల రెండూ నన్ను తీసుకోమంటే నేనేమన్నా బాగుపడాలా !'

'తాతా ! ఈ పంపకంతో నా ప్రాణం విసిగెత్తి పోతోంది. వాడిష్ట మొచ్చినట్టు కానీ ప్రతిదీని ?

'అదేమిటండీ ! అంతకాడికి పంపకాలు పెట్టుకోకపోతే ఏం ? అంతా ఆయనగార్నే తీసుకోమని ఊరుకోకపోయారూ' అని గది కిటికీలోనుంచి తొంగి చూస్తున్న అన్నపూర్ణ భర్త నుద్దేశించి అన్నది.

రాముడు భార్య మాట వినీ విననట్టుగా ఊరుకున్నాడు. పుల్లా రెడ్డి ఆ మాటల్తో కొంచెం కదిలి న్యాయమాలోచించి 'గోపాలం ! నువ్వన్న మాట బాగానే ఉంది. ఎగువమళ్ళు రెండూ ఎందుకూ పనికి రావని నువ్వే అంటున్నావు కదా ! అవి వాడు మాత్రం ఎట్లా తీసు కుంటాడు చెప్పు' అని మెల్లగా అన్నాడు.

దీంతో గోపాలం మండిపడి 'వ్యవహారాల్లో ఆడవాళ్ళు కూడా దిగితే ఇక చెప్పేదేముంది ? ఇంట్లో కూర్చుని ఏడవక పీటిల్లో వాళ్ళ కెందుకంట' అంటూ ఎదురుగుండా ఉన్న గేదెకట్టు కొయ్యవంక చూస్తూ అన్నాడు.

రాముడు ఈమాట భరించలేక పోయాడు. అతని కాపాద మస్తకమూ శరీరం కోపంతో గజగజలాడింది. 'తమ్ముడివని ఊరు కున్నానురా వెధవా ! ఏదో చిన్న వాడివి. నీకయిష్టంగా ఎందుకు జరగాలని నేను సర్దుకుంటూ ఉంటే నోటికి వచ్చినట్లల్లా పేల్తావేం. జాగ్రత్త !' అని అన్నాడు.

'నువ్వు వెధవా గిధవా అంటే ఇక్కడ పడేవాళ్ళెవరూలేరు. ఈముండ మోపి బెదరింపులకు నేనేం భయపడతాననుకున్నావు

కాబోలు. ఒళ్ళు దగ్గిర ఉంచుకు మాట్లాడు' అంటూ గోపాలం చొక్కా చేతులెగదీస్తూ అరుగు మీదనుంచి లేచాడు.

'కొడ్తావా ఏమిరా! కొట్టు చూద్దాం ఏ మాత్రం కొడ్తావో' అంటూ రాముడు ముందుకు వచ్చాడు.

'కొడ్తానా కొట్టి చూపిస్తానా! నాతో మర్యాదగా ఉండక పోతే చివరికి అంతే అవుతుంది. ఏమనుకుంటున్నావో' అని గోపాలం మరీ మీదికి వచ్చాడు.

పుల్లారెడ్డి చూస్తూ ఊరుకోలేక ఇద్దరి మధ్యకూ వచ్చి గోపాలం వంక చూచి 'ఇంతకాడికి నన్నెందుకురా నువ్వు పిల్చుకు వచ్చావు? చేతులు చాలా! నా దుడ్డు కఱ్ఱకూడా తీసుకుంటావా? భూమ్మీద నూకలు తక్కువై ఏడవబోకు' అంటూ కళ్ళు పెద్దవి చేశాడు,

గోపాలానికి రెడ్డి అంటే కొంచెం గౌరవం ఉంది. కాని అతనికి ఊరంతా అన్నపక్షమే అవలంబిస్తారని అనుమానం. ఈ అనుమానం తోనే రెడ్డి చెప్పినదానికి దేనికీ సరాసరి ఒప్పుకోక ఏదో సవరణ తెస్తూ ఉంటాడు. ఈ సమయంలో రెడ్డి ముఖం చూచేసరికి అతనికి కొంచెం భయం వేసింది. వెంటనే వెనక్కి తగ్గాడు. ఇది ఆసరాగా తీసుకొని 'అయితే నేనొక విధంగా తేలుస్తాను, ఇద్దఱూ వింటార్రా!' అన్నాడు రెడ్డి.

'నీ ఇష్టం వచ్చినట్టు చెయ్యి తాతయ్యా! నాకేమీ అభ్యంతరం లేదు' అన్నాడు రాముడు.

గోపాలం మాట్లాడలేదు.

'ఏరా! గోపాలం! నువ్వేమీ అవుననవు. మఱి నేనేం చెప్పినా ఎదురు చెప్తావాయె. ఎట్లా?"

'నువ్వు చెప్పు - ఏం చెప్తావో. నేనూ మాట్లాడనులే' అని అంటూ అరుగుమీద మళ్ళీ కూర్చున్నాడు గోపాలం.

'అయితే ఉత్తరపువైపు ఎగువమడీ, దిగువమడీ ఒకరు తీసుకోండి. దక్షిణపువైపు రెండుమళ్ళూ ఇంకొకరు తీసుకోండి. మఱి నీకేవైపు కావాలో చెప్పు'

'నేను ఉత్తరపుమళ్లే తీసుకుంటాను' అన్నాడు గోపాలం

రాముడు మాట్లాడలేదు. ఉత్తరపు మడిలోకి నీటి కాలవఉంది. దక్షిణపు మళ్లల్లోకి నీరు రావాలంటే ఆ మళ్ళల్లోంచిరావాలి. ఆ సంగతి అన్నపూర్ణకు తెలుసు. రాముడు ఏమీ మాట్లాడకుండా తలవంచుకు కూర్చున్నాడు. అందుకని ఆవిడ మళ్ళీ నోరుచేసుకో వలసి వచ్చింది. 'అయితే నీళ్లు ఆ మళ్ళలోనించి రావలసిందేనా వీటికి?' అని ఊరు కున్నది.

రెడ్డి వెంటనే అందుకుని 'దానికేం ? ఉత్తరపుమళ్లు తీసుకున్న వాడు దక్షిణపు మడిలోకి కాలవ తీయించియిస్తాడు. ఏరా గోపాలం !' అన్నాడు.

గోపాలం కాదనడానికి వీల్లేకపోయింది. 'సరే అట్లాగే కానియ్యి', అని ఊరుకున్నాడు.

రాముడు ఒప్పుకున్నట్టుగానే గ్రహించి పుల్లారెడ్డి 'ఇక మిగిలిందల్లా వాములదొడ్డీ, ఎకరం బీడూనూ. నా మతం ఏమిటంటే, ఇద్దఱూ చెఱి ఒకటీ తీసుకోవడం మంచిదని. రాముడూ ! ఈసారినువ్వు చెప్పు, నీకేం కావాలో' అని అంటూ గోపాలంవంక చూస్తూ నిలబడ్డాడు.

రాముడు 'నేనేమీ మాట్లాడను తాతాయ్యా. ఎందుకొచ్చిన అప్రతిష్ఠ ! ఏదో ఒకవిధంగా తేల్చేసెయ్యి' అన్నాడు.

దాంతో గోపాలానికి కొంచెం కోపంవచ్చింది. అయినా కార్యం సానుకూలం అయిందాకా మాట్లాడ గూడదని కొంచెం తమాయించుకుని

ఊరుకున్నాడు. గోపాలం ముఖంచూచి అతని మనోవిషయం గ్రహించాలని ప్రయత్నిస్తున్న పుల్లారెడ్డి 'అయితే గోపాలం! నువ్వు వాముల దొడ్డి తీసుకో, వాడికాబీడు ఇయ్యి. కాని దానికి కోఅడీ గీఅడీలేదాయె. అందుకని ఈ యేటికి మంగళగిరి కంపపెట్టించి కంచెవేయించి ఇయ్యి; ముందునాటికదే అబాజవుతుంది. ఏమంటావ్' అన్నాడు.

'నాకుమాత్రం బీడు అక్కఅలేదా ఏమిటి?' అంటూ మూతి ముడిచాడు గోపాలం.

వెంటనేరెడ్డి 'అదీ ఎకరమే. ఇదీ ఎకరమేనాయి. దీనికిచుట్టూ కోటగోడలాంటి రోఅంఉండె. దొడ్డినిండా వాములే పెడ్తావా? వామి మేరవిడిచి మిగిలింది రెండు చాళ్ళు దున్ని విడిచిపెడితే మొలలోతు బీడు సిద్ధమౌతుంది!' అన్నాడు.

'అదిమాత్రం నమ్మకమేమిటీ? అది ఎప్పుడో తాతలనాటి నుండీ దిక్కూ దివాసూ లేక వాములలో ఉడికెత్తిన భూమి గడ్డి పట్టుతుందా ఏడుస్తుందా! అట్లా ఎందుకు? ఇందులోనూ రెండుభాగాలు చెయ్యి; అందూలోను రెండుభాగాలు చెయ్యి, అన్నాడు గోపాలం.

'అక్కడోకాస్తా అక్కడోకాస్తా ఉంటే అబాజు చేసుకోవడం కష్టం కాదుట్రా!'

'కష్టం అయితే అయిందిలే. అట్లాచేస్తేనే నేను ఒప్పుకుంటాను.'

'ఎందుకు తాతయ్యా! ఇంతరాద్ధాంతం. వాడి ఇష్టంవచ్చినట్లు నిశ్చయించెయ్యి. నేనేమీ ఎదురు చెప్పనన్నాగా' అన్నాడు రాముడు.

'సరే! అట్లాగే కానివ్వండి. ఇక అయిపోయినట్టేనా!' అన్నాడు రెడ్డి.

'మఱి పాత్రసామగ్రీ - గొడ్డూగోదా. అసలు ముఖ్యమైన విషయాలు విడిచిపెట్టితే ఎట్లాగా? అవి పంచనక్కఅలేదా ఏమిటి?' అంటూ గోపాలం మళ్ళీలేచి నుంచున్నాడు.

దీంతో రాముడికి చిరాకు ఎక్కువైంది. పంపకమన్నాక అన్నీ ఒకసారే తేలిపోతే మంచిదిగదా అని సమాధాన పఱుచుకొని పాలేళ్లను కేకవేసి ఉన్నసామగ్రి అంతా దింపమన్నాడు. ఒక్క అరగంటలో చెంబూ తప్పాలా దగ్గఱ్నుంచీ బొట్టుపెట్టెలూ, భోషాణాల వఱకూ అన్నీ బైట పడవేశారు.

'తాతయ్యా! ఉన్న సామాన్లివి. నీ ఇష్టం వచ్చినట్లు పంచు' అని దూరంగా కూర్చున్నాడు రాముడు.

'ఇప్పుడు ఇంట్లో వాడకంలో ఉన్నసామాన్లు తనేతీసుకుంటాడా?' అని రెడ్డివంకచూసి అన్నాడు గోపాలం.

తలవంచుకొని అరుగుమీద నెత్తిన చేతులుపెట్టుకు కూర్చున్న రాముడు ఉలిక్కిపడి 'ఏమేవ్! ఆ అంట గిన్నెలతోపాటు ఇంట్లోఉన్న వస్తువులన్నీ బైటపడెయ్యి" అని భార్యనుద్దేశించి కేకవేశాడు. అన్నపూర్ణ ఒక్కొకటే బైటకు జేరవెయ్యడం మొదలుపెట్టింది. ఒక పాలేరు వాటి నందుకుని సామానులన్నింటిలో చేరుస్తున్నాడు.

ఇంతలో గొడ్లపాకలో పాడిఆవు అరిచింది. దానిముందు మేత అయిపోవడంవల్లచి మఱొక పాలేరు మేతతేవడానికి వెళ్ళాడు. పుల్లారెడ్డి సామాన్లు ఇంకా అన్నీరాకపోవడం చూచి ముందు పశువుల సంగతి నిర్ణయం చేద్దామనుకున్నాడు. వాళ్లకు రెండావులూ, రెండుగేదెలూ, ఒక ఎడ్లజత మాత్రం ఉన్నాయి. ఆ ఎడ్లజత వాళ్లఇంట పుట్టిపెరిగిందే. ఆ రెండావులూ ఏడాదివిడిచి ఏడాది కోడె దూడల్ని పెట్టాయి. అయితే అవి పీళ్ళకు ఏడాది హెచ్చుతగ్గుగా వచ్చాయి. అందుకని తొలి చూలు కోడెల్ని పెంచి పెద్దవిచేసి వ్యవసాయం చేస్తున్నారు. తర్వాత వాటి నన్నింటిని ఒకటి రెండు ఏళ్ళుపెంచి చిన్న సంసారం అయిన కారణంచేత అమ్మేసుకునేవారు. ఆవుల్నీ, గేదెల్నీ పంచడం విషయంలో

రెడ్డికేమీ ఇబ్బందిరాలేదు. ఇద్దఱూ చెఱొక ఆవునీ, చెఱొక గేదెనీ తీసుకొనేటట్టు నిశ్చయించేశాడు. కాని వాటి చిన్నతనంనుండీ తాను ఎఱిగి ఉండడంవల్ల ఆ ఎడ్లజత పంచడం విషయంలో మాత్రం అతని మనస్సు చివుక్కుమన్నది. భూమిమీద పద్దది లగాయితు సుఖంవచ్చినా, దుఃఖం వచ్చినా అవిరెండూ రామలక్ష్మణులలాగా కలిసి ఉన్నాయేగాని విడివడి ఉండలేదు. వీళ్ళతండ్రి అంకమ్మ బ్రతికి ఉన్నప్పుడు తాను గూడా ఆ ఎడ్లు కట్టినబండి ఎక్కి చాలాసార్లు తిరిగాడు. వాటిచుఱుకు, నెమ్మదీ, అన్యోన్యం అన్నీ తనకు బాగాతెలుసు. అటువంటి జతను విడదియ్యడమేమీ బాగుండదనిపించి 'ఒరే గోపాలం! ఈ ఎడ్లజతను మాత్రం విడదియ్యబోకండి. ఎవరో ఒకరుదాన్ని తీసుకుని దానికి బదులు ముదరాఇస్తే రెండోవాళ్ళు మఱోజత కొనుక్కోవచ్చు" అన్నాడు రెడ్డి.

'ముదరా ఇవ్వడమంటే సామాన్యమా ఏమిటి? ఇప్పుడు వాటి ఖరీదు ఎంతహీన పక్షమైనా ఎనిమిది వందలకు తక్కువకావు. ఎక్కడి నుంచి ఎత్తుకు వస్తాదేమిటి ఎవడుమటుకు' అని విసుక్కున్నాడు గోపాలం.

ఈ మాటలు గోపాలం గట్టిగా అనేటప్పటికి ఎడ్లను పంచడం తప్పదన్న విషయం రాముడి మనస్సులో ముల్లు గుచ్చుకున్నట్టు గుచ్చు కుంది.

రాముడికి పంపకం బొత్తుగా ఇష్టంలేదు. తండ్రి చనిపోయి ఇంకా నెలరోజులు కాలేదు. పరిస్థితి అట్లా విషమించడం అతన్ని ఎంతోబాధ పెట్టుతోంది. గోపాలం ఇట్లా ప్రవర్తిస్తాడని అతను అనుకోక పోలేదు. కాని ఇంతతొందర్లో ఈ అవసరం వస్తుందని అతను ఎన్నడూ అనుకో లేదు. ఈ పంపకం జరుగు తున్నంతసేపూ అతడు మనస్సులో యమ యాతన పడుతున్నాడు. తనతండ్రి మర్యాద, తన కుటుంబం ప్రతిష్ఠ

అన్నీ గంగలో కలుస్తున్నట్లు అతని కళ్ళఎదుట భీకరంగా కనపడు తున్నాయి. భావిజీవితంలో తమ గౌరవహీనమైన బ్రతుకులు అతనికి సాక్షాత్కరిస్తున్నాయి. తనకొక కొడుకున్నాడు. తనభార్య ఈ పంప కానికే పట్టు పడుతోంది. ఈ నెలరోజుల్లోనూ గోపాలం తన్నూ, తన భార్యనూ, అన్నమాటలు ఇన్నీ అన్నీకావు. ఒకప్పుడు సమస్తమూ గోపాలానికి ఒదిచి పెట్టేసి తాను ఏదోకూలిచేసుకొని బతుకుదామని గూడా అనుకున్నాడు. కాని భార్య నిలవేసింది. కొడుకును చూపిం చింది. ఇటువంటి పరిస్థితుల్లో భార్యను సంతుష్టిపఱిచి కొడుకును బాగు చేసుకోవడం తనవిధి అని తోచింది. అందుచేత ఈ పంపకానికి ఒప్పు కోక తప్పనిసరి అయింది. అయినా ప్రతిదానికి పేచీలుపడడం అతని స్వభావంకాదు. అందుకనే మొదటినుంచీ ముభావంగా ఉన్నాడు. కాని ఎడ్లజత విషయంలో అట్లా ఉండలేకపోయాడు. వాటిని చిన్నప్పటి నుంచీ తన చేతుల్తో తన బిడ్డలవలె పెంచడమే దానికి కారణం. వాటిని తానే తీసుకోవాలన్న సంకల్పం అతని మనస్సులో గాఢంగాఉంది. అందుకని రెడ్డి ఇచ్చిన ఈ సలహా అందుకుని 'నేను ముదరా ఇస్తాను. నాకు ఇచ్చేసెయ్యి' అన్నాడు రాముడు.

'నీకేమయ్యా! ఏదో తెగనమ్మి ఇస్తావే అనుకో. నీ డబ్బు ఎవడికి కావాలి? అటువంటి ఎడ్లు నాకు దొరకద్దూ. ఏదో ఒకటన్నా ఉంటే రెండోది ఎక్కడన్నా సంపాదించుకుని తంటాలు పడవచ్చు' అన్నాడు గోపాలం.

రాముడు ఈ భావానికి తట్టుకోలేకపోయాడు. గొంతు నులిమితే రెక్కలు టపటపాకొట్టుకున్న పిట్టలా గిలగిలలాడింది అతని మనస్సు. కాని ఏం చెయ్యగలడు? ఉపాయమేమీ తోచక చేతుల్తో తల పట్టుకు కూర్చున్నాడు.

ఈ విషయంలో పుల్లారెడ్డి మనసు గూడా బాగా నొచ్చుకుంది. ఏమిటిరాగతి ! వీటిని విడదియ్యవలసి వచ్చేటట్లే ఉందే అని కాసేపు ఆలోచించాడు. అంతలో ఆతనికో ఉపాయం తోచింది. 'ఒరే అబ్బాయిలూ ! నేనేదో పెద్ద వాణ్ని. మీ ఇద్దఱి మధ్యా పరిష్కారం చెయ్యడానికి వచ్చాను. ఇందులో నేను బావుకునేది ఏమీ లేదు గదా !' అని ఆగాడు.

ఈ మాటలు వినేటప్పటికి ఈ దుష్ట పరిస్థితి తొలిగే ఉపాయం ఏమన్నా రెడ్డి చెప్తుతాడేమో అన్న ఆశ రాముడికి కలిగింది. అందుచేత కొంచెం తలఎత్తి రెడ్డి వంక తిరిగి 'అదేమిటి తాతయ్యా అట్లా అంటావు ! ఇందులో నీకేమున్నది - ప్రొద్దుటినుండి మామూలాన పడుతున్న బాధ తప్ప' అన్నాడు.

'సరే దానికేంలే. పెద్ద వాళ్ళమంటూ ఉన్నాక ఆ మాత్రం అంటించు కోకపోతే ఎట్లా ? అదికాదు గాని మీఱు ఇద్దఱూ ఏమీ అనుకోకుండా ఉంటే నాకొక మాట చెప్పాలని ఉంది.' అని మళ్ళీ ఆగాడు రెడ్డి. 'ఏమిటో చెప్పవయ్యా నసక్క' అన్నాడు గోపాలం విసుగుతో.

'నువ్వు అలా విసుక్కుని కసిరితే నాకు ఎందుకు వచ్చిందీ బెడద. నాదారిని నేపోతాను. మీ ఇష్టం వచ్చినట్లు అఘోరించండి !' అంటూ లేచాడు పుల్లారెడ్డి.

'ఇంతదాకా వచ్చి నువ్వు కోపగించుకుని వెళ్ళడం ఏమీ బాగా లేదు తాతయ్యా !' అన్నాడు రాముడు మెల్లగా.

ఈ మాట విని రెడ్డి ఆగాడు. 'సరే ! ఏమయితే అది అవుతుంది. నేను చెప్పాలిసిన మాట ఏమిటో చెప్పి మఱీ వెళ్తాను. ఒరే గోపాలం ! నువ్వు కూడా బాగా ఆలోచించు. వాటిని విడదియ్యడం

నేనే కాదు, ఊళ్ళో ఎవళ్ళూ అంగీకరించని విషయం. అలా విడదీసి ఎవ్వరూ లాభం పొందలేరు సరి గదా, దానివల్ల అనర్థాలు గూడా వస్తాయి. అందుకని నామాట విను. నువ్వు వాటిని తీసుకుని వాడికి ముదరా అన్నా ఇయ్యి. వాటిని వాడికిచ్చి నువ్వన్నా డబ్బు తీసుకో, ఇది కాదంటావూ, నీ ఇష్టం వచ్చిన ధర చెప్పు. ఆ పైకం నేనివాళ ఇస్తాను. ఇద్దఱూ చెఱి సగం తీసుకుని దానికి కాస్తో కూస్తో కలుపు కుని చెఱో జతా చిన్న జతలు కొనుక్కుని కాలక్షేపం చెయ్యండి' అని సమాధానం కోసం గోపాలం వంక చూచాడు రెడ్డి.

గోపాలం చఱ్ఱుమని లేచి 'చాలు చాల్లేవయ్యా ! నిన్నేమో పెద్ద మనిషివని తీసుకు వస్తే మా దగ్గఱ నుంచి జత కాజెయ్యాలని చూస్తావు ! నువ్వెంత ఇస్తావేమిటి ? మహా ఇస్తే పదిపందలు ఇస్తా వేమో ! పంచుకుంటే ఐదు వందలు వచ్చె ! తోక ఉండే గొడ్డు లొంభై పలుకుతున్న ఈ రోజుల్లో అయిదువందలకి అడ్డెడు గింజలు లాగే ఎద్దురాదు' అంటూ ఎడ్ల దగ్గఱకు పోయి చిన్న ఎద్దు మెడతాడు పట్టుకుని ఈవలకు లాక్కు వచ్చి గుంజకు కట్టివేస్తూ 'ఇలా జరగ వలసిందేగాని మఱొకరకంగా అయితే నేనసలు ఒప్పుకోను' అని ఎద్దు మీద చెయ్యివేసి విజయ గర్వంతో నిలబడ్డాడు.

వెంటనే పుల్లారెడ్డి 'నేనేం చేస్తాను. మీ కర్మం' అంటూ లేచి పోయాడు.

'సామాన్లు జేరవెయ్యడం అయింది' అన్న అన్నపూర్ణ మాటలు వరూ వినిపించుకోలేదు.

కుడి చేత్తో బొమ్మ అదుముకుని ఎడం చేత్తో వాలినతల నొక్కు కుంటూ లోపలికి వెళ్ళాడు రాముడు.

౨

రెడ్డి వెళ్ళిపోవడం, రాముడు ఇంట్లోకి పోవడం, సామాన్లన్నీ బైటపడి ఉండడం చూచి గోపాలం మొదట్లో నిర్ఘాంతపోయాడు. కాసేపు ఉండేటప్పటికి అతనికి తన్ను ఎవ్వరూ ఏమీ చెయ్యలేరన్న ధైర్యం వచ్చింది. వెంటనే గోపాలం సామాన్ల దగ్గఱికి పోయి తనకు నచ్చినవన్నీ విడిగా తియ్యడం మొదలు పెట్టాడు. ఈ అలికిడి విని అన్నపూర్ణ భర్తను బైటికిపోయి చూడమన్నది. కాని రాముడు కదల్లేదు. తానే వీధి గుమ్మంలోకి పోయి నుంచున్నది. ఇంతలో నులక మంచంలో నిద్రపోతున్న పిల్లవాడు లేచి 'అమ్మా' అంటూ ఏడుపు మొదలు పెట్టాడు.

'వాడట్లా ఏడుస్తుంటే నువ్వు అక్కడ నుంచోవడమేమిటి !' అంటూ కేకవేశాడు రాముడు.

'అంతా ఆయన ఇష్టం వచ్చినట్టు అక్కడ తీసుకుంటున్నాడు. మీరిక్కడ మాట్లాడకుండా కూర్చున్నారు' అని విసుక్కుంటూ లోపలికి వచ్చింది అన్నపూర్ణ.

'నాకు చేతకాదు. నీకు చేతయితే వ్యవహారం చేసుకోపో !' అన్నాడు రాముడు కోపంతో.

'ఇంత వఱకూ పంపకం నన్ను ఉద్ధరించడానికే జరిగిందన్న మాట' అని గొణుక్కుంటూ పిల్లవాణ్ణి ఎత్తుకుంది అన్నపూర్ణ.

రాముడు మాట్లాడకుండా కూర్చున్నాడు.

గోపాలం తనకు కావలసిన సామాన్లన్నీ విడిగా తీసి పాలేళ్ళ చేత పాకలో ఒక మూల పెట్టించాడు. గొడ్లపాకలో అటక మీద ఉన్న నాగళ్ళూ, మేడి కోళ్లూ, పల కట్టులూ, మైలారం జల్లలూ అన్నీ

దింపించి తనకి కావలసినవి తాను తీసుకున్నాడు. ఆ పూట నుంచే వేఱింటి కాపురానికి ప్రయత్నాలు మా జోరుగా సాగించాడు. పాలేళ్ళచేత గొడ్లపాకకు మధ్య కఱ్ఱలు కట్టించాడు. తన ఆవునీ, తన గేదెనీ, తన ఎద్దునీ తన భాగంలో కట్టేశాడు. ఇల్లు రెండు భాగాలయ్యేటట్టుగా మధ్య ప్రస్తుతానికి తడికెలు పెట్టించాడు. పాలేళ్ళను వెంబడి పెట్టుకు పోయి వాముల దొడ్లో గడ్డివామి రెండు భాగాలు చేసి తన వాటా వేరే వామిగా వేసుకున్నాడు. చొప్ప గూడు పగల గొట్టించి తన భాగం వేఱేగా కుప్ప వేయించాడు. ఆ సాయంత్రమే బయలుదేరి భార్యను తీసుకురావడానికి అత్తవారింటికి వెళ్ళాడు.

రాముడు వీటన్నింటిలో జోక్యం కలిగించుకోలేదు. తమ్ముడి ఔద్ధత్యం చూచి వాడి ఇష్టం వచ్చినట్లే జరగనిమ్మని ఊరుకున్నాడు! 'తండ్రి చనిపోయి నెలకాలేదు. అప్పుడే సంసారం ఇంత బట్ట బయలైంది. ఇకముందు ఎంత యాతన పడాలో', అనే ఆ రాత్రల్లా ఆలోచించాడు. రాముడు కొంచెం పూర్వకాలపు మనిషి. పెద్ద మనిషి తరహాగా ఉంటాడు. తండ్రి బతికి ఉన్నన్నాళ్ళూ ఆయన అడుగు జాడల్లో నడిచాడు. ఇప్పటికీ ఆయనలా బ్రతకాలని అతని అభిలాష. తన తండ్రి ఎంత మంచివాడు! ప్రేమతో గ్రామం అంతా తన వశం చేసుకున్నాడు. తాను పెద్ద ఆస్తిపరుడు కాకపోయినా 'దేహి' అని అడిగిన ప్రతి వాడికీ కాస్తో కూస్తో ఇచ్చి సంతృప్తి పఱిచేవాడు. వ్రాతా కోతా సాధించక పోయినా ఐహికానికీ, ఆముష్మికానికీ కావలసిన విజ్ఞానం పూర్తిగా సంపాదించాడు. గుళ్ళో పురాణాల దగ్గఱనుంచీ, గూడెంలో తోలుబొమ్మలాటల వఱకూ అంకమ్మలేందే అయ్యేవికావు. అంత బ్రతుకు బ్రతికిన తండ్రి కడుపునపుట్టి తామిద్దఱూ ఇట్లా అయి పోవడమేమిటా అని అతని మనస్సు నిమిష నిమిషానికీ బాధ పడింది.

కాని గోపాలం చిన్నప్పటినుంచీ ఎడ్డెం అంటే తెడ్డెం అనేరకం. అతడు ఒకడితో కలిసి ఎప్పుడూ ఉండలేడు. ఈ సహజ ప్రవృత్తికి తోడు జీవితరంగంలో అతడు పెరిగిన పరిస్థితులు కూడా అట్లాగే సమకూడాయి. అతడు తల్లిదండ్రుల అదుపాజ్ఞల్లో పెరిగి పెద్దవాడు కాలేదు. పుట్టిన రెండేళ్లకే తల్లి చనిపోవడంవల్ల మేనమామల ఇంటనే పెరిగాడు. తనభార్యకు ఇష్టం లేకపోయినా వాళ్ళ మేనమామ తనకు చేతనైనంతలో గోపాలాన్ని శ్రద్ధగానేపెంచి పెద్దవాణ్ని చేశాడు. చిట్ట చివఱికి తన కూతుర్నిచ్చి చెల్లెలిమీది అభిమానంతో గోపాలానికి పెళ్లి కూడా చేశాడు. ఎంతచేస్తే ఏం, గోపాలం తనతండ్రి గౌరవమర్యాదల్లో పాలుపంచుకుని పెరగలేదు.

తెల్లవారింది. పలుదోముపుల్ల నములుకుంటూ పుల్లారెడ్డి రాముడి దగ్గఱకు వచ్చాడు. రెండువందల రూపాయలు లెక్కపెట్టి రాముడి కిచ్చాడు. తండ్రి చనిపోయినప్పుడు దినవారాల ఖర్చుకు చేతిలో పైకం లేక తనకున్న ఒక్కబండినీ పుల్లారెడ్డి కిచ్చివేసి అవసరానికి ఒకవంద రూపాయలు తెచ్చాడు రాముడు. అదిపోగా బండిఖరీదులో మిగిలిన సొమ్మిది. రెడ్డినీ, ఆ సొమ్మునూ చూచేటప్పటికి రాముడికి వెనకటి దుఃఖం అంతా నెమరుకువచ్చింది. రెడ్డిని కౌగలించుకొని 'తాతా! మా అయ్యగౌరవం ఇట్టా నిలబెట్టుతున్నాం' అని వెక్కివెక్కి ఏడ్చాడు.

రాముడి తల తనచేత్తో నిమురుతూ 'ఓరి! వెఱ్ఱివాడా! దీనికి నువ్వేంచేస్తావు? అయినా ఇట్లాఏడ్చి ప్రయోజన మేమిటి? నీమానాన నువ్వుబ్రతుకు. ఎవరిగౌరవం వారికే ఉంటుంది' అని ఓదారుస్తూ ధైర్యం చెప్పాడు.

రాముడు కొంచెం తేటుకొని చేతులో నోట్లవంక చూచి జ్ఞాపకం చేసుకుని తాతా! నీతో ఒకమాట చెప్పాలి. ఇట్లాకూర్చో' అని అరుగు మీద కూర్చోపెట్టాడు.

'తాతా! నువ్వు అప్పుడిచ్చిన వందలోనూ ఎనభై దాదాపు చిన్న దినానికీ పెద్ద దినానికీ ఖర్చయినాయి. అయితే ఆ ఖర్చులో వంతులు పెట్టడం నాకిష్టంలేదు. అందుకని మిగిలిన ఈ పైకం అంతా వాడికే ఇచ్చివెయ్యి. నేనిస్తే నాతోఏదో జగడమాడి అవీఇవీ కెలుకుతాడు. అదిఅంతా నేను సహించలేను నువ్వేవాడిచేతికీ పైకం ఇస్తే మఱేమి మాట్లాడడు. ఈ కాస్తపని నాకోసం చేసిపెట్టాలి' అని రెడ్డి చేతులు పట్టుకున్నాడు రాముడు.

'సరేలే! నీ ఇష్టం అట్లాఉంటే అట్లాగేచేస్తాను' అని రెడ్డిలేచి, బయలుదేరాడు.

అప్పటికింకా జాముప్రొద్దు ఎక్కలేదు. రెడ్డి అలా వీధిలో అడుగు పెట్టేటప్పటికి గూడుబండీ ఒకటి వాకిట్లో నిలబడింది. గోపాలమే అయివుంటాడు, మనము ఎందుకు పలకరించాలని తనదారిన తాను వెళ్లిపోయాడు రెడ్డి. గోపాలం భార్యను లోపలికి పంపించి, పాలేరుచేత పెట్టే బేడా దింపిస్తూ, వెళ్ళుతూ ఉన్న రెడ్డివంక చూస్తూ నిలబడ్డాడు.

పరిచయం చిన్నబావతో ఎక్కువఉన్నా సీతమ్మకు పెద్ద బావ మీద అభిమానం ఎక్కువ. తన్ను చిన్నప్పుడు చిన్నబావ ఎప్పుడూ మొట్టికాయలు మొట్టడమేకాని ఎత్తుకున్న పాపాన పోలేదు. పెద్దబావ అట్లాకాదు. చిన్నతనంలో తన్ను ఎత్తుకొని ఏది కావాలంటే అది తెచ్చిపెట్టేవాడు. తాను గుమ్మంలో అడుగు పెట్టుతునే, కుఱ్ఱవాణ్ని భుజాన వేసుకుని జోకొట్టుతూ అటూ, ఇటూ పచార్లు చేస్తున్న రాముడ్ని చూచింది సీతమ్మ.

'బావా! రంగయ్య కులాసాగా ఉన్నాడా?' అని అంటూ చేతులు చాచింది.

అంతలో గోపాలం లోపలికి వచ్చి సీతమ్మను చూచి 'నీకు వాళ్ళతో ఏం సంబంధం! అటుపో. లోపలికి పో' అని కేకవేశాడు.

సీతమ్మ చాచిన చేతులట్లాగే ఉంచి నివ్వెఱపోయింది.

రాముడు ఱాతి బొమ్మలా నిలబడిపోయాడు.

'ఇంకా కదలవేం ? నీకు కాదూ చెప్పేది !' అని గట్టిగా అరుస్తూ కళ్ళు ఎఱ్ఱజేశాడు గోపాలం.

సీతమ్మ మెల్లగా, తడబడుతున్న శరీరంతో తమ భాగంలోకి వెళ్ళింది.

కుఱ్ఱవాడు గొల్లున ఏడుపు మొదలెట్టాడు. రాముడు తలవంచు కుని లోపలికి వెళ్ళాడు.

గోపాలం కొత్తకాపురం ఈ విధంగా మొదలు పెట్టాడు. అతని వెనకనే వచ్చిన పాలేరు పెట్టే మూటా అరుగుమీద పెట్టి, అమ్మగారు కనపడకపోవడం చేత, అయ్యగారితో చెప్పడానికి భయం వేసి ఎవరి తోనూ చెప్పకుండా బండి తోలుకు వెళ్ళిపోయాడు.

మఱునాటికల్లా తామర పువ్వుల్తో కలకలలాడే నిండు చెఱువు వంటి అంకమ్మ ఇల్లు తిమితిమింగిలాలతో తరంగ సంక్షుభితమయ్యే మహాసముద్రం లాగా మాఱిపోయింది. 'కూడలికాపురం కుతకుతలూ, వేఱింటి కాపురం వెతవెతలూ' అన్నట్లయింది వారి పరిస్థితి. పాలే ళ్ళిద్దఱూ పని మానేస్తామని రాముడితో చెప్పడానికి వచ్చారు. తండ్రి బతికి ఉండగా స్వంతానికి తోడు కవులు పొలం వ్యవసాయం కూడా ఉండేది కాబట్టి వాళ్ళ అవసరం ఉన్నది. తనకు ఇప్పుడవి అన్నీ పెట్టుకునే మనస్వాస్థ్యం లేకపోబట్టి 'సరే వెళ్ళండి' అన్నాడు. దాంతో ఎవరి పని వాళ్లు స్వయంగా చేసుకోవలసి వచ్చింది. తానూ, తన భార్యా కాపురానికి కొత్త కాబట్టి కొన్నాళ్ళపాటు గోపాలం పాలేర్ని పెట్టుకుందా మనుకున్నాడు గాని తన దగ్గఱ పని చెయ్యడానికి ఎవడూ ఒప్పుకోలేదు. అందుచేత గోపాలం మగపనీ ఆడపనీ తనే చేసుకోవలసి వచ్చింది.

పంపకాలయి సరిగా రెండు రోజులే అయింది. రాముడు వీధి లోకి రావడం మానివేశాడు. ఎప్పుడూ ఇంటి పట్టునే ఉండేవాడు. తోచకపోతే అటూ ఇటూ పిచ్చి ఎత్తిన వాడిలా తిరుగుతూ ఉండేవాడు. గంటల తరబడి గొడ్లపాకలో కూర్చునేవాడు. లేచి ఇంట్లోకి రాబోతూ అప్పుడప్పుడు గోపాలం భాగంలోకి పొరపాటున అడుగు పెట్టేవాడు. ఆ సమయంలో గోపాలం ఇంట్లో లేకపోతే 'రా ! బావా ! లోపలికిరా!' అని కేకవేసేది సీతమ్మ. ఈ కేక విని పొరపాటు తెలిసికొని చటుక్కున్న వెనక్కి తిరిగి తన భాగంలోకి వచ్చేవాడు. గోపాలం ఇంట్లో ఉంటే ఆ పొరపాటూ జరిగేది కాదు. ఒకవేళ జరిగిందో, ఎదురు మాట రాముడు ఎన్నడూ చెప్పక పోయినా, వీధిని బోయే ప్రతివారూ ఆగేటట్లు గోపాలం గట్టిగా కేకలు వేసేవాడు.

ఎంత తంటాలు పడ్డా రాముడు గృహాన్ని పాక్షికంగా చూడలేక పోయాడు. ఒక్క గృహమేమిటి ? తన్ను తన పూర్వులతోటీ, తన వంశంతోటీ ఏకం చేసుకుని పెరిగిన అతని మనస్సు తన్ను తానుగా చూచుకోలేక పొయ్యేది. చెయ్యి శరీరాన్ని ధిక్కరించి తెగిపోవచ్చు. అతెగి పోవడంవల్ల శరీరానికి చెయ్యి లేదన్న అప్రతిష్ఠే వస్తుంది గానీ తాను స్వతంత్రంగా బ్రతకలేదు. ఈ విధంగా అతని మనస్సు ఊహించి, ఊహించి విడివడడంవల్ల తమకు వచ్చే ప్రళయం ప్రత్యక్షువులోనూ సాక్షాత్కరింపజేసేది. ఒక్కొక్కప్పుడు తాము విడిపో లేదన్నట్టుగానే అతడు అనుకునేవాడు. అటువంటి సందర్భాల్లో బాహిరమైన ప్రతిబంధకాలు పంపకం విషయం జ్ఞాపకం చేసేవి.

ఒకొ్క్కక్కప్పుడు బాధభరించలేక దైవ ప్రార్థన చేసేవాడు. ఆ ప్రార్థనా సమయంలో అప్రయత్నంగా తన తండ్రి యావజ్జీవమూ ప్రతి నిత్యమూ నమస్కరించిన దేవుడున్న గూడుదగ్గఱకు వెళ్లబోయే

వాడు. కాని దారిలో తడిక అడ్డుతగిలేది. చటుక్కున చతికిలబడి తన ఊపిరి తిత్తులలో ఒకదాన్ని కోసివేసిన బాధతో కుంగిపోయేవాడు. మఱికొన్ని సమయాల్లో అతని సర్వస్వాన్నీ తండ్రి ఆవేశించేవాడు. అటువంటి సమయాల్లో తన తండ్రి కూర్చున్నచోటూ, అతడు వాడిన చెంబూ, అతడు పట్టుకున్న కఱ్ఱా ఇట్లాంటి వాటికోసం తహతహలాడే వాడు. కాని అవి ఏవీ అతని భాగంలో లేవు. అతనికి దక్కింది తండ్రి హృదయం మాత్రమే. భౌతికమైన తండ్రి ఆకారాన్ని జ్ఞాపకంచేసి ఏతద్వియోగ బాధ సహనయించే బాహ్య వస్తువొక్కటీ అతని భాగంలో రాలేదు.

గోపాలనికి విచారం ఏమీలేదు. కాని ఒక్కొక్క రోజు గడిచిన కొద్దీ అతనికి సంసారం బరువు ఎక్కువ కావడం మొదలు పెట్టింది. పాలేరు లేకపోయినా తనకు కావలసిన పనులన్నీ తనే చేసుకుంటు న్నాడు. ఎంత చేసుకున్నా తన్ను అనుకూలించే వాళ్లు ఊళ్లో ఎవళ్లూ లేకపోవడం అతనికి కష్టం అయింది. రెడ్డి ఇచ్చిన పైకం చేతిలో ఉన్నది. ఉన్నా దాన్ని ఖర్చుపెట్టుకోవడానికి వీలులేని పరిస్థితులు వచ్చాయి. తనకాపురం కొత్తది. తానా ఊళ్ళో నిలదొక్కుకోవాలి. ఇప్పుడే పైకం ఖర్చుపెట్టితే ముందేం అవసరం వస్తుందో అని దాన్ని దాచి పెట్టాడు. దీనికితోడు తన భార్య ఎంతసేపూ అన్న పక్షాన వాదించడంకూడా అతనికి ఇష్టమయ్యేది కాదు.

ఉన్నవి ఉండగా పంపకమైన మూడోనాటి నుంచీ అతనికి ఒక కొత్త బెడద వచ్చిపడింది. ఎడ్లలో అతని ఎద్దు చిన్నది కావడంతో అది బెంగపెట్టుకుంది. జతగా మెయ్యడం అలవాటయిన గొడ్డు కాబట్టి ఈ మూడు రోజులనుండీ ఒంటరిగా కట్టివేస్తూ ఉండడం వల్ల మేత మెయ్యడం మానివేసింది. కొత్త వదిలితే అదే మేస్తుందని ఒకటి రెండు రోజులు ఉపేక్షచేశాడు కాని తర్వాత గూడా అది అట్లాగే ఉండి

పోయింది. దిష్టితాడు వేయించీ, నడుంతాడు కట్టించీ తంటాలు పడ్డాడు గాని లాభం లేకపోయింది. తన ఎద్దు ఇలా తీసిపోతూ ఉంటే రాముడి ఎద్దు బాగానే ఉంది. దీన్ని అతడు సహించలేక పోయాడు. తాను దుక్కలా ఉంటే తన అన్న రోజురోజుకూ శుష్కిస్తున్నాడే అన్న విషయం అతనికి తోచలేదు. అది తెలిస్తే ఈ ఎద్ల పరిస్థితి కూడా అర్ధమయ్యేది. రాముడి ఎద్దు అప్పుడప్పుడు జతవిడిచి పొరుగూరుపోయి పనిచేసి వచ్చేది. అందుకని గోపాలం ఎద్దుకు పట్టినంతగా దీనికి జత విడవడం దుఃఖం పట్టలేదు. మొదట్లో రెండు మూడు పూటలు తోటి ఎద్దుకు సానుభూతి చూపిస్తూ రాముడి ఎద్దు మేత మానివేసినా తర్వాత మామూలుగా మేతమేస్తోంది. అందుచేత రాముడికి తనఎద్దు విషయమైన ఆందోళన ఏమీ అవసరం లేకపోయింది. కాని గోపాలం ఎద్దు పదిరోజులు గడిచేటప్పటికి సగానికి సగం తీసింది. అది ఎప్పుడూ రాముడి ఎద్దువంకే చూస్తూ నిలబడేది. అప్పుడో పరకా అప్పుడో పరకా నమిలినా మనఃపూర్తిగా తినని తిండి ఏంవంట బట్టుతుంది ?

రాముడికి దుఃఖం కొంచెం వెనకపట్టింది. ఇప్పుడు ఇదివఱకు మాదిరి ఎప్పుడూ ఇంట్లో కూర్చోక బైటికి వచ్చి ఆపనీ ఈపనీ చూచుకుంటున్నాడు. ఊళ్ళో పరపతిగల మనిషి కాబట్టి వాముల దొడ్డినుంచి మేతతేవడం, పచ్చగడ్డి మోటబావులకింద ఎక్కడైనా ఉంటే తెచ్చుకోవడం మొదలైన పనులన్నీ తాను చేసుకోకుండానే ఇతరులచేత చేయించుకుంటున్నాడు. పనిచేసుకోవడంలో అతనికేమీ కష్టం లేకపోయినా అతని దుఃఖాన్ని తిరగబెట్టే పరిస్థితులు అనుక్షణమూ తటస్థిస్తూనే ఉన్నాయి.

గోపాలం ఎద్దు ఇలా శుష్కిస్తూ ఉండడం అతన్ని ఎంతో కష్టపెట్టింది. అది రోజల్లా పోత బొమ్మలా నిలబడి కళ్లవెంబడి నీరు కారుస్తూ ఉంటే చూడలేక పోయేవాడు. దాని ఎదురుగుండా తన

పాకలో కూర్చుని తాను గూడా ఏడ్చేవాడు. గోపాలం ఏకారణం చేతనైనా ఇంట్లో లేకపోతే తన ఎద్దును కట్టు ఊడదీసి గోపాలం భాగంలోకి తోలి అక్కడే మరింత మేత పడవేసేవాడు. దీని జతన ఉన్నంత సేపూ గోపాలం ఎద్దుకూడా మేతమేసేది. ఇటువంటి సమయంలో ఒక రోజున గోపాలం చూచాడు. అతనికి ఒళ్లుమండీ కోపం వచ్చింది. చేతికఱ్ఱతో రాముడి ఎద్దును కొట్టుతూ 'గొడ్డు మేతకోసం అశుద్ధం తినకపోతేవేం? దగ్గఱఉండి మేపుతున్నాడు పెద్దమనిషి' అని అంటూ పెద్ద గందరగోళం చేశాడు. రాముడు నోరుమూసుకొని కళ్ళనీళ్లు గుక్కుకుంటూ దగ్గఱికి వచ్చిన ఎద్దు వీపుమీద చేత్తోనిమిరి దాని మీదపడి భోరున ఏడ్చాడు. మఱొకమాటు గోపాలం ఎద్దు తాడు తెంపుకుని రాముడి ఎద్దుతో కలిసి మేతమేస్తోంది. రాముడు దాన్ని చూచి మఱింత మేత వాటిముందు పడవేసి రెండు చేతుల్తో రెంటికీ అఱుగోకుతూ కూర్చున్నాడు. ఇదీ గోపాలం కంటపడింది. 'బుద్ధి గడ్డితినే వెధవలకు ఎన్నిసార్లు చెప్పితే ఏంలాభం? నాఎద్దుని తీసుకువెళ్ళి తన పాకలో ఎవడు మచ్చిక చేసుకోమన్నాడు' అంటూ తన ఎద్దును లాక్కుపోయి పెద్ద అల్లరి చేశాడు.

ఇటువంటి సంఘటనలు ప్రతినిత్యమూ రాముణ్ణి కుంగదీస్తూనే ఉన్నాయి. గోపాలం ఎద్దు ఏ మాత్రమూ కోలుకోక అట్లాగే ఉండిపోతోంది. రాముడు దాని దీనస్థితిచూచి భరించలేకపోయాడు. దాన్ని బాగుచేద్దామని తాను ఏమిచేసినా గోపాలం దానికి దురర్థం కల్పిస్తున్నాడు. తన ఎద్దును గోపాలానికి ఇచ్చేస్తే ఆ ఎద్దు తప్పకుండా బాగుపడుతుంది. కాని తాను ఈ పనిచెయ్యడం తనభార్యకు ఇష్టంలేదు. ఒకసారి తాను ఈ అభిప్రాయం బైటపెడితే 'ఇచ్చుకోండి. ఇద్దఱమూ కాడిభుజానవేసుకుని పొలందున్నుదాము' అన్నది. ఆవిద అభిప్రాయం ఎట్లా ఉన్నా తాను ఇవ్వడానికే సిద్ధపడ్డాడు. కాని ఈ ముక్కతానంటే

గోపాలం ఏ మంటాడో ! దీనికి ఏమి అర్థం కల్పిస్తాడో ? మొత్తానికి అతనికి భయంగానేవుంది. అయినా ఒక రోజున ధైర్యంచేసి చెప్పుదా మని నిశ్చయం చేసుకున్నాడు. అప్పుడు గోపాలం గొడ్లపాకలో అతని ఎద్దుదగ్గఱనుంచుని ఉన్నాడు, ఆ ఎద్దు మేతమెయ్యకుండా రాముని ఎద్దువంకచూస్తోంది. అటువంటి సమయంలో రాముడు తన ఎద్దు దగ్గఱకుపోయి దాని తలతాడు ఊడదీసి నడుంమీదవేసి బయటికి తోలుతూ 'గోపాలం ! నీ ఎద్దు బొత్తిగా పాడైపోతోంది. దీని జతన ఉంచే అది బాగుపడుతుంది. నేను మఱొకజత కొనుక్కుంటాను. దీన్ని గూడా నువ్వుతీసుకో' అన్నాడు. వెంటనే మబ్బులేకుండానే ఉఱుములూ, మెఱుములూ ఫెళఫెళార్భటులుచేశాయి. 'నీ మూలాన, నీ ఎద్దుమూలాన అన్యాయంగా నా ఎద్దు పాడైంది. పెద్ద ఔదార్యం చూపించ వచ్చావు. పుచ్చుకున్న మఱునాటినుంచీ ఊరంతా రెండు ఎద్లూ కాజేశానని నన్ను అనేందుకా ! నాకు నీ ఎద్దేమీ అక్కర్లేదు. నేనే మఱో ఎద్దు కొనుక్కొంటాను" అని దూకుడుగా వెళ్లిపోయాడు. రాముడు ఏంచెయ్యగలడు ? తన ఎద్దును మళ్ళీ గుంజకు కట్టుకున్నాడు.

గోపాలం ప్రవర్తన ఇంతటితో ఆగలేదు. అతడు చేసే ప్రతి పనీ, అనే ప్రతిమాటా రాముడి దుఃఖాన్ని మఱింత గాఢతరం చేస్తూనేవచ్చాయి. తనభార్యని అన్నగారి భాగంలోకి వెళ్ళవద్దని కట్టు దిట్టం చేశాడు. భర్తకు భయపడి వెళ్ళడం అతని ప్రత్యక్షంలో మానినా మేనత్తకొడుకన్న చనువుండడంచేత పెద్దబావపక్షాన ఎప్పుడూ వాదిస్తూనే ఉండేది. ఆ వాదనలు అప్పుడప్పుడూ చాలా తీవ్రంగా నడి చేవి. ఆ తీవ్రతలో తమతమ భావాన్నిబట్టి గోపాలం ప్రవర్తన కూడా ఉండేది. ఒక మాదిరిది అయితే అన్నను తిట్టి పొయ్యడం, కొంచెం ఎక్కువయితే భార్యనీ అన్ననీ కలిపి తిట్టి తిండితినకుండా లేచిపోవడం, అంతకన్నా ఎక్కువయితే భార్యమీద చెయ్యిచేసుకోవడం, ఇదీ

వరస. ఈ వరస రోజుకొక మాటన్నా అన్నిదశల్లోనూ జరుగుతూ వుంటుంది. ఒక రోజున పొద్దుగుంకేవేళ గోపాలం ఇంటికి వచ్చాడు. అప్పుడు సీతమ్మ రాముడి భాగంలోనుంచి బైటికి వస్తోంది. అప్పటికి రెండు రోజులనుంచీ చంటివాడికి జ్వరం తగులోంది. సీతమ్మకవకాశం దొరకక వాణ్ణిచూడ నన్నా చూడలేదు. ఆ పూట పనిమీద గోపాలం పొరుగూరు వెళ్ళాడుకదా అన్న ధైర్యంతో పెద్దబావ భాగంలోకి వెళ్ళింది. "సాయంత్రానికి తిరిగి వస్తాను, జాగ్రత" అని గోపాలం చెప్పే వెళ్ళాడు. ఎప్పుడు వస్తాడో అని సీతమ్మ భయపడుతూనేవుంది. తానిలా బైట అడుగుపెట్టిందోలేదో గోపాలం చక్కావచ్చాడు. సీతమ్మను చూడటంతోటే గోపాలానికి ఉప్పెనలా కోపంవచ్చింది. అట్లా నిలబడి కళ్ళుపెద్దవిచేసి ముఖంకండలు ఉబ్బించి సీతమ్మ వంక చూచాడు. తలవంచుకుని మెల్లగా తమ భాగంలోకి వెళ్ళింది సీతమ్మ. దీంతో గోపాలంకోపం మఱీఎక్కువైంది. సరాసరి లోపలికివెళ్ళి కంచంలో అన్నం పెట్టడానికి వంగిఉన్న సీతమ్మ జుట్టుపట్టుకుని పైకి ఎత్తి ఛడామడా రెండు చెంపలూ వాయించాడు. చెంపమీద చెయ్యి అంటిపోయి వాతలు కనబడ్డాయి. ఆ ముఖం చూడకుండానే గోపాలం గిఱ్ఱునవెనక్కితిరిగి బైటికిపోయాడు. ఏదో అఘాయిత్యం జరగబోతుందని రాముడు అనుకుని కుఱ్ఱవాణ్ణి జోకొట్టుతూ ఇవతలకు వద్దామని ప్రయత్నంచేస్తూనే ఉన్నాడు. ఇంతలో దెబ్బ తగలడం, సీతమ్మ ఏడవడం, గోపాలం వెళ్ళిపోవడం అన్నీ జరిగాయి. ఏడుస్తున్న కుఱ్ఱవాణ్ని మంచంమీద అల్లాగే ఉంచి రాముడు హడావిడిగా సీతమ్మ దగ్గఱకువెళ్ళాడు. 'బావా ! రాబోకు. వెళ్ళిపో ! వెళ్ళిపో ! నిన్ను కూడా కొట్టుతారు. నేనుచూడలేను, వెళ్ళిపో' అని బిగ్గఱగా అఱిచింది. రాముడు మఱదలు తల నిమురుతూ కొంచెంసేపు ఓదార్చాడు. 'సీతా ! వాడు ఎప్పుడూ ఇలాగే ఉండడు. వాడి అంతట వాడే మాఱతాడు.

ధైర్యం వహించాలిగాని నువ్వే ఇట్లా అయితే ఇక నేనేం కావాలి? నేను ఎంత బాధపడుతున్నానో నీకు తెలియదూ' అని అంటూ ఉండగానే ఏడుస్తున్న కుఱ్ఱవాణ్ని సముదాయించడానికి వచ్చిన అన్నపూర్ణ సాధింపు మాటలు వినపడ్డాయి. 'ఈ లెక్కన కుఱ్ఱవాడు గోల పెట్టుతూఉంటే వాడి దగ్గఱ కాస్త కూర్చోగూడదూ? అటువంటా, ఇటువీడి సంరక్షణా అన్నీ నేనే చూచుకోవలసి ఉండె. అయినా ఎన్ని టికని నేనేడుస్తాను! అయినా వాళ్ళ కాపేక్షలుండాలి గాని ఇటు చేసు కున్న పెళ్ళామూ లేకపోయె, కన్న కడుపు అని ఆపేక్షాలేకపోయె. ఇంతకూ మన అదృష్టం ఇల్లా తగలబడింది. ఏడవకురా వెధవా' అని విసుక్కొంటూ కుఱ్ఱవాడి పిఱ్ఱమీద రెండు అంటించి, వాడు కెవ్వు మనగా ఎత్తుకుని దూకుడుగా లోపలికి వెళ్ళింది అన్నపూర్ణ. ఈ మాటలు రాముడి హృదయంలో శూలాల్లా గుచ్చుకున్నాయి. మాఱు మాట్లాడలేక స్తబ్ధుడై నిలబడిపోయాడు. శరపాత శిలాతలాల నడుమ పడి నలుగుతున్న శిరీష పుష్పము వలెనై అతని హృదయం చైతన్యం కోల్పోయింది. ఇంతలో గోపాలం వస్తూ ఉండడం చూచి ఏదో తప్పు చేసిన వాడిలా అప్పుడే తెలివి వచ్చిన రాముడు తన భాగంలోకి తూలుతూ తడుముకుంటూ వెచ్చేశాడు,

ఈ విధంగా ఒకవంక తమ్ముడూ, మఱొకవంక భార్యా తన్ను అనేమాటల్తో జీవితంమీద అసహ్యం పుట్టి దుఃఖభారంతో ఎందుకు వచ్చిందిరా భగవంతుడా అన్నట్లు జీవయాత్ర సాగిస్తున్నాడు రాముడు. పట్టుదల గల గోపాలం ఎన్నివిషమ పరిస్థితులువచ్చినా అట్లాగే నెట్టుక రావాలని ప్రయత్నిస్తున్నాడు. ఎన్నివిషయాల్లో సద్దుకోగలిగినా ఎద్దు విషయంలో మాత్రం గోపాలమేమీ చెయ్యలేక పోయాడు. అదినానాటికీ తీసిపోతోంది. ఇంకా కొన్నాళ్లు ఉపేక్షచేస్తే చచ్చిపోతుందేమో అని కూడా అనిపిస్తోంది. చిట్టచివఱికి గోపాలానికి ఎట్లాగైనా దానిసంగతి

తేల్చుకోవాలన్న నిశ్చయం కలిగింది. దానిజతకు మరొక ఎద్దును కొనడంతప్ప మరే ఉపాయమూ తోచలేదు. ఎద్దును కొనడం అంటే సామాన్యమైన విషయంకాదు. అయిదు వందలన్నా ఉండాలి. ఖండి బాపతు రెడ్డిఇచ్చిన రెండువందలు తప్ప తనదగ్గిర దమ్మిడీలేదు. ఏమిటి చెయ్యడం. భార్య నగలమ్మడానికి తగిన స్వాతంత్ర్యం తన మేనమామ దగ్గర తనకులేదు. అందుకని వాటిజోలికి పోకూడదు. ఎదురుగుండా ఆవూ, గేదే కనబడుతున్నాయి. వాటినమ్మితే కావలిసిన పైకంవస్తుంది. కాని మజ్జిగచుక్కకు కరువువస్తుంది. పల్లెటూళ్ళల్లో చల్లచేసి కుడితి తొట్లలో అన్నా పోస్తారుగాని ఊరికే అసలుపొయ్యరు. అయినాసరే, ఇబ్బంది పడకతప్పదు. అమ్మితీరాలి. అమ్మకపోతే ఉన్నఎద్దూ పోతుందేమో అన్నభయముంది. అదిగూడాపోతే తాను ఎడ్లుకొనలేడు; వ్యవసాయం చెయ్యనూలేడు.

ఈ రోజుల్లో పాడిగొడ్డునీ, పంటపొలాన్ని అమ్మజూపితే కొనం దెవరు ? నిమిషాల్లో నూరు దగ్గరనుంచీ నూటఎనభై దాకా పెరిగింది ఆవుఖరీదు. పుల్లారెడ్డి తానురాకుండా పాలేరును పంపించి 'రెండు వందలు ఇస్తాను ఇవ్వ వలసిం'దని కబురు పంపించాడు. గోపాలం ఇంకా వస్తుందేమో అని ఒకరోజుచూచి, ఇంకా ఆశపడడం భావ్యంకాదని వాళ్ల పాలేర్నే కేకేసి తోలుకు వెళ్ళమన్నాడు. గేదె అమ్మితే నూటఎనభై కంటే ఎక్కువరాలేదు. వచ్చినసొమ్ముకు ఉన్నసొమ్ము కలిపి తన ఎద్దుకు సమానమైన ఎద్దు కొనాలని భగీరథ ప్రయత్నం చేశాడు. కాని సఫలంకాలేదు. చిట్టచివరకు తన ఎద్దుకంటే ఒకగుప్పెడు ఎత్తు తక్కువున్నదాన్ని - నాలుగుకాళ్ళ ఎద్దును కొనుక్కొనివచ్చి పాకలో తన ఎద్దుపక్క కట్టేశాడు.

ఇంతచేసినా పాప మా యెద్దు బెంగవదలలేదు. తానుచిక్కినా అది కొత్త ఎద్దువంక గౌరవంతోనూ చూచేదికాదు, ప్రేమతోనూ చూచేది

కాదు. ఏదో అప్పుడప్పుడు మఱీ అంతగా కడుపులో ఎలికలుదూరితే ఒకపరక ఎంగిలి పడడమేగాని ఆప్యాయంగా తినడమేలేదు. మఱి అదేం కోలుకుంటుంది! యథాప్రకారంగా ఆ ఎద్దు తీసిపోవడంతప్ప అభివృద్ధి సూచన లేమీ కనపడడం లేదు.

3

ఇంతలో జ్యేష్ఠమాసం వెళ్ళింది. ఆ నెలలో అప్పుడొక వానా అప్పుడొకవానా పడి నేలఅంతా చక్కగా పచ్చిక కట్టింది. అందుకని ఎడ్లనుగూడా పొలం తోలుతున్నారు. పొలం తోలడం మొదలు పెట్టిన దగ్గఱనుంచీ గోపాలం ఎద్దుగూడా కొంచెం బాగుపడింది. ఈ మార్పుకు కారణం పొలంతోలడమేమాత్రమూకాదు. కాని అందువల్ల దానికి రాముడి ఎద్దుతో పగలంతా కలిసిఉండే అవకాశం వచ్చింది. ఒక్క ఇరవై ఏళ్ళు జైలులో ఒంటరిగా చీకటి కొట్టులో జీవితం గడిపినవ్యక్తి బైటికి వచ్చినప్పుడు ఎంత ఆనందం అనుభవిస్తాడో అంతసుఖం అనుభవించింది పాపమాఎద్దు. చిన్నప్పటినుంచీ తనతో ఎదిగిన ఎద్దు తన పక్కన లేకపోవడంవల్ల ఇన్నాళ్లబట్టీ ఎంతమథన పడిందో కాని పాపం తలత్రాడు ఊడతీసి పొలం తోలడానికి పాకలోనుంచి బైటికి పంపిన దగ్గరనుంచీ తిరిగి ఇంటికి వచ్చేవఱకూ ఒక్కక్షణం రాముడి ఎద్దును విడిచి ఉండడంలేదు. ఎంతసేపూ దానిప్రక్కనే నడుస్తుంది. తన శరీరం దానిశరీరాని కొరుసుకునేటట్లు నడుస్తుంది. నెమరు వేసేటప్పుడు దానికెదురుగుండా పడుకుని కళ్లలో కళ్లుపెట్టి చూస్తూఉంటుంది. ఇటువంటి పరిచయం వచ్చి నాలుగురోజులు కాకపోయినా అదిపోయిన బలం అంతా సంపాదించుకుంది. 'ఉత్సాహం సగంబలం' అన్నమాటలో ఎంతనిజముంది! ఆ జతను చూచిన వాళ్లందఱూ ఎటువంటి జతరా అని ఆశ్చర్యపడకుండా ఉండరు.

తన ఎద్దులో కలిగిన ఈ మార్పుకు గోపాలం సంతోషించక పోలేదు. వ్యవసాయపు దుక్కులు సాగించడానికి ఇంకా పదిరోజులు వ్యవధి ఉన్నది కదా, ఇంతలో ఇది హాయిగా బాగు పడుతుంది అని ఆశపెట్టుకున్నాడు. దాన్ని త్వరగా బాగు చెయ్యాలన్న ఉద్దేశంతో తెలగపిండీ, మడ్డి కూడా పెట్టించాలని కూడా అనుకున్నాడు. కాని, తీరా తెప్పించి దాని ముందు పెట్టేటప్పటికి అది వాసనైనా చూడలేదు. పాప మా ఎద్దు మనస్థితి ఏమిటో కాని ఇంటికి వచ్చాక ఏ విధమైన మేతా మెయ్యేదు. పొలంలో ఆ ఎద్దుతో కలిసి ఏం మేస్తుందో అంతే. ఈ విషయం గోపాలానికి కొంత నిరుత్సాహం కలిగించింది. కాని ఏం చెయ్యగలడు ? అట్లాగే సమాధాన పరుచుకుని ఊరుకున్నాడు. కొత్త ఎద్దు రావడం వల్లనే తన ఎద్దు బాగు పడిందని అతని అభిప్రాయం. ఇంటి దగ్గఱ మేత మెయ్యక పోవడంబట్టి అది సరియైన అభిప్రాయం కాదని తెలుసుకోవలసి ఉన్నా తనకు వ్యతిరేకమైన ఊహ రానిచ్చేవాడు కాడు. మొత్తం మీద ఎద్దులో కలిగిన మార్పుకు సంతోషిస్తూనే ఉన్నాడు.

అది చెఱువు కింద పల్లాల ఊరు అవడం వల్ల పల్లపు దుక్కులు తొలకరిలోనే ఆరంభించినా చెఱువు నిండే వఱకూ వ్యవసాయపు పనులు ముమ్మరంగా సాగవు. తొలకరించడంతోటే రాముడు పుల్లారెడ్డి దగ్గరకు పోయి అతని పొలంలో ఒకరోజు పనిచేసి అతని అరక అడిగి తెచ్చుకుని తన పొలం దున్నుకున్నాడు. తన ఎకరం పొలానికి కావలిసిన నారు కూడా రెడ్డి పొలంలోనే పోసుకున్నాడు. సాధారణంగా పశువుల విషయమూ, ముఖ్యంగా తన ఎద్దు విషయమూ తెలిసినవాడు కాబట్టి రాముడు తన ఎద్దుకు మఱో ఎద్దుతో జతకలపడానికిగాని, దాని చేత పనిచేయించడానికిగాని పూనుకోలేదు.

గోపాలానికి ఊళ్ళో తనకు అట్లాంటి సహాయం లభ్యమౌతుందన్న ఆశలేదు. అందుచేత గత్యంతరం లేక తన ఎడ్లు రెంటినీ జతకలిపి దున్నుకోవలసిన అవసరం వచ్చింది. పూర్తిగా నాగలి కట్టి దున్నడం మొదలు పెట్టక ముందు రెంటినీ కాడిగట్టి అలవాటు చెయ్యాలని కఱ్ఱులేని నాగలితో ఒక రోజున ప్రయత్నం చేశాడు. కొత్త ఎద్దు జతగిట్టక గోపాలం ఎద్దు మారాం చెయ్యడం మొదలు పెట్టింది. కోపం వచ్చి నాలుగు దెబ్బలు వేస్తే రెండడుగులు వేసినా ఏమఱుపాటున ఎటో అటు లాగివేసేది. నానాయాతనా పడి మళ్ళీ స్వాధీనంలోకి తెచ్చుకుని ఎంత అరిచినా, ఎంత కొట్టినా, ముల్లు కఱ్ఱ పెట్టి ఎంత పొడిచినా అడుగుతీసి అడుగు పెట్టేదికాదు. వట్టి కాడి భుజానవేసి జతనుతోలుకు వస్తే అలవాటు అవుతుందని ఇంటి వైపుకు మళ్లవేస్తే కొత్త ఎద్దును తనతోపాటు పరిగెత్తించి మేఘాలమీద ఎగిరిపోయి, ఏ చెట్టుకో కాడి తగిల్చి, మెడతాడు తెంపుకుని భూప్రదక్షిణం చేసి అర్ధరాత్రి ఏ వేళకో యింటికి వచ్చేది. దాంతో పౌరుషం వచ్చి ఎద్దు ఇంటికి రావడంతోటే గోపాలం దాన్ని కోపంతో కొట్టేవాడు. కసి తీర్చుకున్నాననుకుని రేపు దుక్కిలో దింపితేసరి, లాగకేం చేస్తుందని ధైర్యం వహించేవాడు.

ఆ రాత్రి బ్రహ్మాండంగా వర్షం కురిసింది. గట్లు తెగేటంతగా చెఱువులు నిండాయి. ఆబాల గోపాలం పల్లెటూళ్ళో అందఱూ తమ తమ అభీప్సితాలు నెఱవేరినట్లు సంతోషిస్తున్నారు. సంస్కారవంతుడైన మానవుడు పరోపకార విషయకంగా ఆర్ద్రమనస్కుడైనట్లు భూమి సమస్తమూ బీజనిక్షేపానికి అనువైంది. నేల యీనినట్లు కర్షక జనం యావన్మందీ పంట పొలాల్లో పని చేసుకోవడానికి బయలు దేరారు.

తెల్లవారకుండానే మధ్యాహ్నం లోపల తన ఎకరం పొలం ఊడ్చెయ్యాలని రాముడు రెడ్డి అరక తోలుకుని పొలానికి వచ్చాడు. గోపాలం కూడా తన జతను వెంట బెట్టుకుని రెండు చాళ్లన్నా ఇవాళ దున్నుదామని బయలుదేరి వచ్చాడు. ఉన్న రెండెకరాల భూమికి రెండు జతల ఎడ్లతో వ్యవసాయం చేస్తున్న వీళ్ళని చూచి ప్రకృతే నవ్వుతోందా అన్నట్లుగా ఫక్లున తెల్లవారింది.

గోపాలం తన జతతో దుక్కి సాగించడానికి తీవ్ర ప్రయత్నం చేస్తున్నాడు. కాని ఎంత చేసినా లాభం లేకపోతోంది. గోపాలం ఎద్దు కొత్త ఎద్దుతో ఏ మాత్రమూ సయోధ్య కుదుర్చుకోలేదు. వట్టి నేల నైతే తన యిష్టం వచ్చినట్లు గంతులు వెయ్యడానికి అవకాశం ఉండేది. వరిపొలం మడిలో దుక్కి అయిన కారణం చేత బురద నేల అవడం బట్టి అటూ ఇటూ పారిపోవడానికి వీలు చిక్కడంలేదు. గోపాలం ఎద్దు ఒక కొత్త విద్య నేర్చుకున్నది. కొత్త ఎద్దుతో జతకలవక అది కాస్తా ముందుకు లాగిందంటే ఇది చటుక్కున పడుకునేది. తోక మెలి పెట్టి, ముళ్లకట్టతో పొడిచీ, ఇంకా లేవకపోతే ఆ కట్టతోనే వీపుమీద నాలుగువేసీ, వీటన్నింటికీ ఊతగా రాముణ్ని ఉద్దేశించిన తిట్లుకలిపి ఎంతో హైరాణపడగా ఒకసారి లేచేది. చాచ్చో అని రెండడుగులు వేయించే టప్పటికి మళ్ళీపడుకునేది. తానిలా తనదుక్కితో నానా తిప్పలూ పడుతూఉంటే తనపక్కనే రాముడు ఏ కష్టమూలేకుండా పొలందుక్కి పూర్తి చేసుకోవడంచూచి సహించలేక కోపం మఱీ ఎక్కువై ఒళ్ళు తెలియకుండా బాదడం సాగించాడు గోపాలం.

గోపాలం మనసులో ఒక పుట్టిపుట్టని ఊహ. తానుపడే కష్ట మంతా చూస్తూ తనకంటే వ్యవసాయంలో ఎక్కువ అనుభవమున్న రాముడు తాను అడగకపోతే మాత్రం ఎందుకు సహాయం చేయగూడదు? కాని ఈ ఉహ రూపుకట్ట నివ్వకుండా అతని వ్యక్తిత్వం అడ్డునిలిచేది.

వెంటనే వాడేమిటి, నాకు సాయంచేసేదేమిటి అనేధోరణి ప్రబలి అంతా తనే చేసుకోవాలన్న పట్టుదలతోచి, నిర్వహించు కోవడానికి ఉపాయం తట్టక అసమర్థతా పారవశ్య దూషితమైన ఈ ప్రవర్తనలో పడిపోయాడు గోపాలం. గోపాలాన్ని చూస్తే రాముడికి జాలీకలుగుతోంది, కోపమూ వస్తోంది. తమ్ముడికి సాయం చెయ్యాలన్న భావం అతని మనస్సులో ఎప్పుడూ గాఢంగా ఉంటుంది. కాని చెయ్యబోతే అతడుదానికి ఏ అర్థం చెప్పి తన్ను దూషిస్తాడో అన్నభయం మాత్రం వెంబడిస్తుంది. అందు చేత జంకుతాడే కాని అసలు చెయ్యకపోవడం అతని స్వభావంలో లేదు. ఇప్పుడు గోపాలం ఎద్దువల్ల పడుతున్న యాతన చూచినదాని కంటే గోపాలం ఎద్దును పెట్టుతున్న యాతనచూచి అణుమాత్రం సహించలేక పోయాడురాముడు. ఈసారి గోపాలం ఉగ్రంచూస్తే ఎద్దునెత్తురు కళ్ల చూస్తాడా అనిపించింది. రాముడిగుండె దడదడలాడింది. చటుక్కున కళ్లులోతుగా గ్రుచ్చి, దుక్కి ఆపివేసి వెనక్కు తిరిగాడు. గోపాలం ఇంకా కొట్టుతూనే ఉన్నాడు. ముల్లుకఱ్ఱ చేతోపుచ్చుకుని చకాచకా నాలుగడుగులు వేసి ఎద్దుదగ్గఱకు పోయాడు రాముడు. గోపాలం ఎత్తినకఱ్ఱ ఎత్తినట్లే ఆగిపోయాడు. రాముడిలా వస్తాడని అతనెన్నడూ అనుకోలేదు. రాముడు సరాసరి ఎద్దు దగ్గఱకుపోయి దాని వీపుమీద రాస్తూ, ముఖంలో ముఖంపెట్టి చూచి కళ్లనీళ్లు పెట్టుకున్నాడు. ఒళ్లంతా వాతలుతేలి ఉంది. దానిమీద చెయ్యివేసి, దానికళ్ళల్లో చూస్తే తన శరీరంలో ప్రతినరమూ ఉబికి వాతలుతేలి కలుక్కు మన్నట్టయింది. ఆబాధ భరించలేక పోయాడు. ఒక్కమాటు దాని ముఖంమీద ముఖం పెట్టి ఏడ్చాడు. దాని మెడమీద పెట్టిన తనచేతికి కాడికట్టు తగిలింది. అప్పుడు తెలివివచ్చి మెడతాడు వదిలించి కాడి ఊడదీసి గట్టునపెట్టాడు. గోపాలం ఏంచెయ్యడానికీ తోచక ఎత్తిన కఱ్ఱదించి కాసేపు నుంచు న్నాడు. రాముడు ఎద్దును నుంచోపెట్టాలని తోకమీద నిమిరి జబ్బ

చరుస్తున్నాడు. అది లేవడంలేదుగాని కలతనిద్రలో మనిషి ఉలిక్కి పడ్డట్టు కదులుతోంది. రాముడికికూడా ఏంచెయ్యడానికి తోచలేదు. చెఱువుకట్ట అంచున మొలిచిన పచ్చిగడ్డి పరకలు కోసితెచ్చి అరచేతుల్లో పెట్టుకుని దానికెదురుగా కూర్చున్నాడు. గోపాలం ఒకచోట నిలబడ లేకపోయాడు. రాముడక్కడుండగా ఎద్దు దగ్గఱకు పోలేక పోయాడు. చిరాకెత్తి ఒళ్లుతెలియని వానిలాగా పొలంగట్ల వెంబడి చకచకా నడవడం మొదలు పెట్టాడు.

అప్పటికి ఝామ్ము పొద్దెక్కింది. ఎఱ్ఱగుడ్డ కట్టిన కూడు దుత్తనెత్తిన పెట్టుకుని పొలం కాపునకు అన్నం తెచ్చిపెట్టే కాపుపడుచువలె సూర్యుడు చెఱువు కట్టపైకివచ్చాడు. బాల సూర్యకిరణ చిత్రవర్ణ సమాక్రాంతములైన శాద్వల భూములు సత్యకాలంలో కృషీవలుడు స్వయం కృషిచేత సంపాదించిన మంచి బంగారపు మేలిమికాంతుల భ్రాంతి మాత్రమే కల్పిస్తున్నాయి. కాని యిదిసత్యమునందసత్యభ్రాంతి యేమోఅని అనిపిస్తోంది. ఆ కాంతులవెంబడి రాత్రి చల్లదనము సర్వస్వమూ తొలికోడి కూతలో కోల్పోయిన ఎద్దు మెడలోని కంచు గంట సుస్పష్ట శ్రావ్యనినాదములు వినవచ్చినవి. చెఱువుతట్టు లోగట్టున మేత మెయ్యడానికి ఊళ్ళోగొడ్లన్నీ అప్పుడప్పుడే వస్తున్నాయి, రాముడి ఆవూ, గేదేకూడా వచ్చాయి. ఆవు చెఱువుకట్ట ఎక్కి మడిలో పడుకున్న ఎద్దునూ, ఎద్దుదగ్గఱ కూర్చున్న రాముణ్నీచూచి అరిచింది. ఆ అరుపుకు గోపాలంఎద్దు ప్రతిధ్వని చేసింది. అటూఇటూ తిరుగుతున్న గోపాలం ఒకసారి ఆవువంకా, ఒకసారి తన ఎద్దువంకా చూచి ఆగాడు. అంతలో మళ్ళీ పచార్లు మొదలుపెట్టాడు. ఆవు చెఱువుకట్ట దిగి మడిలోకి రాబోతోంది. గోపాలానికి చిరాకు ఎక్కువైంది. దూకుడుతో అటూ ఇటూ నడవడంలో రాముడి మడిలో మెఢమీది కాడితో బురదనేలలో దిక్కులుచూస్తూ దవడలు ఆడిస్తున్న రెడ్డిగారి ఎడ్లజత గోపాలం కంట

బడింది. అతడు సరాసరి దాని దగ్గఱకు పోయాడు. అనాలోచితంగా మెడకట్టు వదిలించి కాడి ఊడదీసి గట్టున పెట్టాడు. ఎడ్లురెండూ రెండడు గులువేసి మడిదాటి రోడ్డుమీదికి వచ్చాయి. గోపాలం వాటివెంబడే వెళ్లాడు. ఎదురుగుండా రాముడిఎద్దు వస్తూ వీటినిచూచి అరిచింది. అది దూకుడుగా చెఱువు కట్టమీదికి వెళ్తోంది. గోపాలం ఎడ్లను తోలుకుని ఊళ్ళోకి వెళ్ళి పోతు న్నాడు.

చెఱువు కట్టఎక్కి రాముడిఎద్దు మడిలో గోపాలం ఎద్దునుచూచి గట్టిగా అంభా అని అరిచింది. గోపాలం ఎద్దుకూడా దీనివంకచూచి అంభా అని మళ్ళీ అరిచింది. రాముడి ఎద్దు ఒక్కఅంగలో ఉరికింది. గోపాలంఎద్దు ఒకత్రుటిలో లేచి నిలుచుంది. త్రవ్వుతున్న బావిలో జల పొడిచినట్లు రాముడి మనస్సులో ఉత్సాహం పరవళ్ళు త్రొక్కింది. రెండెడ్లూ ఒకదానిమూతి మఱొకదానికి ఆన్చుకుని దీర్ఘకాల వియోగ దుఃఖమలిన కథా ప్రసంగములతో ఓదార్పు పొందాయి. ఒకదాన్ని ఒకటి వెంబడించి గట్లనున్న గడ్డిపరకలు కొరికాయి. ఒక్కొక్కక్షణం ఆగి ఒడళ్లు ఒరుసుకోగా గాఢ పరిష్వంగ సౌఖ్యం అనుభవించాయి. రాముడు వాటివంకనే అనిమీలిత దృక్కులు ప్రసరిస్తూ ఆనంద తన్మయుడై నిలబడ్డాడు.

అరగంట గడిచింది. ఎడ్లుమేతమాని మువ్వలు లేని బొఱుగు పట్టెడ మ్రోగగా దవడలు ఆడిస్తూ నిలబడ్డాయి. రాముడు కాడితీసి వాటిభుజాన వేశాడు. అప్పటికింకా ప్రొద్దు నడినెత్తికిరాలేదు. ఇంకా గజం నీడ పడుతూనేఉంది. వేసవికాలం కాబట్టి ఇళ్ళకు పోవలసిన సమయం. ఎండవేడి ఎక్కువగానే ఉంది. కాని కాడి బుజానవేసుకుని ఎడ్లు ఊరికే నుంచోక నడకసాగిస్తూ ఉండడంచూచి రాముడు అనాలోచితంగానే మేడికోలు కాడికిబిగించి నాగలి కొమ్ము చేత బుచ్చుకున్నాడు. దుక్కి సాగిపోతోంది. అరమడియలో చాలు దుక్కి పూర్తిఅయింది.

ఎడ్లు మహదావేశంతో ముందు నడుస్తున్నాయి. రాముడు ఉత్సాహంతో దుక్కి పగ్గంపట్టుకు నడిపిస్తున్నాడు. దుక్కి రెండుచాళ్ళు కలపడం అయిపోయింది. ఎడ్లు వాటిఅంతట అవే ఆగిపోయాయి. రాముడు తలఎత్తి చూచాడు. ప్రొద్దు నడినెత్తికి వచ్చింది.

కాని కాలం వేళమించి పోయింది. ఇంక ఉండడానికి వీల్లేదు. రాముడు వెంటనే కాడి ఊడదీసి ఎడ్లను విడిచిపెట్టాడు. ఎడ్లు జంట విడవకుండా ముందు నడవడం మొదలుపెట్టాయి. రాముడు తనమడిలో ఎడ్లకోసం చూచాడు. ఎడ్లను ఊడదీసి గోపాలం తోలుకు వెళ్ళడం రాముడు గమనించలేదు. ఇప్పుడక్కడ ఎడ్లు కనబడక పోవడంతో అతడు ఒక్కక్షణం నిర్ఘాంతపోయాడు. తనతమ్ముడి ప్రవర్తన ఇంతలో ఇట్లా మారుతుందని అతడు అనుకోలేదు. రాముని స్వభావంలో మాలిన్యం లేకపోయినా తమ్ముని ప్రవర్తన అతని మనస్సులో తెచ్చి పెట్టిన కష్టంవల్ల గోపాలం ఈ పనిచెయ్యడం. ఇంకెందుకైనా యేమో అన్న అనుమానం రాకపోలేదు. కాని అతని సహజ సుస్వభావం తల యెత్తి ఈ ఊహను నిలవనియ్యలేదు. ఎడ్లు ఉల్లాసంతో జతగూడి నడుస్తున్నందుకు సంతోషమూ, గోపాలం ప్రవర్తన అర్థంకాక ఆ భావమూ పునఃపునః పర్యాప్తములై అతని మనస్సుమీద రాజ్యం చేస్తున్నాయి. మండుటెండలో పండువెన్నెలలోవలె ఎడ్లవెంబడి రాముడు ఊళ్లోకి నడకసాగించాడు.

గోపాలం రెడ్డిగారి ఎడ్లను ఆయన కప్పజెప్పి ఇంటికి చిరాకుతో వచ్చాడు. భర్త చిరాకూ, విసుగూ చూచి సీతమ్మకు నోటమాటరాలేదు. ఏమనడానికీ తోచక చల్లని నీళ్ళుమాత్రం తెచ్చి ఎదురుగుండా బెట్టి లోపలికి వెళ్లిపోయింది. అన్నపూర్ణ ఉదయంనుండీ వంటఇంట్లో పనులు

ఒకదానివెంబడి ఒకటి తలపెట్టు కోవడంవల్ల తీరక యాతన పడు తోంది. కుఱ్ఱవాడు రంగయ్య ఆలస్యంగా పడుకోవడంవల్ల చాలాసేపు నిద్రపోయాడు. కాని పదిగంటలయే టప్పటికి నిద్రలేచి అప్పుడప్పుడు గుక్కపట్టి ఏడవడం మొదలుపెట్టాడు. సీతమ్మ వీలుచూసుకుని అన్నపూర్ణకు తెలియకుండానే పిల్లవాణ్ని తీసుకుందామని ప్రయత్నం చేస్తోందేకాని ఆమెకు కూడా తీరడంలేదు. ఇంతలో గోపాలం రానే వచ్చాడు. గోపాలాన్ని చూడ్డంతోటే సీతమ్మకు ఈ ఊహ కాదుగదా, ఏ ఊహా తోచడంలేదు. కానీ అంతలో పిల్లవాడు గోలపెట్టడం మఱీ ఎక్కువైంది. ఆ ఏడ్పు వినబడడంతోటే ఎన్నడూ కదలని గోపాలం గూడా మనసులో ఒక కదలిక పొందాడు. అమాంతంగా లేచి నుంచున్న భర్తనుచూచి సీతమ్మ హడలిపోయింది. కాని గోపాలం చరాచరా అటూ ఇటూ ఒకసారి నడిచి 'ఆ లెక్కన ఏడుస్తుంటే వినపడటం లేదూ? కదలవేం' అని అంటూ సీతమ్మనుచూచి కళ్లు పెద్దవి చేశాడు. సీతమ్మకు ఈ విధమైన భర్త ప్రవర్తన ఏమీ అర్థంకాలేదు. ఆ మాటల్లో ఎంత నిజమో, ఎంత అబద్ధమో తోచలేదు. వెళ్ళడానికీ, ఉండడానికీ, కూడా భయం వేసింది. 'నీకు కాదూ చెప్పేదీ' అని అంటూ గోపాలం మధ్యనున్న తడికను ఒక తన్ను తన్నాడు. తన్నుతా తెలియని పార వశ్యంలో క్రిందబడ్డ తడికను తొక్కుకుంటూ సీతమ్మ పరుగెత్తుకుని పోయి పిల్లవాణ్ని తీసుకుంది. అన్నపూర్ణ తడికపడ్డ చప్పుడు విని బైటికివచ్చి ఆశ్చర్యపడి నిలబడింది.

తలలాడిస్తూ, బొఱుగుల చప్పుడు ఒయ్యారంగా చేసుకుంటూ కలిసిమెలిసి పెరిగిన అన్నదమ్ములవలె ఎడ్లజత లోపల అడుగుపెట్టింది. గోపాలం ఆ రెండెడ్లనూ తలపగ్గాలు లాగి ఒకచోట కట్టి మేత వేశాడు.

బుజంమీది కాడితో రాముడువచ్చి ఎడ్లను కట్టుతున్న తమ్ముణ్ణి చూచి విస్తుపోయి నిలబడ్డాడు. ఎడ్లను కట్టిన గోపాలం వెనక్కి తిరిగి అన్ననుచూచి 'రెండు ఝాములయ్యేదాకా పొలంలో ఏం చేస్తున్నావన్నయ్యా! ఎండ మండిపోవడం లేదూ?' అన్నాడు.

తండ్రిపోయిన ఇన్నాళ్ళకు రాముడి ముఖంలో సౌభ్రాతృ సౌఖ్య సూచక మందస్మితము వికసించింది.

(ఏప్రిల్, 1946)

# 17. 'లి' గాడు

—కవికొండల వెంకటరావు

సర్వసామాన్యంగా తెనుగువారిచే నుపయోగింపబడుతూన్న "లి గాడు'' శబ్దాన్నే విటిచి "లి"గాడుగామార్చి దానిని సార్థకం గావించే విధంగా ఈ కథలో వాడుతూ వున్నాను. పాఠకులు పరా మర్శింౖతుగాక : లేరుమటీ ''వన్నెకాడు'', "అందగాడు", ''ఆట గాడు", ''పాటగాడు" అని. అట్టివాడే "లి'' గాడున్నూ.

"లి''గాడు అనగా— కొడవలి, గొడ్డలి, గుద్దలి, రోకలి, నాగలి, వీనిని పనిముట్లుగా గైకొని శ్రమపడే మగ వ్యక్తి. ఎంత శ్రమపడ్డా వాడు సంపాదించే సంపాదన, కలి, అంబలి, ఈ రెండింటినీ మించిన ఆహారాన్ని సంబాళించుకోవడానికి చాలదు. వా డనే మాటల్లో "దాపలి", "వెలపలి" అని వినబడేనిగాని ఆ పదాలు ''గిలక" పరంగా కాకుండా "గి త్త'' పరంగా వాడేవి అని తెలుసుకోండి. అంతకంటె ఎక్కుడువిద్య వానికద వుండడాని కవకాశమే లేదు. వానికున్న కష్టా లన్నీ విభజిస్తే రెండింటి కిందకువస్తాయి. ఒకటి ఆకలి, రెండోది చలి. సంఘంలో వాని అవధి ఎల్లాగు వుంటుందంటే సంపెటపెట్టుతినే దాంగలి యొక్క అవధిలా గుంటుంది, విన్నారా?

ఇటువంటి "లి" గాండ్రు వాళ్ళ భార్యలు "లి'' కత్తెలు ఒక కొందఱు కలిసి వున్నట్టాయినా వాళ్ళందర్నీ మూకుమ్మడిగా మనం "లి గాడు ప్రజ" అని అనవచ్చును.

అనవచ్చును ఏమిటి? వాళ్ళ మొహాల్లోని దిగాలే చెబుతుంది, చూడ్డంతోనే వీళ్ళు "లి గాడు ప్రజ" అని. ఆనందం అనేది వాళ్ళ కళ్ళల్లో మృగ్యం. ఎలా వుంటుంది? వాళ్ల బ్రతుకూ, పట్నవాసపు రోడ్డు పక్కను నాటబడ్డ చెట్టుయొక్క బతుకూ వొక్క టాకీగా ఉన్నప్పుడు? ఆ చెట్టుకిందే వాళ్ళ విడిది అయినప్పుడు? ఆ చెట్టు తప్పితే మఱి ఆస్కారం ప్రపంచంలో — ఈ ప్రపంచంలో ఎక్కడా వాళ్ళకు కానరానప్పుడు?

ఓ సాయంత్రం అటువంటి జనసమూహం తాలూకు ఓ కుటుంబాన్ని చూచి వితర్కించడం నాలో జరిగింది కాబట్టే ఇంత బలవత్తర సాక్షిగా వాళ్లనుగురించి నొక్కి వక్కాణింప గల్గుతున్నాను. నమ్మండి నా మాట, పాఠకులు!

ఆ కుటుంబాంది సంసారమన్నా వొక్కటే సన్యాసం అన్నా వొక్కటే, ఆ స్త్రీనిగురించి జాబితా వ్రాయడం అంటూవస్తే — తవ్వే మట్టి నెత్తికెత్తుకునే రెండు తట్టలు, పట్టివి కావట్లో ఇటూ అటూ పన్నుకుని, ఆ తట్టల్లో పెద్ద కుండలు రెండూ, కూంత కూంత గంజివద్దనున్న ముంతలు రెండూ వుంచుకుని. బుజాన్ని గునపం గునపానికి పార తగుల్చుకొని మొగాడు ముందు వస్తూవుంటే, ఆ వెనకనే ఆడది వో చంకను కుఱ్ఱాణ్ణి సముదాయించుకుంటూ, రెండోచేత మాఱు వొల్లె తొళ్లికా, పుచ్చుకు మగాణ్ణి అనుగమిస్తూ "ఈ చెట్టుకింద దిగుదాంరా!" అని పట్నంలో గోదావరి గట్టు ప్రక్కను వో చెట్టు మొదట దిగారు, నడచి నడచి ఎక్కణ్ణుంచో వచ్చినట్టు కనబడే దుమ్ముకాళ్ళతో చెమ్మట తల కట్లతో—

సన్యాసివస్తే ఎదురువెళ్ళి పట్నంలోని గృహస్థులు అనేకమంది తమ యిళ్ళకూ పిల్చి భిక్షలు పెడతారేగాని యిలాంటి వాళ్ళను ఎవరున్నూ ఆహ్వానించరు. వారి కెవరున్నూ ఆతిథ్యమివ్వరు.

ఉతకా చిరతాలేని ఊరచెట్లు కాబట్టి అవి నిర్మోహమాటంగా వాళ్ళను తమ కిందకు రానిచ్చాయి. రానిచ్చాయి అన్నమాటేగానీ కొంత సేపటి వరకూ వాళ్ళను ఆ చెట్లున్నూ పలకరించలేదు. గాలికూనలు బయలు దేరి చెట్ల చెవుల్లో వీళ్లు నావాళ్ళు సుమండీ అని ప్రేరేపించేదాకా రాతి లాగానే వూరుకున్నాయి.

నాడు గాలికి చెట్లు చలించడంలో వొక అపురూపమైన చలవ – ఆ పని వాళ్ళ మూలంగానో ప్రకృతి మూలంగానో ప్రపంచాని కంతకూ సోకింది. ఆకాశం చూసేసరికి వో అనుకోని మబ్బుతునక బంగారం వర్షించినట్టు సాయంకాలం నీరెండ కాంతిలో వర్షిస్తూ, చేరిక బడ్డదై, చెట్లనూ, చెట్లకింద దిగినవాళ్ళనే కాకుండా ఆ పరిసర ప్రాంతాన్ని అంతనూ అతి వినోదవంతంగా మార్చివేసింది. పెద్ద వానగా పడలేదు. గోరునీళ్ళు చల్లినట్టుగా పడింది. అంతేశాన. వెంటనే కష్టజీవులయొక్క కనురెప్పలమీద దుమ్ము, చెట్ల ఆకులయొక్క ధూళీకూడా కడిగివేయ బడినట్టయింది. కమ్మని శ్వాస భూదేవిదా, భూదేవిమీది ప్రాణికోటిదా అన్నట్టు వ్యాప్తమైంది. అంతేకాకుండా "అదివరు కెక్కడున్నవో యీ పక్షులు" అని అనిపించీలాగు ఆకుపచ్చని చిలుకలు, తెల్లని కొంగలు, నల్లని కాకులు, గోధుంవన్నె గోరింకలు, కొన్ని ఎగురుతూ, కొన్ని నిశ్చింతగా కూర్చుని, కొన్ని అరుస్తూ, కొన్ని కులుకుతూ సందడి చేశాయి.

దాంతో పట్నంలోనూ ప్రకృతిశోభకు తావువుంది అని తట్టింది. మఱిన్ని ప్రకృతితోపాటూ పామర జనానికిన్నీ ఆశ్రయం వుంది అని తోచింది.

"లి"గాని అంగన తన అనుగు బిడ్డణ్ణి వెంటనే చెట్టుకు తన విడి పుట్టంతో వొక వుయ్యాలావేసి ఆ వూయల్లో పండబెట్టి —

''తొలుత బ్రహ్మాండబు తొట్టిగావించి, నాలుగు వేదాల గొలుసు లమరించి'' అని వూచినట్టుగా అంతరాళమం దొకసారి వూచి మగని కోసంగాను చూచింది.

మగడక్కడ లేడు. ''అరి పీడి జిమ్మడ! ఇంకా ఈ కొత్త వూళ్ళో అడుగెట్టామోలేదో పీడి కప్పుడే ఏ వొంకదానోసన కొట్టిందిరా బాబా! ఆ కల్లోసన! ఆ కల్లుపాకోసన! ఏ తట్టుకు సచ్చాడని నెమకే దాన? ఆడు మళ్ళీ ఒన తాగుబోతు వాలకంతో యీ పెద్ద మహా నగరంలో దారీ తెన్ను నా అంకకు కనుక్కోగలడా! దేవుడా!'' అని దీనంగా దిక్కులు చూచింది. చూచి చూచి నిరాశా భావోద్రిక్తమైంది ఆ భావంనుంచి తీవ్రమైన క్రోధభావం లోనికి మాఱింది. ''పీడు! పీడు! మొగుడనుకోనా మొద్దులనుకోనా? బువ్వ బూరికింద, గంజి పాయసంకింద గడుస్తూవున్న యీ బతుకుని లాయిరు బందులు పెట్టే వాడు పీడా తాళిగట్టినోడు? రానియ్యి! రాడూ? నిసి రేత్రికైనా రాడూ? వచ్చాడా వాణ్ని అంతదూరంలో ఆ చెట్టుకు రెక్కలు విరిచికట్టి చింత బరికెలతో బుద్ధిసెప్పి గద్దెడతా!'' అని నిశ్చయించుకుంది. నిశ్చయించుకుని బిడ్డ దంతలో యేడిస్తే వాణ్ని యుయ్యేలలోనుంచి తీసి, నేలనే కూర్చుండ బెట్టి, యుయ్యేల చీరవిప్పి, ఆదో తలగడాగా చేసుకు, దాని మీద తన కట్టుకొంగు పఱచుకొని. పక్కలో బిడ్డణ్ణి పరుండబెట్టుకు పట్టీ పట్టని కునుకు వానితోపాటు పోతూవుంది.–మినుకు మినుకుమనే చుక్కల్లే దీపంలేక, చీకటిలోనే కాలం వెళ్ళబుచ్చుతూంది. విశ్వేతరమంతా అంధకార బంధురంగా వుంది.

రేత్రి పదకొండు గంటలయింది. బిడ్డడు మంచి నిదురలో ఉన్నాడు. మగని అజాపజా ఏమీ కనిపించడం లేదు. ఏంచేస్తుంది ఆ ఇల్లాలు? ''ఎక్కడికి పోయినాడో యీ దిక్కుమాలిన పట్టణంలో'' అని వెక్కువెక్కున యేడ్వసాగింది.

అలా ఏడుస్తూండగానే ఆమె వీనులకు "బ్లెడీహుం'' అని వొక శబ్దం వినిపించింది. అది మనిషిగొంతుక, మగవాని గొంతుకలాగు తోచింది. కళ్లనీళ్లు తుడిచివేసుకొని ఆమె "వస్తున్నాడు. వెఱ్ఱొలికించు కుంటూ, వీడికీ రోజుతో బుద్ధిరావాలి'' అని తన తాత్కాలికపు తలగడా చీరతీసి పొడుగ్గావిప్పింది. తిరిగి ఆవలవ్యక్తి "మేరీ! డార్లింగు! హల్లో! బ్లెడీ! టారీ! లిలీ! బులీ! జోలీ!" అన్నాడు. —"నన్ను ఒంటిదాన్ని చేసి యింకా ఏడిపించాలని అనుకొంటున్నావురా. నేను జడిపిస్తే జడిసేదాన్ని కాదు. ఏడిపిస్తే ఏడ్చేదాన్ని కాదు'' అని ఆమె ఏంచేసిందీ అంటే— ఆవలవ్యక్తి అంతదూరాన్ని వుండగానే తన తలగడచీర వుచ్చుపోసి విసరినట్టు విసరి చెట్టుచెంత కమాంతంగా ఏనుగు నీడ్చినట్టు ఈడ్చి రెక్కలు విఱిచికట్టి "ఈ రేత్రి తెల్లవార్లూ అలామెదక పలసిందే నీవు'' అంది. ఆవలివ్యక్తి ఎంచేతో కోరలుతీసిన పాములా కొంతసేపు నీరసస్థాయిలో పడ్డాడు. దీపంపెట్టి చూడ్డానికి స్త్రీదగ్గఱా దీపంలేదు. వచ్చిన పురుషవ్యక్తి దగ్గఱాలేదు. కానీ ఆ వచ్చిన వ్యక్తిశరీరచ్ఛాయ శరీరాచ్ఛాదన చ్ఛాయ సమస్తం నలుపురంగే. దాని మగనిరంగూ దానిమగని గుడ్డలరంగూ అట్టిదే. పోనీ కళ్ళు తెలుపేమోఅని గుర్తించ డానికి ఎఱ్ఱనికళ్లు తాగినప్పటి కళ్ళు ఎట్టివారి కళ్లైనా చీకట్లో నల్లగానే కనిపిస్తవి.

ఇంతకు ఎవర్రా ఆ కొత్తవ్యక్తి అని మనకు జిజ్ఞాసగాని ఆమెకు లేనేలేదు ఆ సమయాన్ని. ఆమెకు ఆ వచ్చినమనిషి, బాగాతాగి క్రైపెక్కి వున్న తన మగడనే — నిస్సందేహంగా తనమగడనే - ఘట్టినమ్మకం.

దూరంగా ఠంగుఠంగుమని పన్రెండు కొట్టారు తాలూకాలో. ఈ పామరాంగనకు దాని పరకాయింపేలేదు. ఆమెకు సూర్యచంద్రులున్న ప్పటికాలం తెలిసికొనే పాళపు విజ్ఞానమే కలదుగానీ మఱిలేదు. చుక్కల్నిబట్టి సుంతాతెలీదు. ఆ చెట్లకిందనుంచి చుక్కల్ని చూడ్డం

అనేది కూడాదుస్సహము. చూడలేదో బ్రతికిపోయింది. చూచివున్నట్టాయినా బ్రహ్మరక్షస్సో, పిశాచమో ప్రాణం అదలించి యుండేది.
—''బ్లెడీహుం !'' ''బ్లెడీహుం'' !—

ఈ "బ్లెడీహుం'' అనేవాణ్ని గురించి మనం రైట్‌రాయల్‌గా ఎరిగివుండాలీ అంటే తఱచు మెయిలుబండి ఎక్కుతూవుండాలి. ఊరకే ఎక్కడమే కాకుండా మెయిలుబాగా పదినిముషాలు, పదేను నిముషాలు ఆగుతూవుండే ప్రతి స్టేషనులోనూ దిగి ఇంజనుదగ్గరకు వెళ్ళి అతి విచిత్రంగా గమనిస్తూరావాలి. అప్పుడు ఆ ఇంజన్‌యొక్క జఠరాగ్నికి నిరంతరం రాక్షసిబొగ్గు సమకూర్చే తెల్లదొర వొకడౌపిస్తాడు. అసలు తెల్లని చాయవాడైనా చేసేపనినిబట్టి నీగ్రోలా నల్లనివన్నె ప్రకటిస్తాడు. ఈ "బ్లడీహుం'' అన్నది ఆ దొర. ఆ దొర నామధేయం మిస్టర్ ఎలూఫ్. ఆయనకు వొక భార్యవుంది. ఆవిడపేరు మిసెస్సు ఎలూఫ్.

మిసెస్సు ఎలూఫ్ మాంచి ఫాషనబుల్ లేడీ. క్లబ్బులో డ్యాన్సింగుకు ఎన్నికగన్న అన్నులమిన్న. డ్రెస్సువేసిందీ అంటే ఆమెడ్రస్సు ఇతర లేడీస్‌కు అందఱికీ వరవడి. ఒకరవ్వ వుంగరంవేలికి. ఒక బంగరుగొలుసు మెళ్ళో. అంతే ఆమెపెట్టుకునే ఆభరణాలు. అవితె మాత్రం ! మెడ తిప్పుకోకుండా వున్నా గొలుసు అల్లాడ్డం వోసొగసు, మెడ తిప్పుకొంటూవున్న గొలుసు అల్లాడక పోవడం వోసొగసు. ఇలాగ్గా వొకవస్తువును పుచ్చుకునే రెండువిధాల సొగసులు ఆమె చూపిస్తూవుంటే ఎవరైనా ఆమెను వింతవింతగా చూడవలసిందే. మడి వేలివుంగరం ! అస్తమానం ఎవరినో వొకర్ని పిలుస్తూవున్నట్టే, ఎవరినో వొకర్ని తలుస్తూవున్నట్టే ! ఏమా అంటే అందఱూ మాటాడుతూ మాటకనుగుణ్యంగా అభినయిస్తే ఈమె ఊహిస్తూ ఊహకే అనుగుణ్యంగా అభినయిస్తుంది. చూస్తే ఆమె వూహిస్తూవుండని ఘడికే

లేదు. కనుక ఆమెయొక్క తదంగుళీయకం నిరంతరాభినయంతో కూడుకున్నదై విశ్వమోహనంగా అగపించింది.

ఇటువంటి సరళ మిస్టర్ ఎలూఫ్‌ను వలచి పెళ్ళాడిందీ అంటే అది సాంఘిక సమస్యల్లో మెట్టుసమస్యయే యగుగాక, మనకిచ్చట అప్రస్తుతం. అది కదపరాని సత్యము.

రోజూ మిస్టర్ ఎలూఫ్ రేత్రిపూట తప్పతాగి, ఒక్కొక్కప్పుడు రోడ్డునడాన్న, ఒక్కొక్కప్పుడు డస్టు బిన్నులకాడ, ఒక్కొక్కప్పుడు గట్టుకీపక్క, ఒక్కొక్కప్పుడు గట్టుకాపక్క, ఒక్కొక్కప్పుడు గట్టు మీద, ఎక్కడపడితే అక్కడే వొళ్ళుతెలియక పడిపోవడం రివాజు. మిసెస్ ఎలూఫ్ డ్యాన్సుగీన్సు అయిపోయిన తరవాతను ఒక బ్యాటరీ లైటుచ్చుకు రోడ్లంటా రోడ్లసైడ్లంటా వెతకి మగణ్ని కనుక్కొని ఏ కూలి వాడిసాయాన్నో తన యింటికి జేరేసుకుంటూ ఉండడం రివాజు.

"లి" గాడు తన భార్యను విడిచిపెట్టి ఎక్కడికో వెళ్ళిపోయిన రేత్రికూడా పై దంపతులకు తమ తమ రివాజులు యథాప్రకారం జరిగినవి. మిస్టర్ ఎలూఫ్ తాగి మైమఱచి "బ్లడీ హుం" అని అరచుకుంటూ వచ్చి వచ్చి చెట్టుకింద పూర్వోక్తప్రకారం బందీ అయినాడు. కానీ అతగాడు "మిస్టర్ ఎలూఫ్" అని "లి" కత్తెకేం తెలుసు. ఆ తాగి తూలుతూ వచ్చిన మానవుడు తనమగడే అనుకొంది. అనుకొని చేయదలచు కొన్నంత పని చేసింది - చింతబరికతో బాజా వాయించడం ఒక్కటి మినహాగా !

ఇక అక్కడ "లి" గాడు— వాడెక్కడికి పోతాడు ? అసలు గట్టే వచ్చేటప్పుడే పసిపట్టివుంటాడు దిశ. పసిపట్టి అనుకొని వుంటాడు. "ఒకగ్లాసుడు ఇద్దటిక్కామందు" అని అనిపించే యీ కల్లు తాగక తప్పదని. తిన్నగా కల్లుఅంగడి వున్నరోడ్డుచ్చుకు అంగడికేసి నడ చేడు.

రోడ్డుమీద విద్యుదీపాలు వెలిగిపోతున్నాయి. ఎడాపెడా, రుప్పరుప్ప చూచే కుక్కల్లే, కొట్టుకొట్టూ తొంగిచూచేవాడు పట్నవాసాల్లో కల్లంగళ్ళు ఊరి చివరకాక ఊరిమధ్యనే వుంటవిగూడాను. దాని వాసన రంయిన కొట్టింది వోచాయను. లోపల జన సంకులం యొక్క ధ్వని మిక్కుటంగా యివలకు వినబడుతూ వుంది. కాని జనం కనిపించడం లేదు. గుమ్మం వద్దమాత్రం ''దయచెయ్యండి" అని ఆహ్వానం బోర్డు వ్రాసివుంది. "లి" గాడు ఈ జన్మలో చదువురానివాడైనా పూర్వజన్మ సంస్కారం కలవాడేమో— ఆ అక్షరాలబోర్డు వాణ్ని ఆహ్వానించి నట్టయింది. తొంగిచూచేడు. ''ఏం తొంగిచూస్తున్నావు? వస్తేరా లోపలికి! లేకుంటే నీదారినిఫో! అంతేగాని తొంగి చూడరాదు'' అన్నాడు లోపలనున్న వొకవ్యక్తి. మరోవ్యక్తి "వె: వె! వెధవని లోనికి లాగిట—'' అని వెనక్కి తానే పడిపోయినాడు. మూడోవ్యక్తి ''డబ్బుల్లేని ముఖం లాగుందినీచి, నడువు. ఇక్కడ అరువుగిరువు జాంతానై.'' అన్నాడు.

ఈ కడమాటతో ''లి'' గాడు కొంచెం వెనక్కుతగ్గాడు వాడి దగ్గఱ డబ్బేది? నాడసలేసున్న. రోజంతా ప్రయాణం తోనేచెల్లు. కొత్తపూరు పనికోసం రావడంలో.

అయితే డబ్బూగిబ్బూ లేకుండా తాగుడుకు బయలుదేరడంలో అర్థమేమిటంటారేమో. అర్థమేమీ లేదు. ఏమారి పరుగు లెత్తడం తప్ప. ఓపర్యాయం ఆపొద్దు కల్లుపాక చుట్టూ తిరిగి దానోసనకు రంజిల్లడమే లోపలి కుట్ర.

అయినా ఆశపోలేదు. ఆ కొట్టుకాకపోతే మఱోకొట్టుందదూ? మఱోకాడ! అని యింకాబాగా ముందుకు సాగాడు. రేత్రి 10, 11 అయింది. తిండి తినలేదేమో ఆపొద్దు రోడ్డుపక్కన ఈతట్టు, దారి

మఱచి చతికిలబడ్డాడు. రోడ్డుకాపక్కన ఆతట్టు ఓ మహాహర్మ్యంవాడి ముందు కళ్ళకు కట్టినట్టు రెండు అంతరువుల్ది కనిపిస్తూవుంది !

హర్మ్యం యొక్క దిగుభాగం వొక పెద్దహాలు, పైభాగం పదహారుగదులు. ప్రతిగదిలోను నిల్వుటద్దాలు, చెల్వుసోఫాలు, చల్వ రాళ్లు, హల్వాతీపిమంచాలు, కల్వపూ మెత్తని పరుపులు వున్నయి. అన్నిగదుల్లో లైట్లు. లైట్లుకు షేడ్లు. ఆరిపేయబడేవి, కొన్ని వెలిగించ బడేవి కొన్ని యిల్లాగా వుంటూన్నాయి.

"లి"గానిదృష్టి పైగదులమీదికి పోనేలేదు. అసలు వానిదృష్టి ఆదిలోనే కిందిహాల్లో ఆగిపోయింది. అదే వాడికి పరమానంద దాయకంగా వుండేది. రోడ్డుపక్కను చతికిల బడ్డవాడల్లా "గుళ్లో గోవింద రాజుల" విగ్రహం శయనించినట్లు ఓ చేతిమీద తలానుకు ఆ హాల్ను సూటిగా చూస్తూవున్నాడు.

హాల్లో నలభై జతలు, ఆడమగ జతలు, తెల్లని శరీరాలవాళ్ళు, మిలమిల ప్రకాశిస్తూ జిలజిలపాకే రోమాంచంతో నాట్యమాడుతూ వున్నారు. కిటికీలన్నీ తెరవబడివున్నాయి. లైట్లన్నీ వెలిగించబడి వున్నాయి. బ్యాండు వాయించబడుతూ వుంది. ఆర్గన్ మోత బుయి మంటూ వుంది. షేంపేన్ బాటిల్సు, కార్కులు వైపుపడే ధారచాలక, అధోభాగాన్ని కొట్టబడ్డవై గ్లాసులోకి వంచబడుతూ వున్నాయి.

"లి"గాడికి పై దృశ్యమేమిన్నీ అర్థంకాలేదు, ఒక్క వాళ్ళ గ్లాసు పుచ్చుకు తాగేటప్పటి చేష్ట తక్క, ఆలోపల వాళ్ళలో ఎవరైనా గ్లాసెత్తి తాగుతూంటే తానుగూడా రోడ్డుపక్కని చీకట్లో నోరు తెఱచి నాడు పాపం! అలా ఎన్నిసార్లు తెరవగలడు? ఎంతకాలం తెఱచి వుంచుకోగలడు. క్రమంగా ఆవలింతల్లోకిదిగి తనకు తెలియకుండానే నిదరోయాడు.

హాల్లో గడియారం రాత్రి ఒంటిగంట కొట్టింది. అంతా నిశ్శబ్ద వంతంగా మాఱిపోయింది. దీపా లారిపేశారు హాల్లో. పై గదుల్లో అక్కడక్కడ కొందఱు స్త్రీలు కొందఱు పురుషులు దిగబడ్డా అవికూడా చీకటి కోణాలే. హాల్లోనివారు చాలామంది హర్మ్యం వెలువడి ఆలా ఈలా తమ తమ లోగిళ్ళకు వెళ్ళిపోయినారు. అందరూ అనక చాలా మంది ఎందుకు అనడం వచ్చిందీ అంటే ఒకామె తన యింటికేసికాక "లి''గాడు పరుండియున్న రోడ్డుమీదకువచ్చి యిటూ అటూ చూచి రోడ్డు సైడ్డే "లి''గాడువున్న దెసకు వాణ్ణి చూడకుంగా అడ్డంగా నడుస్తూవుంది.

నడుస్తూ ఆమె ఏమి చేసిందీ ? తన పాదంతో తనకు తెలియ కుండా ''లి"గాణ్ణి తన్నింది. ''లి''గాడు "చచ్చాను" అని కెవ్వున అరిచాడు. ఆమె తన చేతిలో తయారుగావున్న బ్యాటరీలైటు వేసింది. ''హూ ఆర్ యు బ్లెడీ'' అంది. "లి''గాడు మాట్లాడలే. ఆమె మఱి రవంత కీచుగా ''కోన్ హై" అంది. "మాలోణ్ణి కాదుతల్లీ" అన్నాడు ''లి" గాడు. "మాలోడివి కావు ? కూలోడివా ?" అంది. ''ఊఁ" అన్నాడు. ''స్టాండ్ అప్" అని జబ్బట్టుకు లేవదీసిందివాణ్ణి. "లి"గాడు తానాపూట తిండి తినలేదన్నట్టు కడుపు తప్పటగా చూపిస్తూ వంగివంగి సలాము పెట్టాడు. ఆమె "ఫరవానై, ఈ రొతితిను. ఈనీళ్ళుతాగు'' అని ప్లాస్కులోను చేతిబుట్టలోను ఉన్నవాటినిచ్చింది.

"లి"గాడు ఆ రొతీ గబగబతిని గడగడ ఆనీళ్లుతాగాడు. "నన్ను ఫాలో'' అని చేసంజ్ఞ చేసింది. "లి" గాడు ఆమెవెనుకనే బంటు అయి నడుస్తున్నాడు. ఆమె ముందుకు దారితీస్తూవుంది. నడుమ నడుమ సైడ్డు రోడ్లకు సందుగొందుల్లోకి బ్యాటరీలైటు వేస్తూవుంది.

"నీవు తాగుతావా ?" అంది ఊరికేనే "లి''గాణ్ని పలకరిస్తూ ఆ స్త్రీ వ్యక్తి ఒకచోట ఆ నడకలో. ''నేను తాగనమ్మా !'' అని

(20)

అప్రయత్నంగా బొంకేశాడు "లి''గాడు. ఆమె నా భర్త తాగుతాడు. ఈ రోడ్డు పక్కనో, ఆ గట్టుకిందో పడిపోతూవుంటాడు. కనిపెట్టి చూడు. నివ్వూను'' అంది. అంటూ బ్యాటరీలైటు ఆర్పివేసింది. ఆకాశంకేసి చూసింది, ''ఓ స్టార్సు! ఓ క్లౌడ్సు!'' అని కళ్లమ్మట నీళ్లెట్టుకుంది.

దూరాన్నే "బ్లెడీహుం! హంగర్'' అని వినిపించింది. ''అక్కడ నా పెనిమిటి వున్నాడురా! త్వరగారా!'' అని తాడిచెట్టు ప్రమాణానికి ఎగసే తన బ్యాటరీలైటు కాంతిని నేలబారుగా ఆ మాట వినిపించిన దిక్కుకు వేసుకుంటూ నడవసాగింది. వెళ్ళినకొద్దీ చూపులో మనిషి, మనిషిలో తనమగని పోలిక కనిపించింది. "ఓ మైగాడ్! అతడే నాడియర్ ఎలూఫ్" అని వేగంగా డాసి ఆ చెట్టుకు నిర్బంధితుడై యున్న వానికట్టు విప్పింది. బ్యాటరీలైటు ముఖంమీదికి వేసి చూసింది. తన ముఖం వానికిచూపింది. వారిద్దరూ ఎలూఫ్ దంపతులు.

''ఈలానిన్ను ఎవరు అవమానించినారు?'' అని అడిగింది మిసెస్సు ఎలూఫ్— "నేను నా మొగుణ్ణి! పోయేనా ఏరతా!" అంది "లి''కత్తె సగం సగంలేస్తూ పక్కలో పండుకొన్న బిడ్డణ్ని వొత్తిగించు కుంటూ— మిసెస్సుఎలూఫ్ ''నీ మొగుడెవరు?'' అని బ్యాటరీలైటు "లి''కత్తె ముఖమ్మీదికి వేసింది. ''అది నా పెళ్ళాం'' అన్నాడు "లి''గాడు. "ఆ బిడ్డడు?'' అంది మిసెస్సు ఎలూఫ్. "మా పిల్లడే నమ్మ! అంది "లి''గాని అంగన.

''నీభర్త తాగడు. మిక్కిలి మంచివాడు'' అంది మిసెస్సు ఎలూఫ్. "ఏంరా? తాగుడికి కాదంట్రా పోయింది పొద్దునీవు?" అంది "లి"కత్తె. "లి''గాడు, ''కమ్మని రొట్టెట్టారే అమ్మగారు. కల్లులొట్ట యికసెల్లే!'' అన్నాడు. మిస్టర్ ఎలూఫ్ తెలివిని బడ్డాడేమో ఊరికే

సిగ్గుపోతున్నాడు. మిసెస్ఎలూఫ్ ''లి''గానితో ''కూలీ ! నా మగనిని నాతోకూడా ఇంటికి జాగ్రత్తగా తీసికొస్తివా నీకో రూపాయ ఇస్తాను'' అంది. ''అక్కర్లేదమ్మా కుసంత గంజితాగితే దొరగారికి నడకబ్బుద్ది'' అంటూ "లి''కత్తె తనమగని కోసమని ముంతలో పెట్టివుంచిన చప్పని చలిగంజి తెచ్చి మిస్టర్ ఎలూఫ్ ముందు పెట్టింది. మిస్టర్ ఎలూఫ్ గడగడా బెడ్కాఫీ లాగు ఆ గంజితాగి ''థాంక్స్" అన్నాడు.

ఉషఃకాంతులు చిరునవ్వు నవ్వినాయి, పగటిపూటా అది? ఎవ్వాని జీవిత గ్రంథంలోనూ క్రొత్తపుటా అది ?

(ఏప్రిల్, 1938)

# 18. అపనమ్మకం

—కొడవటిగంటి కుటుంబరావు

"మామయ్యా, రోజూ నీ ఆహ్వానం కోసం ఎదురుచూస్తూ నిస్పృహతో కుమిలిపోతున్నాను. ప్రతి సంవత్సరమూ రమ్మని ఉత్తరం రాసేవాడివి. ఈసారి, నీవు హోటల్లో తింటూకూడా ఎందుకు రాయ లేదు? నీకు హోటలు తిండి ఎంత అయిష్టమో నే నెరగనా? అందుకని ఈసారి వేసవి శలవులకు పిలవకుండానే వస్తున్నాను. రేపు రాత్రిబండికి వచ్చి పడతాను. ఉప్పూ పప్పూ సిద్ధంగాఉంచు. నేను వచ్చిన తరవాత మళ్ళా నీకు సావకాశం ఉండదు. ఈ లోపుగానే ఇల్లంతా అల్లరిగా చెయ్యి. (ఇల్లు పశువుల దొడ్డికింద చెయ్యటానికి నీ తరవాతే ఎవరన్నా!)

"నా పరీక్షలు రేపు సాయంకాలానికి ఆఖరు. అత్తయ్య కులాసాగా తిరుగుతున్నట్టు ఉత్తరం వస్తున్నదా? ఆవిడ, పాపం, దురదృష్ట వంతురాలు. అయిదు మోతలుమోసి ఒక్క పిల్లనుకూడా చంకనెత్తుకో లేక పోయింది. నేను మొదటినుంచీ అంటూనే ఉన్నాను. ఆవిడకు మగపిల్లవాడు పుడితేకాని బతకడు. ఆ మాట అంటే నువ్వు నవ్వుతావని తెలుసును. వట్టి నమ్మకంలేని మనిషివి. పైగా, ప్రతిదాన్నీ సందే హించటం వేదాంతమంటావు. ఒక మగపిల్లవాణ్ణి కని నాకిచ్చి పెళ్ళి చెయ్యవలసిన భాధ్యత ఇంకా నీమీద ఉంది తెలుసునా?

—రాజ్యం."

ఒక్కొక్క మనిషి జీవితంలో పరిపూర్ణమయిన అనందమంటూ ఉండదు. నన్నెరిగినవాళ్ళెవరూ తెలుసుకోలేరుగాని నేను అటువంటి

మనిషిని. కించిత్తు ఆనందం కలిగించే అనుభవం ఏదైనా అందు బాటులోకి రాగానే నేను పనిపెట్టుకుని ఆ ఆనందాన్ని భంగంచేసే అంశం ఏదైనా ఆ అనుభవంవెంట ఉందా అని వెతుకుతాను. సాధారణంగా ఉంటుంది. ఏదైనా రుచ్యమైన పదార్థం తినటానికి కూర్చోగానే అది పడదేమోనని భయం; ఎవరిమైనైనా మనసు మొగ్గసాగితే మోసపోతా నేమోనని భయం.

నాలో ఉన్న ఈ జబ్బు నే నెరిగినంత వరకూ ఎవరూ కనిపెట్ట లేదు. ఒక్క నా మేనకోడలు రాజ్యమే కనిపెట్టిందేమో ననిపించేది. "నువ్వు వట్టి అపనమ్మకం మనిషివి. నీలోనే నీకు నమ్మకంలేదు. కొన్ని విషయాల్లో అపనమ్మకం ఉంటే తప్పులేదు— మరికొన్ని విషయాల్లో మరింత నమ్మకం కుదిరేటందుకు! దేన్నీ నమ్మకుండా జీవితమంతా గడిపి ఏం బావుకుంటావు?" అని రాజ్యం నన్ను వేళా కోళం చేసేది. కాని, ఈ అపనమ్మకం నాకు ఆనందంలేకుండా చేస్తున్నదని దానికి తెలుసునో తెలియదో నేనెరుగను. తనే నా జీవి తానికి ఒక బాధా, ఒక ఆనందమూ అయిన సంగతి రాజ్యం అసలెరిగి ఉండదు!

నా భార్య కాపరానికి వచ్చిన రెండో రోజున, నా ఇరవై ఒకటోఏట, రాజ్యం భూమిమీద పడ్డది. దానికి ఏడోఏడు వెళ్ళి ఎనిమిది వస్తుండగా మా చెల్లెలు పోయింది. రాజ్యం నా మేనగోడలనీ, రక్త స్పర్శ అనీ అప్పుడే నేను మొదటిసారి సమగ్రంగా భావించగలిగాను. అది తల్లిలేని పిల్ల అయేవరకూ దానికి నేను నా మానసిక ప్రపంచంలో ఎటువంటి స్థానమూ ఇవ్వలేదు. నేను పిలవగానే రాజ్యం చప్పున దగ్గరికి వచ్చి నా ఒళ్ళోకూర్చుని నన్ను చిన్నతనంనించీ ఎరిగిన దాని మోస్తరుగా మాట్లాడుతుంటే నాకు భరించరాని బాధా, పశ్చాత్తాపమూ కలిగినై.

ఆ క్షణాన నాకు రాజ్యం మీద పుట్టుకొచ్చిన సహజమైన మమకారం చూసి నేనే భయపడ్డాను, తక్షణమే నేనా మమకారాన్ని నిగ్రహించుకున్నాను. నా జీవితమంతా నిగ్రహమే అయిపోయింది. ఎవరైనా నిగ్రహం సాధ్యంకాలేదని ఏడుస్తారు— నేను నాకది సాధ్యమయిందని ఏడవదగిన దుస్థితిలో ఉన్నాను.

నేను మా బావమరిదికి సలహాకూడా ఇచ్చాను : 'నువు సాధ్యమైనంత త్వరలో మళ్ళీ పెళ్ళిచేసుకో, పిల్లను సవితితల్లి సరిగా చూడదనికాని, చూడలేదంటారనికాని ఏ మాత్రమూ భయపడకు. ముందు ముందు నీభార్య పిల్లను అలుసు చెయ్యకుండాకూడా చూడు. ఇటువంటి విషయాల్లో లోకాన్ని పాటించి లాభంలేదు.'

మా బావమరిది పెళ్ళిచేసుకున్నాడు. రాజ్యాన్ని సవతితల్లి సరిగా చూడలేదు. ఆవిడ అసూయ చూపించిందనీ, సవతితల్లితనం ప్రకటించిందనీ అందరి మాదిరిగా నిష్ఠురంచెయ్యటం నాకిష్టంలేదు. తల్లి పిల్లలను చూడటమే పెద్దకళ. సవితితల్లి సవితి పిల్లను సరిగా చూడటం మరింత కష్టసాధ్యమైన కళ, ఆ కళకు అవసరమైన శిల్ప చాతుర్యం మా బావమరిది రెండో భార్యలో పూర్తిగా లోపించింది,

రాజ్యానికి జీవితం హాయిగా లేదని ఎవరన్నా చూచాయగా అన్నప్పుడు నా హృదయం చలించేది, కాని ఏదో సమాధానం చెప్పుకుంటేగాని నాకు తృప్తి కలిగేది కాదు. లోకం నోరు మంచిది కాదు. తల్లిపిల్లల్ని ఎంత హింసించినా ఎవరూ గమనించరు. సవతితల్లి అవసరంగా కోప్పడ్డా గొల్లున గోలెత్తుతారు : రాజ్యం మాత్రం చిన్నతనం చేత అవివేకమైన పనులు చెయ్యదా ?......ఈవిధంగా అనుకుని ఊరుకున్నాను.

పదో ఏట రాజ్యం పెళ్ళి అయింది. ఆ పదోయేటనే అది వితంతువు కూడా అయింది. వైధవ్యం సంప్రాప్తించిన ఒక నెలకే రాజ్యం నాకు మొదటి ఉత్తరం రాసింది. ఆ ఉత్తరం ద్వారా నేను తెలుసుకోగలిగాను. రాజ్యం విషయంలో నా విద్యుక్తధర్మం నేను నెరవేర్చలేదని కొంతకాలంపాటు దాన్ని మా ఇంట్లో వుంచుకుంటానని మా బావమరిదితో చెప్పి రాజ్యాన్ని తీసుకొచ్చేశాను.

దాని భావిజీవితంగురించి స్థూలనిర్ణయం చేసేశాను. దాన్ని వెంటనే ట్యూటరు కిందపెట్టి పై సంవత్సరం ఏ ఫస్టుఫారంలోనో ప్రవేశ పెట్టటమూ, కాలక్రమాన దానికి పునర్వివాహంచేసి దాని జీవితం సార్థకపరచటమూ.

రాజ్యం మా యింటికి వచ్చేవరకు నాకు పిల్లలమీద ఎంత వాంఛ వుండిందీ తెలిసివచ్చింది. దానికోసం గుడ్డలనీ, సబ్బులనీ, సూదులనీ అవనీ ఇవనీ విచారించటం నాకు కొత్త ఆనందం ఇచ్చింది. అది కొంత కాలంపాటు మా ఇంట్లో వుండిపోతుందనే ఆలోచనే నాకెంతో సంతోషం కలిగించింది. కాని, దాని వెనకాలే వచ్చింది ఆలోచన— రాజ్యం మీద ఇంత మమకారం పెట్టుకుంటే ఈ బంధం తెంచుకోవలసి వచ్చేటప్పటికి ఎంత బాధపడతానోనని :

రాజ్యం రాకముందు నా భార్య కనబరచిన నిర్లిప్తత చూచి నేను ఆశ్చర్యపడ్డాను. అది - నాభార్య - అంటే నాకన్న చాలా ఎక్కువగా కలవరించేది పిల్లలకోసం. అటువంటి మనిషి ఇంట్లో ఒక పిల్ల తిరుగుతుంటే ఎందుకు పరవశమైపోనూ ? అంటే నాభార్య రాజ్యాన్ని చూసి మొహం మాడ్చుకుందని కాదు, రాజ్యానికి వుపచారం చెయ్యటంలో నాభార్య కనబరచదగిన వుత్సాహం కనబరచకపోయింది. అంతకన్న వున్నసంగతి స్పష్టంగా చెప్పలేను.

మళ్ళీ రాజ్యమూ, నాభార్యా చాలా రాచకార్యాలు చేసుకునే వాళ్ళు. కలిసి పనిచేసేవాళ్ళు. ఎంతో బంధం వున్నట్లుండేవాళ్ళు. కాని నాతో మాట్లాడేటప్పుడు రాజ్యం గొంతుల్లో మరొక ధోరణి కని పించేది. పైకి ఏమీ అనకుండానే ఆ పసిపిల్ల నామీద తనకున్న అభి మానం యొక్క ప్రత్యేకతను ప్రకటించేది.

రాజ్యం నా పనులన్నీ తనే చెయ్యసాగింది. అందుమూలంగా తనభారం చాలా తగ్గించినందుకు నాభార్య సంతోషించింది. రాజ్యం అనేక పనులు నాభార్యకన్న బాగా చెయ్యగలిగినందుకు నేను సంతో షించాను, కాని ఈ సంతోషంతోబాటు అర్థంకాని బాధ కలిగేది.

రాజ్యం మా ఇంటికొచ్చిన కొత్తలోనే ఒక కోతిపని చేశాను. ఆపని చేసేదాక అటువంటి పని చెయ్యగలనని నేనెన్నడూ భావించ లేదు. ఆ తరవాతకూడా నా జీవితమంతా సింహావలోకనం చేసుకుంటే నాకర్థంకాని అనేక విషయాల్లో ఇదికూడా ఒకటి అనిపిస్తుంది. అదేమి టంటే, నేను మా రాజ్యాన్ని నా భార్య చూడకుండా ముద్దుపెట్టు కున్నాను, నాకు నిజంగా పిల్లల్ని ముద్దుపెట్టుకునే అలవాటు లేదు. ఆపని చేసేవాళ్ళను చూస్తే రోతకూడాను! ఆపని ఎటువంటి ఉద్రే కంలో చేశానో నేనిప్పుడు చెప్పలేను. నేను కుర్చీలో కూర్చుని చదువు కుంటున్నాను. రాజ్యంవచ్చి నా చదువు భంగం చెయ్యసాగింది. పైకి కనబడనిచ్చేవాణ్ణి కానుగాని దాని అల్లరి నాకు చాలా యిష్టంగా వుండేది. ఆ సంగతి గ్రహించినదానల్లేనే రాజ్యం నేను కసిరితే లక్ష్యం చేసేది కాదు. ఆరోజున నేను దాన్ని కసరలేదుకూడాను. పుస్తకంమీది నుంచి దానికేసి కళ్ళు పెద్దవిచేసి చూశాను, రాజ్యం చప్పున దగ్గిరికివచ్చి నా వీపుమీద చెయ్యివేసి ''నేను పెద్దదాన్నయి నీ అంత చదువువొచ్చి ఇట్లాగే చదువుకునేటప్పుడు, నన్ను ఇట్లాగే ఏడిపిస్తావా?'' అని అడి

గింది— కేవలమూ పసితనంవల్ల అన్నట్టుగాని, కావాలని అన్నట్టు కాకుండా.

ఆ క్షణంలో నాకు చెప్పతరంగాని వుద్రేకం వచ్చేసింది. అమాంతం దాన్ని అవలీలగా ఎత్తి ఒళ్ళో కూర్చోబెట్టుకుని చెంపముద్దు పెట్టుకున్నాను. మరుక్షణం నా ప్రతి నరమూ ముడుచుకు పోయినట్టయి పోయింది. ఏదో మహాపాపం చేసినట్టు పశ్చాత్తాపంలో మునిగిపోయి నాను. ఇక రాజ్యం ఎన్నటికీ నన్ను మామూలుగా చూడదనుకున్నాను. అది బతికి ఉన్నంత కాలమూ దాని మనస్సులో యిది నన్ను గురించిన కళంకంగా నిలిచి ఉంటుందనుకున్నాను. అది ఈ విషయం ఏ మాటల సందర్భంలోనో మొగుడితో కూడా చెప్పేస్తుంది. కొద్దికాలంలో రాజ్యం ఈ సంఘటన మరిచిపోతుందేమోనని ఒక క్షణకాలం వెర్రి ఆశ కలిగింది, కాని మరుక్షణమే అది అడుగంటింది. రాజ్యానికి పది నిండినా. అమాయకురాలైనా కాదు.

అయితే నా కాశ్చర్యం కలిగించిన విషయం ఏమంటే, రాజ్యం నన్ను కొత్తగా చూడలేదు. వెనకటి మోస్తరుగానే ఉంది. "నువ్వు నన్ను ముద్దుపెట్టుకొన్న సంగతి నేను మరిచిపోలేదులే!" అన్నట్టయినా అది ప్రవర్తించలేదు. నా గుండె కొంచెం కుదుటబడ్డది. అది మా యిద్దరిమధ్యా ఒక రహస్యం. ఇక దాన్ని గురించి మూడో ప్రాణికి తెలియదని రూఢి చేసుకున్నాను.

రాజ్యం స్కూలుఫైనలు పాసుకాగానే దాని పెళ్ళివిషయం ప్రయత్నిస్తానన్నాను. అది అంగీకరించలేదు. తనకు పెళ్ళి వద్దంటే వద్దన్నది. చదువుకుంటానన్నది. ఏదైనా ఉద్యోగం చేస్తానన్నది.

"అయోమయంగా మాట్లాడకు. రాజ్యం సహజమైన ఆడదానికి మొగుడు లేకుండా జరగదు. నీ కిప్పటికే యీడు మించింది. మొగు

దక్కర్లేదంటే నువ్వు అవ్యక్తంగా ప్రవర్తించటానికి సిద్ధపడుతున్నా వనుకోవలసి వస్తుంది. లేదా సహజమైన అడదానివి కావనుకోవలసి వస్తుంది. ఏది అనుకున్నా నాకు కష్టంగానే ఉంటుంది.'' అన్నాను.

రాజ్యం చదువుకుంటున్న కొద్దీ దానితో గంభీర విషయాలు స్వేచ్ఛగా మాట్లాడే అవకాశం నాకు లభించింది. ఆ ధోరణిలోనే ఇప్పుడీ విషయంకూడా ప్రస్తావించాను. రాజ్యం కోపగించలేదు. నవ్వ లేదు, గంభీరంగా ''నువ్వెప్పుడన్నా అవ్యక్తంగా ప్రవర్తించావా, మామయ్యా?'' అని అడిగింది.

నేను కంగారుపడి, ''లేదు! ఎప్పుడు లేదు! ఎప్పుడో చిన్న తనంలో ఒకసారి— అదికూడా చెప్పుకోదగిన విషయంకాదు. ప్రమాదం జరక్కముందే కళ్ళు తెరిచి—'' అని తడువుకుంటూ ప్రారంభించాను.

రాజ్యం నాకడ్డంవచ్చి ''అప్పటికి నీకు పెళ్ళి అయిందా!'' అన్నది.

''నాకు చాలా చిన్నతనంలోనే అయింది పెళ్ళి. నీమాదిరిగా కాదు—''

''అత్తయ్య కాపరానికి వచ్చిందా?''

''వచ్చే ఉంటుంది! అదికాదు నేననేది—''

రాజ్యం ఇక మాట్లాడదగిన విషయం పూర్తి అయినట్టుగా లేచి తన పనిమీద వెళ్ళబోతూ మళ్ళీ అగి, ''ఆ అవ్యక్తత విషయంలో ఎప్పుడన్నా మనస్ఫూర్తిగా పశ్చాత్తాప పడ్డావా?'' అన్నది.

నా నోట మాటరాలేదు.

మళ్ళీ నేను రాజ్యంతో దాని పెళ్ళి విషయం ఎత్తలేదు.

ఈ నాలుగు సంవత్సరాలూ అది లేని కొరత నాకు బాగా కనిపించింది. రాజ్యం కాలేజీలో ప్రవేశించటానికి వెళ్ళిపోగానే నేను మళ్ళీ మామూలు ప్రపంచంలో పడ్డట్టయింది. గృహచ్ఛిద్రాలను పరిష్కరించుకోవటమే పరమార్థంగా పెట్టుకున్న నా భార్యా నేనూ మిగిలాం. ఒక మంచి పుస్తకం చదివి పూర్తిచేసి మూసినట్టయింది. రాజ్యం దగ్గర్నుంచి ఎప్పుడన్నా ఒక ఉత్తరంవస్తే ఆ పుస్తకం మళ్ళీ తెరిచి అక్కడక్కడా వాక్యాలు చదివి మొదటి పఠనానుభవం స్ఫురణకు తెచ్చుకున్నట్టు అయ్యేది.

కిందటిసారి శలవులకు వచ్చినప్పుడు మా సంభాషణలో ఒక కొత్త అంశం వచ్చింది. ముందుగా నేనే రాజ్యాన్ని కెలికాను—ఏమే రాజ్యం, అవ్యక్తపు మనిషి అవుతున్నావా ? అసహజమైన మనిషి వవుతున్నావా అన్నాను.

రాజ్యం కొద్దిగా మందహాసంచేస్తూ "నేను అసహజమైన దాన్ని కాను మామయ్యా !" అన్నది.

ఆ మాటకు నేను కంపించిపోతూ "కొంపతీసి ఏం చేస్తున్నావేమిటి ?" అన్నాను. రాజ్యం మాట్లాడలేదు.

ఇప్పటికే మే మిద్దరమూ ఔచిత్యభంగం అయేటంత సంభాషణ చేశాం. కాని, నా ఆదుర్దా నన్ను నోరు మూసుకోనివ్వలేదు. నేను బతిమాలుతూ "రాజ్యం తొందరపడి అవివేకమైన పనులుచెయ్యకు. నాకు నిన్ను గురించి అది ఒకటే దిగులు," అన్నాను.

''ఏం చేస్తావు, మామయ్యా ? నీ ప్రవర్తన నీ యిష్టా యిష్టాల మీద ఆధారపడి ఉంటుందా ? ఎవరో వచ్చి సోదిపెట్టుకు కూర్చుంటే నువ్వేం చేస్తున్నావు చెప్పు. ''నీ సోది నాకు తలనొప్పిగాఉంది. చాలించి నీ దారిన నీవు పో" అనగలవా ?"

''అదా ఉపమానం?'' అన్నాను నిర్ఘాంతపోయి.

"ఎందుకు కాదూ? ఎవడోవచ్చి నాకోసం చచ్చిపోతున్నా నంటాడు. నేను మొగ్గేవరకూ నన్ను విడవడు. ఏమిటి చెయ్యటం?"

"నీ కోసం చస్తున్నా నన్నవాడి మాటల్లా నమ్ముతావా?"

"నిన్ను చూసి జాలిపడుతున్నట్టు కనబడే వాళ్ళందరితోనూ పోట్లాడతావా? నిన్ను చూసి ఇతరులు జాలిపడదగిన స్థితిలో ఉండటం నీ దురదృష్టం. అడతనమూ, యవ్వనమూ నా దురదృష్టం:" అన్నది రాజ్యం. ''అది ఒక బాధ్యత, ఇతర బాధ్యతల మాదిరిగానే ఇది కూడా నిర్వర్తించటం కష్టం. ఏదో ఒకపొరపాటు జరిగితీరుతుంది. అత్యద్భుతంగా నిర్వర్తించగల మనుకునేటందుకు లేదు."

'' అట్లా మనస్సుకు సమాధాన పరుచుకుంటే నీ ఆత్మగౌరవం మాటేమిటి? నీకు నీతిలో నమ్మకంలేదా? నా కిప్పటివాళ్ళ లేకితనాలు నచ్చవు రాజ్యం. నేను ముసలివాణ్ణి" అన్నాను.

''నేను పడుచుదాన్ని, నాకు నిజంగానే నీతిలో నమ్మకంలేదు. నీతికంటే చాలా ముఖ్యమైనవి జీవితంలో ఉన్నట్టు అదివరకే నిర్ధారణ చేసుకున్నాను. అయితే, నాకు ఉన్న లేకితనమూ అసహ్యమే. నేను అవినీతిని ఆరాధించను. ఇక ఆత్మగౌరవమూ, పవిత్రతా అంటావా! దీర్ఘంగా ఆలోచిస్తే అవి అణిచిపెట్టిన అహంకారాతిశయాలుగాని ఇంకేమీ కావు......ఏమిటాలోచిస్తున్నావు?'' అన్నది రాజ్యం.

"ఏమీలేదు. నిన్ని చదువులోపెట్టి పాడుచేశానా అనుకుంటున్నాను. నీకిటువంటి విశ్వాసాలు కలగటం నాకెంత కష్టంగా ఉందో నేను ఊహించనైనాలేను. నా బాధ నిన్ను చీమతలకాయంతయినా అంటుతుందనే ఆశతో ఆ మాట అంటున్నాను.''

రాజ్యం దీనంగా నవ్వి "చీమతలకాయంత కాదు, కండచీమ మోస్తరుగా పట్టుకుంటుంది. నీ కటువంటి బాధ కలగకుండా ఉండే టందుకే నిష్కల్మషంగా నా మనస్సు విప్పి చెబుతున్నాను—చేతయి నంతవరకు, ఒక్కటి అర్థంచేసుకో మామయ్యా. భగవంతుడు ఒక్కొక్క మనిషిని ఒక్కొక్క విధంగా పుట్టిస్తాడని నీకు నమ్మకం ఉందా ? అయితే ఆ భగవంతుడు నాకు నీతి గీత గియ్యకుండా పుట్టించాడు. నేను భూమిమీద పడక పూర్వమే నాకు నీతితో సంబంధం లేకుండా ఏర్పాటుజరిగింది. దేవతలు నాకు కావలసిన పువ్వులన్నీ పోగుచేసి ముళ్ళకంచెల మీదపెట్టి ఆ ముళ్ళకంచెల చుట్టూ ఊబి కల్పించారు. అంతకన్న నే నేమీ చెప్పలేను. వాటిని సంపాదించగలిగానా ఒళ్ళంతా బురద అవుతుంది. గీసుకుపోయి రక్తం కారుతుంది. కాని జన్మ సార్థకం అవుతుంది. లేదూ—నా జన్మ నిరర్థకం అవుతుంది."

రాజ్యం మాట్లాడుతుంటే నాకేదో మైకం కమ్మినట్టు కాసాగింది. నల్లమందు పొగలు చుట్టవేసినట్టయింది. ఈ పొగలలోనించి పుస్తకాల్లో ఉన్మాదులైన కథకులు చిత్రించే అసహజమైన ప్రపంచం అస్పష్టంగా కనిపిస్తున్నది. పుస్తకాలు చదివి పాడైన రాజ్యం నన్నా మాయప్రపంచం లోకి తీసుకుపోవటానికి ప్రయత్నిస్తున్నది. నేను పోను, ఈ మైకాన్ని విదిల్చేస్తాను.

"నీ మాటలకు అర్థంలేదు. ఏదో మాట్లాడుతున్నావు—అంతే ! నీకు వెధవరికం రావటం నిజంగా అక్రమమేననుకో. కాని, దానివల్ల బాధపడటం నీ తప్పే. నువ్వెందుకు పెళ్ళిచేసుకోవూ ? ఇద్దరు పిల్లల్ని కంటే ఈ పైత్యమంతా దిగిపోతుంది. కాదనకు—నువు మాట్లాడేది కేవలమూ పైత్య ధోరణి."

రాజ్యం మళ్ళీ నవ్వింది. అది నన్నుచూసి నవ్వుతున్నదా అని పించింది నాకు.

"నీకు ప్రేమలో నమ్మకంలేదా ?" అన్నది రాజ్యం.

"ప్రేమ ! ప్రేమ ! షెల్లీ, కీట్సు చదివిన ప్రతిమనిషికి అన్నం కంటె అత్యవసరంగా ముందు ప్రేమకావాలి ! ఎక్కడుందా ప్రేమ ? దేవుడున్నాడనటం మూఢ విశ్వాసమూ, ప్రేమ ఉందనుకోవటం నాగరి కతా ; నాకూ కావాలి లక్షరూపాయలు. ఏదీ ?" అని గట్టిగా అన్నాను.

రాజ్యం ఓర్పుతో, "అంటే నీకు ప్రేమలో నమ్మకం ఉన్నట్టా. లేనట్టా ?'' అన్నది.

"నాకు లేదు ! నీకు లేదు— యేవో కలలు కంటున్నావు. నే నటువంటి కలలు కనటం మానేసి ఇరవై సంవత్సరాలైంది. నలభై ఏళ్ళు వచ్చి నేను నేర్చుకుంటున్న దేమిటంటే— మనిషి కామం తీర్చు కోవటంలో పప్పులో కాలు వెయ్యకుండా ఉంటే అదే పదివేలు ! నా యీడువచ్చిన తరవాత నీకు అదే తెలుస్తుంది.''

రాజ్యం నవ్వి, "మధ్య వయస్సంటూ లేకుండా నేను పసి తనంనించి నడివయస్సులో పడి నీమాదిరిగా మాట్లాడగలిగితే ఎంత బాగుండేది ?'' అన్నది.

''అయితే ప్రేమఅంటే నీకూ అంత ఘనమైన అభిప్రాయం లేదన్నమాటే !" అన్నాను.

''ఉంది ! లేకుండా వుంటే మనస్సుకు శాంతి వుంటుందని ! ఏ పని చేస్తున్నా నీ కళ్ళయెదుట, నీ మనస్సులో, నీ గుండెలో, నీ నెత్తు రులో ఒక మనిషి ప్రత్యక్షమై ఉండటం ఎంత బాధ ! ఆ మనిషి జ్ఞాపకం రాగానే నీ కళ్ళవెంట నీరు కారటం ఎంత యిబ్బంది ! ప్రపం చంలో ఆ ఒకదేమనిషి అనిపించటం ఎంత గుడ్డితనం !''

"ఎవరది ?''

"ఎవరైనాను !" అన్నది రాజ్యం నిర్లక్ష్యంగా.

"వట్టి కవిత్వం !"

"కావచ్చు. కవిత్వం అబద్ధమా ?"

ఈ సంభాషణ పోయినకొద్దీ అన్యాయ మవుతుందనిపించింది. ఇదంతా ఎట్లా ఉపసంహరించాలో తెలియలేదు.

"నీ ప్రేమను విడవటానికి మంచి వుపాయం చెప్పనా ?" అన్నాను.

"తప్పకుండా చెప్పు. ఇది దాదాపు జబ్బుగా పరిణమించింది." అన్నది రాజ్యం.

"అయితే విను. నువ్వు ప్రేమించిన మనిషిని పెళ్ళాడెయ్యి."

"అట్లా ప్రేమను చంపటానికి నాకు చేతులురావు. ఇంకేదన్నా చెప్పు."

"అయితే నువ్వు ప్రేమించిన వాడుకూడా మామూలు మనిషే అని తెలుసుకో—"

"నాకు తెలుసును."

– "వాణ్ని పులి తరుముతున్నట్టు ఊహించుకో. బురదలో జారిపడి లేస్తున్నట్టు ఊహించుకో. గురక పెడుతున్నట్టు— ఎందుకల్లా నవ్వు తున్నావు ?"

"నీకు సెన్సు ఆఫ్ హ్యూమరు లేదు మామయ్యా !"

"నాకా ?" అన్నాను రోషంగా.

రాజ్యం మళ్ళా నవ్వులో పొర్లిపోయింది.

"మొత్తంమీద చాలామోసం జరిగింది. నువ్వు నే నెరిగిన రాజ్యానివే కాదు. ముఖ్యంగా నే నాలోచిస్తున్నదేమంటే, ముందుముందు

ఆడపిల్ల లందరినీ చదువవేసి నీ మాదిరిగా తయారుచేస్తే ప్రపంచం ఏమవుతుందా అని! చదువుకున్న ఆడవాళ్ళూ మగవాళ్ళూ కూర్చుని ప్రతి పిచ్చిముక్కకూ వెకవెకలాడటం ఆదివరకే చూశాను. కాని అది వాళ్ళలో తూకంలేక పోవటమనుకున్నాను. మవ్వుకూడా ఆ జాతి లోకేచేరితే ఈ వెకిలితనం చదువులోనే ఉందనుకోవాలి. నీ వంటివాళ్ళు వందమందికంటే మీ అత్తయ్య ఒకతె నయం!'' అన్నాను.

రాజ్యం ఒకచెంప కళ్ళు తుడుచుకుంటూ రోషం నటిస్తూ "అంత తలవాచేటట్టు పెట్టేవాడివి ఎందుకు నవ్వించావేమిటి?" అన్నది.

''సరే అయితేచెప్పు. దేనికి నవ్వావు? నేను నిజంగా అడుగుతున్నాను సుమా!"

"నేను ప్రేమించినవాడే వచ్చి ''నన్ను పెద్దపులి తరిమినట్టు ఊహించుకో!" అన్నట్టయితే ఆ మనిషిమీద నాకున్న ప్రేమ ఎట్లా విజృంభిస్తుందో ఆలోచించుకో.''

"నీ ప్రేమ!" అన్నాను పళ్ళుబిగబట్టి.

''మాటలు చూసి భయపడకు మరి — అందరినీ తేలిక మనుష్యుల కిందకట్టే బరువయిన మనిషివి!'' అన్నది రాజ్యం కొంటెగా.

అంతటితో ఆ అయోమయపు సంభాషణ అయిపోయింది. అది అన్నట్టు నాలో సెన్సు ఆఫ్ హ్యూమరు కాకపోయినా ఏదో సెన్సు లోపించింది. జరిగిన సంభాషణకు పడదగిన పశ్చాత్తాపమంతా పడ్డ తరవాత అదికూడా ఒకవిధంగా మంచిదే అయిందని స్ఫురించింది. ఏమంటే, అంతసేపు ఉన్మాదంగా మాట్లాడినా, గంభీరంగా రంకుతనాన్నీ, అవినీతినీ సమర్థించటం మొదలుపెట్టిన రాజ్యాన్ని నవ్వించగలిగాను; మామూలు మనిషిని చెయ్యగలిగాను. ఈ సంగతి నా కప్పుడే ఎందుకు తట్టలేదూ?

ఇది కిందటి సంవత్సరం జరిగిన సంగతి. మే మిద్దరమూ మళ్ళీ అటువంటి సంభాషణలో పడలేదు. ఇది మా ఇద్దరి మధ్యనే నిలిచి పోయిన రెండో రహస్యం.

మా మూడో రహస్యాన్ని గురించి చెప్పటానికి నాకు భాషలేదు. చిత్రించటానికి శిల్పం చాలదు. నేను మొదట్లో చెప్పిన ఉత్తరం అందిన సాయంకాలం బండిలో రాజ్యం దిగింది. అది దిగిన క్షణంనించీ ఆరాత్రి ఆఖరయ్యేవరకూ జరిగిన సంగతులు ఈ ప్రపంచానికి సంబంధించినవిగా తోచవు. నేను, నాది అనుకునే ప్రకృతికి ఏమీ అందులో పాలు లేదు. భగవంతు డనేవాడుంటే అట్లా జరిగి ఉండేదేమో !

అది నా ఆదర్శాల మధ్య పిడుగుపడ్డట్టు పడింది. చిత్రమేమిటంటే రాజ్యం కనబడిన క్షణంనించీ నా అంతరాత్మ "ఏదో జరగబోతున్నది జాగ్రత్త !" అని సూచిస్తూనే ఉంది. అసలు మేమిద్దరమూ ఈసారి ఒకరివంక ఒకరం సూటిగా చూసుకోలేక పోయినాం. దానితో మాట్లాడాలంటే నాగొంతు బరువెక్కినట్టయిపోసాగింది. రాజ్యం నాకు రెండడుగుల దూరంలో వస్తే ఊపిరి పూర్తిగా బిగబట్టి ఒకక్షణం ఉండి గట్టిగా విడవటం మొదలుపెట్టింది. మేమిద్దరమూ మాట్లాడుకోవటం మొదలుపెడితే ఒకప్పుడు గంటలెల్లా గడిచినయ్యో ఇప్పుడు క్షణాలంత కన్నా భారంగా గడవసాగినై, నన్నెవరో ఊదర పెట్టినట్టయింది. రాజ్యంకూడా అట్లాగే భావిస్తున్నదని నే నూహించగలిగాను.

ఈ ఊదరనించి తప్పించుకుపోవటం ఎట్లా ? ఇంట్లో నాభార్య అయినా లేదు. "ఎందుకిట్లా అవుతున్నాను ? ఇంత కాలానికి నా కూతురితో సమానమైన రాజ్యం మీద నాకు కామోద్రేకం కలుగుతున్నదా ?" అని కోపంగా ప్రశ్నించుకున్నాను. ఎవరు సమాధానం చెబుతారు ? అర్థంలేని ప్రవాహానపడి కొట్టుకుపోతుంటే విమర్శించిపెట్టేవారెవరు ?

అది రాజ్యం మీద ప్రేమకాదు. నాకు ప్రేమానుభవం ఎన్నడూ కాలేదు. కాని ఇది ప్రేమకాదని గుర్తించాను. ఇది ప్రేమ అయితే ప్రతి ప్రాణీ ప్రేమించగలదు. నాలో ఆ క్షణాన మానవత్వం ఏమీ లేదు. నా ఉద్రేకం కట్టలుతెగి రాజ్యాన్ని నిర్మూలించటానికి చూస్తున్నది కాని పవిత్రం చెయ్యటానికి చూడటంలేదు. అటువంటి ఉద్రేకం నేను యవ్వనంలో కూడా యెరగననిపించింది. నే నింతకాలమూ అభ్యసించిన నిగ్రహానికి మరోరూ మరోరూ కాకుండా రాజ్యమా బలి ! ఇది నాకు ప్రకృతివేసిన శిక్షా ? ఈ సంఘటనలో ఆధ్యాత్మికమైన గుణపాఠం ఉందా ?

ఆ క్షణంలో రాజ్యం మనస్సు నాకర్థమైతే ఎంత బాగుండును ? కాని కాలేదు. ఆ నిమిషంలో నాకు రాజ్యంకన్న దూరంగావున్నది మరేదీలేదు. నా ఊహ సరయితే నా ప్రతి కదలికలోనూ రాజ్యానికి రాక్షసత్వం కనిపించి ఉండాలి, ఆ క్షణాన అదికూడా రాక్షసి అయితే తప్ప ;

రాజ్యం నన్ను అణుమాత్రమైనా ప్రతిఘటించలేదు. ఒకవేళ నాకు తెలియలేదో ! తనలోపడి కొట్టుకుపోతున్నవాడు వాలునపడి వస్తున్నాడో, ఎదురీదడానికి ప్రయత్నిస్తున్నాడో వరదకేం తెలుస్తుంది?

నన్నావేశించిన పిశాచం వదలి తుపాను సమసిపోయిన తరవాత నాస్థితి ఆలోచించుకుంటే నాకొక వింత విషయం అవగాహన అయింది. నేను భయంకర పాపమనుకుంటూ చేసిన ఈ పని నా తత్వానికి సరిపోయింది. ఇందులో ఆనందమూలేదు. బాధాలేదు. ఆనందమైనా బాధ అయినా నాకు అసహజమైన అనుభవాలనిపించేవి. ఈ అనుభవం తరవాత దీని ఫలితంగా ఏ వికారమూ లేదు. ఇక ఏదో వికారం నేనే పనికట్టుకొని తెచ్చుకోవాలి. నన్నిటువంటి పనులు చెయ్యమని పుట్టిం

చాడా భగవంతుడు. కిందటి జన్మలో రాజ్యం నాతో అన్నమాటలేవో జ్ఞాపకం వచ్చినై.

ఇకముందు రాజ్యానికి నే నేమవుతాను, అది నాకేమవుతుంది. ఈ దుష్కార్యానికి శిక్షో ప్రతిఫలమో ఏమిటి ? ఇటువంటి సమస్యలన్నీ కాలక్రమాన పరిష్కారం అవుతై. వాటినిగురించి ఆలోచించే త్రాణ లేదు. నా ఆత్మలో నేను రాజ్యంకేసి చూడనన్నా లేదు.

అంధకారంలో జడుడిమాదిరిగా ఉన్న నాకు వెలుతురు కిరణం సాక్షాత్కరించింది. రాజ్యం నా పక్కనే వచ్చి కూర్చుని నా మెడచుట్టూ చెయ్యివేసి "చూశావా, మామయ్య ! నాకూ్కడా నీతి అనేది ఉంది !" అన్నది దాదాపు పరిహాసం గొంతుతో.

"నన్ను తిట్టదలిస్తే అంత నాజూగ్గా తిట్టనక్కరలేదు. నువ్వె యెంత మాట అన్నప్పటికీ ఆగ్రహించడానికి అధికారం లేకుండా చేసుకున్నాను."

రాజ్యం ఆదుర్దాగా నన్ను కుదిలిస్తూ ''పశ్చాత్తాపపడటం మొదలుపెట్టి నా ఆనందమంతా పాడుచెయ్యకు.'' అని బతిమాలింది.

మొదట నా చెవులు నేనే నమ్మలేక పోయినాను. కాని మరుక్షణమే నాకు రాజ్యం స్వర్గంలో ఉన్నదని—ఉన్నా ననుకొంటున్నదని— అర్థమయింది. జీవితం పొరపాటున నాటకం మాదిరిగా అవుతుందేమోనని జీవితమల్లా భయపడిన నేను ఆ క్షణాన దేవుణ్ణి ఉద్దేశించి ''చూశావురా, దేవుడా ? నేను చేసినపని రాజ్యం ఆమోదిస్తున్నది!'' అని వెర్రికేక వేతామనుకున్నాను.

''నేను మొదటిసారి నిన్ను చూచిన క్షణంనుంచీ నిన్ను మిగతా ప్రపంచం నుంచి ఎడంచేసి రహస్యంగా దాచిపెట్టు కున్నాను. నా జీవితం ఏ గుట్టలెక్కినా, ఏ లోయల్లో పడిపోయినా సరే నేను చెయ్యి

చాచి ఏ క్షణాన నిన్ను అందుకోలేకపోతే ఆ క్షణాన నా జీవితం తొ్రర పడిపోతుందనుకున్నాను. నా అభిప్రాయాలు ఎన్నో మారినై. ఇది మారలేదు. నేనేం చెయ్యను ?

"మూడు నాలుగేళ్ళనించీ నీమీది అభిమానం అణిచిపెట్టడానికి వీల్లేని వాంఛగా మారింది. నేను ఎట్లా నిగ్రహించుకున్నానో తెలియదు. ఏ క్షణాన నువు నన్ను కౌగలించుకున్నా నేను నీ చేతుల్లో నీరై పోయి వుందును. వెనక ఒకసారి నన్ను ముద్దుపెట్టుకున్నావు. మళ్ళీ ముద్దు పెట్టుకుంటావని ఈ ఎనిమిది తొమ్మిది సంవత్సరాలనించీ ఎదురు చూస్తున్నాను.

"నీమీద పంచప్రాణాలూ పెట్టుకున్న నేను నీతిని ఎట్లా లక్ష్యం చెయ్యను ? నీకేమో నీతిలో అంత నమ్మకం. నిన్ను ఆకర్షించటానికి ఎంత సిగ్గుమాలిన పని అయినా చేతామనిపించేది. కాని చెయ్యలేదు. నీ అంతట నీవే నాకు మోక్షం ఇచ్చేవరకూ నేను చెయ్యీ కాలూ కదలించదలచలేదు. ఆ నిశ్చయంమీదే ఉన్నాను. నాకు తగిన నీతి నాకుమాత్రం లేదంటావా ?"

ఎంత అందమైన మాటలు — నిజమైతే!

నన్నా అపనమ్మకం వదలదు! నేను స్వర్గ నరకాలచుట్టూ వెయ్యి ప్రదక్షిణాలు చేసివచ్చినాసరే అది నా వెంట వుంటుంది. వెయ్యి మందిలో ఒకడు అనిపించుకోని మాటలు ఆడదానినోట అనిపించుకున్న తరవాత కూడా నా అపనమ్మకం నా వెంటే వుంటుంది ! ధన్యుణ్ని.

"నా వ్యక్తిత్వం సార్థకం చేసుకునేటందుకు రాజ్యాన్ని హింసించాను ! దాని కోరికను తృణీకరించి నా పశ్చాత్తాపం వెలిబుచ్చాను. ఇక యిటువంటి పని ఎన్నడూ చేయనని శపథంచేశాను ! వెనకటి మా పవిత్రమైన సంబంధం కళంకితమై పోయిందని వాపోయినాను !

దాని మాటలు నిజంగా అబద్ధంకాకపోతే నామాటలు దాన్ని ఎట్లా హింసించేది నేను లెక్క-చెయ్యలేదు. దానిప్రాణం హింసపడటంకంటే నా అపనమ్మకమే నాకు ప్రియమైనది. దాని మాటలు నిజంకావని నిరూపించటానికి లక్షవాదాలు నా మనస్సులో పుట్టుకొచ్చినై !...

రాజ్యం మనిషికాదు, దేవత ! అది ఒకప్పుడు తన వాంఛను ఎట్లా అణగదొక్కి పెట్టిందో యిప్పుడు తన బాధనుకూడా అట్లాగే అణగదొక్కి, నా మాటలన్నీవిని తలవంచుకుని "పోనీ మామయ్యా ? నువ్వెందుకు పశ్చాత్తాప పడతావు ? పాపిష్టిదాన్ని నేనే ! నా మూలంగానే నువ్వు గోతిలో పడ్డావు. నేను సమయానికి నివారించగలిగితే నువ్వు మేలుకునేవాడివి. నే నిదివరకే చెడిపోయినాను కనక నాకు ఫరవాలేదు. ఇప్పటికైనా నీ మనస్సు తెగబడి ఏదన్నాకోరితే నేను ఏ విధమైన అభ్యంతరమూ చెప్పను. నీకు నావల్ల ఏంకావాలంటే అది నిశ్చింతగా తీసుకో. నా బుద్ధికి మాత్రం మన వెనకటి సంబంధం ఏమీ మారినట్టులేదు. నీ బుద్ధికి అట్లా తోచినప్పుడు మళ్ళీ వెనకటి పద్ధతికి పోదామని ప్రయత్నించకు. లాభం ఉండదు" అన్నది.

నా అంతరాత్మ జాలిపడ్డట్టు నటించింది. దాని మనస్సుకు శాంతి కలిగించే వాడల్లే నటిస్తూ, దాని దృష్టితో రాజీపడే వాడల్లే కనిపిస్తూ దాని శరీరం మళ్ళా నా స్వాధీనంలోకి తీసుకున్నాను. నా మనస్సును మార్చుకోకుండా, నా ఉన్నతాదర్శాలు సంస్కరించుకోకుండా రాజ్యం ద్వారా కామోపశమనం చేసుకోవటానికి రోజుకొక నూతన మనః పరిణామం ప్రదర్శించుతూ వచ్చాను. ఈ విధంగా నేను రాజ్యాన్ని మరింత హింసించి వుండాలి. కాని దాని నోటివెంట ఒక్క-సాధింపు మాటరాలేదు. అందుకు నేను కృతజ్ఞత చూపలేదు. దాని నోటివెంట ఒక సంతోషకరమైన మాటకూడా రాలేదు. అదికూడా నేను గమనించ

లేదు. నాకిప్పుడు స్మరించితే అనుమానం కలుగుతున్నది—ఆ రోజుల్లో రాజ్యం నవ్వినట్టు జ్ఞాపకంలేదు.

నా భార్యకు మళ్ళా ఆడపిల్ల కలిగినట్టు ఉత్తరం వచ్చింది. బారసాల విషయం అశ్రద్ధచేసినా శాంతి ఒకటి ఉందికనక తప్పక రమ్మని రాయించింది నాభార్య. మర్నాడు పోవటానికి ప్రయాణం కట్టాను.

ఆరోజు సాయంకాలం మాయింటికొక కుఱ్ఱవాడు వచ్చాడు. చిక్కి శవాకారంగా ఉన్నాడు పాపం. ఎవరు కావాలన్నాను. అతను సమాధానం ఏదో గొణిగి అటూ ఇటూ చూడసాగాడు. ఇంతలో రాజ్యం లోపలినించివచ్చి అతన్ని చూస్తూనే పేరుపెట్టి పిలిచింది.

"ఒక్కమాట మాట్లాడి వెళ్ళిపోతాను. ఇక్కడ ఒక డాక్టరును చూసి పోదామని వచ్చాను. ఈబండికి పట్నం వెళ్ళి పోతున్నాను." అన్నాడు ఆ కుర్రవాడు.

ఇద్దరూకలిసి దొడ్లోకి వెళ్ళారు. ఆ ఇద్దరూ నా దృష్టిపథం దాటిపోగానే నాలో అసూయ అంకురించి భగ్గునమండి జ్వాలగా అయింది.

"ఇటువంటి ప్రియులు దీనికింకా ఎందరున్నారో ? పాపం, తన్ను తానే మోసగించుకుంటున్నది. నడివయస్సు వాడిమీద దానికి ప్రేమ ఏమిటి ?"

ఒక నిమిషానికి ఇద్దరూ లోపలికి వచ్చారు. కుఱ్ఱవాడు వెళ్ళి పోయినాడు. వాడి వాలకంచూస్తే మొహంలో మృత్యుదేవత తాండవిస్తున్నది. ఎటువంటి ప్రియుడు ! అంతకంటె నేనే లక్షరెట్లు నయం !

"ఎవరతను ?"

"ఒకప్పుడు నన్ను నిర్బంధించినవాడు. అతనిలో అంత మానవత్వం ఉందనుకోలేదు." అన్నది రాజ్యం పరధ్యానంగా.

"ఏం ! ఏమంటాడు ?"

"తనకు క్షయఉందని వైద్యులు నిర్ణయించారుట. నాకు చెప్పటానికి వచ్చాడు."

"జాగర్త పడమనా ?"

"ఊఁ !"

వాడిస్థితిలో నేనుంటే అట్లా ప్రవర్తించేవాణ్ణా అని ప్రశ్నించుకున్నాను. ఆ తరాని కాతరం ప్రవర్తనలో నీతి ఒకవేళ జాస్తి అవుతున్నాదేమో ననిపించింది. రానురాను స్త్రీ పురుష సంబంధం అట్లా అధోగతి పోవటందేనికి ? నాకాసంబంధం సరిగా అర్థంకాలేదా ?

నేను మా బావమరిదిగారి ఊరుకెళ్ళి రావటానికి పదిహేను రోజులు పట్టింది. ఈ పదిహేను రోజుల్లో రాజ్యం యొక్క నగ్న సౌందర్యం పదిహేను వందలసార్లు జ్ఞాపకంవచ్చింది. స్త్రీ పురుష సంబంధమైన నీతినిగురించి నాకున్న ఖచ్చితమైన జ్ఞానం నా పురుషత్వాన్ని గురించి లేకపోవటం గ్రహించి కొంత ఆశ్చర్యపడ్డానుగాని నామనస్సు ఆత్మపరీక్షవైపు జాస్తిగా వెళ్ళలేదు.

ఆఖరుకు ఇంటికి బయలుదేరి రైలెక్కగానే దిక్కుమాలిన ఉద్రేకం ఒకటి పుట్టుకొచ్చింది. ఏ ఆదర్శం కోసమైనాసరే రాజ్యాన్ని వదలిపెట్టటం నాకసంభవమని తేల్చుకున్నాను. రాజ్యం నాకు ఆత్మార్పణ కావటంలో ఉన్న గొప్పతనం నాకు ఆకస్మాత్తుగా అర్థమయినట్టయింది. నాలో కృతజ్ఞత మొలకెత్తింది.

రెక్కలు కట్టుకుని వచ్చినవాడల్లే నేను ఇంటోవచ్చి వాలేటప్పటికి రాజ్యం సావిట్లో మంచంవేసుకుని పడుకుని ఉంది. దాని స్వరూపం

చూడగానే నాకు కళ్ళు తిరిగిపోయినై. ఆనాడు ఆ కుష్ఠువాడి మొహాన ఏ మృత్యుదేవత గోచరించిందో ఆ మృత్యుదేవత ఈనాడు రాజ్యం మొహాన తాండవిస్తున్నది.

"రాజ్యం ?" అన్నాను, వణకుతున్న గొంతుతో, మోకాళ్ళు పట్టు తప్పిపోతున్నై.

"పిల్లా, తల్లీ కులాసాగా ఉన్నారా ?" అన్నది రాజ్యం హీన స్వరంతో.

"ఏమిటి ఇట్లావున్నావు ? నీ కేమయింది ? ఎన్నాళ్ళనించి ! నీ కెవరుతోడుగా వున్నారు ? చెప్పు రాజ్యం !" అన్నాను.

"క్షయ ! సందేహంలేదు. చాలా ప్రమాదకరమైనదని పట్నంలో వైద్యులు చెప్పారుట. ఉత్తరం రాశాడతను. పాపం, జీవచ్ఛవం !"

"నీకు ? నీకూ అదే ? ఇంతకాలం దాగివుండి యిప్పుడు బయట పడ్డదా ?"

"లేదు. అతనిక్కడికి వచ్చినప్పుడు-"

"ఏంచేశావు ! మీరు ఒక్క నిమిషంకంటే మాట్లాడినట్లు లేదే?"

రాజ్యం మొహం పక్కకు తిప్పుకుని "ముద్దు పెట్టుకున్నాను" అన్నది పొడిదగ్గు దగ్గుతూ..

నా అవస్థ వర్ణనాతీరం. ఆ క్షణంలో నా ప్రపంచమంతా— సంప్రదాయ సిద్ధంగానూ చదువులతోనూ నాకు సంక్రమించిన సంస్కారమూ, నా విశ్వాసాలూ, నేను గుర్తించిన విలువలూ— ఒక్కసారిగా తారుమారయినట్టయింది.

నా నోటివెంట మాటల ప్రవాహం బయలుదేరింది. నా కంటి వెంట నీటి ప్రవాహం కూడాను. ఏమి మాట్లాడానో, ఎట్టా మాట్లా

డానో తెలియదు. దాని తాత్పర్యం ఏమంటే, నేను రాజ్యాన్ని విడిచి బతకలేను. నేను ఎనిమిదోయేట దాన్ని చూసినప్పటినుంచీ దాన్ని ప్రేమిస్తూనే ఉన్నాను. నేను గుర్తించలేదు కాని అది మర్రిచెట్టల్లే దినదిన ప్రవర్ధమానమై నా జీవితాకాశాన్ని కప్పేస్తూ వస్తున్నది. నేను జ్ఞాపకం తెచ్చుకోగలిగితే నేను రాజ్యంతో అన్న ప్రతిమాటా, దాన్ని గురించిచేసిన ప్రతిచిన్న ఆలోచనా ఆ పరిణామంలో సోపానాలే! నాకు నోటికివచ్చిన భాషలో రాజ్యాన్ని క్షమాపణవేడాను.

ఇప్పటికైనా మించిపోయిందిలేదు. దేశమంతటా తిప్పి ఎంత డబ్బయినా ఖర్చుచేసి రాజ్యానికీవ్యాధి నయంచేస్తా నన్నాను. రాజ్యం తనకే వైద్యమూ అవసరం లేదన్నది పరుషంగా.

"ఎందుకు నేను బతకటం? నాకు బతకాలనిలేదు. నా ఒంటో ప్రాణంవుండగా నే నే వైద్యానికీ ఒప్పుకోను. కావలిస్తే నా శవానికి చికిత్స చేయించు" అన్నది రాజ్యం.

"ఇంతపని ఎందుకు చేశావు రాజ్యం? ఆ అబ్బాయి నిన్ను దాగర్రగా ఉండమని రావడమేమిటి? నువ్వతన్ని ముద్దుపెట్టుకోవట మేమిటి? ఎందుకు చేశావాపని?

''కృతజ్ఞతకొద్దీ: అటువంటిదేమీ నీ కర్థంకాదా?" అన్నది రాజ్యం, బలహీనంగా నవ్వుతూ.

నా కళ్ళకు రెండంగుయిల దూరంలో మెరుపు మెరిసినట్టయింది. అవును నా కర్థమయింది—మానవత్వం: నేను చప్పున రాజ్యం పడుకున్న మంచంపక్క మోకరించి దాని మొహం నా వైపుకు తిప్పు కుని వాడిపోయిన దాని మూతి దీర్ఘంగా ముద్దుపెట్టుకున్నాను.

''కృతజ్ఞత కొద్దీ: తెలిసిందా? కృతజ్ఞత కొద్దీ! నేను కూడా కృశించి నీమాదిరిగా అయేవరకూ ఇట్లాగే ముద్దు పెట్టుకుంటాను.

ఇహమూ, పరమూ కూడాను: నీ పెదిమలు ఎప్పటంత తియ్యగానూ ఉన్నై. నా కేమీ తేడా కనిపించటంలేదు.''

రాజ్యం మెరిసే కళ్ళతో నన్నొక్క క్షణం చూసి నా మొహం గట్టిగా తన మొహాని కద్దుకుని, ''భోజనం తెప్పించు. మామయ్యా! లేచి వంటచేసే ఓపికలేదు'' అన్నది. దాని మొహాన తాండవించిన మృత్యుదేవత ఏమయింది? దాని గొంతులోకి అంత జీవం ఎట్లా వచ్చింది? ఆ పౌడిదగ్గేమయింది?

నా ఆశ్చర్యానికి రాజ్యం సమాధానం చెప్పింది.

"నే నా అబ్బాయిని ముద్దు పెట్టుకోలేదు. ప్రాణంపోయినా పెట్టుకుని ఉండను. రెండుమూడు రోజులనించీ కటిక లంఖణాలు చేస్తున్నాను.........ఉండు! అసలు దుర్వార్త అట్టేవుంది. నువ్వు నాకు అబ్బాయిని కని యివ్వలేక పోయినావు. నేనిస్తే పుచ్చుకుంటావా?'' అన్నది రాజ్యం.

(జూన్, 1940).

# 19. అంటు జాడ్యం

—కరుణ కుమార

సాయంత్రం ఏడుగంటలయింది. బాగా చీకటి పడింది. రామన్న పాలెం గ్రామకరణం వీధి అరుగుమీద దీపం పెట్టుకొని ఇంకా ఆఫీసు పని చేసుకొంటూనే వున్నాడు.

''ఏమయ్యో! కొంప మునిగిందే!'' గ్రామ మునసబు అయ్యవారప్ప వగర్చుకొంటూ పరుగుమీదవచ్చి అరుగుమీద కూలబడ్డాడు.

కరణానికి ఏభయ్యో, ఏభయ్యయిదు సంవత్సరాల వయస్సు ఉంటుంది. మునసబు వైఖరి చూచేవరకు అతనికి గుండె గుభెల్లుమనింది.

"ఏమి, ఏమి" అని వంచినతల పైకెత్తి మునసబు నడిగాడు కరణం.

"ఇంకేముంది? కొంప మునిగిందయ్యో: యానాదివాడు నన్ను నట్టేట ముంచేశాడు" అని అన్నాడు మునసబు.

''ఏ యానాదివాడయ్యో?'' అని కంటి అద్దాలు చేతికి తీసుకొని ఆత్రంతో అడిగాడు కరణం.

"ఆ యానాది వాడేనయ్యో!"

"ఏ యానాది వాడయ్యో అంటేను?''

''వాడి దేవూరో నాకు తెలియదయ్యో.''

"అయితే యిప్పుడేం వచ్చింది?"

"వాడు కలరా తగిలి చచ్చాడు."

కలరా అనేటప్పటికి కరణానికిగూడా గాబరా పుట్టింది.

"కలరా అని ఎవరన్నారయ్యా! అంతా లేనిపోని ఖంగారు నీది. ఇప్పుడు కలరా ఎక్కడినుంచి వచ్చిందయ్యా?" అని కరణం విసుక్కొన్నాడు.

"సడేలే, నేను స్వయంగా కళ్ళారా చూశాను - వాడికి పొద్దున్న కలరా తగిలి వుండంగాను."

"ఎక్కడ చూశావయ్యా?"

"రోడ్డుమీద చూశాను. ఉదయాన్న నేనాతట్టు పొయ్యేవరకు వాడు గవళ్ళపాలెం దగ్గర రోడ్డుమీద వేపచెట్టుకింద పడిపోయి ఉన్నాడు..."

"ఇస్సు, అబ్బబ్బ... నీతో ఒకటి గాదయ్యా చెరా! ఎవడయ్యా వాడూ?" అని యింకా విసుక్కొన్నాడు కరణం.

"వాడిది అదేదో వూరని చెప్పాడు. పేరు జ్ఞాపకంలేదు. వారం రోజులికిందట ఆ వూరు కాపు సుబ్బారెడ్డి కయ్యల్లో నారు వేతకేమో వచ్చాడట! మొన్న పగటివేళ వాడికి కలరా తగిలేవరకు వాణ్ణి బయటికి వెళ్ళ తరిమాడట ఆ రెడ్డి! పోయినవాడు విరగడై పోకుండా మన పొలిమేరలోనే పడి చచ్చాడు—"

"వాడి దేవూరోగూడా అడిగి తెలుసుకో లేదటయ్యా? నువ్వా సరే."

"అడిగానయ్యా! ఉత్తరాదో, దక్షిణాదో అని చెప్పాడు. ఏడిల్లు వల్లకాడుగానూ."

"అయితే వా డెక్కడ చచ్చాడు ?''

''గవళ్ళ పాలేనికి దక్షిణంగా చెర్లోకి పొయ్యే డొంకలో పడి చచ్చాడట ;"

"నువ్వు చూడలేదా ఏమిటి ?''

"నేనెప్పుడు చూశానయ్యా ? ఇప్పుడు ముతరాసు లక్షుంగాడు చెప్పుతుంటే నాకు తెలిసింది.''

''ఏ లక్షుంగాడయ్యా ?''

''ఆదేందయ్యా ? గూనివాడి కొడుకు లక్షుంగాడిని ఎరగవు ? వాడూ వాడి మేనల్లుడు వెంకట సుబ్బడూ చీకటిపడి చెర్లోపల్లినుండి డొంకన వస్తూంటే వాడు చచ్చి డొంకలో పడి ఉన్నాడట.''

''ఏ డొంకలోనయ్యా ?" అని కరణం యింకా విసుక్కుంటూనే వున్నాడు.

"నీ దంతా మరీ విడ్డూరం. గవళ్ళ పాలేనికి దక్షిణంగా చెర్లోకి పొయ్యే డొంక ఎరగవూ ?"

"ఆ ముతరాచవాళ్ళు సరిగ్గా చూశారోలేదో, వాళ్ళనిట్లా పిలిపించవయ్యా ఒక్కసారి" అన్నాడు కరణం.

గ్రామ మునసబు తలారి నర్సిగాడిని పంపి లక్షుంగాణ్ణి, వెంకటసుబ్బణ్ణి పిలిపించాడు.

''ఏందిరా ; మీరు వాణ్ణి చూశారట్రా ?" అని దబాయించాడు కరణం.

"మేము కళ్ళారా చూశాముసామీ ! అబద్ధం చెప్పేదాకా మాకేమి సొయ్యమా ?" అన్నారు ముతరాచులు.

"ఎక్కడ పడిచచ్చాడురా వాడు ?" కరణం మళ్ళా క్రాసు చేశాడు.

"గమళ్ళపాలేనికి పదిపగ్గాల దూరంలో డొంకలో మనుష్యులు వచ్చిపోయే దారికి తూర్పుగా కొంచెం ఎడంగా తుమ్మల్లో పడిఉండాడు. మొలకి గుడ్డకూడా లేదు."

"వాడి దేవూరో మీకు తెలుసా ?

"వాడి పేరూ వూరు తెలియదుగానీ వాణ్ణిమాత్రం మేము మొన్న ఊళ్లో చూశాం. ఈవేళ పొద్దున మేము చెర్లోపల్లెకు పోతుండే వాడు రోడ్డుమీద చెట్టుకింద మాత్రం పడిఉండాడు. వాడు మాకు బాగా గుర్తే" అన్నారు ముతరాచులు.

"అయితే ఇప్పుడు పోయిచూస్తే శవం అక్కడ ఉంటుందట్రా?" అని అడిగాడు కరణం.

"ఉండక ఏడకు బోతుంది ?" అంటూ ముతరాచు లిద్దరూ "మేం పోతామయ్యా" అని ఇళ్ళకు చక్కాపోయారు.

"ఇప్పు డెట్లానయ్యా చేసేది ?" అని మునసబు కరణాన్ని సలహా అడిగాడు.

"ఎట్లనా, నా పీకెకీ నీ పీకెకీ ఉరివేసుకొని బావిలో దూకుదాం పద—" అని కసురుకొన్నాడు కరణం.

"నామీద కసురుకుంటావు. నేనేం చేశానయ్యా ?" అని దీనంగా అడిగాడు మునసబు అయ్యవారప్ప.

"ఒకవేళ ఆ ముతరాచువాళ్ళు ఇప్పుడీ సంగతి నీతో చెప్పితే మట్టుకు నువ్వు ఊరూవాడా యాగీ చేసుకొంటూ ఇట్టా ఎందుకు పరు గెత్తుకొని రావడం ? ఈ సంగతి అసలు ఊళ్ళో రెండోవాడి చెవికి ఎందుకు పోవాలి ?" అని గొంతు ధ్వని కొంచెం తగ్గించి కోపంగానే మాట్లాడాడు కరణం.

"నేనేమి యాగీ చేశానయ్యా? నీతో తప్పా నేనెవరితోనూ అన లేదే ఈ సంగతి ?" అని అయ్యవారప్ప నెమ్మదిగానే జవాబిచ్చాడు.

"ఇంతటనైనా పలక్కుండా ఊరుకో" అని రహస్యంగా సలహా యిచ్చాడు కరణం.

"ఊరుకుంటే ?" అని ఆశ్చర్యపోయి అడిగాడు మునసబు.

కరణం జవాబు చెప్పలేదు.

"అదికాదయ్యా ! ఊరుకుంటే ఎట్లనయ్యా ?" అని మళ్ళా రెట్టించాడు మునసబు.

"తెల్లవారి ఊరేగవచ్చును లేవయ్యా! నీదంతా ఒకటే తొందరా, ఒకటే హడావుడీనీ" అన్నాడు కరణం.

"తెల్లవార్లూ ఆ శవానికి కాపలా అయినా లేకుండా ఆమోయిన అడవిలో పడేసివుంటే, రాత్రి ఏ నక్కలయినా పెరుక్కొని తింటేఎట్లా?" అని మునసబుకు సందేహం కలిగి అడిగాడు.

"ఎట్లనా ? నా గొంతుక్కు ఉరివేయవయ్యా! నీకు అన్నీ లేని పోని సందేహాలూ, శంకలూను..." అన్నాడు కరణం.

"కోపం చేయవోకయ్యా! నాకు తెలియక అడుగుతాను. మనం ఆ శవానికి ఈ రాత్రి కాబ్దారీ చేయించవద్దా అంటాను" అన్నాడు మునసబు.

"నీ చేతనయితే చేయించు. ఇప్పుడు అర్ధరాత్రివేళ ఆ అడవిలో ఎవడుపోయి శవ జాగరణం చేస్తాడు ?"

"అయితే శవాన్ని నక్కలు పీకవా అంటాను."

"పీక్కొని తింటే తిన్నాయిలే నీకేమీ!"

"మనం పోలీసులకి మేస్త్రేటుకి రిపోర్టు చేయవద్దూ ?"

"ఉదయాన్న చేయవచ్చునులే."

"శవాన్ని నక్కలు పెరుక్కొని తింటే మనం కాపాడి చేయించ లేదని ఆ పోలీసువాళ్ళు మనమీద పడతారేమో ?"

"పడరు లేవయ్యా ! నీకు అసలీసంగతి ఉదయాన్నే తెలిసినట్టూ, వెంటనేపోయి చూచేవరకు శవం ఫలానా ఫలానా స్థితిలో ఉండినట్టూ రిపోర్టులో రాయవచ్చునులే—"

"ముతరాచు వాండ్లు మనకి సాయంత్రమే చెప్పినప్పుడు, రేపు పొద్దున్న తెలిసిందని తప్పుడుకూత ఎట్లా కూసేదయ్యా ?"

"ముతరాచు వాండ్లు మనకు ఇప్పుడే చెప్పినట్లు దాఖలా మకాబూ ఏముందీ ?"

"అమ్మో ! రేపు పోలీసు వాండ్లు వచ్చి అడిగితే ఈ ముతరాచు వాండ్లు నిజంచెప్పరూ ?"

"అట్లా చెప్పకుండా వాళ్ళని మనం లోగట్టుకొందాంలే."

"ఏమోనయ్యా ! నాకుమాత్రం ధైర్యంలేదు. ఏమో ! మనకి ఇప్పటికి ఈ ఇద్దరే అగుపడుతున్నారు గ్రామంలో ఇంకా ఎంతమంది చూశారో ఆ శవాన్ని. నిజాన్ని అట్లా కప్పిపుచ్చడానికి ఎంతమాత్రమూ వీల్లేదుసుమా !"

"అయితే ఇప్పుడేం చేస్తానంటావయ్యా ?"

"ఒకవేళ పోలీసువాండ్లకి రిపోర్టు ఉదయాన్నే పంపినా, ఈ రాత్రి ఎవర్నయినా శవం దగ్గర కాపాడి పెట్టిస్తాను—"

"ఇప్పుడు ఎవరు కాపాడి చేస్తారు నీకు ?"

"తలారి నర్సిగాణ్ణి పంపిస్తాను."

నర్సిగాడు సమక్షంలోనే వున్నాడు. మునసబూ, కరణమూ అంటే వాడి కసలు లక్ష్యమేలేదు.

"పోతే నానౌకరీపోయింది లెండయ్యా! నేనూ మనిషినే గానీ గొడ్డునుకాను. మీరందరూ ఇళ్ళకాడ లక్షణంగా పండుకోవలసిందీని, నేనూ నాబిడ్డలూ అన్యాయం అయిపోవలసిందీ నా ?– నావల్లకాదు. దీనితల్లి సిగ్గోసిన ఉద్యోగం. మీరేంచేసినాసరే !" నన్నాడు నర్సిగాడు.

"వాడు చెప్పేది నిజమేమరి. వాడుమాత్రం మనిషికాదూ పాపం!" అన్నాడు కరణం.

"అయితే మాలవాడకిపోయి ఇద్దరు వంతు వెట్టి వాళ్ళనయినా పిలుచుకొని పంపించరా ?" అన్నాడు మునసబు.

"వెట్టి వాళ్లెవరూ పిలిస్తే పలకడంలేదు. వరినాటు అదునుకు ఒక్కపురుగు కూడా చిక్కడంలేదు. వాళ్ళకేమైనా జీతాలా భత్యాలా ? మనకెందుకు చేస్తారు– వెట్టిచాకిరీ ?" అన్నాడు తలారి.

"అయితే– ఏంగతి చెప్పవయ్యా ! కరణంగారూ !"

"........."

"ఇస్సు......అబ్బబ్బ......నేనెప్పుడూ ఇట్లాంటి అగచాట్లు పడ్డవాణ్ణి కానయ్యా ! ఆ భగవంతుడు నాకే తెచ్చిపెట్టుతూ ఉంటాడు ఈ కడగళ్ళన్నీని."

కరణం పలకలేదు.

తలారి గడ్డంకింద కర్ర ఆనించుకొని అరుగుదగ్గరే నిలబడి వున్నాడు

"పలకవేమిటయ్యా కరణంగారూ ! ఏదో విధంగా తగలబెట్ట వయ్యా స్వామీ !... ఇస్సు... నాకు కాళ్ళూచేతులూ పీక్కొని పోతు న్నవి. జాంపొద్దు పోయింది. ఇంకానేను అపశిష్టం తీర్చుకోవాలి. సంధ్యావందనం వార్చుకోవాలి... పీడి తల్లికడుపు పీడితోనే కాల-

చచ్చినవాడు నా పొలిమేరలోనే పడిచావాలా ?" అని నిట్టూరుస్తున్నాడు మునసబు.

కరణం కళ్ళకు అద్దాలు తగిలించుకొని చేతికి కలం తీసుకొన్నాడు.

"లేచి పోయినాడయ్యా! రోడ్డుమీద పండుకొన్నవాడు లేచి దక్షిణంగా డొంకన పడిపోయాడు. పీడ విరగడై పోయింది గదా అనుకొని, ఎండబడి ఆమైన ఇంటికి వచ్చేశాను. వాడింకా పొలిమేరలోనే తారట్లాడుతూ ఉండిన సంగతి తెలిస్తే, అప్పుడే ఎవరినో ఒకరని పంపి పొలిమేర దాటిపొయ్యే వరకూ వెళ్ళతరిమించే వాణ్ని. వాడిట్లా మోసం చేస్తాడని అనుకోలేదు."

"వాణ్ణి రోడ్డుమీద చూసినప్పుడే అనుకొన్నాను, వాడికి ఆయువు మూడిందని. నేనక్కడ నిలబడి ఉండంగనే వాడికి పది సార్లయినట్టు అయింది. అందులో కలరాజాడ్యం. తిరుగులేని వ్యాధి— ఇంతకి ఖర్మ. వాడిది కాదు - ప్రారబ్ధం మనది; ఏ పూర్వ జన్మలోనో చేసుకున్న సంచితం ఈ జన్మలో గ్రామ మునసబు నౌకరీరూపంగా పట్టి వేధిస్తోంది."

అని ఈ విధంగా ఏమేమిటో చదువుతున్నాడు మునసబు. ఏ సమాధానం చెప్పడానికీ పాలుపోక కరణం అడంగలులో సొగుబడి చెల్లువేసు కొంటున్నాడు.

"దీని ముండామోసిన నౌకరీ - రాజీనామా గీకి పారేదామని ఎన్నిసార్లో అనుకొన్నానయ్యా! కాని అన్నోదక రుణానుబంధం తెగనిస్తాడా ఆ పాపిష్ఠి దేవుడు! ఛీ, ఛీ! ఈ నౌకరీ చేసుకుని బ్రతికే దానికన్నా, పదిఊళ్ళు ముష్టెత్తుకొని బ్రతకడం మేలు'' అన్నాడు మునసబు.

"అట్లా అనుకొన్న వాడివి రాజీనామా ఇచ్చి లేచిపోరాదూ ?" అని అడిగాడు కరణం.

"ఏమయ్యా ఇస్తే ? ఈ ముండా నౌకరీతోనే బ్రతుకుతున్నా నను కొన్నావు కాబోలు. బ్రాహ్మడికి ఏ వృత్తి చేసుకొన్నా తప్పులేదు" అని పౌరుషంతో జవాబిచ్చాడు మునసబు.

"అసలు విషయం ఏమిటో వగదెంచకుండా ఈ ముచ్చట్లు పెట్టుకొని కూర్చున్నారేందయ్యా ?" అని హెచ్చరించాడు తలారి.

"శవానికి కాబ్దారీ ఉంటే ఉంది. లేకపోతే లేకపోయింది. మన చెవికి వచ్చిన నంగతి ఆలస్యం చేయకుండా పోలీసులికి వెంటనే రిపోర్టు పంపకుండా మాత్రం వీల్లేదయ్యా !" అన్నాడు మునసబు.

"సరే. అయితే రిపోర్టు రాసి పంపించు" అన్నాడు కరణం.

"నువ్వే నాలుగు ముక్కలు రాసేస్తూ. నేను సంతకం పెట్టు తాను."

"ఏమని రాయమంటావు ?"

"ఈ సంగతే ! జరిగిన సంగతి నీకు తెలియనిదేముంది."

ఎవరో పరాయి గ్రామయానాది వాడొకడు ఈవూరు కూలిపనికి గానువచ్చి అకస్మాత్తుగా కలరాతగిలి చచ్చిపోయాడనీ, వాడిపేరూ, ఊరూ తెలియదనీ, ఈ బేవారసు శవాన్ని కాబ్దారీ చేయించడం కష్టంగా ఉన్నదనీ, పోలీసువారు తక్షణంవచ్చి శవానికి పంచాయితీ జరిపించి పోవలసిందనీ పోలీసు స్టేషన్‌హౌసు కొక రిపోర్టు రాశాడు కరణం. గ్రామ మునసబు సంతకం పెట్టాడు.

"కలరా తగిలి మనిషి చచ్చిపోతే మనం హెల్తు ఇన్‌స్పెక్టరు తాలూకాకు కూడా రిపోర్టులు పంపాలి కాబోలునే - పంపవద్దూ ?" అని అడిగాడు కరణం.

"తెల్లవారి పంచాయితీ జరిగిన తర్వాత పంపవచ్చునులే. ముందు పోలీసువాండ్ల బదనాయం తప్పించుకోనీ'' అంటూ రిపోర్టును తలారి నర్సిగాడికిచ్చి స్టేషనుకు ఎత్తుకొని పొమ్మన్నాడు మునసబు.

"అర్ధరాత్రి నేను ఒంటరిగా ఎట్టాగయ్యా పోయేది?'' అని అడిగాడు తలారి.

''అన్నిటికీ అన్ని సాకులూ చెప్పితే ఎట్లరా? ఈ వూరికి నువ్వొక్కడవే నౌకరువయిపోతివి. అక్కర పడ్డప్పుడు కాస్త ఒళ్ళు వంచి పనిచేసుకొని రాకుంటే ఎట్లాచెప్పు నర్సయ్యా! శవానికి కాబ్దారీ చేయలేనన్నావు - సరే. రిపోర్టు అయినా ఎత్తుకొని పోకుంటే ఎట్లా? మూడుమైళ్ల స్టేషన్ ఇక్కడికి. ఇంటికిపోయి అన్నంతిని వెళ్ళావంటే ఎంత సేపట్లో తిరిగి వస్తావు. మళ్ళా ఊరుమాటు మణిగే వరకు తిరిగి రావొచ్చు; వెళ్ళు. నామాటవిని వెళ్ళరా" అని మునసబు తలారిని బతిమిలాడుకున్నాడు.

''కూడా యానాదివాణ్ణయినా పిలుచుకొనిపోరా! ఉన్న నౌకరువు నువ్వొకడవూ కాదంటే ఎట్లా?'' అని కరణంగూడా హెచ్చరించాడు.

"సరే! ఇటు పారేయండయ్యా ఆ రిపోర్టు. ఎక్కణ్ణుంచో వచ్చి ఈడ నా కోసరమే చచ్చినట్టుండాడు – ఆ పాపిష్టినా కొడుకు'' అన్నాడు తలారి.

''ఏం చేస్తాంరా నాయనా! నీ ఒక్కడి కోసరమేగాదు. మన అందరి కోసరమూ చచ్చాడు – ఆ ముతనష్టపాడు. ఇంతాచేస్తే తెల్లవారి పోలీసువాళ్ళు వచ్చేలోపల ఏ నక్కలయినా శవాన్ని పెరుక్కొనితింటే వాడి చావు అబద్ధమూ, మన చావు నిబద్ధమూ అవుతుంది.'' అన్నాడు మునసబు.

''ఇదెక్కడి చట్టమయ్యా – ఈ చట్టము? మనిషి బతికి ఉండంగా వాడి గొంతుకలో ఊపిరి ఉన్నంతమట్టుకు వాడు చచ్చాడా,

బతికాడా, తిన్నాడా, పస్తుపండుకున్నాడా అనే యోచన ఏ మారాజుకీ కాబట్టదు. తీరా చచ్చిన తర్వాత ఈ రిపోర్టు లెందుకు? ఈ కాఖ్దారీ లెందుకు? మనల్ని ఇట్లా ఎడిపించడం ఎందుకు? ఏదిపట్టినా దిక్కూ-దీమూ ఉన్నట్టు గోచరించదే!" అన్నాడు తలారి.

"మన చట్టాలన్నీ ఇట్లనే వుంటాయనుకో! మనమంతా చచ్చిన వాళ్లని కాఖ్దారీ చేయడానికే గానీ బ్రతికిన వాళ్ళని పోషించడానికి గాదు. పొద్దుపోయింది - తొందరగా పోయిరా" అన్నాడు మునసబు.

కరణం చిరునవ్వు నవ్వుకున్నాడు.

"అది కాదయ్యా! వాడెవడో బతకలేక కూలీపని చేసుకోను ఏడనుంచో ఈడకివచ్చి అమ్మవారి జాడ్యం తగిలితే, వాడికింత మందూ, మాకూ పోసేదిక్కు లేకపోవడం సరిగదా, వాణ్ని ఆఖరుకు ఊళ్లో నయినా ఉండకుండా బయటికి వెళ్ళతరిమితిరి. వాడెట్టాగా చచ్చాడు గదా- ఇక ఇప్పుడీ రచ్చ అంతా దేనికయ్యా? తెండి. ఇట్టాపారెయ్యండి ఆ కాగితం. నా తిప్పలునావి. చచ్చోబతికో ఆ పోలీసువాళ్ళ మొఖాన్న కొట్టివస్తా" అని రిపోర్టు తీసుకొని విసుక్కుంటూ వెళ్ళిపోయాడు తలారి.

"శివశివా! ఏం ఖర్మం తెచ్చిపెట్టావురా భగవంతుడా!" అని పెద్ద నిట్టూర్పు విడిచి గ్రామ మునసబు భోజనానికి ఇంటికి లేచి పోయాడు.

## ౨

రామన్నపాలెం సర్కారు శ్రోత్రియం గ్రామం. ఆ శ్రోత్రియానికి ఒక కరణమూ, గ్రామ మునసబూ, ఒక తలారి నౌకరూ ఉన్నారు. కరణమూ, మునసబూ ఇద్దరూగూడా వైదీక బ్రాహ్మణులే.

కరణానికి ఆరు రూపాయలూ, మునసబుకి అయిదు రూపాయలూ, తలారికి మూడు రూపాయలూ సర్కారువారు నెల జీతాలిస్తారు. కరణం మిస్సల్ కరణమేగానీ మునసబు మాత్రం రిజిష్టర్డు మైనరు తరపున వత్తాసిగా పనిచేస్తున్న ఆక్టింగు మునసబు. గ్రామాధికార్లిద్దరి లోనూ మునసబుదే చాలా నీరసమైన సంసారం. పైగా ఆయనగారికి ఇంటినిండా గంపెడు పిల్లలు, పెద్ద సంసారం. నెల జీతం అయిదు రూపాయలతోనూ ఆయనగారికి సంసారం గడవడం చాలాకష్టంగా ఉంది. అందువల్ల ఆయన అచ్చం నెలజీతాన్ని నమ్ముకోకుండా, సమీప గ్రామాల్లో శుభాశుభ కార్యాలకి బ్రాహ్మణార్థాలు చేసుకొంటూ కొంత సంసారపోషణ చేసుకొంటున్నాడు. అదిగాక వాళ్ళ గ్రామానికి మూడుమైళ్ళ దూరంలోవున్న పట్నవాసానికి ప్రతిరోజూపోయి ప్లీడర్ల ఆఫీసుల్లో పార్టీల వకాల్తనామాలు వగైరాలు ధృవపరుస్తూ తద్వారా ఒక్కొక్క వకాల్తానామాకు ఒకబేడ డబ్బులు చేతిలో వేసుకొంటూ పొట్టపోసుకొంటూ వస్తున్నాడు.

ఆ బ్రాహ్మడికి కలరాజాడ్యం అంటే తగనిభయం. తన గ్రామంలో కాదుగదా, ఆచుట్టుపక్కల ఏ గ్రామంలోనయినాసరే, అమ్మవారి జాడ్యం అనే అలికిడి చెవిని పడిందంటే ఇంటి దగ్గర గంపెడు సంసారాన్నీ ఇంటిదగ్గరనే విడిపించి, అంగవస్త్రం చంకన పెట్టుకొని పలాయనమై పోతూఉండే అలవాటు. ఆరంభదశలో ఈ విధంగా పారిపోతూవచ్చాడు గానీ, ఆమధ్య రెండు సంవత్సరాల క్రిందట ఇట్టనే ఆ తాలూకాలో ఇంకో గ్రామ మునసబు కలరాజాడ్యానికి భయపడి పారిపోయి, పై అధికార్లకి సకాలంలో రిపోర్టు చేయలేదన్న కారణంతో, ఆగ్రామ మునసబును సర్కారువారు నౌకరీ నుండి మత్తరబు చేసినప్పటినుండీ ఈ శ్రోత్రియం గ్రామ మునసబు అయ్యేవారప్పు, ఊరువిడిచి పారిపోయే పద్ధతి చాలించుకొని, ఏమయినప్పటికీ

గ్రామంలోనే నిలబడి పైవారికి రిపోర్టు వగైరాలు పంపి తన ధర్మం యధావిధిగా నిర్వర్తించుకోవాలని నిశ్చయ పరచుకొన్నాడు. ఏంచేయ గలడు ? పాపం ! విధిలేదు. కలరాకు భయపడి ఆ అయిదు రూపా యల నౌకరీ పోగొట్టుకుంటే ఆ నౌకరీని ఆధారం చేసుకొని తెచ్చుకొనే ఇతర సంపాదన ఎంతో నష్టమైపోతుంది.

కలరా జాడ్యానికి భయపడి పారిపోకుండా యింటిదగ్గరనే నిలబడవలెనని తాను తీర్మానం చేసుకున్న తర్వాత ఆ గ్రామంలో కలరా కనబడడానికి ఇదే మొదటి పర్యాయం.

సందేహాలు నివర్తిచేసుకొని మునసబుగారు భోజనానికి లేచారు. కాని ఆయనగారి మనస్సంతా డొంకలో పడివుండిన శవం మీదనే ఉన్నది. అందులోనూ కలరా తగిలి చచ్చిన మనిషి. కలరా అంటు వ్యాధి తగిలితే మళ్ళా తిరుగుముఖంలేదు ఆ జాడ్యానికి. ఆ ఉదయం ఆ మనిషికి కలరా తగిలిఉండగా తాను రోడ్డుమీద వానిని స్వయంగా చూచాడు కూడాను. మునసబుకు గుండెలు పీచు పీచు మంటున్నవి. నోటికి అన్నం హితవుగా లేదు. నాలుగు మెతుకులు ఎంగిలిపడి లేచి మంచం యెక్కి ముసుగుతన్ని పండుకున్నాడు.

రాత్రి పొద్దుపోయింది. పదకొండు గంటలయింది. ఊరంతా మాటుమణిగి నిశ్శబ్దంగా ఉన్నది. కాని మునసబుకు నిద్రపట్టలేదు. కళ్ళుమూసినపుడల్లా ఉదయాన్న తాను రోడ్డుమీద చూచిన మనిషి కళ్ళయెదుట ప్రత్యక్ష మవుతూనే వున్నాడు. మనిషికి భయం వేసింది. ఉదయంకలరా తగలడమూ, సాయంత్రానికి చచ్చిపోవడమూనా ! ప్రాణం ఎంత బుద్బుద ప్రాయమైనదో ! ఒకవేళ తనకే కలరా తగిలితేనో ! అని లోపల హఠాత్తుగా ఒక సందేహం కలిగింది. ఆ వెంటనే మనస్సులో ఇంకో ఆలోచన యేదో బయల్దేరింది. దానివెంట మరొక ఆలోచన !

మనిషికి ఖంగారు పుట్టింది. కప్పుకున్న ముసుగుతీసి మంచం మీదనే లేచి కూర్చున్నాడు. గుండెలు కొట్టు కొంటున్నవి. చేత్తో పొట్ట మీద వాయించుకున్నాడు. డబడబ గాలిబంతిమీద కొట్టినట్టు చప్పు డయింది. పొట్ట ఉబ్బరించినట్టు అనుమానం కలిగింది. తిన్నతిండి జీర్ణానికి రాలేదా అనుకొన్నాడు. భోజనంలో తిన్న పదార్థాలు ఏమా అని జ్ఞాపకం చేసుకొన్నాడు. కందిపచ్చడీ, మినుములు వేసిన చింత పండు పచ్చడీ జ్ఞాపకానికి వచ్చినై. అదిగాక ఆరోజు ఇంట్లో వండిన బియ్యం కొత్తబియ్యం. పొట్టమీద చెయ్యివేసి నిమురుకున్నాడు. కడుపు ఊదినట్లు చేతికి తగిలింది. పొట్ట అక్కళించు కొన్నాడు. బొడ్డుదగ్గర నొప్పిగా ఉన్నట్టు తోచింది. మనిషికి భయం జాస్తీ అవుతూ వచ్చింది. దానికితోడూ కడుపులో వికారంగా ఉండినట్టు గూడా అనుమానం బయల్దేరింది. అల్పశంకకు పోవలసిన అవసరం కనబడింది. కాని మంచం దిగలేక పోయాడు. ఒంటరిగా బయటికి పోవడానికి భయం. నిద్రలో ఉండిన భార్యను లేపాడు. ఆమె సహాయంతో తలుపుతీసి వాకిట్లోకి వెళ్ళాడు. అవసరం తీర్చుకొని లోపలికి తిరిగి వచ్చాడు. మంచంమీదనే కూర్చున్నాడు. కడుపులో నులి నొప్పిగా ఉన్నట్టు తోచింది. లేవవలసిన అవసరమేమో ! భయపడ్డాడు. ఏదో ఆయా సంగా ఉన్నదతనికి. రోడ్డుమీది యానాది వాడు ఎదురుగా నిలబడ్డాడు. తన బాధ అంతా కలరా చిహ్నాలు కాదు గదా అని అతనికి అను మానం వృద్ధి అవుతోంది.

గుండె దడదడమన్నది. నిద్రపోతూ వుండిన భార్య వైపూ పిల్లలవైపూ ఒకసారి చూచుకున్నాడు. తనకి తెల్లవారుతుందో లేదో అనుకొన్నాడు. కడుపులో బుడబుడమని చప్పుడయింది. గబగబా భార్యను లేపి వీధిలోనికి పోయాడు, మళ్ళా వచ్చి పండుకున్నాడు.

మంచంమీద వెల్లకిలా పండుకుని చేతులు రెండూ గుండెలమీద చేర్చుకుని కళ్ళు మూసుకొన్నాడు. ఏవో వికార స్వరూపాలు గోచరిస్తూ ఉన్నవి. రాత్రి రెండు జాములు దాటింది. ఎక్కడనో బయట నక్కలు కూస్తున్నట్టు చెవికి వినవస్తోంది. యానాది వాడి శవాన్ని నక్కలు పీక్కొని తింటున్నాయో ఏమోనని సందేహం కలిగింది. తాను చేసిన అజాగ్రత్తకి పోలీసువాండ్లు తనమీద పై వారికి రిపోర్టు చేస్తారేమో? ఇట్లాంటి విషయంలోనే అజాగ్రత్తగా ప్రవర్తించినందుకు ఒక గ్రామ మునసబును ఇదివరలో సర్కారువారు నౌకరీ నుండి నిలుపుదల చేశారు కూడాను; తన గతి ఎట్లా ఉన్నదో? అతనికి భయం వేసింది. మళ్ళా కడుపులో ఏదో బాధగా ఉన్నట్టుగా ఉంది. మళ్ళా భార్యను లేపి వీధిలోకి పోయాడు. మూలుగుతూ, ముక్కుతూ రెండు చేతులూ నడుముకానించి లోపలికి వచ్చి పండుకొన్నాడు. కాళ్ళులాగుతూ ఉండినట్టు ఉన్నదతనికి. శరీరం చిరు చెమ్మట పోసింది. ఒళ్ళంతా నీరసంగా ఉన్నది. దాహం అని ఒక లోటా నీళ్ళు తాగాడు. అన్నీ కలరా లక్షణాలే? భార్యతో చెప్పనా వద్దా అని సందేహం కలిగింది. అట్టే ఆలోచించాడు. 'సంసారం గుట్టు, వ్యాధిరట్టు' అన్న సామెత స్ఫురణకు వచ్చింది.

''ఏమే'' అని భార్యను పిలిచాడు.

ఆమె దగ్గరగా వచ్చి నిలబడింది.

"నాకేమో కడుపులో సంకటంగా ఉన్నది. చూడు, ఒక్కసారి కరణాన్ని ఇట్లా పిలుచుకొనిరా'' అన్నాడు మునసబు.

"ఇప్పుడు కరణం ఎందుకు?''

"అతగాడి దగ్గర ఏ మాత్ర అయినా ఉంటుంది. ఏదో కడుపులోకి ఇంతమందు పడితేనేగాని ఈబాధ తగ్గేటట్టులేదు. చుట్టు పక్కల

ఊళ్ళలో అమ్మవారి జాడ్యాల వల్ల బాగాలేదని అంటున్నారు" అన్నాడు.

భార్య గుండెల్లో రాయిపడింది. దీపం దగ్గఱగా తీసుకొని వచ్చి భర్తనట్టే పరీక్షించి చూచించిది. ఆయన వైఖరి చూచే వరకు ఆమెకు కూడా ఖంగారు పుట్టింది. రాత్రినట్ట నడిజాము.

లాంతరు దీపం చేతబట్టుకొని ఆమె తిన్నగా కరణం గారి ఇంటికి పోయింది. ఆయన్ని నిద్రలేపింది.

''ఆయన కడుపులో ఏదో సంకట మంటున్నాడయ్యా! రెండు సార్లు వీధిలోకి పోయివచ్చాడు; నిద్రపట్టలేదు. ఒళ్ళంతా తపనగా ఉన్నదని మంచంమీద పడి ఊఁ ఆకోటా, ఈకోటా పడి కొట్టుకుంటు న్నాడు. దప్పిక దప్పిక అని నీళ్ల తాగుతున్నాడు. నాకేమీ పాలు పోక ఇట్లా వచ్చా అన్నా!'' అని కరణంతో చెప్పింది.

కరణానికి అనుమానం వేసింది.

''ఊళ్ళో ఏమో బాగులేదని అంటున్నారు. ఆ సంబంధం కాదు గదా అన్నా!" అని అడిగింది.

''ఊరుకోవమ్మా నువ్వు! అంతా లేనిపోని అనుమానాలూ, కలగ దొక్కుకోవడాలూను. అన్నం జీర్ణానికి రాలేదు కాబోలు. అందువల్ల మనిషి అట్లా ఆయాసపడుతున్నాడు'' అని కరణం ధైర్యం చెప్పాడు.

"ఏమో అన్నా! బిడ్డల అదృష్టం ఎలా ఉన్నదో?'' అని కంట నీరు తుడుచుకొంది.

''నీకేమైనా మతిపోయిందా ఏందమ్మా! ఏందీ పిచ్చి చేష్టలు?'' అని కరణం కసురుకొన్నాడు.

మునసబు భార్య ముక్కు తుడుచుకొని,

"నిన్నొక్కసారి పిలుచుకొని రమ్మన్నాడయ్యా. నేనెంత చెప్పినా ఊరుకోలేదు. ఒక్క అడుగు ఇంటి దాకా వస్తూ. నీ కోసం ఆరాటించి పోతున్నాడూ" అని అడిగింది.

రొంటిని ఉన్న నశ్యం పట్టు ముక్కులోనికి జుర్రున జుర్రి కాళ్ళకు చెప్పులు తొడుక్కొని ఆమెతో గూడా మునసబు గారింటికి వెళ్ళాడు కరణం.

కరణాన్ని చూచీ చూడడంతోనే మంచం మీద పండుకున్న మునసబు దిగ్గునలేచి కూర్చుని,

"నేను బతకనయ్యో! బిడ్డల్ని నీ కప్పగించి పోతున్నానయ్యో!" అని కరణాన్ని ఘట్టిగా కౌగిలించుకొని బావురుమన్నాడు.

భర్త స్థితి చూచే వరకు భార్యకు దుఃఖం ఆగలేదు. "నా గతేం చేస్తావు, అన్నా!" అని ఆమె ఏడిచింది. ఆ రోదనవల్ల పండుకొని నిద్రపోతూండిన పిల్లలులేచి గీ, గా అని గోల ఆరంభించారు.

కరణంగారు గుండె నిబ్బరం చేసుకొని వీళ్ళనందరినీ సముదాయించలేక పోతున్నాడు. మునసబుగారింట్లో గలభాకు చుట్టు ప్రక్కల వాళ్ళందరూ లేచి ఏమిటో విచారించి వద్దామని గుంపు గూడారు. అందరూ తలొక మాటా చెప్పి వాళ్ళకు ధైర్యం చెప్పారు. వారిలో ఒక పెద్ద ముత్తయిదువ ఇంత శొంఠీ, వాముపాయా తీసుకొని వచ్చి నూరి, ఉండచేసి మునసబు గొంతులో వేసింది. ఒక అరగంటకి చేరిన జనం అంతా వెళ్ళిపోయారు. అక్కడచేరిన వాళ్ళల్లో చాలామంది అది కలరా జాడ్యమేనని తీర్మానం చేసుకొన్నారు.

కరణం మాత్రం మునసబు ఇంటనే నిలిచాడు. మాత్ర మింగినప్పటికీ మునసబుకి అయాసమూ, వికారమూ తగ్గలేదు. ఏదో బయ

టికి చెప్పలేనట్టుగా ఉన్నది. ఆయనగారి బాధ. పిల్లల్ని పండుకోబెట్టి భర్త మంచాని కానుకొనే కూర్చున్నది భార్య.

ఎదురుగ్గా మంచంమీద కూర్చున్నాడు కరణం. రాత్రి రెండు గంటలయింది. మూడయింది. నాలుగయింది. కరణానికీ మునసబుకీ ఆయన భార్యకీ నిద్రలేదు. ఊఁ, ఊఁ అని తెగ మూలుగుతునే ఉన్నాడు మునసబు. భార్య కాళ్ళు పిసుకుతూనే కూర్చున్నది, పాపం.

"ఏమయ్యా! ఆ శవం అక్కడనే ఉన్నదో ఏ నక్కలయినా పెరుక్కొని తిన్నాయో! ఆ పోలీసు సబిన్‌స్పెక్టరు నన్ను బ్రతక నివ్వడు ఎట్లానయ్యా?" అని కరణాన్ని అడిగాడు మునసబు.

"నీకా భయం ఏమీ పనిలేదు లేవయ్యా! నేను ఆయనతో మాట్లాడి నీకేమీ మాట రాకుండా చేస్తానులే'' అని ధైర్యం చెప్పుతూ 'నీకు వంట్లో ఎట్లావుందీ?'' అని అడిగాడు కరణం.

"కడుపులో ఊఁ వికారంగా ఉన్నదయ్యా! వాంతి వెళ్ళే టట్టుగా ఉన్నది" అని అన్నాడు మునసబు.

"అన్నా! ఇట్లారా! కాళ్ళు చేతికి చల్లంగా ఉన్నట్టుగా ఉన్నవే! నా చేతులకేనా, నీక్కూడా అట్లానే ఉన్నాయా?" అని కరణంతో చెప్పింది, మునసబు భార్య.

''అయ్యో, అయ్యో!— 'రామహరే, కృష్ణహరే! తవ నామ వదామి...'' అని మూలుగుతున్నాడు— మునసబు. కరణం లేచి వచ్చి మునసబు వంటిమీద చెయ్యివేసి పరీక్షించి చూచి—

"లేనిపోని సందేహాలు పెట్టుకుని మనస్సు కలగ దొక్కుకో బోకండి" అని వాళ్ళనిద్దరినీ మందలించాడు—.

బయట కోడి కొక్కొరోకో అని కూసింది - ఒక్క అరగంట నడుము వాలుస్తానని కరణం ఆ మంచం మీదనే ఒరిగాడు. మునసబు

భార్య చీర పరచుకొని భర్త మంచాని కానుకొని నేలమీదనే పండు కున్నది. మునసబు కళ్ళు మూసుకొన్నాడు.

3

ఉదయం అయిదు గంటలయింది. ఇంకా కని చీకటిగానే ఉన్నది. పోలీసు స్టేషన్‌కు రిపోర్టు యెత్తుకొని పోయిన తలారి వచ్చి, "సబిన్‌స్పెక్టరు వచ్చాడు. పిలుస్తుండాడు—'' అని కరణంతోనూ, మునసబుతోనూ చెప్పాడు.

ఈ మాట చెవిని పడేవరకు ఉలిక్కిపడి లేచి మునసబు మంచం మీదనే ఈతట్టూ ఆతట్టూ కొట్టుకుంటూ,

''నేను రాలేనయ్యో! నాకిక నూకల రుణం తీరిపోయిందయ్యో! నాకాళ్ళూ చేతులూ కొంకర్లు పోతున్నాయయ్యో! నన్నవతలికి ఈడ్చి పారేయండయ్యో!'' అని పెద్ద పెట్టున గోల ఆరంభించాడు.

భార్య లేచి వచ్చి భర్త మంచం మీద కూర్చుని ఏడుస్తూనే ఆయన్ని సముదాయిస్తోంది. కరణంగారు దగ్గరకు వచ్చి చూచే వరకు మునసబుకు దవడలు రెండూ కరుచుకొనిపోయి, మిడిగ్రుడ్లు వేసి కొయ్య అయిపోతున్నాడు.

ఇదేమీ అర్థం కావడం లేదు తలారి వాడికి.

కరణం మాత్రం బలవంతాన్న ధైర్యం తెచ్చుకొని మునసబుకీ భార్యకీ ధైర్యం చెప్పి తలారి వాణ్ణి తీసుకొని సబిన్‌స్పెక్టరు దగ్గరకు వెళ్ళిపోయాడు.

"మునసబుకి రాత్రి చాలా జబ్బు చేసిందండీ! ఆయన లేచి వచ్చే స్థితిలోలేదు" అని కరణం సబిన్‌స్పెక్టరుతో చెప్పాడు.

"ఎక్కడనయ్యా— శవం పడి ఉన్నదీ?" అని కరణాన్ని అడిగాడు సబిన్‌స్పెక్టరు.

"ఒరే గమళ్ళ పాలేనికి దక్షిణంగా చెర్లోకిపోయే డొంకలోకి దారితీయరా" అని తలారివాడికి ఉత్తర్వుచేస్తూ, ఇంకో మనిషిని ముతరాచు లక్షుంగాడినీ, వెంకట సుబ్బణ్ణీ పిలుచుకొని రమ్మని పంపాడు కరణం.

"చాలా చీకటి ఉండంగనే లేచి వచ్చారే నాయుడుగారు! తెల్లవారిన తర్వాత నిదానంగా రాలేక పోయినారా?" అని సబిన్‌స్పెక్టరుతో అన్నాడు కరణం.

"అసలు నేను అచ్చం ఈ డ్యూటిమీదనే రాలేదయ్యా! వేకువ జామునే లేచి చెర్లోపల్లెకు పోవాలని ప్రయాణమై ఉన్నాను. రాత్రి పదకొండు గంటలకి తెచ్చి యిచ్చాడు మీ రిపోర్టు. పోయేదారి గదా, ఈ పంచాయితీ పూర్తి చేసుకొని మరీ పోదామని వేకువనే లేచి వచ్చా" నన్నాడు సబిన్‌స్పెక్టరు.

ఇంతలో ముతరాచు వాండ్లిద్దరూ వీండ్లని కలుసుకొని డొంకలోనికి ముందుగా దారి తీస్తున్నారు.

తూర్పు రేఖలు బాగా అరినవి. రాత్రి తెల్లవార్లూ కళ్ళని కప్పిన అంధకారం తొలగి ప్రజలకు జ్ఞానోదయం కలిగినట్లు సూర్యోదయం కాబోతోంది. కరణమూ, సబిన్‌స్పెక్టరూ, తలారీ, ముతరాచు వాండ్లూ గమళ్ళ పాళెం దాటి ఒక ఫర్లాంగు దూరం వెళ్ళారు—

ముతరాచు వాండ్లు చూపిన స్థలంలో డొంకకి తూర్పుగా తుమ్మచెట్టు కిందపడి ఉన్నాడు-ఘూనాది వాడు. ఈ జన సమూహాన్ని చూచి ఆఘూనాది వాడు నోటితో ఏమీ మాట్లాడలేక, చెయ్యెత్తి మూతిదగ్గర పెటుకొని దాహమవుతూవుందని సంజ్ఞచేశాడు.

అందరికీ ఆశ్చర్యం వేసింది.

"వీడు చావలేదయ్యా! బ్రతికే ఉన్నాడు. భలేపని చేశారు కదయ్యా: వీడికిన్ని గంజినీళ్లు పోయించి ఊళ్ళోకి తీసుకొనిపోండి" అంటూ సబిన్‌స్పెక్టర్ ఒంటెద్దు బండెక్కి అక్కణ్ణుంచే చెర్లోపల్లెకు పోయాడు.

"అరే, రాత్రిపొద్దు చూస్తే చచ్చినట్టే ఉండాదయ్యా, ఎంతపని జరిగిందో చూశావా ?" అన్నారు ముతరాములు.

కరణానికి ఒళ్ళు తెలియలేదు. ఒక్కపరుగున ఊళ్ళోకి పేరెం తీశాడు.

మునసబుకి మన స్మారకం లేనేలేదు. పిలిస్తే పలకడు. భార్య ఏడుస్తూ అతని ప్రక్కలోనే కూర్చుని ఉన్నది.

పరుగులుతీస్తూ కరణం మునసబు ఇంటికిపోయి "ఏమయ్యో! వాడు చావలేదయ్యా! బ్రతికే ఉన్నాడు. వాడికి కలరాకాదయ్యో పాపం! జ్వరంతగిలి పడిపోయాడట! వాడితో వచ్చిన కూలివాళ్ళంటు న్నారు'' అని వగర్చు కొంటూచెప్పాడు.

''ఆ! ఆ! ఏమిటీ, వాడు చావలేదూ ? నిజమే! నిజమే!" అని ఎగిరి ఒక్కగంతు వేశాడు— మునసబు.

(ఏప్రిల్, 1938)

# 20. బాలింతరాలు

—రా. వి. అంజనేయశాస్త్రి

౧

శ్మశానమే వాగుకి అవతల ఒడ్డున. దానికి అనుకునే వుంటుంది ఆ మఱ్ఱిచెట్టు. వాగుకి యివతల ఒడ్డునవున్న ఆ వూళ్ళో చచ్చిపోయిన వాళ్ళందరినీ ఆ శ్మశానంలోనే దహనం చేస్తారు. ఎంతకాలం నుంచీ వుంటున్నారో, యింకా ఎంతకాలం వుంటారో ఆ ముసలి చెట్టుకే తెలియాలికాని, ఎప్పుడు చూసినా దానికింద సాధారణంగా పది పది హేను కుటుంబాలకి తక్కువుండవు. చెట్టుమీద కొండ గబ్బిలాలు కూడా వున్నాయి... ఊడకీ ఊడకీమధ్య ఏ వాసం ముక్కలో రెండు దిగేసి వాటికీ వీటికీ కలిపి తాడూ తంకరాకట్టి, వాటిమీద ఓ తాటాకు ముక్కా, ఓ గోనెగుడ్డ పేలికా, చాపముక్కా యిలాంటి వేవో కాస్తా అతుకుపెట్టి కట్టి పందిరిలాగా వుండే ఏ గుడిశ లాంటిదో తయారు చేస్తారు. వాటిల్లోకి నీళ్ళెక్కకుండా కాస్తమెరక చేసుకుంటారు. ఇవే వాళ్ల దివ్యభవనాలు...

చెట్టున్నగట్టూ, ఆ శ్మశానం తప్పితే మిగతా ప్రదేశమంతా పొలాలే... చెట్టుక్రింద వాళ్ళుండటానికి గాను, శ్మశానంలో చచ్చిన వాళ్లని బూడిద చెయ్యటానికీ వీలుగా వుండటానికి గాను సాగుచెయ్య కుండా విడిచిపెట్టారు ఆ ప్రదేశాన్ని.... అక్కడుండే వాళ్ళు ఫలాని తెగవాళ్లని గానీ, వాళ్లది ఫలానావృత్తి అనిగాని చెప్పటానికి వీల్లేదు. సాధారణంగా ముసలివాళ్ళూ చిన్నపిల్లలూ ఊళ్ళో ముష్టెత్తుకుంటారు.

దొరికితే కూలికెడుతారు పడుచువాళ్లు. ఆడవాళ్ళు కొంతమంది సోది చెబుతారు. పాముల్ని పట్టేవాళ్లుకూడా ఒకరిద్దరున్నారు. దువ్వెనలూ, సబ్బుబిళ్ళలూ, దారపుండలూ లాంటివి యింటింటికీ తిరిగి అమ్ముకునే ఆడవాళ్ళుకూడా కొంతమందున్నారు. పొలాల్లోకి ఆలస్యంగా నీళ్ళెక్కినా లేకపోతే ఏదన్నా ఎద్దడివచ్చినా ఎప్పుడన్నా రైతులు వీళ్ళని ఊడ్పు లకీ కోతలకీ పిలవటం కూడాకద్దు. పంటకోసి కుప్పలేసినా, కుప్పలు నూర్చి రాసిపోసినా అక్కడ మొక్కమొలిచి పోవాలి, తప్పితే ఒక్క గడ్డిపరకన్నా పోదని ఆ చుట్టుపట్ల మహాప్రఖ్యాతి. అంతనమ్మకం ఆ చెట్టుక్రింద వాళ్ళంటే. అంతకన్నా విచిత్రం : ధాన్యపు రాసులికి కాపలా కాసేదేవాళ్ళు !! ఊళ్లో పెద్దమనుష్యులు షికారొచ్చినప్పుడు చెట్టు కింద వాళ్ళని చూసి "వాళ్ళదే హాయైన బతుకు, చీకూచింత లేదు" అంటారు.

౨

అతనికి ముప్ఫైఅయిదేళ్లుంటాయి. కాస్త లేత వయస్సులోనే పెళ్లిచేసుకున్నాడు. పెళ్లైన రెండోఏటే, ఓ పిల్లాడు పుట్టి నెల తిరక్క ముందే పోయాడు. తరవాత మళ్ళా సంతానమేలేదు పది పదిహేనేళ్ళ వరకూను... ఇప్పుడు భార్యకి పురుడొచ్చే రోజులు. ఇద్దరికీ అబ్బ రంగానేవుంది. కోతల్లో నాలుగు డబ్బులు మిగుల్చుకుని పెళ్ళానికి కారబ్బూంది పలుకులూ అవీ కొనిపెడుతూ ఒచ్చాడు కూడాను... ఇవాళో రేపో పురుడొచ్చేట్టున్నా పొట్టగడవదు గనుక పాపం అతను పెద్దరైతు రాసిమీద నాలుగురోజులు కాపలాకి కుదురు కున్నాడు. బంధువులు సాయం రావటం మూలాన రైతు రాసిఅంతా రెండు రోజుల్లోనే కొట్లల్లోకి చేరింది కాపలాకాసే నిర్భాగ్యుడికీ సంగతి ముందరే తెలిసి ఆ తెల్లారి కట్టనే మునిమునిచీకట్లో రాసిలోంచి, రెండు మరకాల

గింజలు మూటకట్టుకు చక్కాపోయాడు. నాలుగురోజులు కాపలావుంచే ఆ కూలి గింజల్తో పురుడువెళ్ళేదాకా ఎలాగో ప్రాణాలు నిలుపుకోవచ్చునని పాపం అతనిఉద్దేశం; కాని రెండురోజుల్లోనే పని అయిపోవడంచేత కక్కుర్తిపడి సాహసం చేశాడు. ఇంతపెద్ద రాసిలో రెండుమరకాలు తక్కువౌతే కనుక్కోఒచ్చారా అని. దొంగతనం యింకోతనం బయట పడక మానదంటుంది ప్రపంచం. ఆ చెట్టుకింద వాళ్ళే ఎవరో ఊదారు రైతుచెవిలో. పట్టుపట్టని అతన్ని లాక్కొచ్చి, స్తంభానికి రెక్కలు విరిచికట్టి, ఆ చెట్టుక్రింద వాళ్ళచేతనే కఱ్ఱలతో బాదించారు పెద్దలు. "తరతరాల్నుంచీ ఎంతో నమ్మకంతో కాపలా కాస్తున్నారు. ఈనాటికి పుట్టాడు, ఈ చిత్రకార్తి ముండా కొడుకు..." అన్నారు అంతాను... భార్యస్థితి తలుచు కోటంచేత దిగజారిన అతని గుండెలా దెబ్బలకి తాళుకోలేక పోయాయి. మొన్నాటికి ఒళ్ళంతా ఉబ్బినట్లైంది. మూడో నాడు తెల్లారేసరికి శరీరమంతా నల్లపడింది... పురుగు ముట్టడం చేత పోయాడన్నారు అంతాను. అప్పుడే ప్రసవించిన భార్యకి తెలుసు ఎందుకు పోయాడో...ఆ చెట్టుక్రిందున్న వాళ్ళని శాశ్వతంగా దారిద్ర్యంలోవుంచే శుద్ధ సత్యానికి ముప్పైఅయిదేళ్ళ యువకుడి వేడినెత్తురు బలిధారలు !

## 3

భార్య యిప్పుడు బాగా ముసలిదైపోయింది. పురుట్లో సూతిక జ్వరం రావడంచేతా, తరవాత తరవాత మనోవ్యాధితోనూ బాగా క్షీణించిపోయి, పిల్లకి మూడోఏడు వచ్చేసరికి తల్లికి పక్షవాతం వచ్చింది. దాంతోటి మూతి ఎడంవేపుకి బాగా వంకర తిరిగిపోయింది. ఎడంకాలు అసలు భూమిపైన అననేఅనదు. ఎడంచేయి అఖరికి పైట సవరించు కోడానిక్కూడా పనికిరానంతగా పడిపోయింది. ఓ కన్ను కూడా కిందికి వాలిపోవటం మూలాన చూసేవాళ్ళకి మహావికృతంగా కని

పిస్తుంది. నోట్లో పైవరసనో పన్నూ, కిందివరసను రెండు పళ్ళూ మాత్రం ఉన్నాయి. తలంతా నెరిసి పోయినట్టే. పైట వేసుకుంటే మొలకి చుట్టుకుంటానికి సరిపోదు గనకనూ, ముసలిదీ, అందులో ఒళ్ళంతా ఎండిపోయింది కనకనూ మొలకి మాత్రమే ఓ గుడ్డచుట్టి వుంటుంది. యాభై ఏళ్ళకంటే ఎక్కువ వుండకపోయినా యీ మాయదారి రోగంవల్ల ఎనభై, ఎనభై అయిదేళ్ళదల్లే కనిపిస్తుంది. ఆ వెదురుకర్ర ఎంతబలం కలదైనా ముసిల్దాని చేతిలోనే ఎంతకాలంనుంచో అణిగి వుంది.

కూతురు కిప్పుడిరవై ఏళ్ళుంటాయి. పుట్టినప్పుడు పచ్చగానే వుండేదట. రానురాను చామన చాయైంది. ఇప్పుడు నల్లగా వుంటుందనే చెప్పాలి. కొంచెం పెద్దకళ్లు. ముక్కుదూలం అట్టే నిడివిగా వుండదు గాని, చివరమాత్రం కాస్త కొస తేలివుంటుంది. గడ్డంమధ్య చిన్న సొట్ట. వసివాడిన ముదురు తమల పాకులల్లే చెంపలు అదోమోస్తరుగా వుంటాయి. చిన్నప్పుడే పొడిపించిన పచ్చ మడ్డిపట్టిన మొహంమీద బాగా కనిపించదు. జుట్టు ముడేసినప్పటికీ కొన్ని వెంట్రుకలురేగి, గుబురుగా చెవుల్ని కప్పేస్తూ వుంటాయి. తల్లిమాదిరిగానే మోకాళ్ళ వరకూ వచ్చేది మొలకోగుడ్డ చుట్టుకుంటుంది. ముసలితనం రాలేదు గనక, ఒళ్ళు దాచుకునేందుకు ఇంకో గుడ్డపేలిక లాంటిది మొలలోంచి దోపి, గుండెల మీదుగా, ఎడమ భుజంనుంచీ మెడచుట్టూ త్రిప్పి మెళ్ళోవున్న గోగునార తాడుకి ముడేసుకుంటుంది. చేతులకి రంగు తాళ్లు గాజులుమాదిరిగా చుట్టుకుంటుంది. కుడిచేతిలో కుండపెంకు పట్టుకుని, ఎడంచెయ్యి అమ్మభుజంపైన వేసి తన ఉరోభాగాన్ని అమ్మ శరీరానికి చాటుచేసుకొని నెమ్మదిగా యింటింటికీ అడుక్కుంటూ వెడుతుంది... కాలూ చెయ్యీ ఉన్ననాటి తల్లిగుర్తు ఆ అమ్మాయికి లేనే లేదు. తల్లంటే మహాప్రేమ కూతురికి. అమ్మ గనకనే కాకుండా

అవిటిదనీ, తనుతప్ప వేరేదిక్కు లేదనీని. ముష్టిగింజల్తో ఎలాగో ప్రాణం నిలుపుకుంటున్నా గుడ్డకిమాత్రం మహా యిబ్బందిగా వుండేది. అందులో చలికాలంలో మరీని. పగలు అడుక్కున్న బియ్యపుగింజలు శవాల్ని కాల్చగా మిగిలిపడున్న కట్టెలతోనో, పిడకల్తోనో ఓ బొచ్చెలో కాస్త ఉడకేసుకు తింటారు రాత్రిళ్లు. ఎత్తుకున్న మధూకరపు మెతుకులు, చెరోరెండూ నోట్లోవేసుకుని, యిన్ని నీళ్ళుత్రాగి, మఱ్ఱిచెట్టుకి తూర్పు వేపునవున్న ఆ రెండున్నర గజాల మెరకమీదా అమ్మని కావలించుకొని తన పమిటగుడ్డ తీసేసి. చాలీ చాలకుండానే, యిద్దరికీ కలిసి కప్పుకునీ, ఆమెగుండెల్లోకి తలదూర్చి పడుకుంటుంది కూతురు...

అప్పుడప్పుడు ముసిల్ది చెబుతూవుంటుంది తన చిన్నప్పటిగాధ. వాళ్లమ్మ పుట్టినది అక్కడేనట. ఓ రోజు, చెట్టు నరుకుతుండగా పిడుగుపడి అకస్మాత్తుగా నడి వయస్సులోనే చచ్చిపోయాడట మొగుడు. పిల్లలు లేకపోవటం మూలాన, ఏ నాలుగిళ్ళదుక్కున్నా. లేకపోతే ఏ కోతగింజలు దాచుకున్నా ఓ మోస్తరుగా వెళ్లిపోతుంది. ఓ రోజు తూర్పార పొయ్యటానికి ధాన్యం అందిచ్చి, పొద్దూకు వేళకి, చెంగు మాయడంచేత, కాస్తా ఆలస్యంగా చెట్టుక్రింది కొస్తుంటే, దార్లో పొలం ఖామందు, ఆటకాయించి బలవంత పెట్టాడుట. కాళ్ళా వేళ్లాపడి ఎంత బతిమాలుకున్నా, భయపెట్టినా, ఏం లెక్కచెయ్యకుండా, మరీ పశువల్లే, మీద పడబోతుంటే 'చెంగు మాసిందన్నా... నీళ్లరోజు వాస్తా...' నందిట తప్పించు కుంటానికని. ఆయనా కాస్తా ఆలోచించి... 'నిజమేనా?... సరే, నీమాట నమ్ముతున్నా. మీ వాళ్ళల్లో అబద్ధ మాడటం యింతవరకూలేదు.' అని విడిచిపెట్టాడు. నాలుగోరోజు సాయంత్రానికి, రానిలో బెడ్డ ఏరాలని ప్రత్యేకం పనిపెట్టి పిలిపించాడు. నిజమేననుకుని వెళ్లింది. తీరాచూస్తే పొలంమీద రా సేలేదు. బిక్కుబిక్కుమంటూ వెనక్కు తిరిగేసరికి, మీసాలు దువ్వుకుంటూ, వామి పక్కనుంచి,

పొలంఖామందు... ''నేనుకూడా ఏరుకుందామని ఒచ్చా...'' నంటూ నవ్వుతూ అమాంతం కుడిచెయ్యి పట్టుకున్నాడు. గుండె గుభేలుమంది పాపం. చెయ్యి విదిలించుకుని పరిగెత్తి, కళ్ళం వెనక్కి తప్పుకుంది. చెంగున దూకాడు మీదికి. 'నీళ్ళనాడొస్తానని నువ్వే చెప్పావుగా మరి ?...' అంటూను. అరవటానికన్నా వీల్లేకుండా నోట్లో గుడ్డలు కుక్కేశాడు. చేతులూ కాళ్ళూ విదిలించి కొట్టింది. ఏంచేస్తే ఏంలాభం? ఏనుగంత మగమనిషితో, పిట్టలాంటి ఆడది ఎంతసేపని పోట్లాడ గలదు ? అలసిపోయి మొహం తేలవేసింది. తన మానరక్షణ కేమీ అవకాశం లేదు. ఒక్కక్షణం ఆలోచించి, నోట్లో గుడ్డలు తీసెయ్యమని సంజ్ఞచేసింది. 'అల్లారా... దార్లోకి...' అంటూ తీసేశాడు. లేచి అతని చెయ్యిపట్టుకుని గోడ్డసావిట్లోకి తీసుకు పోయింది. అతనికీ ఆశ్చర్యంగానేవుంది. అప్పుడే ఒస్తున్న వెన్నెట్లో పాక వెనకపక్క ఆరుబయట కొత్త నులకమంచం వుంది......! ఇది వరకెప్పుడూ అబద్ధ మాడలేదు ఆమె. ఇప్పుడూ ఆడనట్టే! అదే తృప్తి...

మొదట్లో ఒకటిరెండు నెలలు, మానెడూ, అడ్డెడూ గింజలు కొలుస్తూ వుండేవాడు. తరవాత తరవాత అసలు మొహం చూపటమే మానేశాడు... కార్తీకమాసంలో పురుడొచ్చింది... జోరున వాన కురుస్తుండగా పిల్ల బైటపడటం, తల్లి పరమపదించడం ఒక్కమాటే జరిగి పోయాయట....

ఈ కథ చెబుతుంటే చెవులు దోరబెట్టుకుని వింటూ, తల్లి చెబు తున్న గుర్తులతో అమ్మమ్మ రూపాన్ని తన మనస్సులో చిత్రించు కుంటానికి ప్రయత్నిస్తూ, ఏవో దీర్ఘాలోచనల్లో మునిగి మునిగి, ఆఖరికి నిద్రపోయేది, చెమర్చిన కళ్ళు తుడుచుకుని ఆ అమ్మాయి.... అమ్మమ్మ ప్రాణం పోసుకుని అమ్మ పుట్టింది... తనో ?....

''నాన్నేడే ?'' అని తన చిన్నతనంలో, మాటలొచ్చీ రానప్పుడు అడిగితే ''సముద్రం దాటి వెళ్ళాదనీ, తరవాత ఒస్తా''దనీ చెప్పేది తల్లి. రానురాను పిల్లకికూడా తెలిసింది పెద్ద రైతు పొలానికి కాపలా పెట్టడం, రెండు మరకాల గింజలు చెప్పకుండా తీసుకురావటం, రెక్కలు విరిచి స్తంభానికి కట్టి కొట్టించడం, పురుగు ముట్టడంచేత చచ్చాడని అందరూ అనడం అదీని.... ఇప్పుడా రైతు పెద్ద షావుకారై పోయాడు. మొన్నీమధ్యే రెండు బియ్యపు మరలుకూడా కట్టించాడాయన పెద్ద కొడుకు. ముష్టికెళ్ళేటప్పుడు వాళ్ళింటిదగ్గి రాగేదికాదు ముసిల్ది. మొదట్లో కూతురికి తెలిసిందికాదు కారణం. ''వాళ్ల వెయ్యరమ్మా'' అంటూ వుండేది తల్లినడిగితే. విషయం తెలిసిన తర్వాత తనే ఆగేది కాదు. ఏదో పిచ్చిగాని యీ ముష్టిముండలా యింట్లో ముష్టి తీసుకోక పోతే వాళ్లకొచ్చిన నష్టమేమిటి ?....



పుష్యమాసం ఊహూ చలిగాలి వేస్తోంది విశ్వమంతా గడ్డ కట్టుకు పోతుందా అనిపించేట్టు. సూర్యుడుకూడా బిగుసుకు పోతు న్నాడు చలికి. పొద్దున్నే ఆరుగంటలకి నిద్రలేచిందా అమ్మాయి. చలి చేత ఒళ్ళు పగిలిపోతున్నా ఎలాగో చేతులూ, జుట్టూ కప్పుకుని, తల్లికి కాస్తా వెచ్చగా వుండాలని తన పైట గుడ్డకప్పి, కాలకృత్యాలు తీర్చు కుంటానికి వెళ్ళింది. తిరిగి ఒచ్చి "ఎండపొడలో పడుకుందుగానీ లే అమ్మా'' అంటూ తట్టిలేపింది తల్లిని, మొహంమీద గుడ్డ తప్పిస్తూను. ఒళ్ళు మంచుగడ్డల్లే తగిలింది చేతికి... 'నాయనోయి' అని పెద్ద కేకేసి తల్లిమీద పడిపోయింది... చెట్టుకింది వాళ్లంతా చుట్టూ జేరారు... ఏముందీ ?... అక్కడేగా శ్మశానం !

## ౨౪

సూదంటురాయి యినుమును ఆకర్షించకుండా వుండలేదు. మానవ హృదయం ప్రేమించకుండా వుండలేదు. తాను ఓ వస్తువును, ప్రేమించి, తన దానినిగా చేసుకుని తన్ను దాంట్లో ఐక్యంచేసి దివ్యానందాన్ని పొందడానికి ప్రయత్నిస్తుంది. ఇనుము ఎదట వున్నప్పుడే ఆకర్షిస్తుంది సూదంటురాయి. ప్రాణశక్తివున్న మానవ హృదయం తాను ప్రేమించదగిన వస్తువుకోసం ప్రపంచమంతా గాలిస్తుంది. ఆ వస్తువు లభించేదాకా శాంతి వుండదు. లభించిన ఆ వస్తువు నశించిపోతే తానుకూడా నశించటం కద్దు. ఒక్కొక్కప్పు దలా చచ్చిపోలేకపోతే ఆ స్థానం ఆక్రమించగల మరో వస్తువుకోసం వెతుక్కుంటుంది. ఆ వస్తువు చైతన్య రహితమైనదిగూడా గావచ్చు. కొన్ని సందర్భాల్లో ఓ ఆదర్శాన్ని నిర్మించుకుని, దానికి సంపూర్ణంగా అధీనమౌతుంది మానవ హృదయం. భగవద్భక్తికూడా అలాంటిదే... మాతాసుత ప్రేమలోనూ, భార్యా భర్తృ ప్రేమలోనూ, భక్తి ఆత్మ సమర్పణ సిద్ధాంతాల్లోనూ ఈ తత్వమే అంతర్వాహినిగా పరిగెడుతూ వుంటుంది. తెలిసినా, తెలీకపోయినా ప్రతి మానవ హృదయం చేసేపనీ యిదే.

ఆ అమ్మాయికూడా హృదయం వుంది. అది ప్రేమించగలదు. ప్రేమించి తీరాలి. ప్రేమించింది అవిటి తల్లిని, ఏ కూతురూ ఏ తల్లినీ ప్రేమించనంత గాఢంగా. అమ్మ ప్రీతిలత కూతురి ప్రేమనల్లికతో పెనవేసుకుని, ముడివడి, ఏకత్వాన్నిపొంది అమర సుఖాన్ని కలిగించింది. ఆ అనుభూతిలో చిరిగిపోయిన తన గుడ్డపేలికలుగానీ, ఎండిపోయిన ఎముకల రోదనగాని, ఆరిపోయిన గుండెల అర్పులుగానీ, అరుస్తున్న పేగుల మోతలుగానీ కనిపించలేదు. వినిపించలేదు. ఇప్పుడా దివ్య గ్రంథిలోని ఒక తీగె ఎండి రాలిపోయింది. రెండవదాని కిహ

స్థావరం ఎక్కడ ? కానీ ఆమె అధీర హృదయ కాదు. రాలిపోయిన ప్రీతిలత ఆమె ప్రాణాన్ని బలితీసుకోలేదు. ప్రేమానుభూతిలోంచి దొర్లిపోయిన ఆ యువతిని చింకిపేలికలు, ఆకలిమంట నాలికలై ఎండు టెముకల్ని కాల్చెయ్యటం మొదలుపెట్టాయి. చక్కబరచబడిన ఆర్థికస్థితి ఆమె హృదయ వేదనకి జవాబు కాకపోవచ్చు. కాని సాధన మాత్రం కాకపోదు... అందుకైనా అవకాశం ఏదీ ? ఊరుబైట శ్మశానం దగ్గిర, క్రొందగబ్బిలాలుండే మఱ్ఱిచెట్టుకింద తూర్పుభాగపు మెరకమీద 'నా' అనేవాళ్లులేని ఓ పక్షిలాంటి బీదమనిషి, తన ప్రేమ నిధానమైన తల్లి మరణిస్తే, హృదయ వేదనతో పిచ్చెక్కి కృశించి పోతోందనీ, దాన్ని ఉద్ధరించమనీ పరుగెత్తుకుపోతున్న ఈ ప్రపంచానికి చెప్పేదెవరు ? ఓ వేళ చెప్పేవారున్నా వినిపించుకునే దెవరు ? కాని తను ప్రేమించ దగినదై, తన్ను ప్రేమించే వస్తువు దొరికితే ?... అచేతనమైన వస్తువునిగాని, ఆదర్శాన్నిగాని ప్రేమించటము ఆమెకి తెలీదు. ఆమె జ్ఞానీ కాదు, చదువుకోనూలేదు. ఇహ దేన్ని ప్రేమించాలి ? ఏమో, ఆమెకే తెలీదు. దుర్భరమైన వ్యథగా ఉంది. లక్ష్యరహితమైన, ఆమె ప్రేమ హృదయాన్ని రూపంలేని నగ్న విచారాలు కోసేస్తున్నాయి.

౬

పుచ్చపువ్వులాంటి విదియ వెన్నెల ఎముకల చూర్ణం ఆరబోసి నట్టుగా వుంది. చేలు ఈనే రోజులవి. వాగుమీది తరంగాల్లో వెన్నెలలు ప్రతిఫలిస్తూ పొర్లిపోతున్నాయి. గట్టుపక్కని చేలల్లోంచి పచ్చిక వాసనలు చంద్ర కిరణాల్లో తేలుతూ, వాగులోని వెండి తరంగాలమీదుగా అవతలిగట్టు దాటి ఊళ్ళో కెడుతున్నాయి. మబ్బుతునకలు నల్ల ముసుగుల్తో కప్పేస్తే, అంచుల్లోంచి తొంగి చూస్తూ, ముసుగులు తీసేసి నప్పుడు కిలకిలా నవ్వుతూ, యవ్వన మదంతో తలలూగిస్తున్న చేలకి

చక్కలిగింతలు పెడుతూ ఆడుకుంటున్నాడు చంద్రుడు. ఎదుటవున్న ఊరు, కృత్రిమదీపాల మూలాన అసలు కనిపించటమే లేదు. కాస్తా దూరంగా అవతలి ఒడ్డునవున్న ఆ మఱ్ఱిచెట్టు వెన్నెల వెలుగుల్లో విస్పష్టంగా కనిపిస్తున్నా, ఊడల నీడల్లో మనుష్యులు మాత్రం కనపడీ, కనపడకుండా వున్నారు.

వాగులో మొహం కడుక్కొని పైటచెంగుతో తుడుచు కుంటూనే నడుస్తోంది గట్టంబడే ఆ అమ్మాయి. ఏమిటో అనేక భావాలు! మనస్సుమాత్రం నిశ్చలంగా లేదు. ఓనాడు ఒక పాపాయిని ముద్దెట్టు కుంటుంటే పనికుదురుకున్న యింటావిడ చటుక్కునవచ్చి "అల్లా నలిపేస్తావేమిటే పిల్లాడిని?" అంటూ పిల్లాడిని లాక్కుపోడం తను గుడ్లనీళ్ళు గుడ్లకుక్కుకుని "నాకుమాత్రం తెలీదుటండీ" అనడం, ఆ అమ్మాయి కళ్లళ్ళో మెదుల్తున్నాయి. తనది కానప్పుడు ఒచ్చే చిక్కే అది... చంద్రుడికేసి చూస్తూ యిందాకటినుంచీ తుడుచు కుంటూనే వుంది మొహం పరధ్యానంగా. మరీ తుంటరిగా, పమిట తొలగిన ఆమె వక్షంలోకి తొంగి తొంగి చూస్తున్నాడు చంద్రుడు మబ్బుతెరల్ని చాటుచేసుకుని. వాగుమీదినుంచి ఒచ్చే లేతగాలి సందులుచేసి చంద్రుడికి తోడ్పడుతుంది. సౌందర్యం చాటున తెలీకుండానే హత్యలు జరుగు తుంటాయి... చంద్రుడి పక్కనుంచే ప్రేతకళతో దిగిపోయిన నక్షత్రం వెన్నెల మూలాన ఆమెకు కనిపించనేలేదు.

ఎదురుగుండా ఒస్తున్న షాహుకారుగారి రెండో అబ్బాయి నామె అసలు చూడనేలేదు. అతనుమాత్రం దూరంనుంచే గమనించాడు ఎవరో వస్తున్నట్టు. వెన్నెల పరుగుల్లో విస్పష్టంగా కనిపిస్తున్న ఆమెతీరు, యవ్వనంలోవున్న అతణ్ణి మోహపెట్టింది. అతన్నేగాదు, ఉప్పుపులుసూ తింటున్న ఎవరినైనా మోహపెట్టేదే ఆ దృశ్యం. అకస్మాత్తుగా గజంన్నరదూరంలో పరాయిపడుచువాడిని ఎదురుగా చూసేసరికి

ఆ అమ్మాయి గుండెలు ఝల్లుమన్నాయి. చచ్చిపోయిన తల్లీ, తల్లి చెప్పే అమ్మమ్మకథా, అర్థంకాని ఆవేదన పొందుతూన్న తనహృదయం తాను పనిచేస్తున్నయింట్లో, ఆ పాపాయిని తను ముద్దెట్టుకుంటుంటే ఆవిడ కోప్పడటం, తన యవ్వనం, బీదరికం, వెన్నెలలో ప్రకృతిశోభ, రాత్రివేళ, ఎదుట దబ్బుగల అందమైన యువకుడూ, ఏకాంతం... ఏమిటో భావాలూ ఎన్నోదృశ్యాలూ, ఒక్కమాటుగా ఆ అమ్మాయి కళ్లనీ, హృదయాన్నీ ముంచెత్తి కలవర పరిచాయి. ఆ కలవర పాటుని ప్రతిఫలింప జేస్తున్న ఆమె నల్లకళ్ళు, అతణ్ణి మరీ ముగ్ధుణ్ని చేశాయి. తను ధనికుడూ, ఆమె బీదదీ. ఆమె నేంచేసినా సంఘం నోరుమూసు కునే కూర్చుంటుందని అతనికి బాగా తెలుసు. నిర్భయంగా మీది కొచ్చి, పమిటలేని ఆమెకుడి భుజంపైన చెయ్యివేశాడు... ఇంతవరకూ నెగళ్ళుగా మండుతున్న ఆమె హృదయ కుండంలో ఓ అమృతపు చుక్క వేసినట్టయింది... ఆమె ప్రతిఘటించలేదు... చిన్న వంతెన మీదుగా వాగుదాటారు. దక్షిణపువేపు చేలో పాతగడ్డివామి యింకా అయిపోలేదు. నీళ్ళుతాగిన పచ్చిక సువాసనలతో కలిసిపోయిన ఎండు గడ్డి గుమాయింపుల్లో ఎన్నిగంటలు గడిచి పోయాయో...

కావిలించుకుంటానని చెబుతూ, తన కాల హస్తాల్తో చంద్రుడి గొంతు ఓ మాటు నులిమేసి విడిచిపెట్టింది మేఘం.

౭

తరవాత ఊళ్ళో అతను రెండుసార్లు కనిపిస్తే, సిగ్గుచేత తలొంచుకు వెళ్ళిపోయింది. మూడోమాటు ఓ రోజు, మసిమసి చీకట్లో పని కెళ్లుతున్నప్పుడు, పెద్ద వీధి పక్కసందులో అతను కనిపించాడు ఒక్కడూను. ఇదివరకు పలకరించక పోయినందుకే అనుమాన పడు తున్న ఆ అమ్మాయి యిప్పుడన్నా మాట్లాడిస్తాడేమోనని కాస్తా నిమ్మ

దిగా అడుగులేసింది. దులపరించుకుని వెళ్ళిపోయాడతను. అవమానం భరించలేక, సిగ్గు మళ్ళించుకుని, రెండడుగులు వెనక్కి వేసి, ఆవేదనతో తడబడుతూ... 'దొరగారూ' అంది. అతను వెనక్కి తిరిగన్నా చూడలేదు...

౨

అక్కడ పనిమానుకున్న తర్వాత, వేరే దొరకలేదు. అదీగాక నెలలుకూడా వచ్చాయి. రెక్కలాడటం మానగానే డొక్కలు మాడటం మొదలెట్టాయి. పైగా అవమాన భారం. క్రమంగా నీరసించి క్షీణించి పోయింది. అందులోనూ వేసవికాలం మూలాన మరీ ఒచ్చింది. ముష్టి అడుక్కునే ఓపికకూడా సన్నగిలింది. ఓ పూట తినీ, ఓ పూట తిన కానూ, శారీరకంగా ఎంత కష్టపడుతున్నా, మానసిక క్షోభ మట్టుకూ లేదు. తాను చేసిన పనికి మొదట్లో చింతించింది, తన నిష్కలంక హృదయం ఓ మాటు, ఓ స్వార్థపరుడైన పాశవిక కాముకుడి కఠోర స్పర్శకి ఆకరం అయినందుకుగాను, కాని తాను శాశ్వతంగా ప్రేమించ దగిన వస్తువుని, తన వినిర్మల మానాన్ని బలిచ్చి నిర్మించుకో గలిగి నందుకు, ఆమె తన అమాయకత్వాన్నే మెచ్చుకుంటూ ఒచ్చింది తర వాత తరవాత. ఆ వస్తు సందర్శనంకోసం ఆమె మనస్సు తహతహ లాడిపోతోంది. ఈ తహతహలో ఆమె దారిద్ర్యం బాధించగలిగినంత ఎక్కువగా వేధించలేక పోయింది.

౩

జ్యేష్ఠమాసం సగం వెళ్ళిపోయింది. బహుళ పాడ్యమినాడు అరుణోదయం అవుతుండగా ఒచ్చింది పురుడు. మొగపిల్లాడు. దువ్వో న్నలూ, సబ్బులూ అమ్ముకునే ఓ ముసలమ్మ బొడ్డుకోసి వెళ్ళింది. రెండు రోజుల్నుంచీ పడిన మరణవేదన ఆమెకేమీ లెక్క అనిపించడం

లేదు. తన ప్రేమ నిధానాన్ని చూసుకుని స్వర్గసుఖం అనుభవించింది. నీరసించిన గుండెల్లో తన ఆశాజ్యోతిని అదుముకుని... నా... నాన్న... అని ఎండు పెదవుల్లో గొణుక్కుంటూ, పొంగులుపోయే తీపి చూపుల్తో పిల్లాడిని ఒక్కమాటు ముంచేసి, తల నిమురుతూ, బల హీనంచేత కళ్ళు మూసుకుంది... పాలివ్వడానికి పిల్లాడిని యింకా దగ్గరికి తీసుకుని, తాగడం వాడికి చేతగాకపోతే, తనే రెండు చుక్కలు పిండింది నోట్లోకి. ఏమిటో ధన్యత ! ఎంతో ఆనందం !! అమ్మ ఉన్నప్పుడు, అమ్మా తనూ ఒకళ్ళ నొకళ్లు కావిలించుకుని అమ్మమ్మ కథ చెప్పుకుంటూ పడుకునే నాటి దివ్యానందానుభూతి మళ్ళా జ్ఞప్తికి వచ్చింది.



ఉదయంపూటే వెచ్చదనం కనిపించింది గాలిలో. పొద్దెక్కిన కొద్దీ గాలిలో వుండే నీళ్లు బీదవాడి ఒంట్లో నెత్తురు మాదిరిగా ఇగిరి పోవటం మొదలెట్టింది. పదకొండుగంటలు దాటిపోయింది. వడగాడ్పు ఝుమాయించి కొడుతోంది. మూడోరోజు పురుడొచ్చి. బాలింతరాలి గొంతులో యిన్ని పచ్చి మంచినీళ్లు పోసిన పాపానన్నా పోలేదెవరూను. పాపం, ఆ ముసలమ్మ పుణ్యమా అంటూ బొడ్డుకోసి వెళ్ళింది. తప్పితే ఏం చెయ్యగలదు ? తనకుంటేగదా యితరులమాట చూచేది ? ఆకలి నకనక లాడిపోతోంది బాలింతరాలికి. పిల్లాడిపని మరీ యిదిగావుంది. మొదటి రెండు రోజులు నాలుగు పాలచుక్కలతో వెళ్ళమారిపోయింది. కాని యివాళ ఆ చుక్కలుకూడా లేవు తల్లిదగ్గిర. ఊహూ కక్కటిల్లి పోతున్నాడు. శోష ఒస్తుందేమోనని భయంగా వుంది. కాస్త అలవా టవటంచేత తల్లి ఎదుర్రొమ్ములో తన బుల్లి మూతితో వెతుక్కుని చన్ను కరిచాడు. కాని ఏం ప్రయోజనం ? ఏడ్చేడ్చి సొమ్మసిల్లి

పోయాడు. తల్లి గుండె చెరువై పోయింది. ఆదుర్దాగాలేచి, పిల్లాడిని ఒళ్ళో తీసుకుని, వాడినోట్లో ఎడం రొమ్ము పెట్టి నొక్కింది దారుణమైన బాధ సహిస్తూ. ఆమె ప్రాణా లవిసిపోయాయి. ఇంకో నొక్కు... చనుమొనను నెత్తురు చిమ్మింది... తన బాధకేంగాని పిల్లాడింకా సొమ్మ సిలే పడివున్నాడు. శరీరపు మూలలో ఎక్కడోవున్న కాస్త ప్రాణాన్ని కూడదీస్కుకు చిక్కబట్టుకుని పక్కకెళ్ళి అప్పుడే ముష్టెత్తుకుని తిరిగి ఒచ్చిన ఓ గుడ్డివాడి బొచ్చెలోనుంచి రెండు చద్దిమెతుకులు అడిగి తెచ్చి యిన్ని నీళ్ళల్లో పిసికి, పిండి, పిల్లాడినోట్లో పోసింది. వాడుకాస్త యిటు కదిలేసరికి ఆమె ప్రాణాలు లేచొచ్చాయి. 'నా తండ్రే' అంటూ ఒక్కమాటు గుండె కదుముకుని పడుకోబెట్టింది.

రెండు ఝాములు తిరిగింది. ఇనపసూదులు కాల్చి గుచ్చుతున్న ట్టుగా వున్నాయి సూర్యకిరణాలు. కనకనలాడే నిప్పుబొగ్గులు నోట్లో పోసుకుని యముడు ఊదుతున్నాడా అనిపిస్తోంది వడగాడ్పు. మచ్చుకైనాలేవు అకాశాన, ఆఖరికి తెల్లమబ్బు ముక్కలైనా. నీలాంబరంలో కాలపాశపు చుట్టల్లే కూచుని చూస్తున్నాడు సూర్యుడు, తనప్రతాపానికి ప్రపంచం ఏమంటోందోఅని. రెండయ్యేసరికి చెట్లాకులన్నీ మలమలా మాడిపోయాయి. లేతరెమ్మలు కాలి పోయినట్టుగా నల్లబడ్డాయి కూడాను. చెట్లమీదనుంచీ ఉడతపిల్లలు చచ్చి ఠపీమని వెల్లగిత్తులుగా కింద పడిపో తున్నాయి. కొమ్మల సందుల్లో యిరుక్కున్న పక్షుల శవాలకి అంతే లేదు...

పిల్లాడు మళ్ళా ఏడుపుసాగించాడు. తన ప్రాణంకూడా యిటా అటా అన్నట్టుగా వుంది. ఏంచెయ్యటానికీ తోచక గాభరాగా వాడిని ఒళ్ళో వేసుకుని చరచరా బయలుదేరింది ఫ్రాళ్ళోకి, మళ్ళీ శోషరాక ముందు రెండు మెతుకు లెక్కడన్నా అడుక్కొచ్చి నీళ్లల్లో పిండిపోద్దా మని. కాల్చిన యినపపోడి మాదిరి భగభగమంటున్న ఆ గంధ్రయిసుక

లోంచి వెళ్ళి వాగుదాటి వూరు మొగదలలోకి ఒచ్చింది... ఎదురుగానే నాలికవెళ్ల బెట్టుకుని మూతినేలకి కొట్టుకుని చచ్చిపడుంది ఓ తెల్ల కుక్కపిల్ల వీధిమధ్యగా. బాలింతరాలి గుండెలు గుభేలుమన్నాయి. మాటిమాటికీ పిల్లాడిని స్పృశించి చూస్తూ బాగా గుడ్డకప్పేసి తనపైకి పమిటెగూడా లేకుండా, పిచ్చెక్కిన దాని మోస్తరుగా అంగలు జాస్తూ ఒక్కయింటి తలుపన్నా తీసి వుంటుందేమోనని బహు ఆత్రంగా వీధికి రెండువేపులా పరిశీలిస్తూ తొందరపాటుతో పదిగజాలు నడిచింది. ఓ యింట్లోంచి యింకోయింట్లో కెడదామని ప్రహరీగోడ తూంములో నుంచీ బయటి కొచ్చిన ఓ మచ్చలపిల్లి రోడ్డు అవతలి కెళ్లకముందే గిర్రునతిరిగి పడిపోయి నెత్తురు కక్కుకుంది.

బాలింతరాలి కళ్ళు చీకట్లు కమ్మాయి, అంతవెలుగున్నా. కన్నీళ్ళు కార్చటానిక్కూడా శక్తిలేదు. మృత్యు ముఖంలో బిగుసుక పోయిన ఆ జీవాలకి అదృష్టవశాత్తూ ఒక్క ఆధారం దొరికింది. కుడి వేపు వరసలో మాత్రం ఓ యింటితలుపు ఓరవాకిలిగా వేసివుంది. మొహం యింతచేసుకుని, ఆ అమ్మాయి ఆ ఇంటి ముందుకెళ్లి ఎండిన నాలుకతో ఆరిపోయిన పెదిమెల్ని తడుపుకుంటానికి ప్రయత్నంచేస్తూ, ఒణికిపోతున్న బలహీన స్వరంలో "బాలింతరాల్ని తల్లీ. ఒక్కమెతుకే యించు మా అమ్మా !'' అని కేకేసింది. నాలుగేళ్ళ పిల్లాడూ, ఆరేళ్ల పిల్లా ఆ యింటి సావిట్లో ఆడుకుంటున్న వాళ్ళల్లే ఈ కేకవిని, గుమ్మం దగ్గరికొచ్చి, తలుపు యింకాకాస్త తెరిచి కమ్ములు పట్టుకునే నుంచుని "పాపాయేడీ! చూపించు" అన్నారు. "చూపిస్తాతల్లీ— యింత ముద్దెయ్యమని అమ్మగారితో చెప్పమ్మా ! పాలులేకచచ్చి—'' ఆ మాటన ''పాలులేవు నాయనా, మూడు రోజుల్నుంచీ'' అంది బాలింతరాలు త్రంగా.

''బాతేమరి అన్నం ఎందుకూ?" అందాపిల్ల.

''చూడు... చూడు... మరినీ... చెవుల్లో దూదిలేకేం!
మా బుల్లక్కయ్యే కూడా పెట్టుకుంది పాపాయి పుట్టినప్పుడు'' అన్నాడు
అబ్బాయి.

''...ఛీ ! ముష్టి వాళ్లెక్కడన్నా చెవుల్లో దూదిపెట్టుకుంటా
రట్రా ?'' అందాపిల్ల. చిన్నప్పుడే తెలుస్తుంది కామాలు వాళ్ళకి, ముష్టి
వాళ్ళు మనుష్యులు కారని. మళ్ళా ఆ పిల్లకే సందేహం ఒచ్చి ''ఔతే,
మరి నడికట్టేసు కోలేదేం ?'' అని ప్రశ్నించింది.

ఈ ప్రశ్నలకి సమాధానం చెప్పే మనస్తిమితం ఎక్కడిది
బాలింతరాలికి ?

''గుడ్డలేదమ్మా'' అని ఏదో సమాధానం చెప్పుతూ ఎక్కడో
వున్న కాస్త ప్రాణాన్ని చెదిరిపోకుండా మళ్ళా కూడదీసుకుని, లోపలి
వాళ్ళకి వినబడేటట్టు, కొంచెం బిగ్గరగా ''బాలింతరాల్ని తల్లీ! ఒక్క
చద్ది ముద్దేయించమ్మా...'' అంది గొంతుకకోసిన నల్లమేక చివరి
అరుపు మాదిరిగా. ఈ అరపుకి, లోపలున్న యిల్లాలు చర్రునలేచి
సావిట్లోకొచ్చి చూచేసరికి, ఆ పిల్లలిద్దరూ బాలింతరాలితో రాచు
కుంటున్నంత దగ్గిరగా మాట్లాడటం కనిపించింది. మొగపిల్లాడు
అరుగు చివరనా నుంచుని బాలింతరాలి ఒళ్లోకి తొంగిచూస్తూ...
"అదిగోనేవ్ అక్కయ్యోయి ! పాపాయిచెయ్యి... ఎంత బుల్లిదోచూడు,
చూడు... పిలుస్తున్నాదే నిన్ను... రమ్మని'' అంటున్నాడు. తమ్ము
డున్న స్థానంలో నుంచుంటేగాని పాపాయి కనపడదు గనుక "నువ్వో
కొంచెం వెనక్కిరారా... నేను చూస్తాను'' అని తమ్ముడితో అంటోంది
చెయ్యిలాగుతూను ఆడపిల్ల. ఆ చల్లని తల్లి పిల్లల్నిద్దర్నీ చెరోచరపు
చరిచి ''ఛీ... భరవాముండా! పురిటి లంజవి నా వాకిట్లో కొచ్చావా ?
ఫో ! నిక్షేపంలాగా ఆడుకుంటున్న పిల్లల్ని ఎండలోకి రప్పించావ్ !''
అని పిల్లలవేపు తిరిగి "అమ్మో ! అమ్మో ! ఎంతఎండ ! ఎంతఎండ !

సావిడి తలుపు తీశారుటే? పోంది లోపలికి'' అంటూ వాళ్ళని లోపలి కీడ్చుకెళ్ళింది. భగ్న హృదయంతో ''తల్లీ, నీ పాదాలకి మొక్కుతా నాయమ్మా... నీకడుపు చల్లగా, పిల్లలగన్న మాతల్లీ! మూడు రోజుల్నించీ తిండిలేదు... రెండు మెతుకు లేయించి ప్రాణాలు నిలుపు మా రాణీ... నీచెప్పులు మోస్తా... పిల్లాడి నాలిక పిడచగట్టి పోయింది, నా యమ్మా....'' అని చెయ్యి నేలకానించి, మొహాని కద్దుకుంటూ అడిగింది బాలింతరాలు.

''ఛీ, రంకుముండా! ఒళ్ళు మదించి, అడ్డమైన వాళ్ళతోనూ పోయి, పిల్లల్ని కని, ఊరుమీద పడతారు మహా శాత సొమ్మేమో దాచు కున్నట్టు. నీతా, జాతా? పో....'' అంటూ ఆ యిల్లాలు తలుపు తపీ మని వేసింది. ఇంటినిండా గంపెడు పిల్లలు. వేసీవెయ్యకుండా యింతవుందికూడాను. నలభై అయిదేళ్ళుంటాయి. పోయినవాళ్ళు పోను నలుగురాడపిల్లలూ ఆరుగురు మొగపిల్లలూనూ. కడసారివాడికి మొన్ననే మూడో ఏడొచ్చింది . ...

తపీమని వేసిన తలుపు వడగాలి విసురుకి, మళ్ళీ వెనక్కి తన్నడం మూలాన, పాపం ఆ యిల్లాలి మొహానికి తగిలి కాస్త బొప్పి కట్టింది. దాంతోటి ఆవిడ మహాంకాళి అయిపోయింది. ఆ గాద్పుకి బాలింతరాలి ఒళ్ళోవున్న పసివాడు కెవ్వున కేకేశాడు. గాలి గూబ లోంచి, రాల్చిన బాణంమాదిరిగా దూసుకుపోవటంచేత, బాలింతరాలు తూలిపోయింది. కాని ఎలాగో అరుగు మొత్తపట్టుకుని, నిలద్రొక్కు కుంది, అరచిన పసివాడు, మళ్ళీ కదలకపోయేసరికి తల్లి ప్రాణా లెగిరి పోయాయి. ''కాసిని మంచినీళ్ళన్నా పోయించు తల్లీ! పిల్లాడు...కదలటం లేదమ్మో...'' అని బావురుమంది పాపం!

''నీ మొహం మండ! ఏమివగలే? పొద్దున్నే ఎవరి మొహం చూశానో గాని, మొహమంతా బొప్పికట్టింది— నీ మూలాన. నీ

పిల్లాడూః నువ్వూ పెద్ద గంగలోపడి అణగారిపోనూ! చావండి, నాశనంకండి ఎండలోపడి...'' అని, తలుపు జాగ్రత్తగానొక్కి, మళ్ళీ వెనక్కి రాకుండా గడియవేసింది. కిటికీల్లోంచి అక్కా తమ్ముడూ పాపాయికోసం యింకా చూస్తానే వున్నారు.

ఎండించి, కాల్చి, మాడ్చేసి, చిత్రవధ చెయ్యటం జరుగుతూం టుంది: సంఘంలో, ఓ వ్యక్తిని సంఘమంతాకలిసో, ఓ వ్యక్తి సంఘాన్నంతానో, లేకపోతే ఓ తెగ యింకో తెగనో, కృశించి కాలి పోయే గుండెల పొగలూ, నీరసించి ఎగిరిపోయే ప్రాణాల అరుపులూ ఏమి ఆనందాన్నిస్తాయో ఆ వ్యవస్థకి!

మళ్ళా అల్లాంటిదే యింకో గాడ్పు...ఒళ్లోఉన్న పసిపాప, చిట్టచివరి మాటుగా యింకో ప్రళయనాదం పలికించాడు...దానికూడా జవాబులేదు. చెవిటి సంఘంయొక్క రాతిగుండెల్లో చొరబడే శక్తి ఆ ఆర్తనాదానికి లేదు...మరుక్షణంలో ఒళ్లోఉన్న బిడ్డ మంచుగడ్డయి పోయాడు. అప్పటికే మహాప్రస్థాన సన్నాహంలోవున్న బాలింతరాలు ప్రాణాలు ఆ చల్లదనాన్ని మాత్రం గ్రహించగలిగాయి. "నాయ నోయి''...అన్న ఆమె అంతిమ నాదం వీధంతా ప్రతిధ్వనించింది. సుడి తిరిగి గిర్రున పడిపోయిన ఆమె శిరస్సు వీధి అంచున కంకర ముక్కలమీద అనింది. ఒళ్ళోఉన్న పిల్లాడి తలా, ఓ చెయ్యీ మాత్రం దుమ్ములో దొర్లుతున్నాయి. మిగతా శరీర భాగం యింకా తల్లి ఒళ్ళోనే వుంది......

ఆయింటి రెండో అంతస్తులో అప్పుడే భార్యయిచ్చిన చల్లటి పానీయాన్ని సేవిస్తున్న షాహుకారుగారి రెండో కొడుకు బాలింతరాలి ఘోషకి అదిరిపడిలేచి, వెండి చంబా చేతిలో పట్టుకునే, కిటికీ తెర ఒత్తిగించి క్రిందకి చూశాడు. భార్య కూడా... "ఏమిటా

అరుపు ?...'' అంటూ భర్తని అనుసరించింది. తలదిమ్ము కాస్తతిరిగి కళ్ళు తెరిచిన బాలింతరాలికి, కిటికీలోంచి చూస్తున్న భార్యాభర్తలు కనిపించారు. ఆమె కళ్ళల్లోంచి షాహుకారుగారి రెండో కొడుకు కళ్ళల్లోకి బలవత్తరమైన ఓ అదృశ్య ప్రవాహం పరిగెత్తింది. దాంట్లో సర్వసృష్టినీ భస్మీపటలంచేసే కాలాగ్నులున్నాయో ? ప్రేమాంబుధిలో ముంచిలేవనెత్తే పీయూషధారలున్నాయో ? కాని అతడు తన కళ్ళకి వెండిచెంచా అడ్డంపెట్టుకుని ప్రవాహాన్ని కట్టెయ్యడంమూలాన అది బాలింతరాలి కళ్ళల్లోనే యిగుచ్చుకుపోయింది. ఆమె నేత్రాలకి అమరాచ్ఛాదనం వేసిన వెండిచెంచాని భార్యకిస్తూ, చెమటలు పట్టిన దేహంతో నీళ్ళుకమ్మిన కళ్లల్లోంచి, కాకివాలిన పసిపిల్లాడి మొహంలోకి చూశాడు షాహుకారుగారి రెండో కొడుకు !

(జనవరి, 1940)

# 21. పొరబాటు - అన్నయ్యా!

—'వెంచాశా

౧

సూది కూడా మోపటానికి వీలులేని క్రిక్కిరిసి యున్న రైల్లో ఎక్కడంకన్న దిగడమే కష్టం అని చెప్పవచ్చు. దిగడంలో ఒక్కొక్కప్పుడు ప్రాణాలు కూడా పోతాయేమో అని అనిపిస్తుంది.

రైలు ఎక్కడికి తీసుకుపోతుందో కూడా తెలీని పరిస్థితుల్లో ఉన్నాం. రం——విడచి ఇప్పటికి రెండు రోజులైనా మేం ఏ వూరూ చేరుకోలేదు. రైల్లోనే వున్నాం. అదైనా మా దేశంలోనే రైల్లో పోతూన్నా 'గరగర' శబ్దం వినవస్తూనేవుంది. కండ్లు పొడుచుకుని చూస్తే నీలమేఘాలు తప్ప ఏవీ కన్పించటంలేదు. నిబ్బరంగా చంద్రుడు ఇవ్వాళ బయటకు రాగలడా అనిపిస్తుంది. రైలుకూడా బెదుర్తూనే వెళ్తున్నది. ఒక్కరూ మాట్లాడటంలేదు. కొంతసేపు అయిన తరువాత శబ్దం వినిపించటం తగ్గిపోయింది. మాకు వాన కురిసి వెలిసినట్లుగా వుంది. దాంతో రైలుకూడా నెమ్మదిగా వెళ్తోవెళ్తో చప్పున ఆగిపోయింది. ఒక్కొక్కరూ దిగడం మొదలుపెట్టారు. ఒక్కుమ్మడిగా తిరణాల ప్రజ అయిపోయినారు. మేం దిగినచోటు ప్లాట్ ఫారంలాగే కన్పించింది. కొంతదూరం పోయి చూస్తే నల్లగా త్రాచుపాములు మెలివేసుకున్నట్లుగా అక్షరాలు కన్పించాయి. దాని మీద ప్రో——అని వ్రాసివుంది. "అబ్బ ! మనం ఇప్పటికి నూటడెభ్బై

మెళ్ల ప్రయాణం చేశా మన్న మాట" అన్నారు ఎవరో మాలో. నూతి లోంచి మాట్లాడినట్లుగా వుంది అతని గొంతుక. రైలు ఎక్కినప్పటి నుంచి మానవుని స్వరం వింటం అదే మొదటి తడవు. రైలు చూస్తుండగానే వెనక్కు తిరిగి పోయింది. మేం అట్లాగే శిలల్లాగా నిల్చున్నాం. ఎవరో అన్నారు—ఆయనా అధికారిలాగే వున్నాడు. "ఇంకో రైలు వస్తుంది. ఇక్కణ్ణించి మరోచోటికి తీసుకుపోతుంది కొంచెం కాచుకూర్చోవాలి అది వచ్చేంతవరకు. ఇంతట్లో భోజనాలు చేసేవాళ్ల చెయ్యచ్చు. అక్కడే 'పైపు' లున్నాయి మంచినీటికి" అని.

మేం ఏం తెచ్చుకున్నామో ఏం తెచ్చుకోలేదో అప్పటికి చూసు కున్నాం. నా విషయం చూస్తే నడవటానికి కూడా చాలా బరువుగా వుంది. నా వీపుకు ఒక పెద్ద సంచీ వంటిది వుంది. దాంట్లో ఏమేమి ఉన్నాయో తెలియదుగాని చాలా బరువుగా వుంది, కుడి చేత్తో ఒక టిన్ పట్టుకున్నాను. నా వెనకాత్తే 'బాబా' వస్తున్నాడు. ఆయన దగ్గిరా ఏవేవో ఉన్నయి. మా 'అమ్మి' చేతుల్లో మటుకు ఏవీ లేవు. ఆమె ఎందుకో దిగులుపడ్తూ వస్తున్నది. "గోడా గేదే పోతేపోయింది. ప్రాణాలు దక్కించుకున్నాం. అంతే చాలు" అన్న సంతోషం, తృప్తి ఆమెలో వున్నాయనీ ఆమెముఖకవళికలను బట్టి అనలేం. అడుగులో అడుగు వేసుకుంటూ వస్తున్నది. మా బరువు లన్నీ దింపుకుని ఆకసం వంక చూస్తూ ఆ చెట్టుకింద కూచున్నాం తాపీగా. పొరలుపొరలుగా విడిపోతున్నయి మేఘాలు. 'బాబా' సంచీలోకి 'దాల్' వరగపోస్తూ అన్నాడు: "పోయి మూడు రాళ్లు తీసుకుర" మ్మని. నాకు రాళ్లు దొరకలేదు సరి కదా భయం కూడా వేసింది, అవతలకు వెళ్లటానికి. ఇనుప కమ్మీ లవతల అంత గాఢాంధకారంగా వుంది. "అక్కడ గుంటే వుందో మిట్టే వుందో ఎట్లా అక్కడికి వెళ్ళటం—" అప్రయ త్నంగానే అనేశా బయటకు. నా కెవరో తిరుగుజవా బిచ్చినట్లుగా

వుంది— ''మేం ఇప్పుడే చేలాంతరు వెలిగించి అక్కడకు వెళ్ళిచూసి వచ్చాం. దట్టంగా గుములుకుని చెట్లున్నాయి. అంతే, రాళ్ళుకూడా అక్కడక్కడ వున్నా'' యని. మనిషి కనపడకపోయినా గొంతును పట్టి ఆ మాట్లాడినది ఎవరో స్త్రీయే అని అనుకున్నా. ఆపళంగానే నాకు చాలా సిగ్గు వేసింది. నాకు మనస్సు నిలకడలేదు. తొందరపడి భయపడ్డానని నాలో నేను సమాధాన పరుచుకున్నాను.

'బాబా' ఇంత ఆలస్యంగా వచ్చావేమని కోప్పడకపోయినా నిప్పుపుల్ల గీసిన వెలుతుర్లో ఆయన ముఖాన్ని చూసే నొచ్చుకున్నాను. ఆయన రాళ్ళు అమరుస్తూ అన్నాడు: "వెధవ పుల్లలు దమ్ముకున్నాయి" అని. పైప్ దగ్గరకు వెళ్ళి 'టిన్' లో నీళ్ల పట్టుకువచ్చి నాపని నేచేశాకదా అని కూర్చున్నా పొయ్యి దగ్గరే మంటవైపు చూస్తూ. కనురెప్పలు పెరపెరలాడినట్లుగా మండుతూవుంది పొయ్యి. మా 'బాబా' వంట చేస్తా డని నేనెప్పుడూ అనుకోలేదు. 'అమ్మి' దగుల్తోనే కూచున్నది చెట్టు నానుకుని. నిమిషంలో వంట చేశాడు. వండిన బియ్యం, దాల్ కలుపుకుని తిని 'పైప్' నీళ్ల త్రాగి మా ఆకళ్లు తీర్చుకున్నాం అనిపిచ్చాం. ముందుముందు ఇదికూడా దొరికి ఇట్లా తింటం కూడా అసంభవం అన్నాడు బాబా నాతట్టు చూస్తూ. అలవాటు పడ్డ వాడు కనుక 'తమాఖు' కోసం జేబు తడువుకున్నాడు. మళ్ళీ ఏం మాట్లాడకుండానే తనూ ఒకవైపు చెట్టుకు ఒరిగి కూచున్నాడు. ''నిద్రా నిప్పులూ లేవూ ఇహ" అందా మనుకున్నా. 'బాబా'ను చూసి మరింత భయపడ్డా. 'అమ్మి'కి దిగులు పోయి మామూలు మనిషి అవుతుందని నమ్మకం నాకే లేదు. నే నట్లాగే 'ఖారా' నెమరేస్తూ చిన్న రాతిగట్టు మీద కూచున్నా. ఆకాస్తలోనే వీలు చేసుకుని కన్ను మూశాడు 'బాబా'. 'అమ్మి' మేలుకున్నా నిద్రపోయినట్టుగానే వుంది. ఇహ నే నొక్కణ్ణి. భయం లేకపోయినా గుబులుగుబులుగా వుంది. నేను

ఇట్లాగే కూర్చుని తెల్లవార్చాలకామాల్సి అనుకున్నాను. నిద్రపోయి నాదే అని 'బాబా'మీద నాకు ఇంతవరకూ వుంది. 'ఖారా' మరింత వేగం నమలటం మొదలు పెట్టాను. అమ్మికి కొంచెం దగ్గరసా కూర్చున్నా. 'అమ్మి'ని పలకరించటానికి మనస్కరించలేదు. కోడి కూతలూ అవీ ఏం లేవుగనుక తెల్లవారిందనే భ్రమతో 'బాబా'ను లేపాను.

నానోట్లో ఖారాను చూసి "నీవు రాత్రినించి నిద్రపోలేదా" అన్నాడు 'బాబా'. నేనేమీ మాట్లాడలేదు.

తెల్లవారుతూనే రైలు వచ్చింది. సంచీ మళ్ళీ మామూలుగా వీపుకు కట్టుకున్నాను. 'అమ్మి' అతి కష్టంమీద ఎక్కింది. ఆమె దిగులు ఎప్పటికి తీరుతుందో తెలియదు. అందరూ ఎక్కేంతవరకూ ఆగింది పాపం రైలు. టిక్కెట్టు 'బాబా'యే కొని తెచ్చాడు. ఇదివరకు ఉన్నంత నిశ్శబ్దంగా లేకపోయినా జనంలో గుసగుసలు బయలుధేరుతున్నాయి. ఈ రైలు ఎక్కడికి తీసుకుపోతుందో అని భయపడుతూ చలికి వణుకుతున్నారు కొందరు. ఏదో ఒక స్టేషనులోనే తప్పక ఆగుతుం దని తెలుసుగనుక ఈసారి అంత ఆదుర్దా పడలేదు. కొంచెం తొందరగానే పోవడం మొదలు పెట్టింది ఎందుకనో. దానికీ భయం తీరినట్టుగా వుంది. మాకింకా ఆకలి బాగా కాలేదు. స్టేషను వచ్చింది. నేను మళ్ళీ పేరు చదివాను. టాం——అని వుంది. ఇది మొదట చూసిన స్టేషనంత పెద్దదిగా లేదు. ఇక్కడ మటుకు దిగడం కొంచెం కష్ట మనిపించింది. నేనూ, 'బాబా' పట్టి దింపవలసివచ్చింది 'అమ్మి'ని.

అందరూ బారులు తీర్చి నిల్చున్నారు. పోయినసారి వచ్చిన అధి గాని, అటువంటివాడుగాని వచ్చి ఏమైనా చెప్తాడేమో అనుకున్నా. ఎరొచ్చినా అటునుంచి ఇటు ఆయన మాదిరిగానే కనపడేవాడు.

"ఇంక రెండు మైళ్లుమాత్రం నడవాలి. ఆపయి మళ్ళీ వరవా లేదు'' అన్నాడు అవూరి స్టేషనుమాస్టరు. నడవటంమాట అనేటప్పటికి నా కెందుకో 'ఉషారుగా' వుంది. వళ్లు జలదరించి గుండె 'కి' మంది.

''అమ్మి చెయ్యి పట్టుకో ముందర" అని 'బాబా' కోప్పడ్డట్టుగా వుంది. నేను వెనక్కు వెళ్ళి అట్లాగే చేసి నడవటం ఆరంభించాం.

ఆ రెండుమైళ్ళూ ఎట్లాగో నడచివచ్చి కూర్చున్నాం. ఒక చిన్న నది వంకలువంకలుగా తిరిగి ప్రవహిస్తూ పోతున్నది. "అది దాటాలి. అవతలకు పోయిన తరువాత మళ్ళీ ప్రయాణం చేయాల'' అన్నారు. నా గుండె ఎందుకో 'గతుక్కు' మని బాబాతో అన్నాను- దీనిని దాటడ మెలాగునని. అందరూ ఎట్లాగో మనమూ అట్లాగే అని సమాధానం ఇచ్చాడు. నే ననవసరంగా ఘాబరాపడటం చూసి అందరూ నవ్వుతారేమో అనిపించింది. కొంచెంసేపయిన తరువాత మూడు 'స్టీమ్‌లాంచీ'లు వచ్చాయి. ఆ మూడిట్లో పట్టినంతమంది ఎక్కాం. అది అటూ యిటూ వరిగిపోతుంటే నాకు పరీక్ష తప్పినంత దిగులు పుట్టింది. అక్కడ కూడా 'అమ్మి'ని చెరొక రెక్క పట్టు కున్నాం. అవతల ఒడ్డుకు వెళ్ళిన తరువాత ఒక్కొక్కరికి పదణాలు అడిగాడు. ఈ కాస్తదూరానికి పది అణాలు అనవసరం అని నేను పోట్లాడినా లాభం లేకపోయింది. 'బాబా' జేబులోంచి డబ్బు తీసి యిచ్చాడు.

మేం ఇవతలకు వచ్చాం. ఇవతలకు వచ్చిన తరువాత మేం తెలిసి చేయదగ్గ పని కనిపించలేదు. ఎదురుగ్గా రాక్షసులల్లే కన్పిస్తు న్నాయి కొండలు. 'బా బా' వంటచేస్తానన్నాడు అక్కడే ఒకమూల. కాదని అనటానికి నోరు ఎవరికీ రాదుగనుక (అప్పటికి నాకు ఆకలి బాగా అవుతున్నది) నేనూ ప్రశ్నార్థకంగా 'అమ్మి' తట్టు చూశాను.

ఒకసారి వంటచెయ్యటం అనుభవమేగనుక ఈసారి అంత కష్టమని అనిపించలేదు. ఇక్కడ పైపులేవీ కనబడకపోతే ఆ నదిలోనే నీళ్ళు 'టిన్' లోకి పట్టుకున్నాం. కులాసాగానే ఆ పూట అక్కడ గడిపి ముందున్నాయి గనుక కష్టాలు ఏవో ఆలోచించుకుంటూ అక్కడే కూచున్నాం. నేను పట్టుదలగా అక్కడ పచ్చగడ్డిలో తెల్లటిగుడ్డ పరుచుకుని నిద్రపోయినా.

''అయిపోయింది. ఇంకేముంది. కొండలు వచ్చాయి. కొండ దాటితే కొత్తదేశానికి పోవచ్చు. ఆ తరువాత గమ్యస్థానం విషయం ఆలోచించవచ్చు'' అని అన్నారు కొందరు అప్పుడే కొండ ఎక్కి దిగినట్లుగా......కొందరంటారు—''దిక్కూ దివాణం తెలియదు. ఎన్ని కొండలు దాటాలో, వాటికి దోవలు ఎక్కడున్నాయో అవన్నీ మనకేం తెలుసును ? చెప్పేవా రెవ్వరూ లేరు'' అని, దాంతోటి ఇరుపక్షాల వారుగా తేలారు. బాబా మెదలకుండా కూర్చుని వింటున్నాడు. నాకీ గోడు ఏమీ అర్థంకాక ఎదుటబడి తాగితే మరీ బాగుండదని అవతలకు వెళ్ళి సిగిరెట్టుపీక వెలిగించాను. "ముష్టికొండలు ఎన్నిరోజులు పడ్తాయి, రెండు రోజుల్లో అవతలికి చేరుకోవచ్చు" అని ధైర్యంచేసి ముందంజ వేశారు కొందరు. వారితోపాటు మరి కొందరు. అట్లాగే అసలు మొట్టమొదట అక్కడ నుంచి వచ్చినవారిలో సగంపైగా బయలుదేరారు. 'బాబా' ఎందుకైనా మంచిదని కదల్లేదు. నాపని ముగించి బయటపడి 'బాబా' ముందు వచ్చి కూచున్నా. మీసాలు దువ్వుకుంటున్న బాబా లేచి ''మనం ఈపూట ఇక్కడ వుందాం. ఎందుకైనా మంచిది. మర్నాడు బయలుదేరి పోవచ్చు'' అన్నాడు. అయినా బాబా నా అభిప్రాయం అడగడ మేమిటి ?......ఎట్లాగో ఆపూట అక్కడ వంట పెడతాడని నాకు తెలుసు. అదివరకు తెచ్చినవే ఆపూటకుకూడా వున్నాయి 'దాల్' తో సహా.

భోజనాలుచేసిన తరువాత 'బాబా' నాకోసంగతి జ్ఞాపకంచేశాడు. "'మనకు కావలసినంత ఆహారం లేదు ప్రయాణానికి. చాలా దూరం పోవలసివుంటుందేమో. మనం కూడా తీసుకునిపోతే మంచిదేమో'' అన్నాడు. మొదట్లో ఖాళీచేసి వచ్చేటప్పుడు 'పర్సు' నాచేతికే ఇచ్చి దాచిపెట్టమన్నాడు. ఉన్నదోపోయిందో అని లాగుజేబులోకి భయంతో చూసుకున్నా. అంతకుముందే ఒక టిన్‌లో కావలసినంత 'దాల్' వుంది ఇంక కావలసింది బియ్యమే గనుక ఊళ్ళోకి రెండు మైళ్ళు వెళ్ళి తెచ్చాడు. తెచ్చినపుడున్నంత 'ఉషారు' తీసుక వెళ్ళటం విషయం ఆలోచించేటప్పటికి – అది లేకపోంగా దిగులుకూడా పుట్టు న్నది. నేనో మంచి ఉపాయం చెప్పాను. దాని బదులు రెండు రోజు లకు సరిపోయే రొట్టెలు ఇక్కడే చేసుకునిపోతే బియ్యం మనం ఇన్ని మొయ్యక్కర్లేదు అని, ఫరవాలేదు నాకే మంచి వుపాయంగా తోచింది. మా 'బాబా' ఏమంటాడో అని ఆయనతట్టు చూశాను. మేం తెచ్చిన బియ్యంలో ఇంకోరికి సహం ఇచ్చి మిగతావి మోసుకుపోవటానికి సిద్ధపడ్డాం.

కొండ ఎక్కటం మొదలుపెట్టాం. నాకు చాలా 'హాయి' అని పించింది మొదట్లో. ఉన్న బరువులో సగంపైగా నాదగ్గర వున్నా. అన్నీ నావీపుకు తగిలించిన సంచీలోనే వున్నాయి. మెట్లు అంటూ అట్టే లేకపోయినా అంత కష్టమనిపించలేదు. కాని కొంతదూరం వచ్చి పక్కకు తొంగిచూశాను. ఇంకేముంది అయిపోయింది అనుకున్నా. నే నెక్కడ వున్నానో నాకే తెలియలేదు ఆకాసేపు. అంత అగాధమైన లోయ. ఎంత సేపటికీ కళ్ళు అవైపుకు పోకుండా ఉంటే బావుండురా అనిపించాయి. అట్లా అనుకున్నానన్నమాటేగాని చూడకుండా వుండ బుద్ధిపుట్టేది కాదు.

అందరూ నడుస్తుంటే నే కాసేపు కూర్చునేటప్పటికి నన్నెవరో అడగనే అడిగారు చిరునవ్వు నవ్వుతూ — "ఏం ఆ కొండలోయల్ని చూసి భయపడ్డట్టున్నా"రని. ఒకసారి విన్న గొంతుక కనుక ఇది, సమాధానం సిగ్గుపడకుండానే చెప్దా మనుకున్నా. "వంట్లో సరిగ్గా లేదు. పైత్యమే చేసిందో పాడేచేసిందో. అందుకని కళ్ళుతిరుగుతుంటే కాసేపు 'రెస్ట్' తీసుకున్నట్టుగా వుంటుందని కూచున్నా" అన్నా. ఆ అమ్మాయి అదివరకునుంచీ మా పక్కనే వస్తున్నది. అప్పటినుంచి ఇప్పటివరకు ఏం మాట్లాడలేదు. అప్పుడప్పుడు 'తనలోతను' చిరునవ్వు నవ్వుకోటం మటుకు చూశాను. మాట్లాడదామని వుందికాని లోపల–ఏమని పలకరిస్తే బావుంటుంది అని ఇందాకటినుంచి ఆలోచిస్తూనే వున్నా. ఇట్లా వుండంగా ఈపని జరిగింది. 'బాబా' పెద్దమనిషితరహాగా అన్నాడు : "అమ్మాయి, చూడు, మావాడు వట్టి — పిటికివా డని చెప్పాలో ఏమని చెప్పాలో తెలియటం లేదు. అటు వైపు చూడవద్దురా అంటే వినడు. ఇంకా చిన్నపిల్లల చేష్టలు పోలేదు మావాడికి" అని. అట్లా ఆయన అన్నప్పుడు నే నెవరితట్టూ చూడలేదు. నన్ను నేనే చూసుకున్నాను అపరిస్థితుల్లో. ముసలివాళ్ళకు ప్రపంచ జ్ఞానం తక్కువ అని అనుకున్నా ఆతల వంచుకున్న పుడే. ఎవ్వరం మాట్లాడకుండానే మాదోవన మేం సాగిపోతున్నాం. నేను 'బాబా' మీద కోపం వచ్చినట్లుగా మూతిని పెట్టి సాగిపోతున్నా. (అది నటన అని చెప్పటానికీ వీలులేదు. తాత్కాలికమేమో.)

ఆ అమ్మాయి కొంచెం సేపున్నతరువాత "నాకు మంచినీళ్ళు కావాలి" అని అడిగింది. ఎవరిని ఉద్దేశించీ అడగలేదు. నేను బాబాతో అన్నాను.— "బాబా, అమ్మాయి మంచినీళ్ళు అడుగుతున్నది, ఇవ్వనా" అని.

"నీ మొఖం ! 'అమ్మాయి' ఏవిటీ, 'ఆవిడ' అనలేవూ ? నన్ను అడగాలా, ఇవ్వాల్సిందీ ఇవ్వఖ్ఖర్లేందీ నీకు తెలీదా" అన్నాడు. నన్ను

మరింత ఇరుకున పెట్టినవా దయాదు బాబా. ఏం చేయటానికీ తోచక అమ్మాయితట్టు చూస్తే బావుండదేమో నని మెదలకుండా వూరుకున్నా.

''అబ్బ ! కాళ్లు పీక్కుపోతున్నయి. దాహం వేస్తున్నది.''— మళ్ళీ వినపడ్డది.

''ఏవిటీ, మనల్ని అడగడ మేవిటి, ఎవరి నీళ్ళు వాళ్లు తెచ్చు కోక్కర్లేదూ— ఈమె మనవెంటబడ్డదేం ? వాళ్లవాళ్లు ఎవరూ లేరా'' అని ఆమె ఎదటే అందామని అనుకున్నాను.

ఈలోపల్నే 'బాబా' టిన్‌లోంచి 'లోటా' లోకి పోసి నాచేతి కిచ్చా డివ్వమని.

అడుగడుక్కీ అనుమానమే. ఆమెచేతి కివ్వాలా, లేకపోతే ఆ కొండరాయిమీదనే పెట్టాలా ?

ఆమె నా చేతిలోదే బలాత్కారంగా తీసుకోక పోయినా అడిగి తీసుకుంది. తాగి, మళ్ళీ నా కివ్వబోతూ మూతి తుడుచుకుంటూ నాతట్టు చూసి నవ్వుమొగం పెట్టింది.

''మీరు చాలా శ్రమపడ్డారు. డబ్బివ్వనా'' అంది.

''అమ్మా ! మంచినీళ్ళివ్వటానికి శ్రమ ఏమిటి ? పిచ్చిపిల్లలా గున్నావ్ !'' అన్నాడు బాబా.

''నన్నూ మొదట్లో కోప్పడ్డాడు. ఈమెనూ ఇప్పుడు అంటు న్నాడు. సరిపోయిందిలే'' అనుకున్నా.

''అమ్మా. నీవెవరు ? వంటరిగా వస్తున్నావ్. బంధువులు ఎవ్వరూ లేరూ'' అని అడిగాడు బాబా.

ఈప్రశ్నే మొదట్లో నేనడగా లనుకున్నాను. కాని దానికి సమాధానం తన నోటిమీదిగా ఏమని చెప్తుందో అని నాకు చాలా కుతూ

హాలంగా వుంది. వేగంగా నడుస్తున్న నడకను తగ్గించాం. ఆమె వుండీ వుండీ...''నన్ను మీ అబ్బాయిగారికి బాగా తెలుసు. ఆయన్నే అడగండి'' అని సూక్ష్మంగా నవ్వుతూ అన్నది. ''ఈమె కేమన్నా పిచ్చెక్కిందా...ఎప్పుడూ నవ్వుతూ మాట్లాడుతుంది. ఒకమాటకు ఒకమాటకు సంబంధంలేదు. అమ్మాయిని నాకు బాగా తెలియటమేమిటి'' అన్నాను బాబాతో. అనేటప్పుడు కాస్త రోషంతోనే అన్నాను ఆమెకు బాగా కోపం తెప్పిద్దామని. దాని కెప్పుడూకూడా వ్యతిరేకంగానే జరుగుతోంది. కోపం అణుమాత్రమైన లేకుండా ఇప్పుడు కొంచెం బయటకు నవ్వుతూ అన్నది— ''ఆ మాటలన్నీ అబద్ధం అని నేను చెప్పగలను'' అని.

''అసలు నీ వెవరో నాకు తెలియదు. నిన్నెప్పుడూ చూడలేదు. వట్టి అబద్ధపుకూతలు కూస్తున్నావ్'' అన్నాను.

''మీ మాటలు విన్న కొద్దీ నాకు నవ్వు ఎక్కువగా వస్తున్నది. క్షమించాలి'' అన్నది.

ఇదంతా చూసి అమ్మి, నామీద ఎంతగా కోప్పడ్తుందో నని ఆమె తట్టుచూశాను. కొంచెం ఆమెదగ్గరకు కూడా వెళ్ళాను.

'జీన్నా !' అని పిలిచి చెప్పింది. ''అబ్బాయి ! ఏవిటో తొక్కాను. కాలు కొంచెం నొప్పిగా వుంది'' అని.

''మేం ఏవీ తొక్కలేదే, నీ వెట్లా తొక్కావు ? అయినా ఈ చుట్టుపక్కల్లో ఏవీ చూడలేదే'' అన్నాను.

నామాట విన్నదో లేదో కూడా, నా చేతుల్లోకి వరిగిపోయింది. ెద్దగా కేకపెట్టి 'బాబా'ను పిలిచాను. అసలువిషయం ఏమైవుంటుందో డా ఊహించుకోలేక పోయినాను. ఆయన వచ్చి ముఖంమీద చల్లనీళ్లు ల్లాడు గట్టిగా... 'అమ్మి .. అమ్మి' అని రెండుసార్లు పిలిచాడు.

చాలా సేపు పిలిచినా పలుకలేదు. ఆమెకూడా మా గుంపులోకి చొచ్చు కునివచ్చింది సిగ్గూ, బిడియం ఏమీ లేకుండా. ఆమెచెయ్యి నాచెయ్యికి బాగా తగులుతున్నది. నే సిగ్గుపడి నాచెయ్యి వెనక్కు తీసుకున్నా. ఆమె మరీదగ్గరికి వచ్చి— "ఏమన్నా పురుగు ముట్టిందేమో చూడండి ...ఒక చిన్న గుడ్డపీలిక వుంటే ఇవ్వండి, సరిచేస్తాను". అటూ ఇటూ నాలుగు వైపులా చూసింది. నాభుజంమీద 'తువ్వాలు' వుంది. అది తీసి ముక్క చింపింది నే చూస్తూవుండగానే. నాకు చాలా కోపం వచ్చింది. ఏం చేయలేక వూరుకున్నాను. "నాదగ్గర ఇంత స్వతంత్రంగా వ్యవహరిస్తున్నది. లేనిస్వతంత్రం ఎక్కణ్ణించి వచ్చింది ఈమెకు ? ఈమెవ్యవహారం అంతుబట్టటంలేదు నాకు" అని పరిపరివిధాల ఆలో చించాను. ఆ చించిన గుడ్డపీలికను కాలికి గట్టిగా బిగించింది. నేను మా అమ్మికళ్ళవైపు చూశాను. కళ్ళల్లో ప్రాణం వుందని నాకు తెలీదు. ఎవ్వరి చేతుల్లోనూ నిలవక కిందికి వరిగిపోయింది. నేను ప్రాణం పోయిం దనుకుని ఆమాట బయటకు అనవచ్చునో, అనకూడదో అని తెలియకుండా (ఇరవై ఏళ్లైనాకూడా) "బాబా ! 'అమ్మి' చచ్చి పోయింది" అన్నాను. మా 'బాబా' మా అమ్మను టూకీగానో, ఎంచేతనో 'అమ్మి' అని పిలుస్తాడు. మా అమ్మ అసలు పేరు 'ఖుల్యాంబీ'. ఆ పేరు నా కిప్పటికి జ్ఞాపకం వచ్చింది. పలుకరిస్తే మాట్లాడలేదు. చచ్చి పోయిందనే అనుకున్నారు. ఆమెకూడా బాబాతో తాత్సారంగా అంది —"ఇహ మాఅమ్మ నాకు లేదన్నమాట"

౨

మాఅమ్మ చచ్చిపోయి అప్పుడే రెండురోజులైంది. ఎట్లా నడుస్తు న్నామో మాకే తెలియటంలేదు... అప్పుడే మా అమ్మవిషయం మఱచి నట్లుగా వుంది. ఆమె విషయం వచ్చి నన్ను మఱిపింప చేసింది

నిజంగా. చాలాదూరం వెనక్కుపోయి ఆలోచిస్తున్నాను. నాకేమీ తట్టటంలేదు. ఆమె ఎవరయిందీ జ్ఞాపకంరావటం లేదు. అబ్బ! ఏవిటో కీచుమని అరుస్తున్నయికూడా. మిట్టమధ్యాన్నం మల్లేవున్నాడు చంద్రుడు. చెట్టుకింద పచ్చగడ్డిలో పడుకున్నా నన్నమాటేగాని నిద్రపట్టటంలేదు. బాబా చక్కగా నిద్రపోతున్నాడు పచ్చగడ్డిలో. నా కెంత సేపటికీ 'పురుగుముట్టిన' విషయం జ్ఞాపకానికి వస్తున్నది. నాకళ్ళఎదుట అటూ ఇటూ మెదుల్తూనేవుంది. ఈరాత్రి ఎట్లాగో కన్నుమూస్తే రేపు పొద్దుటికి మళ్ళీ ప్రయాణం చెయ్యచ్చు. ఆమె కొంచెం నాదగ్గరగా వచ్చి మోచేతి మీద పడుకుని— "ఏం ఇంకా నిద్రపట్టలేదా" అంది.

"నిద్రపట్టిందికాని నీ పిలుపుకు లేచాను. అనవసరంగా నిద్రాభంగం చేశావ్" అన్నాను కసిరినట్టుగా.

"ఎట్లా నిద్రపట్టుందీ ఈ మహాభయంకరమైన కొండల్లో చెట్టు కింద—పురుగు పుట్ర..." అంది.

"మాలో వచ్చి పడుకున్నావ్—భయమా నీకు కూడా ?"

"నీవు అన్నయ్యవు గనుక నీదగ్గరకు వచ్చాను. నాకెవరూ లేరుగా మరి ?"

"అమాటే అనద్దని చెప్పాను...నీ వెవరో నే నెవరో! రెండు రోజుల క్రిందట పాపం కదా అని మంచి నీళ్ల అడిగితే ఇచ్చాం—"

"నీవిట్లా కోపగించుకుంటావని నాకుముందుగానే తెలుసు. ఇప్పుడు బాబాను లేపి చెప్పనా ?"

"నేనేం చేశా నిప్పుడు ? ఆయన్ని లేపటం ఎందుకు ? నన్ను కోప్పడతాడు. మెదలకుండా వూరుకో. నీ వొక రాక్షసికిమల్లే భయపెడుతున్నావే. అన్నయ్యా అని నా వెంబటి పడుతూంటివి— నీ కిక ఎవరూ అబ్బా అమ్మా అన్నా లేరూ, నేనేనా దొరికింది ?"

"నీ వొక్కడివే అన్నయ్యవు... ముద్దొస్తున్నావు గనుక అన్నయ్య అని పిలవబుద్ధి అయింది. దానికి నీవు కోప్పడితే ఇంకో విధంగా పిలుస్తాను. అన్నయ్యవు గనుకనే ఇంత చనువుగా మాట్లాడుతున్నాను."

"____"

"అన్నయ్యా, మనకు మంచినీళ్లు అయిపోనయికదా. రేపటికి ఎట్లాగూ?"

"ఆ సంగతి నీ కెందుకు ? మా అవస్థ మేం పడతాం."

"చూశావూ, నిన్న మనం దారిలో వచ్చేటప్పుడు ఎంతమంది చచ్చి పడివున్నారో... నే చాలామందిని లెక్క పెట్టూవచ్చాను కూడా."

"ఆ సంగతి ఎత్తద్దు... నిన్న చీకట్లో నడుస్తుంటే కాలికి ఏదో మొద్దువలె తగిలింది. క్రిందికి చూస్తే శ-వ-ం. నేకూడా శవాన్ని అయిపోతానేమో అనిపించింది..."

"ఆ శవం జుట్టు విరేబోసుకుని వుంది. మొహం కూడా పాలి పోయింది. నాలిక పీక్కుపోయింది. మన కన్నా ముందు వచ్చిన జట్టీలోవాళ్లు వీళ్ళు. ఆహారం సగందూరం వచ్చేటప్పటికి అయి పోయింది. ముందుకు పోవాలన్నా వెనక్కు పోవాలన్నా ముందు కడుపు నింపుకోవాలి... నీళ్ళు ఎక్కడున్నదీ వాళ్ళకు తెలియదేమో. కొండల్లో నీళ్ళు ఎక్కడ వుంటాయి—"

"మనకుమటుకు ఎక్కడనించి వస్తయి? మనం అందరం చచ్చిపోతాం..."

"అన్నయ్యా, మేం చచ్చిపోతే పోతాంగాని నీవుమటుకు..."

"నే బ్రతికుంటే ఏం లాభం...నే నొక్కర్తినీ పోగలనూ?"

"నే నొక తమాషా చెయ్యనా ఇప్పుడు... అయ్యో... అని పెద్దగా అరుస్తాను. బాబా లేస్తాడు, నిన్ను కోప్పడ్తాడు. అప్పుడు నీ పని ఏమవుతుంది? నేను అవీ ఇవీ కల్పించి చెప్తాను...."

"ఏం చేస్తాను ? ఏడుపు వస్తే—స్తాను."

"చూశావా, మా అన్నయ్య ఎంత భయంగల మనిషో" అంటూ నాచేతిని ముద్దు పెట్టుకుంది.

నాకు ఉమ్మేద్దామా అనిపించింది. అసలు ఈ మనిషికి పిచ్చి ఎక్కింది. లేకపోతే ఈ చేష్టలు ఏవిటీ...వదిలించుకుందామని చూస్తే వీలుకావటం లేదు.

"నిద్రపోకుండా మేలుకున్నావేం, రేపు ప్రొద్దుని మళ్ళీ నడవద్దూ, ఆయాసం కదూ" అన్నాను.

నన్ను పట్టుదలగా నిద్రలేకుండా చేసింది. రాత్రిపూట కూడా ఘోషా ఎందుకో ? ముఖానికి గుడ్డ కప్పుకుంది. (తెర) అసలు దారి పొడుగూతా అంతే. మా బాబాకు కూడా ముఖం చూపించలేదు.

తెల్లవారింది. బయలు దేరేముందు నీళ్ళ హెచ్చరిక చేశాను నేను. అదీ అప్పటికి సమస్యే అయిపోయింది. మేం అందరం ఆలోచిస్తూవుంటే ఆమె తన కక్కర్లేదన్నట్టుగా ఎటో చూస్తున్నది.

అప్పటికీ ప్రజలలో చాలామంది గుంపులుగా ఒక మూలకు పరుగెత్తుతున్నారు. కొందరు ఎటువైపు వెళ్ళారో...'ఊటనీరు ఊట నీరు' అని చెప్పుకుంటున్నారు. బాబా 'టిన్' తీసుకుని నన్ను కూడా ళ్ళమన్నాడు. ఆ గుంపుల్లో చాలామంది ఆడవాళ్ళు. ఒక్క రాయి ుద నిల్చుని నీళ్లు పట్టుకోవాలి. రాయి వరిగితే? ఎట్లాగైనా భయమే. అక్కడ జనం నెట్టుకుంటున్నార. ఇంతమందికీ కలిపి ఆ నీళ్లే.

"ఆడవాళ్ళలోకి పోవటం అంత భయమైతే నే పట్టుకువస్తాను నా కివ్వండి'' అని ఆమె తీసుకుంది. కూడా నీవు వెళ్లమని నన్ను పంపించాడు బాబా!

అక్కడికి వెళ్లి నీళ్లు పట్టుకువచ్చి "అన్నయ్యా, ఇదిగో తీసుకో. నాచెయ్యి చాలా బరువుగా వున్నది'' అన్నది. నే తీసుకున్నాను. ఆమె నా వెనకాత్రే వస్తున్నది. నీళ్ళు మేం అక్కడే తాగాం కూడా.

ఆమె అన్నది: ''అన్నయ్యా, ఇప్పుడు బయలు దేరితే సరిగ్గా రెండురోజులు— అంటే కనీసం రేపు సంధ్యవేళకన్నా చేరుకోవచ్చు. ఎంత త్వరగా బయలు దేరితే అంత మంచిది" అని.

నాదగ్గర చాలా బరువు లున్నాయి. వాటిలో సగమేనా తగ్గిపోతే గాని నడవలేం. అసలు అన్నిటికన్నా బరువైనవి పుస్తకా లున్నాయి. వస్తూవస్తూ అన్నీ వదలిపెట్టిరాగలిగాను కాని ఎందుకో అవిమాత్రం వదిలిరా బుద్ధిపుట్టలేదు. అన్నీ డబ్బుపెట్టి కొన్న పుస్తకాలని కాదుకాని ఎందుకనో పుస్తకాలను చూస్తే నా కంత ఇది. డఢ్లీస్టాంపు భూగోళం, షేక్స్పియర్ నాటకం ఇంకా ఎన్నోపుస్తకాలున్నాయి. చాలామందిని అడిగాను ఎవరన్నా ఒక్కొక్క పుస్తకం తెస్తారేమో! అడిగితే ప్రతి వాడూ నిరాకరించాడు. అసలు కట్టుకున్న గుడ్డలు మొయ్యటమే చాలా కష్టంగా ఉంది. నల్లగా మురికిపట్టి చాలా బరువుఎక్కినై. అయ్యో! ఇవన్నీ పారేసిపోవలసిందేనా అనుకున్నా. ఆ చెట్టుదగ్గర పడేశా. తల్లీ నీ వన్నా చదువుకో. అప్పుడు నాకు ఎంతో ఏడుపు వచ్చింది. ఆమె అన్నది: "బతికి బయటపడ్డాం, అంతే చాలు. ఆ పుస్తకాలు ఎప్పటికైనా కొనుక్కోవచ్చు. నీవు త్వరగా నడు అన్నయ్యా!" అని.

పుస్తకాలేకాకుండా ఇంకాకూడా తెచ్చాను. సామానులో కొంత భాగం అక్కడే పారేసి బయలుదేరాం.

"మనం అందరం ఏదో మాట్లాడుకుంటూ పోదాం. ప్రయాస అనిపించదు అప్పుడు. మొట్టమొదట ఏదన్నా మొదలుపెట్టిచెప్పు నీవు. ఆతరువాత బాబా చెప్తాడు." అన్నాను నేను.

"నీవే ఏదన్నా మొదలుపెట్టు అన్నయ్యా— కాదంటే నే చెప్తాను."

''ఊ. మొదలుపెట్టు. ఇటువంటి సమయంలో సిగిరెట్టు వుంటే ఎంత బావుండేదోకదా'' అన్నాను.

ఆమె చెప్పడం మొదలుపెట్టింది.

"నాకు బాబాఎదుట అన్నిమాటలు హృదయం విప్పి చెప్పడానికి సిగ్గుగా వుంది. నేను మొదట్లో నిన్ను అన్నయ్యా అని పిలిచాను. దానికి నిజంగానే నీవు కోప్పడ్డావు. అది నే కాదనను. ఎవరైనా పరాయిస్త్రీ వచ్చి అట్లా చొరవచేసుకుని మాట్లాడుతుంటే కోపం రాదనను. నీవు నిజంగా అన్నయ్యవే మేమూమీరున్న వూళ్ళోనే మీయింటికి రెండుమైళ్ళ దూరంలో ఉండేవాళ్ళం. నేను హెడ్‌మాష్టరుకూతుర్ని. మొదట్లో మా నాన్నావాళ్ళు మీయింటిపక్కనే వుండేవారు. ఆ రోజుల్లో మాఅమ్మ నన్ను కన్నది. ఆమెకు కనంగానే గుర్రపువాతంవచ్చి చనిపోయింది. నేను పుట్టటం, మాఅమ్మ పోవటం ఒక్కసారి జరిగినై. అప్పట్లో నాతండ్రి బాబాయే. బాబా, హెడ్‌మాష్టరుగారూ చాలా అన్యోన్యంగా వుండేవారట. హెడ్ — చెప్పారట — "మీఅమ్మాయిని మాయింట్లో వుంచండి. నా భార్యే పెంచుతుంది." అంటే సరేఅన్నాడు బాబా. వాళ్ళింట్లో నే రెండుమూడేళ్ళున్నానట. నేను చాలా అందంగా వుంటం చేత హెడ్‌మాష్టరుగారు "మాకిచ్చే సెయ్యండి పిల్లను. మేమే

పెంచి చదువు చెప్పించి పెళ్ళిచేస్తాం'' అన్నాట్ట. ఆతరువాత ఎందుకో అక్కడినించి ఖాళీ చేశారు ఇల్లు. ఇంకా కొన్నాళ్లకు అక్కణ్ణించి బదిలీ అయిపోయింది నాన్నకు. పదిపన్నెండేండ్ల పిల్లనై నాను. మళ్ళీ ఈవూరే వచ్చాం. ఎక్కడో రెండుమైళ్ళ దూరాన వున్నాం. అట్టా రెండుమూడు సంవత్సరాలు గడచినై. బాబా మళ్ళీ ఎవరో బర్మాయువతిని పెళ్లి చేసుకున్నాడు, నన్ను నాన్న కిచ్చిన నాలుగైదు నెల్లల్లో .. ఆమే ఖుల్యుంబీ. నీవు స్కూల్లో చదువుతుండేవాడివి. అప్పుడప్పుడు హెడ్ మాస్టరుగారితో మాట్లాట్టానికిగాని, పుస్తకాలకు గాని వచ్చేవాడివి. ఎంతో వినయవిధేయతల్తో, భయంతో వుండేవాడివి. ఒకరోజున అడిగాను నాన్నని.— ఆ అబ్బాయి ఎవరని ? నీ విషయం చెప్తూ నేను తల్లి లేని పిల్లననీ. ఇంకా అన్నివిషయాలూ చెప్తూ వచ్చాడు. నీ వెప్పుడు వచ్చినా నీదగ్గరికి రావాలనీ, కౌగలించుకుందామనీ అనుకునే దాన్ని. నీవు పిలిస్తేనే సిగ్గుపడి వెళ్లిపోయేవాడివి. నీ మొగం వైపు కిటికీలోంచి బాగా చూసేదాన్ని. నీముఖం నాకు బాగా గుర్తు వుంది. అది అప్పటి విషయం...

మొన్న అందరూ రం— విడిచి వచ్చేటప్పుడు మేమూ వచ్చాం. కాదు నేనొక్కతెనే. బాంబులు పడ్డప్పుడు నాన్నావాళ్ళు తప్పించుకోలేక పోయినారు. ఇల్లు కూలిపోయి. భగవంతుడి దయవల్ల ఎంచేతనో నేను బ్రతికాను. నేనూ అందరితోపాటు వస్తున్నాను. నిన్ను రైల్లో చూశాను. ఆ తరువాత ప్రో— స్టేషన్లో దిగినప్పుడు చూశాను. పలకరిద్దా మనుకున్నాను. కాని నా ముఖంమటుకు ఘోషా అయినందువల్ల చూపించలేక పోయినాను "

ఇది వింటూన్న బాబాకు అప్రయత్నంగా రెండు కన్నీటి బిందువులు రాలినవి. నాకేమీ ఏడుపు రాలేదు. 'అమ్మదొంగా' అని ఫక్కున నవ్వుదా మనుకున్నాను.

"అన్నయ్యా! నావంతై పోయింది. ఇహ బాబా చెప్పాలి" అన్న దామె.

"పిచ్చిపిల్లా, వాడు నీకు అన్నయ్య ఎట్లాఅవుతాడు చెప్పు. ఇందాకటినుంచి పిలుస్తున్నావ్!" అన్నాడు బాబా.

ఆమె తెర తీసివేసింది. చెక్కిళ్ళు నిమురుతూ అన్నాడు బాబా మళ్ళీ—"పిచ్చిపిల్లా, వాడు నీకు అన్నయ్య ఎట్లా అవుతా''డని.

"అయితే పొరబాటే... నాకు తెలీక పిలిచానేమో, ఎందుకో అన్నయ్యా అని పిలవబుద్ధయింది, పిలిచాను. ఎంతవారికైనా పొర పాట్లు తప్పవుకదా" అన్నది.

మళ్ళీ చాలాసేపటివరకూ ఏమీ మాట్లాడకుండానే సాగి పోయినాం!

# 22. తీర్పు

—శ్రీ క్రొవ్విడి లింగరాజు

"ఎవరండీ అధికారులు ?''

"ఎందుకూ ?"

"కేసు రిపోర్టు పుచ్చుకొనేవారు''

"ఏం కేసు ?''

"కూనీ"

''ఏమిటీ ! కూనీకేసూ ! ఊఁ...''

''అవునండీ. నేనే కూనీ చేసింది !''

''ఎవరిని ?...... పెళ్ళాన్ని చంపావేమిటి ?''

''కాదండి... కొడుకుని...''

''ఏమిటీ, కొడుకునా ?''

సబినస్పెక్టరు ఉలిక్కిపడ్డాడు. పర్వతంలాంటి మనిషొచ్చి తనంతటతాను నేను నేరస్థుడనని చెబుతుంటే ఇనస్పెక్టరు తెల్లబోవడ మేమిటి ? నేరం దొరికితే తియ్యనీటికి చేపెక్కినట్లు ఉత్సాహపడే పోలీసు ఉద్యోగికి మాంద్యం ఏమిటి ? నిజంగా పారిపోతూన్న దొంగను తరుముకెళ్ళి గబాలున మీదపడి ఒడిసి పట్టుకున్నంత హంగామా చేయ వలసిన పోలీసు ఆఫీసరు నెమ్మదిగా లేచి ''అరెస్టు చేశాను. కూచో" అన్నాడు. తర్వాతి ప్రశ్న లాయన దగ్గరినుంచీ రాకుండానే నేరస్థుడు ''సందేహించకండి. నేనే చంపేను. కారణం మీకు తెలియనక్కరలేదు. ఇదిగో రక్తం చవిచూచిన కత్తి. శవదహనమైపోయింది'' అన్నాడు.

ఇనస్పెక్టరు విధిలేక చట్టప్రకారం జరుపవలసిన కర్మకాండ అంతా జరిపించడం మొదలెట్టాడుకాని అతని హృదయంలో ఏదో ఒక సంకోచం వెనక్కి లాగుతూనే వుంది. చేతులకు సంకెళ్ళు తగిలిస్తుంటే సంకెళ్ళు తన చేతికే బరువుగా కనిపించాయి. ముద్దాయి శరీరాన్ని శోధిస్తుంటే నవనవలాడుతూ వికసించిన గులాబి పువ్వును అకారణంగా నలిపేస్తున్నట్లు వెక్కసపడ్డాడు. చీకటిగా ఉండే ఆ లాకప్‌లో అతన్ని నిర్బంధిస్తుంటే ధర్మదేవతను చీకటికొట్లో వేస్తున్నట్లు కటకట పడ్డాడు. కాని డ్యూటీ... డ్యూటీ... ఇండియన్ పీనల్‌కోడ్... అది స్టీము రోలరు......

*   *   *   *

కొంత స్తిమిత పడ్డాక ఇనస్పెక్టరు నేరస్థుని ప్రశ్నించడం ప్రారంభించాడు. నేరాలు కూపీ తియ్యడంలో ఉండే నేర్పంతా చూపించాడు. చచ్చిపోయిన పెళ్ళాం కొడుకేమో అనే అనుమానంతో ప్రశ్నలు కురిపించాడు. చేతికందిన వయస్సు అవడంవల్ల సరసంలో తండ్రి కొడుకు లొాకచోట తారసిల్లారేమోనని సంశయించాడు. ఎన్ని ప్రశ్నలకైనా నేరస్థుడు ఒక్కటే సమాధానం ఇచ్చాడు. "నేను నేరస్థుడిని. నా చేతుల్తో నా కన్నకడుపును కోసుకున్న పాపిని. ఈ ప్రపంచంలో జీవించడానికి నాకు చోటూలేదు, అర్హతా లేదు. అందుచేత నన్ను శిక్షించండి. శిక్షంటే జైలుకాదు. ఉరికి పంపించండి" అన్నాడు. అల్లా మాట్లాడే నేరస్థుడితో వ్యవహరించడం గజపతిరావు నాయుడుకు మరింత ఇరుకనిపించింది. లా అంటే మాటలా? చంపినవాడు చంపలేదంటే ఊరుకుంటుందా? చంపనివాడు చంపేనంటే ఊరుకుంటుందా? పెళ్ళికీ చావుకీ ఉన్నంత కర్మకాండ జరగాలిసిఉంటె. నూరుమంది కళ్ళఎదుట మనిషిని మనిషి చంపితేనే సవాలక్ష గ్రంథం జరగాలిసిన లా, ఒక మనిషొచ్చి నేను హత్యచేశానంటే మాత్రం ఒప్పుతుందా? కాక

పోతే ఇలాంటి కేసును ఎన్నడూ చూచి ఎరుగని నాయుడుకు మాత్రం ఆశ్చర్య కారణమైంది. నాయుడికే అంతంతగావుంటే జవానుల కేమి తెలుసు? వాళ్ళ సంతోషమల్లా ఒక్కటే. ఉచ్చులోపడింది పెద్ద పక్షి. అంతే. ఎంతో పనిచెయ్యకపోతే ఇల్లా వచ్చి ఇందులో చిక్కుకుంటాడా అనే నమ్మకం.

*  *  *  *

ముద్దాయి రామన్న గ్రామం విజయేశ్వరం గోపూరు పోలీసు స్టేషనుకు ఎనిమిది మైళ్ల దూరంలో వుంది. గ్రామమైతే పెద్దదీ, మోతు బరీ రైతాంగం కలదీ. అయినా ఆ ఊరు ప్రయాణానికి సౌకర్యంలేదు. వేసవి కాలంలోతప్ప బళ్ళబాట లేదు. మిగతా రోజుల్లో కోటీశ్వరుడి కైనా కాలినడకే శరణ్యం. అందుచేత ప్రజలు నానా ఇబ్బందీ పడు తున్నా ఉద్యోగస్థుల తాకిడీ తక్కువవడంచేత ఇదే నయమనుకుని రోడ్డుకోసం ఆందోళన చెయ్యడంలేదని ప్రతీతి. కొద్ది రోజుల క్రిందటనే గోపూరు స్టేషనుకొచ్చిన నాయుడు తెల్లారగట్లే లేచి నానా క్షోభపడి విజయేశ్వరం చేరుకున్నాడు. ఉద్యోగస్థుల తాకిడి అంతగా ఎరుగని జనం పోలీసు ఉద్యోగి వచ్చేసరికి గడబిడ పడ్డారు. గజపతిరావు నాయుడు గ్రామ చావడిలో మకాంవేసి జవానుతో కబురంపి మున సబును రప్పించాడు. మునసబు రావడంతోనే—

"ఏదయ్యా నీ బకీరు ?'' అన్నాడు నాయుడు.

''అదేటండోయ్ ! బకీరా ?''

"అవును. ఏ మెరగనట్లు మాట్లాడతావేం ?''

"ఏటండోయి ఇనస్పెక్టరుగారూ ! ఇపరీతంగా సెప్తున్నారే ?''

"ఏమయ్యా మునసబూ ! ఆట్టే నటించకు. ఊళ్లో పలుకుబడి ఉన్నంత మాత్రాన కేసు కుమ్మకు చేద్దామంటే సాగదు సుమా. అందు లోనూ ఖూనీ కేసు !''

"కూనీ కేసొండి! మా ఊళ్ళోనా? అదేటండీ!"

"ఓహో! నంగనాచిలా మాటాడుతున్నావు. ఇంతకూ అతని పలుకుబడి అంత గొప్పదేం? అబ్బాయి! మునసబూ, ఈ పోకదలు కట్టిపెట్టు. నిన్న ప్రొద్దున్న మీ ఊళ్ళో కూనీ జరిగింది. ఈ ఊరికల్లా నాయకుడుట కాదూ ఆ రామన్న. అంత మాత్రాన్ని దాగుతుందనుకోకు. ఆ రామన్న కొడుకుని కూనీ చేశాడు. మరి..."

"అదేంటండోయ్— రామన్న దొరా! కూనీ! కొడుకుని ..." అని తెల్లబోయాడు మునసబు.

మొదట సందేహపడుతూ వచ్చిన ఇనస్పెక్టరుకు ఇందులో ఏదో కుంభకోణ ముందనే అనుమానం ప్రబలింది.

"ఏమయ్యోయ్ మునసబూ! ఇందులో దాచడాని కేమీలేదు. నిన్న ఉదయం రామన్న తన కొడుకును తాను కూనీచేసినట్లు ఒప్పుకుని రాత్రి వచ్చి రిపోర్టు ఇచ్చి అరెస్టు అయినాడు. ఆ కేసు విచారణ జరపడాని కొచ్చాను. బకీరు రాయకపోతే నీ కొంపమీది కొస్తుంది..."

అని ఇంకా చెప్పబోతుంటే మునసబుమాట కడ్డొచ్చాడు. "ఏమండోయి ఇనస్పెక్టరుగారూ! నిజం చెప్తా వినండి. రామన్నదొర అలాంటి మనిషికాడు. బహు పెద్దమనిషి. మా బురదనాటి సీమంతా ఆయన్ని ధర్మదేవతలా చూచుకుంటాం. నిన్న ఆయన కొడుకు చచ్చిపోయిన మాట వాస్తవమే. మేమంతా వెళ్ళి దహనం చేసొచ్చాం. కాని అది కూనీ ఏమిటండీ? ఆకతాయి ముండాకొడుకు ఆ కొడుకు నానా రోగాలూ పడి ఒళ్ళు పాడుచేసుకొని చచ్చాడు. వాడిని ధర్మదేవత చంపడ మేమిటండీ? ఇందులో ఏదో ఉందిబాబూ! నిన్ననే నేను జనన మరణాల పుస్తకంలో వ్రాశాను. అంతేకాని కూనీ లేదండీ బాబూ! నమ్మండి!"

ఇనస్పెక్టరు అడ్డొచ్చి "మునసబూ! అదేమీ ప్రయోజనం లేదోయి. నేరస్థుడే వచ్చి నేరాన్ని ఒప్పుకుంటే నువ్వూ నేనూ గిజగిజ లాడితే మాత్రం ఏమి ప్రయోజనం? రామన్న గోపూరు లాకప్‌లో ఉన్నాడు. తెలుసా?"

"ఇనస్పెక్టరుగారూ! నమ్మటానికి మనసొప్పదం లేదండి. మాదొర ఖైదీ అవడమేటండీ! అలాంటి చిల్లరిమనిషి కాదండి!"

"అదేమిటోయి! నీ కెంతచెప్పినా అర్థం కాదేమిటి? చూడగా చూడగా నీపీకమీదికి తెచ్చుకొనే టట్టున్నావు. మాట్లాడక నేచెప్పినట్లు బకిరువ్రాయి. పదవాళ్ళ ఇంటికి. విచారణ చేద్దాం."

"ఏం విచారణ బాబూ! ఆ ఇల్లాలి మొహం ఎల్లాచూడడం? ఇంతకీ ఎంత నిర్భాగ్యుడైనా ఒక్కడేకదా కొడుకు. కడుపు దుఃఖం చేత మనిషికేమైనా మతిభ్రమ కలిగిందేమో యోచించారూ?"

"అలాంటి చిహ్నాలేమీ లేవు. కొంచెం ఆవేశం కనిపించింది. అంతే."

* * * *

నాయుడు, మునసబు, నలుగురైదుగురు పెద్దమనుష్యులు రామన్న ఇంటికెళ్లేరు. పుత్రశోకంతో మూలబడ్డ అతని భార్య లచ్చమ్మ (అనే లక్ష్మీదేవమ్మ పోలీసు రికార్డులో)కు రాయన్న కబురు చెప్పేరు. ఒక్కవేటుతో కూలిపోయిన అరటిచెట్టులా పడిపోయి ఘొల్లుమంది. కొడుకు చావుకు భర్తపాటు తోడై జీవితమంతా అంధకారమై పోయింది. ఈ రెండు బాధలకన్న తెరబయట నున్న పోలీసు ఇనస్పెక్టరు ప్రశ్నలకు సమాధానం చెప్పే బాధ మరింత ఎక్కువైంది. అప్పటికప్పుడే నాయుడు ఇంక్వయిరీలో రామన్న చాలామంచి వాడనీ, పెద్దమనిషి

అనీ, ధర్మాత్ముడనీ, చుట్టుప్రక్కల నాలుగైదు గ్రామాలవాళ్ళు అతని ధర్మ నిర్ణయానికి బద్ధులైవుంటారనీ తెలిసింది. అందుచేతనే గజపతి రావు నాయుడుకు నేరం సంగతి మరింత అగమ్యమైపోయింది. అలాంటి ఘరానామనిషి తనూ, భార్యా అనేక మ్రొక్కులు మ్రొక్కి నలభైయవ ఏట కన్నకొడుకును - ఎంతో అపరూపంగా పెంచుకొన్న కొడుకును— వాడు ఎంత దుర్మార్గుడైతే మాత్రం చేతులారా చంపడానికేమి కారణం ఉంది? అందుచేతనే లచ్చమ్మను విచారించడంలో సామాన్యంగా పోలీసు ఉద్యోగస్థునిలో అపురూపమైన శాంతాన్నీ, సౌమ్యతనూ తెచ్చి కొని మాట్లాడేడు.

"గోరుచుట్టు మీద రోకటిపోటా దేవుడా!" అంది.

"తెలిసినదంతా చెపితే ఉపకారం జరుగుతుందమ్మా !''

''నా జన్మకిక ఒకటే ఉపకారం... ఇంతకీ ఆ మహరాజా చంపడమేమిటి కొడుకుని ? వాడి కర్మానికి వాడేపోయాడు...''

''ఆయనేవచ్చి తన కొడుకుని తానేచంపినట్లు చెపుతున్నాడే మరి!''

''అదేమిటో నాయనా ! నాకేమీ తెలియదు. ఆయనల్లా ఎందుకు చెప్పేడో! చెట్టంత కొడుకు రాలిపోతే మతి చలించడంలో ఆశ్చర్య మేమిటి? మొండి ఘటాన్నిగనుక నేను బ్రతికున్నాను. అయిన కర్మ మంతా చాలక కోర్టుకుకూడా ఎక్కాలికాబోలు...."

"తండ్రికొడుకుల కేమైనా తగాదా లున్నాయా ఏమిటి?''

"అయ్యో, రామా! అది కూడానా? నూరునోములు నోస్తే లేకలేక కలిగిన నలుసును అపరూపంగా పెంచుకున్నాం. మాప్రారబ్ధం కొద్దీ వాడి నడవడి మంచిదైంది కాదు. అయినా తండ్రీ కొడుకులు మాట్లాడుకుంటేగా దెబ్బలాట రావడానికి?''

"ఆవేళ ఏమైనా తగాదా పడ్డారా ?"

"అదేమో నాకు తెలియదు. క్రితంరాత్రి ఏడు గంటలకు వీధి వెంకయ్యగారు, ఇంకా ఎవ్వరోచ్చి కొడుకుమీద ఆ మహరాజుతో ఏదో నేరం చెప్పేరు. వాళ్ళ అమ్మాయిని వాడు మోటసరసం చెయ్యబోయాడని కాబోలు ! మావాడు అనేక రోజులుగా దుస్సహవాసం పట్టి అన్నివిధాలా పాడైపోయాడు. నాయనా ! వారితో ఎన్నోసారులు మూర్ఖపురాలిని నేచెపుతూవస్తే వినిపించుకోలేదు. ఇంటి వ్యవహారాలు చూడడానికి వారికి తీరిక ఎక్కడ ? ఎప్పుడూ ఏదో ఊరి వ్యవహారమే అయిరి... పెద్ద మనుష్యులు వెళ్ళిపోయిన తర్వాత మాత్రం మామూలుగా భోజనానికి లేవకుండా బెంగపడి కూచున్నారు. ఎన్నిసారులు పిలిచినా లేవలేదు. దానికితోడు తెలివి తక్కువ దాన్ని నేనుగూడా ఆయన్ని ఒక మాటన్నాను. "కామ్మైనప్పుడు వంగకపోతే మానైతే వంగుతుందా ? చిన్ననాడు వాడిని ఆదుపాజ్ఞల్లో పెట్టకపోయి ఇప్పుడు దిగులుపడితే ఏం ప్రయోజనం ? లేవండి" అన్నాను. ఆ మారాజుకేం కష్టం కలిగిందో మరి. ఎప్పుడూలేదు, భోజనం చేసి కొడుకోకోసం చావట్లో అల్లాగే కునుకుతూ కూచున్నారు. కొడుకు రాత్రి తొమ్మిది పదిగంటలకు తూలుతూవచ్చి తిన్నగా తనగదిలో కెడుతుంటే తండ్రి చెయ్యిపట్టుకున్నారు. వాడు విదలించుకుని లోపలికి పోయాడు లోపలనుంచే భోజనం అక్కరలేదని ఒక్కకేక పెట్టేడునాకు. తండ్రికూడా గదిలో కెళ్ళేరు. నేనుకూడా వెళ్ళబోతే తండ్రి రావద్దన్నారు. కడుపు తీపి ఏడిపించినా ఆడదాన్ని నా కెందుకన్నట్లు వెనక్కొచ్చాను. తండ్రి వాడిని మందలించారు. లాలించారు. కొడుకుకూడా కొంచెం మర్యాద హీనంగా మాట్లాడినట్లు అక్కడక్కడ వినిపించిన ముక్కలవల్ల నాకు తెలిసింది. అప్పటికి రెండు రోజుల క్రిందటనే రామన్నపేట నుంచి వాడికి ఇరవైయకరాలు కట్నమిచ్చి పిల్లనిస్తామని వచ్చారు. మారాజు

ఏమీ మాట చెప్పలేదు. 'పెళ్ళి అయితే కుదుటపడతాడు. చెయ్యకూడదా?' అని నేనొక ఆడమాట అన్నాను. 'దాని గొంతుక కూడా కొయ్యాలా?' అన్నారు. మళ్ళీ ఆరాత్రి వాడితో పెళ్ళిసంగతేదో చెప్పినట్లున్నారు. 'నాకొద్దు. పెళ్లి వద్దు. పెటాకులూ వద్దు' అనే మాటొక్కటే నాకు వినిపించింది. నేనెరిగింది అంతే. అర్థరాత్రి ఆయనగారు లేచి కొడుకు గదిలోకెళ్ళి, కన్నీరు మున్నీరుగా ఏడుస్తూ వచ్చి నన్ను లేపి 'అంతా అయిపోయింది. అబ్బాయి చచ్చిపోయాడు' అన్నారు. నేను గొల్లుమంటూ లేచి గదిలోకి వెళ్లేసరికి మొగం నల్లబడిపోయి పడున్నాడు కొడుకు. తర్వాత చెప్పడానికేముంది? నలుగురూ వచ్చారు. ఏడుపులు, పెడబొబ్బలు: నాయనా, కలికాలం, తండ్రి ఆపత్తు గడప వలసిన కొడుకుని తండ్రే చేతుల్తో కొరివెట్ట వలసివచ్చింది. లేకలేక కలిగిన మా సంతానం మూడునాళ్ళ ముచ్చటై పోయింది.''

అని ఒక్కసారిగా లచ్చమ్మ బావురుమంది. ఇనస్పెక్టరు హృదయంకూడా కరిగిపోయింది. అతనికి దిక్కుతోచలేదు.

* * * *

గజపతిరావు నాయుడు కథంతా మననం చేసుకున్నాడు. ఊళ్ళో దర్యాప్తువల్ల తెలుసుకున్న దానికి లచ్చమ్మకథా కలుస్తోంది. కాని రామన్న స్టేటుమెంటుకు ఏమీ అందడంలేదు. ఆత్మహత్యా అనే సంశయం కలగక పోలేదుగాని రామన్న ఆ భారాన్ని తనమీద ఎందుకు వేసుకుంటాడు? కడుపు తీపేకాని ప్రాణంతీపి మాత్రం తక్కువదా? కాని శాంతుడైన వాడు రేగితే ధర్మరాజు కోపంలాంటిదే కదా. అందులోనూ పరువు ప్రతిష్ఠలతో బ్రతికే వాడికి కడుపుతీపి కన్నాకూడా ఆత్మగౌరవం ఎక్కువై, కొడుకుచేసిన ఏ దుర్మార్గానికో కుపితుడై తాత్కాలి కోద్రేకంచేత ఏ కొట్టరాని చోటనో కొట్టడంటే చచ్చిపోవచ్చును అని కథ కలుపుకున్నాడు. ఇందులో వెనక ముందాలోచనలకీ, దయా

దాక్షిణ్యాలకి పరిపూర్ణమైన ఆస్కారమున్నా 'లా' దృష్టిలో వీటికి చోటులేదు. మతాచారాల్లో అశుభానికీ, శుభానికీ కూడా ఎంతో తతంగం విధిగా నడపవలసినట్లే 'లా' కూడా దాని పంథానది అవిచ్ఛిన్నంగా నడవ వలసిందే. అప్రయత్నంగా రామన్న నిర్దోషియనీ, అతణ్ణి తప్పించాలనీ నాయుడుకేదో అభిప్రాయం స్ఫురించేది కాని పోలీసు ఉద్యోగం. డ్యూటీ, లా, పీనల్ కోడ్ ఇవన్నీ జ్ఞాపకం వచ్చేసరికి మామూలు ఉద్యోగస్థు డయ్యేవాడు. రామన్న వ్యవహారం చూస్తే ఎంత ప్రయత్నించినా కొరుకు పడేటట్టులేదు. లాకప్‌లో ఏదో దీర్ఘాలోచనా తత్పరుడై ఉండడం, ఎన్ని ప్రశ్నలకైనా ఒక్కటే జవాబు చెప్పడం జరుగుతోంది.

"ఎందుకండీ ఈ తర్జన భర్జన? నా కడుపును కోసుకున్న కఠినుడ్ని... ఎవరికోసం నే బ్రతకాలి? లా ప్రకారం శిక్షించి నాబాధ తప్పించండి. మీకెల్లా కావలిస్తే అలా బందోబస్తు చేసుకోండి" అనే వాడు. పైగా ఊరివాళ్ళు, బంధువులు ఎందరో చూడదాని కొస్తే ఎవ్వళ్ళనీ తన దగ్గరికి తీసుకురావద్దన్నాడు. ఈ మనిషితో ఏంచెయ్యడం? కేసుతంతు నడుపవలసిందే! దొరికినంత కథనుగుది గ్రుచ్చి, పైఉద్యోగస్థులతో సంప్రదించి కూనీకేసు బనాయించాడు నాయడు.

*   *   *   *

కూనీకేసు తతంగం అంతా నడిచింది. మొదట మేజిస్ట్రేటు ఎదుట ఆయన స్టేటుమెంటు రికార్డు చేయడం, మేజస్ట్రేటు కోర్టులో కొంతతంతు నడపడం, మేజస్ట్రేటు సెషన్సుకు పంపడం జరిగింది. కేసులో ఎన్నిలోపాలుంటే మాత్రం ఏమిటి? ముద్దాయి నేరాన్ని ఒప్పుకుంటున్నప్పుడు కేసులో కష్టమేముంది? రామన్నను సెంట్రలు జైలులోకి తీసుక పోయారు.

*   *   *   *

సెషన్సు జడ్జీ గిరిరావు పంతులుకు పింఛను పుచ్చుకొనే కాలమయ్యేసరికి జిల్లా జడ్జీ పనైంది. జిల్లా మునసబ్బు ఉద్యోగంలో ప్రవేశించి క్రమంగా ఈ ఉద్యోగాని కొచ్చాడు. మనిషి చాలా శాంత స్వభావుడూ, పాపభీతి కలవాడూ అవడంచేత ఉద్యోగంలో ప్రమోషను కూడా నిదానంగానే వచ్చిందని ప్రతీతి. ముద్దాయిని శిక్షిస్తుంటే ఆ శిక్ష తానను భవిస్తున్నట్లు తహతహలాడేవాడు. అట్టేకాలం ఉండదు కనుక హైకోర్టు ఊరుకుంది కాని, లేకపోతే ఎన్ని దెబ్బలు తినవలసినవాడో. ఆయన ఎదట రామన్న విచారణ. పబ్లిక్ ప్రాసిక్యూటరు రావుసాహెబు వెంకయ్య నాయుడు అధికారుల దయవల్ల తొమ్మిది సంవత్సరాలుగా ఆ పని చేస్తున్నాడు. మళ్ళీ మూడు సంవత్సరాలు ఉద్యోగం పొడిగించుకోడానికి ఆత్రపడుతున్నాడు. కేవలం అలవాటువల్ల పోలీసు కేసులో తిరుగుడుండదనీ, చిన్నచిన్న లోపాలున్నా వాటిని సర్దుకోవలసిన పూచీ ప్రాసిక్యూటరుదనే నమ్మకంతో వాదించేవాడు పోలీసు కేసులో ముద్దాయికి శిక్షపడినప్పుడల్లా తన దివాన్ బహదూర్ ఆదర్శానికి ఒక మెట్టు సాధించినట్టుగా నమ్మేవాడు. లా యొక్క నిరంకుశత్వంలో అలాంటి విశ్వాసాన్ని ఆయన కుదుర్చుకున్నాడు. ఇనస్పెక్టరు గజపతి రావునాయుడు సామాన్యంగా కూనీ కేసుల్లో పోలీసులు అధికారులు చూపించే ఉత్సాహాన్ని చూపకుండా ఏదో పోలీసు యంత్రంలో ఒక్క కీలుగా మాత్రమే పనిచేస్తుండడం రావుసాహెబుకు అత్యంత ఆశ్చర్యం కలిగించింది.

ప్రాసిక్యూటరు సాక్ష్యమైపోయింది. ముఖ్యసాక్షి గజపతిరావు నాయుడే. రామన్న అంగీకారానికి అనుగుణ్యంగానే ఉంది అతని సాక్ష్యం. ముద్దాయి వకీలును ఏర్పాటు చేసుకోవడానికి నిరాకరించాడు. అతడు తప్పించుకో దలచుకుంటేగా! జడ్జీ పట్టుదలమీద గవర్నమెంటు ఖర్చుతో ముద్దాయి తరఫున వకీలు ఏర్పాటైనాడు. అతడు మాత్రం

ఏంచేస్తాడు ? ప్రాసిక్యూషన్‌లో లోపాలు చూపించగలడు కాని రామన్నకు పాఠం చెప్పగలడా ? సాక్షి విచారణ ముగిసిన తర్వాత జడ్జీ ముద్దాయిని—

"ఏం చెప్తావు ? నేరంచేశావా ?"

" నేరస్థుడనే."

"మేజస్ట్రేటుఎదుట ఇచ్చినస్టేటుమెంటు ఐచ్ఛికంగానే ఇచ్చావా?"

"ఆఁ"

"అందులో సంగతులన్నీ నిజమేనా ?"

"మార్చడానికేమీ లేదు."

"హత్యకి కారణం ఏమిటి ?"

"అయిపోయిన తర్వాత 'అవిచార మెందుకండీ ?"

రామన్న ముఖంలో దీనత్వముందికాని, అధైర్యం ఎక్కడాకనబడదం లేదు. మానవ ప్రకృతిని గురించిన తత్వ విమర్శనను ఎంతో అప్పుడప్పుడు గిరిరావు పంతులు చదువుతూ వచ్చాడు. కాని ఈ ముద్దాయి వైఖరి తనకు అవగాహన కాలేదు. అయితే ఇతడు అపూర్వమైన ధర్మమూర్తి కావాలి ; లేకపోతే తడిగుడ్డలతో గొంతు కోసివచ్చి నెత్తురును త్రాగే కటికివాడైనా కావాలి. సాక్ష్యంలోని విషయాలు, ముఖంలోని దీనత్వం, ధైర్యలక్షణాలు సమన్వయిస్తే రెండవ తరహాగా ఆలోచించడానికి ఆస్కారం కనిపించలేదు జడ్జీగారికి.

ప్రాసిక్యూటరు నేరారోపణ చేస్తూ వాదించాడు, ముద్దాయి అంగీకారం, హఠాత్తుగా చచ్చిపోయిన వాడి శవాన్ని పరీక్షకు పంపకుండా తన పలుకుబడి నుపయోగించి దహనం చేసెయ్యడం, ముద్దాయి భార్య లచ్చమ్మ స్టేటుమెంటులోని తండ్రి కొడుకుల తగాదా, అన్నీ ముద్దాయి దోషానికి నిర్ధారణలుగా చూపించాడు. హత్యకు కారణం

ఏదో ప్రబలమైనది ఉండితీరు తుందనీ, ఏ స్త్రీయైనా కూడా కారణం కావచ్చుననీ, రామన్న పలుకుబడివల్ల అలాంటి సాక్ష్యం రావడం అసంభవమనీ వాదించాడు. ఆయన వాదిస్తుంటే రామన్న ముఖం చిట్లించుకొని కటకట పడ్డాడు. ఒళ్లంతా చీమలు, జెర్రెలు పాకినట్లు చిరాకుపడ్డాడు. శరీరాన్ని సూదుల్తో గుచ్చినట్లు బాధపడ్డాడు. ఆ తహ తహ రావుసాహెబు కేం తెలుస్తుంది? ఎద్దు పుండు కాకికి నొప్పా? రాలిపోయినది ముసలి పండైనా, బద్దలైనది పచ్చినామైనా అపరకర్మ చేయించే పౌరోహితుడికి మంత్ర తంత్రాలు ఒక్కటే. తంత్ర ప్రకారం గోదాన భూదాన సాలగ్రామ దానాలు అడుగుతూనే ఉంటాడు. లా తంత్రంగూడా అలాంటిదే. అది యథావిధిగా సాంగో పాంగంగా నడవ వలసిందే. ముద్దాయి పలుకుబడివల్ల కలిగిన లోపాల నాస్కారం చేసుకొని అతన్ని విడుదలచేస్తే పరగణాలో నేరం హద్దులు మీరి పోతుందని గూడా వాదించాడు రావుసాహెబు.

గవర్నమెంటు ఏర్పాటుచేసిన ముద్దాయి వకీలు యథావిధిగా తనధర్మాన్ని నిర్వర్తించాడు. ముద్దాయి నేరాన్ని అంగీకరించినంత మాత్రాన శిక్షార్హుడు కాడనీ, పుత్రశోకంవల్ల మతిభ్రమించి తత్కాల మైన ఆవేశంవల్ల చచ్చిపోయే ఉద్దేశ్యంతో అలా అంగీకరించి ఉండ వచ్చుననీ వాదించాడు. ఇంతకూ ఇలాంటి నేరానికి కారణం ప్రధానమైన దని హైకోర్టు తీర్పులన్నీ చూపించి, అలాంటి ప్రబల కారణం ఏమీ ప్రాసిక్యూషన్ ఋజువు చేయలేదు కనుక అందుచేత సంశయానికి తావుందనీ, బ్రిటిష్ చట్టప్రకారం సంశయముంటే ముద్దాయి కను కూలంగా తీర్పు ఇవ్వాలనీ చక్కగా వాదించాడు. రామన్న మహనీయ మైన ఒక ఆవేశంలోనో ఒక ధర్మ విచేచనలోనోపడి ఈ నేరాన్ని తన నెత్తిపై వేసుకుంటున్నాడనీ, ఈలాంటి బాధ్యత వహించడం అగాధమైనట్టిన్నీ, భవిష్యత్తులో మాత్రమే గోచరమైయేటట్టిన్నీ ఒక్క

మహత్తరమైన నైతిక కారణం ఉంటుందనీ, మామూలు కేసులా దీనిని విచారించ కూడదనీ, ఈ బాధ్యత న్యాయమూర్తిదే అనీ వాదన ముగించాడు.

ఈ యువకుడి కెందుకు తన జీవితం యెడల ఇంతపట్టుదల కలిగిందా అని తెల్లబోయి చూస్తున్నాడు రామన్న. బాధ్యత తనమీద పెట్టిన ఆఖరు వాక్యంవిని జడ్జీ నూతన భారంతో క్రుంగినట్లయినాడు. పబ్లిక్ ప్రాసిక్యూటరు ముద్దాయి వకీలు వాదనను హేళనచేస్తూ జవాబు చెప్పేడు. తీర్పుకు కేసు వాయిదా వేశారు.

*　　*　　*　　*

విచారణ జరుగుతున్నంత సేపూ జడ్జీదృష్టి ముద్దాయి ముఖం మీదనే ఉంది. పిసరంతైనా మృత్యుభీతి ఆ ముఖంమీద కనబడడం లేదు. నిండుకుండలా తొణుకూ బెణుకూ లేకుండా ఉన్నాడు. ఆకుండలో నిండి ఉన్నది నిజమైన శాంతో, లేక దుఃఖమో పరమేశ్వరుడి కెరుక. విచారణ ముగిసి నప్పటినుండి ఆయనకు ఆందోళన హెచ్చింది. ఇక ఆ మనిషి ప్రాణం తనచేతిలో వుంది. ప్రాసిక్యూషన్ వాదంలో లోపాలున్నా ముద్దాయి అంగీకారం బలంగా వుంది. డిఫెన్సు వకీలు చెప్పిన మహత్తరమైన నైతిక కారణం ఉండడానికీ సావకాశాలున్నాయి. కేవలం ముద్దాయిమాట నమ్మి శిక్షిస్తే ఒక్కప్రాణం తనచేతి మీదుగా పోతుంది. జైలులో అతని ప్రవర్తన ఎలాఉందో తెలుసు కోవడానికి జైలు అధికారుల నడిగేడు. రామన్న ఎప్పుడూ ఏదోధ్యానంలో ఉంటా డనీ, మామూలు కూనీ ఖైదీలలాగా తన కేసు సంగతి అందరితో చెప్పుకోడనీ, ఎవరికీ ఏ విధమైన శ్రమా ఇవ్వడనీ జైలధికారులు చెప్పేరు. ఈలాంటి అగాధమైన మనిషియొక్క ఆంతర్యం తనకు ఎల్లా తెలుస్తుంది? కేవలం నిర్జీవమైన పుస్తకపు లా అధారం చేసుకుని శిక్ష విధించాలసొస్తే తన చేతిమీదుగా ప్రాణం తీయాలసొస్తుందే. ఈ విచక్షణ

చెయ్యకపోతే తానుచేసే న్యాయమేమిటి ? ఈ విషయంలో తనకెవరు సాహాయ్యం చేస్తారు ? ఇలా పరిపరి విధాలుగా జడ్జీ ఆందోళన పడ్డాడు.

జడ్జిమెంటు రోజు వచ్చింది. ముద్దాయిని తన ప్రైవేటు గదిలోనికి రప్పించారు. ఒంటరిగా ముద్దాయి ఎదుట నిలబడ్డాడు. జడ్జి కూచోమని కుర్చీ చూపించాడు. రామన్న చేతులుజోడించి కూచోడానికి నిరాకరించాడు. ఆ మర్యాదకు రామన్న ముగ్ధుడైనాడు.

జడ్జీ— రామన్నా. చాలా కేసులు విచారించాను. చాలామంది నేరస్థుల్ని చూచాను. కాని నీలాంటి నేరస్థుడిని గానీ, ఇలాంటి నేరాన్ని గానీ చూడలేదు.

ముద్దాయి— చిత్తం.

''నువ్వు నిజంగా ఈ నేరం చేశావా ?"

''నేరస్థుడి నేనండీ !''

''అది కాదోయ్ ! నువ్వు నీ చేతుల్తో నీకొడుకును చంపేవా అంటాను."

''అపరాధం నాదే ప్రభూ.''

"మాటకు మాట సూటిగా చెప్పవోయ్ !''

"చెప్పడానికేముందయ్యా ! నేనే నేరస్థుడిని ''

ఆ మాటల్లో ఏదో మడత గోచరిస్తూనే వుంది జడ్జికి. చివరికి గొంచెం నిస్పృహతో-

''ఏమోయి రామన్నా ! ఈ ప్రశ్నలన్నీ నేను నా ఉద్యోగం హోదాతో వెయ్యడం లేదు. అలా వేస్తే కోర్టులోనే అడుగుదును. నీ ప్రవర్తనలో నాకేదో చిత్రం కనిపించే ఒక పెద్ద మనిషి అడిగినట్లడుగుతున్నాను. అంతేకాదు. నీ విషయమైన సత్యం తెలుసుకోకపోతే అపరాధిని నేనవుతాను.''

జడ్జీ మాటల్లో సౌజన్యత, ఆభ్యర్థిత్వం రామన్నను కరిగించి నాయి. బందోబస్తుగా కట్టివేయబడిన దుఃఖానికి కట్టలు తెగిపోయినాయి. పాతాళజలకు గడ్డపార తగిలితే నీరుబికినట్లు దుఃఖం ఉబికి వచ్చింది. కన్నీరు ధారగట్టింది. రామన్న తల వంచినాడు. గద్గద స్వరంతో "ప్రభూ ! ఈ దీనుడింత గౌరవానికి, ఇంతటి ఆలనకు అర్హుడు కాడు"

"రామన్నా ! ఆ ప్రసక్తి వదిలెయ్యి. నీ గాథ ఉన్నదున్నట్టు చెప్పు. నన్ను న్యాయ వంథాలోనికి పోనీయకు. ఆ పాపం నా - కొడి గట్టకు"

ఆ మాటలు రామన్న హృదయానికి తగిలేయి. ఏనాటి క్రిందనో వదిలిపెట్టిన ఆప్తమిత్రుడు తిరిగి వచ్చిన తృప్తి తోచింది. ఇక తన గుట్టు దాచలేకపోయినాడు.

"ప్రభూ ! ఈ నిర్భాగ్యుని కథ నిశ్శేషంగా వినండి. ఇంతటి ఆప్యాయతతోనూ, ధర్మ చింతతోనూ తామడిగి నప్పుడు చెప్పకపోతే ధర్మం నన్ను హర్షించదు. ఇదివరకు చేసిన నేరం కంటే ఎక్కువవు తుంది."

జడ్జి మాటాడకుండా వింటున్నాడు...

"తమరు చిత్తగిస్తే మా పరగణాలో నేను పెద్ద సంసారుల్లో లెక్కండి. మీ దయవల్ల పెద్దలిచ్చినదే నూరెకరాలు కొంద్రా, దానితో బాటూ తోటా దొడ్డీ సమస్తం లోటు లేకుండా ఉన్నాయి. కుటుంబం చాలా సాంప్రదాయమైన కుటుంబమండీ ! నేను పెద్దలప్పజెప్పిన వస తిని వృద్ధి చేస్తూ కుటుంబ సాంప్రదాయాన్ని కాపాడుతూ వచ్చానండీ ! నిజానికి ఆ ప్రాంతంలో మంచొచ్చినా చెడ్డొచ్చినా నా చేతిమీదుగా నడు స్తోందండి."

"అవునవును. విన్నా అదంతా. అందుకే నాకు మరీ చిక్కు వచ్చింది."

"చిత్రం. వాస్తవానికి నాకు నా స్వంత వ్యవహారాలు దిద్దుకొనేందుకే తీరుబడుండేది కాదండి. పబ్లికు వ్యవహారాలతోటే రోజంతా సరిపోయేది. ఇంతెందుకు స్వామీ? నా మాటే మాటగా చెల్లిపోయింది ఇన్ని నాళ్ళున్నూ. కానీ ఇంట్లో మాత్రం ఒక్క లోటుండేదండి. చాలా కాలం వరకూ సంతానం కలుగలేదండి. భార్య కాపురానికొచ్చిన రెండు మూడు సంవత్సరాల నుంచీ ఆ లోటు కనుపించడం ప్రారంభమైంది. ఈ లోపాన్ని గురించిన బాధ మొట్టమొదట మా ముసలమ్మతో ప్రారంభమై క్రమంగా నా భార్యకు పాకింది. లోక వ్యవహారాల్లో నిమగ్నుడనైన నేను కొంత మొండికెత్తినా అప్రయత్నంగా నాకు ఇదొక లోపంగానే కనుపడి మనస్సుకు బాధకలిగిస్తూ ఉండేది. సహజంగా ఇంటి వ్యవహారాల్లో ముక్తసరిగా ఉండే అలవాటు వల్ల ఈ బాధను మ్రింగేసేవాడిని. మా ముసలమ్మ మాట అలా ఉండగా ఈ వాంఛ నాకూ నా భార్యకూ కూడా ఆవేదనగా పరిణమించింది. కాని ఆవిషయమైన ప్రస్తావన చేయడానికి గాని, ఒకరి బాధ ఒకరితో చెప్పుకోవడానికి గాని మేము సాహసించలేదు. క్రమంగా మా జీవితంలో మాంద్యం ఏర్పడింది గాని జీవితం మాత్రం యంత్రవతుగా నడచిపోయింది. నా భార్య అనేక నోములు నోచింది. మందులూ మాకులూ సేవించింది. నేను ఆ ఆవేదన మనస్సును బాధించకుండా ఉండాలని లోక వ్యవహారాల్లోనూ, ఏదో ధర్మ కార్యాల్లోనూ నిమగ్నుడనయ్యేవాడిని. ఇలాంటి స్థితిలో నాకు నలభై సంవత్సరాల వయస్సు వచ్చేటప్పటికి మా అదృష్టం పండిందనుకున్న రోజులు వచ్చాయి. నాభార్య గర్భిణి అవడం నాకు భార్య యెడల కొత్త మమకారం కలగడం తటస్థించింది. ఈశ్వరుని కృపవల్ల నాకు కుమారుడు పుట్టేడు. బ్రహ్మాండమైన సంతోషంతో

ఉత్సవం చేసుకుని మా తండ్రి రామయ్య పేరు పెట్టుకుని జన్మసార్థక మైనదని సంతోషించాము. అతి అపరూపంగా పెంచాము... కుర్రవానికి పది సంవత్సరాలొచ్చాయి. చదువు కప్పచెప్పేను. అందులో ఏమీ చురుకు కనుపడలేదు. చదువుకేమి బుద్ధి ప్రధానం కదా, అది తిన్నగా ఉంటే అంతే చాలనుకుని సరిపెట్టుకున్నా. కాని రోజు రోజూ అదీ అనుమానంలో పడింది. అసలే నాది ముక్తసరి స్వభావం. అందులోనూ లేకలేక కలిగిన ఆ నలుసును గట్టిగా మందలించలేకపోయాను.

కుర్రవాడికి పద్దెనిమిదేళ్లు వచ్చాయి. చదువు అట్టే అబ్బలేదని లోపల నాకు బాధ ఉండేది. కాని ఎవరి కర్మ వాళ్ళది. చదువుకోడానికి నేను అవకాశాలు ఇచ్చాను కదా. అంతకంటే నేనేం చెయ్యను అని సంతృప్తి పరుచుకునేవాడిని. మా నాయనెంత చదువు చదువుకున్నాడు? నేనెంత చదువుకున్నాను, కాని నా ఆశలన్నీ విఫలమైనాయి, నీతుంటే చాలనుకున్న ఆశ కూడా విఫలమైపోయింది.'' రామన్నకు నిస్పృహతో కూడిన వెర్రి దుఃఖం పొంగి మాటాడలేకపోయాడు. కాస్సేపటికి సంబాళించుకున్నాడు.

"నా కొడుకు కొంచెం త్రాగుతున్నాడని, పోకిరీ స్నేహాలుపట్టి జూదం జులాయితనంలోకి దిగేడనీ కర్ణాకర్ణిగా వింటూవచ్చాను. కాని ఎవ్వరూ నాతోమాత్రం చెప్పేవారు కారు. తల్లి ఒకటి రెండుసార్లు 'అబ్బాయి చెడ్డస్నేహాలు చేస్తున్నాడట. మందలించమని' చెప్పుతూ వచ్చింది. 'మనబంగారం మంచిదైతేసరి' అని నీళ్ళు నమిలేశాను. అప్పుడప్పుడు చూచాయగా మందలించే వాడిని. కొన్ని సార్లు ప్రత్యక్షంగా కూడా చెప్పిచూచాను. అంతకంటె చొరవచెయ్యడం నాస్వభావంకాదు. చెయ్యలేకపోయాను. అంతే. తుదకు వాడి దుర్మార్గం బహిరంగంగా చెప్పుకోవడందాకా వచ్చింది. నా పరువుకు కూడా తాకిడీ తగిలింది. లోక వ్యవహారాలు గురించి మాట్లాడుతూ కొందరు 'ఊరందరికీ

పంచాంగాలు చెప్పచ్చు. తనదాకా వస్తే తెలుస్తుంది.' అని వ్యంగ్యంగా దెబ్బలు కొట్టడం ప్రారంభించారు. మరికొందరు ప్రత్యక్షంగానే' లోకాని కంతా చెప్తావు నీతులు. నీ కొడుకుని సర్దుకోవేం ?' అని చెప్పుతూ వచ్చారు. అలాంటి రోజున కొడుకుమీద చిరాకుపడడం తప్ప ఏమీ చెయ్యలేక పోయినాను, చేసే అదునుకూడా తప్పి పోయిందేమో. అప్పటికప్పుడే నా పరువు కొన్ని అంతరాలు పడిపోయింది. కొద్దిరోజుల క్రిందట కొందరు పెద్దమనుష్యులు నాయింటికొచ్చి నేను నా పలుకు బడిని దుర్వినియోగం చేస్తున్నానని, కొడుకుని అచ్చోసి ఊరిమీదకు వదలిపెట్టేననీ, వాని ప్రవర్తనకి బాధ్యత నాదే అని ఘట్టిగా చెప్పేరు. అప్పటికప్పుడే వాని ఆకతాయితనం మితిమీరింది. నాకు శరీరం నీరై పోయింది. మాటాడలేకపోయాను. మౌనంతో నా అపరాధాన్ని అంగీక రించాను. నా ప్రారబ్ధాన్ని నిందించుకున్నాను. కొడుకుకోసం ఉబలాట పడినంత కాలంలో వెయ్యోవంతు కాలం పట్టలేదు ద్వేషం కలగడానికి. కొడుకును గట్టిగా మందలించాను. కాని వ్యవహారం ముదిరిపోయింది. కట్టు తప్పింది. నన్నే ధిక్కరించాడు...ఇకనెందుకు ?...ఆఖరు రోజు కథ చెప్తాను. సాయంకాలం ఇంటికొచ్చేసరికి పడమటి వీధి పెద్దమనిషి అతి ఆవేశంతో వచ్చి నన్ను అనరాని మాట అన్నాడు. అనడానికి సబబుంది. పడడానికి నేను అన్నివిధాలా అర్హుడనైనాను. ఆయన ఆడు బిడ్డను నా నిర్భాగ్యుడు అగౌరవం చేశాడు. వాళ్ళు నలుగురూ మెత్తగా సున్నంలోకి ఎముకలేకుండా వాడిని తన్నేరు. అంతటితో ఆగక వాడి మీద కేసు బనాయించి నాతో చెప్పడాని కొచ్చారు. మరునాడు పోలీసులు వాడిని అరెస్టు చేయడమే తరువాయి. నా యోగ్యత, నా కుటుంబ సాంప్రదాయం, ఆకాడి కొచ్చాయి. వాళ్లు తీవ్రంగా నన్ను తిడుతుంటే సిగ్గుచేత నేను భరిస్తే అదిగూడ వాళ్ళు అపార్థమే చేసు కున్నారు. నా మెత్తదనమే ఊరి కుపద్రవమని ఎత్తి పొడిచారు. నా

శరీరమంతా పోట్లు పొడిచినట్లయింది. హృదయం కుమిలి పోయింది. వాళ్ళను సమాధానపరచి చావడిలో కుర్చీలో పడ్డాను. పొంగివస్తున్న దుఃఖాన్ని ఆవేశాన్ని ఆపుకున్నాను. నా భార్య భోజనానికి పిలవడాని కొచ్చి నా వాలకం గ్రహించింది. జరుగనున్న సంగతి చెప్పేసరికి "అదునులో అదలించకపోతే ఏమవుతుంది. అనుభవించాలి' అంది. ఆమె కూడా ఆ బాధ్యత నా నెత్తినే వేసింది. ఆ రాత్రి నా కొడుకు ఇంటికొచ్చే దాక వాకట్లోనే కనిపెట్టుకున్నాను. రాత్రి తొమ్మిది పదిగంటలమధ్య తూలుతూ వచ్చాడు. కళ్లు జ్యోతుల్లా ఉన్నాయి. నాకేసిచూడకుండానే గభాలున తన గదిలోకి ఒక్క చెంగున దాటేడు. ఒక్క క్షణం నిదానించి లోపలికెళ్ళేను.

"ఎమబ్బాయి! ఏంపనిది ?" అన్నాను.

"ఏం"

"నీ కుటుంబ సాంప్రదాయమేమిటి? నీ అంతస్తేమిటి? నువ్వు చేస్తున్న పనేమిటి?"

"..............."

"కళ్లల్లా ఉన్నాయేం ?"

"తాగుడు..."

ధోరణి ముదిరిపోయింది. ఇదివరకెన్నడూ ఇల్లాంటి బహిరంగ ధిక్కారం లేదు. ఇక అలాంటి ప్రశ్నవేస్తే మాట దక్కేటట్లు లేదు.

"సాయంత్రమేదో అల్లరి జరిగిందటగా ?"

"అవును. మామూలు అల్లరే. కొత్తేమటి ?"

"నిన్ను అరెస్టుగూడా చేస్తారటగా ?"

"నన్నెవ్వరూ అరెస్టు చెయలేరు ?"

"ఏం ?"

''ఎవరికీ అందనుగా ః మానవ మాత్రుడి తరంగాదు.''

''అబ్బాయీ... ఏమిటీ నీకీకర్మం ?''

"ఇప్పుడిక మాట్లాడకు... ఇప్పుడుచెప్పి లాభంలేదు. అసలు నువ్వేకారణం నాస్థితికి''

"నేనా ! ఏం ?''

''ముమ్మాటికీ నువ్వే. నువ్వే''

వాడి కంఠంలోంచి ఆ మాటలు పిడుగుల్లా పడ్డాయి.

''నేనేమిచేశాను ః నీకేమి తక్కువైంది... ఇంతకూ నీకర్మ ఇలా ఉంది...''

''నాకర్మా... అవును. నీ కర్మకూడా ఇల్లాగే ఉంది...నాకేమీ లోటులేదు... నీ అలక్ష్యమే నన్నింత చేసింది.''

నాహృదయం కలుక్కుమంది. అట్లే హృదయం చిక్కబట్టుకుని ''నాయనా ః నీ మంచితనానికీ నేనడ్డొచ్చానా ?'' అని అడిగేను.

''అడ్డుకూడా రావాలీ ః నాకు తండ్రి సహాయం కావలిసిన రోజుల్లో నీకు తీరికలేదు. ఊరి వ్యవహారాలన్నీ చక్కదిద్ద గలిగేవు గాని నా బ్రతుకు దిద్దలేక పోయినావు. నా కర్మకునన్ను ఇదివరకు పెట్టనే వదలిపెట్టేవు. ఇక ముందరా వదలిపెట్టు'' అని బావురు ఏడ్చి తలఅటు త్రిప్పుకున్నాడు. ఆ స్థితిలో మాట్లాడి ప్రయోజనం దని నేను పొంగుతూన్న దుఃఖాన్ని సంబాళించు కోలేక బయటి కొచ్చాను. 'నువ్వే బాధ్యుడవు, నా కర్మానికి నన్నొదిలిపెట్టు' అనే మాటలు నా చెవుల్లో గింగిరు మంటున్నాయి. అప్పుడేకాదు ఇప్పటికీనీ. ఒక్క ఝామయినాక కొంచెం మూలుగు వినిపించింది. ఏమోనని

లోపలికెళ్ళి చూసేసరికి గుండె గుభేలుమంది. కుర్రవాడు మరణావస్థలో ఉన్నాడు. మంచంమీద ఏదో సీసాఉంది. అరవబోతే నోరు రాలేదు. నోరు తడబడుతూ 'నాన్నా, నన్ను శాంతంగా చచ్చిపోనియ్యి. ఇదే నువ్వుచేసే ఉపకారం. నలుగురినీ పిలిచి నా బ్రతుకల్లరి చెయ్యకు. ఒక్క క్షణం... నాకర్మ.... నీ కర్మ.... కుటుంబాని కింక కళంకం లేదు.' అంటూనే ఒక్క క్షణంలో నా చేతుల్లోనే ప్రాణం విడిచాడు. ఇక దాచటానికేముంది? గొల్లుమని తల్లిని పిలిచాను. ఆమె గొల్లుమని కూలింది కొడుకుమీద. తర్వాత ఏముంది? ఏడ్పులు, పెడబొబ్బలు. వాడి కోరికప్రకారం బ్రతుకల్లరి చేయకుండా నలుగురినీ పిలిచి ప్రొద్దున్నే ఈ చేత్తోటే దుమ్ము చేసొచ్చాను'' అని బావురమని ఏడ్చాడు. మాట తొణకలేదు.

అప్రయత్నంగా జడ్జిగారి కంటికొలకుల్లో నీటిబిందువులు క్రమంగా చేరుకుని చెక్కిళ్ళమీదికి ప్రవహించాయి. ఒక్క క్షణమాగి,

''రామన్నా! అయితే నువ్వెందుకిలా వచ్చావు? ఈ కేసేమిటి?''

''అయ్యా, చేయవలసిన తంతంతా జరిపించాక ఇల్లు వల్లకాడుగా కనుపించింది. అనుక్షణం 'నువ్వే బాధ్యుడవు! ఊరంతా చక్కపెట్టేవు. కొడుకు బ్రతుకు దిద్దుకోలేక పోయావు' అనే మాటలు హృదయానికి శూలాల్లా గ్రుచ్చుకొన్నాయి. అట్టే ఆలోచిస్తే అందులో సత్యమున్నట్లు తోచింది. చిన్నప్పుడు గారాబంచేత, మధ్యకాలంలో తీరికలేక, కొంచెం ముదురుపట్టాక అహంకారంతో కూడిన ప్రతిష్ఠచేత వాడి బ్రతుకును గురించి పుచ్చుకోవలసిన జాగ్రత్త పుచ్చుకోలేదు. చేతులారా కొడుకును చంపుకున్నాను. ప్రపంచం అంధకారమైంది. బ్రతుకుమీద సుతరాం ఇష్టంలేదు. నూతిలోనో గోతిలోనో పడి ప్రాణం పోగొట్టు కోవడానికి

అహంకారం, ప్రతిష్ఠ అడ్డమొచ్చాయి. తరువాతి గాథ నే చెప్పనక్కర లేదు. నాకు బ్రతుకు ఒక్కక్షణం ఒక్కయుగంలాఉంది. అపరాధిని... నన్ను వదలకండి .. నా ఆవేదనను త్వరలో ముగించండి..." అని సాష్టాంగ నమస్కారం చేశాడు రామన్న జడ్జీగారికి.

* * * *

పదకొండు గంటలకు సమావేశం కావాలసిన కోర్టు నాలుగు గంటలకు వాయిదా వేయబడింది. ముద్దాయితో జడ్జి ప్రైవేటు రూములో మాట్లాడే అపూర్వ విషయాన్ని గురించి కోర్టు ఆవరణలో కొంత లావా దేవీలు జరిగాయి. నాలుగు గంటలకు జడ్జీ ముద్దాయిని నిర్దోషినిగా నిర్ణయిస్తూ తీర్పు చెప్పేడు. జడ్జిమెంటుతో రామన్న గాధ యావత్తూ ఉదాహరించి తన అపూర్వ చర్యను సమర్ధించుకున్నాడు. మామూలుగా విడుదలైన కూనీ కేసు ముద్దాయిల్లాగ రామన్న ఎగిరి గంతెయ్యలేదు. నిస్పృహ, ఆశాభంగం అతని ముఖంమీద తాండవించినాయి. గ్రుడ్డివాడు తడుముకుంటూ నడచినట్లు డాకులో నుంచి బయటి కొచ్చాడు. ఇల్లు, వాకిలి లేనివాడులాగ శూన్య ప్రపంచంలో పడ్డాడు. కోర్టులో రకరకాల సంచలనం కలిగింది. గజపతిరావు నాయుడు మాత్రం బ్రతుకు జీవుడా అని తల తడుముకున్నాడు.

* * * *

రామన్న ఎక్కడెక్కడ తిరిగి స్వగ్రామం ఎప్పుడెళ్ళేడో ఎవకీ తెలియదు. ఒకరోజు తెల్లారేసరికి ఇల్లు తాళంవేసి ఉంది. లచ్చమ్మ కూడా అంతర్ధానమై పోయింది. తన యావదాస్తికి ట్రస్టు ఏర్పాటు చేసి, దానికి సర్వాధికారాలతో రిటైరుకానున్న జడ్జిగిరిరావు పంతులును యజమానిగాచేసి, కొడుకుపేరిట 'శ్రీరామ శరణాలయం' అనే పేరుతో అనాథ బాలబాలికలకు శరణాలయాన్ని స్థాపించవలసినదిగా నిశ్చ

యించి, అందుకు తగిన కాగితాలను సక్రమంగా సృష్టించి వాటిని గిరి రావు పంతులుకు అందజేశాడు. అందులో వుత్తరోత్తరాకూడా తనపేరు ఎక్కడా రాకుండా నిషేధించుకున్నాడు.

*　　*　　*　　*

రామన్న దంపతులజాడ ఎవరికీ తెలియలేదు. కాని ఆతనేర్పాటు చేసిన శరణాలయం విశేషమైన ఆడంబరం లేకుండా ఆ ఊళ్ళోనే అవిచ్ఛిన్నంగా సాగుతోంది.

(ఫిబ్రవరి, 1945)

# 23. ఊహా ఊర్వశి

—చాగంటి సోమయాజులు

వెళ్ళేను పెళ్ళికి వాళ్ళందరితోటీ. పడవనిండా కిక్కిరిసి కూర్చున్నాము. పదిహేను మైళ్ళు గోదావరిలో ప్రయాణం. ఎక్కింది ఏరువాక పడవ. పొంగుతూ తోసుకొచ్చింది సముద్రపు పోటు. తాటి చెట్టంత కెరటాల నెత్తి తిరగేస్తూ లేచింది గాలి. తెరచాపలు రెండూ బిగిసి పూరిస్తే కొయ్యలు కీచులు పెట్టాయి. ఎత్తి కుదేస్తూ ఇనప నాగలి లాగ పడవ నీళ్ళని దున్నుతున్నాది.

పడవ హోరెగరగొడుతూ పెళ్ళివారు గొడవ చేస్తున్నారు. విన వలసిన విషయాలే. మామ్మోలు మానవుల మురికి జీవితం అంతా వాళ్ల సంభాషణలో విమర్శకొస్తోంది. రంకులు, రోగాలు, కుతంత్రాలు, కృత్రిమాలు, పెళ్లిళ్ల, పురుళ్లు, అప్పొస్తులు, సర్వం వాళ్ళ పిచ్చాపాటీకి కీలకం అవుతున్నాది. జీవితాన్ని సారస్వతంలోకి ఎక్కించి విమర్శించ దలుచుకొన్న సాహిత్య పరులకి అదంతా చాలా ఖరీదైన ముడి పదార్థం.

పదహారేళ్ళ నా పెళ్ళాం వాళ్లమధ్య పెద్ద పేరక్కలా పేలాపన గోకి దిగింది. పదహారేళ్లదైతే యేం? ఇద్దరు పిల్లల్ని కని, అబ్బో, అమ్మ అయిపోయింది. అమ్మలక్కలతో సరిగ్గా మాట్లాడుతోంది.

ప్రసాదరావు పెళ్లి. ఆఖరి కెలాగైతేనేం అవుతోంది. అదృష్ట వంతుడు. రెండువేల కట్నం దావుకొట్టున్నాడు. పద్దెనిమిదేళ్ల పిల్లని

పెళ్ళాడుతున్నాడు. పుస్తె ముడేస్తేచాలు రెక్కట్టుకొని అదే గదిలోకి లాక్కెడుతుంది.

పెళ్ళి ప్రయాణంలో పుచ్చపువ్వులాంటి వెన్నెట్లో, నిండు గోదావరిమీద హెత్తారీ లేకపోయింది. పడవలో కళ్ళని కదుపుతూ ఒక్క పడుచుపిల్ల ఉంటే పడవలాగే మనస్సూ ప్రయాణం చేసును, గుండెలు పొడుకుణ్ణు. ఆడాళ్ళ జనాభా ఎక్కువగానే ఉన్నది. కాని అందమైంది లేకపోతే అట్టేపోయె పడుచుపిల్లకి కరవైపోయింది. అందికే యీ డంప్సు (dumps).

లగ్న సమయం. శుభ్రమైన పెళ్ళికొడుకు. ఎమ్మే చదివేస్తున్నాడు. పెళ్లికూతురు గుజ్జంలాంటి కొండముచ్చు. వొంటినిండా నగలు, జరీ చీర, తలనిండా పువ్వులు ధరించింది. అంచేత ఆమె నిడదవోలు స్టేషన్లో మనం చూచే సూచీ ముఖంకాదు. సర్కసు ఎరీనాలోకి అలంకరించి తీసుకొచ్చే ఆడకోతి.

మూడు ముళ్ళూ పడ్డాయి. తలంబ్రాలు పోసుకొన్నారు. పెద్దాళ్లకి కన్నుల వైభవంగా ఉన్నాది కల్యాణం.

నాకేం లెర్రా? ఎందుకొచ్చే నీ పెళ్ళికి? • ఈ మనుష్యుల మధ్యకి? మొగాళ్ళంతా గాడిదలు; విజ్ఞాన దరిద్రులు. ఆడాళ్లంతా పందులు. వాళ్ళ మొహాలు పిడతలు. మొగాళ్ళంతా తండ్రులు (పితృదేవో భవ); ఆడాళ్ళంతా తల్లులు (మాతృదేవోభవ)! ఆడాళ్ల చంకల్లోనూ, మొగాళ్ల తొడలమీదా, పందిరి రాటల కెగబాకుతూ పిలపిల్లాడుతున్నారు పిల్లలు.

మంగళహారతి పళ్లెం పట్టుకొని నలుగురమ్మాయిలు పాట ప్రారంభించారు. భ్రాంతి అనుకొన్నాను కాని సరిగ్గా చూస్తే సత్యమే. అందులో చిట్టి ఉన్నాది.

చిట్టి పంధొమ్మిదేళ్ళది. నా పెళ్లాంకన్నా మూడేళ్ల పెద్ద. నా పెళ్లాం పిల్లల తల్లి. చిట్టింకా అవివాహిత. పదివేలమంది పడుచులను చూస్తాము. అంతా సముద్రపు ఇసకలో అడుగుల్లాగ మనస్సులోంచి మాయమైపోతారు. చిట్టిరూపం చూదామంటే చెరక్కుండా మనస్సులో శాశ్వతంగా నిలిచిపోతుంది. ''ఎందెందు'' వెతకిచూస్తే ''అందందు'' దేముడు కనబడతాడు. కాని 'అందం' ఒక్క చిట్టిలోనే కనబడుతుంది.

ఒక్కొక్క స్త్రీ మనస్సులో బాగా ముద్రపడిపోతుంది. పదేపదే జ్ఞాపకాని కొస్తుంది. ఒక్కొక్క స్త్రీ ఒక్కొక్క రసాన్ని హృదయంలో ద్రవింప జేస్తుంది.

మాలక్షమ్మ జ్ఞాపకానికొస్తే కరుణతో కళ్ళు నానిపోతాయి. అంబాయమ్మ జ్ఞాపకానికొస్తే వొళ్ళు గంగ వెర్రులెత్తుతుంది. అవిణ్ణి గుమ్మంలోంచి 'ఛి ఛీపో' అనాలి. వాళ్ల లచ్చి జ్ఞాపకానికొస్తే ఇంతనా బొద్దుని గుండెకాయ కసాయివాడివై పోతుంది. లచ్చిని కొరతవెయ్యాలి. లేకపోతే పంజాబు పతాలానికి 'బాల్' చెయ్యాలి. చిట్టి జ్ఞాపకానికొస్తే? సింహాసనంవేసి కూర్చోపెట్టి ఆరాధన చెయ్యడానికి మనస్సు ఆయత్త మౌతుంది. అందుకు కావలసిన పూజా ద్రవ్యాలు అమర్చుకొంటుంది.

"ఏం చిట్టీ'' అని పలకరించాను. ఎంతో తహతహలాడి అవ కాశం చిక్కించుకొన్నాను.

"రాత్రి నిన్ను చూశాను'' అన్నాది చిట్టి.

"ఐతే పలకరించావు కావు!"

''ఎక్కడో మొగాళ్లమధ్య నున్నావు. ఉంటావా?''

"మధ్యాన్నం పోవాలి''

"మా వూరు రా."

''తప్పకుండా.''

"అంతటితో సంభాషణ అంతమై పోయింది. చిట్టిని నేనూ ఆకర్షించాను. అదిమాత్రం ఖాయం. కనబడ్డప్పుడల్లా ఎగాదిగా చూడందీ ఒదిలిపెట్టదు. చిట్టి నా మనస్సుని దెయ్యంలా పట్టుకొంది. ఒంటరిగా పడక కుర్చీలో కూర్చుంటే, ఎదురుగా నవ్వుతూ నిలబడుతుంది. కాఫీ తాగుతూవుంటే పీల్పు పీల్పుకీ దాని అధరంమీద కళ్ళు వాల్తాయి. నిద్రలో కలకాదు. జాగ్రదవస్థలో ఉండగా చిట్టి లీల - నిజమైన చిట్టి లాగే వెచ్చగా, బరువుగా మీదికొస్తుంది.

చిట్టితండ్రి కృష్ణారావు ప్లీడరు. రోజుకూలి పావలా అయినా తెస్తున్నాడో లేదో. పెళ్ళంటే మాటలా ! కట్నాలు పొయ్యాలి. ఈజన్మ కతగాడు పెళ్ళి చెయ్యలేడు. చిట్టికి పంధొమ్మిదో యేడు : నాకు పెద్దఆశ పట్టుకున్నాది. చెరువులో తామరలా ఆశ బుర్రంతా చుట్టుకుంది. నా ఆశకల్లా హేతువు నాపెళ్ళాం మళ్ళా కడుపు తోటుంది.

ఆడదానికి ప్రసవమంటే పెద్ద గండం. తల్లీపిల్లా ఏర్పాటు అయీ వరకూ ప్రాణాలు పిడికిట్లో పట్టుకోవలసిందే. ఈ మాటు ప్రసవంతో నా పెళ్ళాం విధిగా చచ్చిపోతుందని నిశ్చయించుకొన్నాను. పెళ్ళాం చావుకోరడం చాలా జాలికరమైన విషయం. ఆమెతో తృప్తి పొందక పోతే పైతిరుగుళ్ళు తిరగొచ్చు. తిరిగినా నాపెళ్లాం ప్రతిఘటించదు. అంద వికారి అయిన పెళ్ళానికి ఆరోగ్యం. అడకువ, మొగుడంటే వెర్రి వ్యామోహం, ఏవంకపెట్టి తిడదామన్నా అవకాశమివ్వని ప్రవర్తనా ఉంటే ఎలాగ చావడం? దాని చావుకోరడం ఘోరాతి ఘోరం. కాని నా చిటికినవేలు కింద పెళ్ళాలరేఖలు రెండున్నాయి. ద్వితీయం ఎలాగూ తప్పదు. పెళ్ళాం చచ్చిపోవడం, చిట్టిని పెళ్ళాడ్డం ఖాయం.

"రెండోపెళ్లి వాడికిస్తారా" అని సందేహించడానికి నా విషయంలో భయంలేదు. చిన్నప్పుడే పెళ్ళయింది కాబట్టి పిల్లలు కలిగారు.

పట్టున పాతికేళ్ళులేవు. నాపెళ్ళాం కన్నా చిట్టి మూడేళ్ళు పెద్ద : నేను కట్నం అడుగు తానేమోఅని వాళ్ళే భయపడాలి. "రెండోపెళ్ళికి కట్నాలుకూడా ఎక్కడ" అండానికి నా విషయంలో వీల్లేదు. నేను తండ్రికొక్క కొడుకుని. నాలుగు డబ్బులున్నవాణ్ణి. నాలుగు డబ్బులు తెస్తున్నవాణ్ని. ఇలాగ పెళ్ళాం చచ్చిపోతే అలాగ చిట్టితో పెళ్ళి అయిపోతుంది.

ఈమాటు నావివాహం ఆదర్శప్రాయంగా జరగాలి. నాచిత్త సంస్కారం ఊరికే పోకూడదు. పూర్వంపెళ్ళి ఐదురోజులు. పెళ్ళి వారి ప్రాణాలు తీస్తూ పీకలమీద కూర్చునేవారు. ఇప్పుడు పెళ్లంటే వోరాత్రి. మర్నాడంతా మర్యాదగా వెళ్ళిపోవలసిందే. ఏకరాత్రి వివాహం సంస్కరణ రీత్యాముందడుగే.

నా సంస్కరణ మరీ విపరీతం. పెళ్ళంటే ఇద్దరు వ్యక్తుల వ్యవహారం. ఇద్దరు సాక్షులూ, రిజిష్ట్రారు అవసరం. ఆజ్యహోమాలు, పురోహిత సంభావనలూ, డిన్నరు పార్టీలు, అన్నశాంతులూ పనికిరావు. కాణీ కట్నం పుచ్చుకోను. పెళ్ళానికి పసుపూ, కుంకం పెట్టక్కర్లేదు. పెళ్ళి సంతకాలు కాగానే చకోర దంపతులమై పోతాము. వెన్నెల్లో కెగిరి పోతాము.

మా యిల్లంతా పాడు పాడుగాఉన్నది ముందు డాబామీద మేడ య్యాలి. స్ప్రింగు మంచంకొని పట్టుపరుపు కుట్టించాలి. బెంగుళూరు సంగి కెళ్ళి రెండుకుక్కలిని తేవాలి. ఇదంతా చిట్టి పెళ్ళామైతే మాట. లేకపోతే ఏముంది ? చిలకలు చెక్కిన మా తాతయ్య పందిరి మంచం, అట్టలు కట్టిన మానాన్న పరుపు, ఉచ్చకంపు కొడుతూ నా పెళ్ళాం నులకకుక్కి కలిస్తే నా పడగ్గది ! చెప్పే దేమిటి ? అవన్నీ

నా పెళ్ళాంతో మాయమైపోయి చిట్టితో నాయిల్లు ఒక మొగలాయి మహలై పోవాలి.

హయ్య కాకినాడెళ్ళేను! చిట్టి పిలిచిందని, నా పెళ్ళాం ఎలాగా చచ్చిపోతుందని పెళ్ళికూతురు చూపులకేళ్ళేను: రామారావు పేటలో కృష్ణారావు గారింటికెళ్ళేను.

"ఏంవోయ్ జ్ఞాపకమున్నాం? ప్రసాదం పెళ్ళిలో కాబోలు చూశాం. కూర్చో. మరేమిటయ్యా మీవూరి విశేషాలూ? మీరాజుగారి పిల్లలెక్కడున్నారు?" అంటూ కృష్ణారావు గారడిగారు.

"అక్కడే ఉన్నారండి."

"ఎప్పుడేనా కనబడతారా?"

"అప్పుటప్పుట,"

"మనం కోట్లో కెళ్ళాల్నా?"

"ఖిలేదారు గారి నడిగి."

"రావాలోయ్ విజయనగరం. మీ మహారాజ కుమార్ కూడా మట్టివాడే. యీమధ్య ఆయన స్టేటుమెంట్లు చెడ్డఘాటుగా ఉంటున్నాయి."

ప్లీడరుగారు విశాఖపట్నం హార్బరుమీదా, వాల్తేరు విశ్వవిద్యాలయంమీదా అరగంట హస్కుకొట్టేరు. ఇంతట్లో ప్లీడరుగారి పెళ్ళాం, చిట్టి నీళ్లబిందెలో కాళ్ళు ముంచెళుతూ కనబడ్డారు. చిట్టిని చూడ్డం అయింది. ప్లీడరుగారి పెళ్ళాం కుశలప్రశ్న వేసింది:

"ఏంవోయ్ ఎక్కడున్నుంచేవిటి? పురుటొద్దులు కాబోలు— నీపెళ్ళాం అటూఇటూ తేలిగ్గా తిరుగుతున్నదా?"

"కులాసాగానే ఉన్నాడండి"

"ఇక్కడా, పుట్టింటా ?"

"మా యింటే"

"సరిసరీ. అన్నట్టు మూడో పురుడుగదూ...... ఖోయనాని కుందేం" అన్నాది. ఆ మాట ప్లీడరుగారనలేక పోయారు.

"ఉంటాను లెండి."

"వాస్తూపోతూ ఉంటేనే చుట్టరికం. ఏవండీ విశాఖపట్నం వాళ్ళ మాట ఇతనితో చెప్పేరూ ?" అని మొగుణ్ణడిగింది.

"జ్ఞానేవ్ మరిచి పోయాను" అన్నాడతను.

"సరిసరీ! అలాగే ఉంటుంది మన వ్యవహారం. ఇంకెప్పుడు చేస్తారండీ పెళ్ళి ? కన్యాదాన మంటే గోదానమా ? ఇద్దరు పిల్లలు పుట్టేకా, వో చెంప నెరిసేకా ?"

"చిట్టికేనా పెళ్ళి ?" అనడిగేను.

"ఇంకెవరికోయ్ ?"

"తొందరేవిఁటి లెండి ?"

"తొందర కాకేమిటోయ్ ?"

"అంత తొందరైతే నాకు చేసీయండి."

"ఫో" అన్నాది చిట్టి.

"నాకన్నా మంచివాడు దొరుకుతాడా ?"

"అలాగే అయితే అడిగేవ్ ! అబ్బో ! నీ పెళ్లాం జుట్టట్టు కుంటుంది" అన్నాదావిడ.

"పెళ్ళాన్నాది లేస్తాను."

"సరి సరీ! ఆ మూడోపిల్లో, పిల్లాడో పుట్టనీ తాపీగా వాడి లేద్దువుగానీ. నాయన్నాయన! దేముడిలా గొచ్చావు. ఆ సంబంధం గురించి కనుక్కొని భోగట్టా రాసి పెట్టు" అంటూ వీధిలోకి తోవతీసింది. తల్లి మాట్లాడుతూఉంటే పక్కగా చిట్టి చక్కగా నిలబడ్డాది. చిన్నమాట కలిపింది. నా కోరిక సిద్ధించింది. చిట్టిని నేనూ, నన్ను చిట్టీ తనివితీరా చూచుకొన్నాము. చిట్టి నీళ్ళు తెళ్ళడం నామర్దాగా కనబడ్డా ఆమె చంకలో రాజమండ్రి రేకుబిందె అందంగానే అమిరింది.

భోజనమైంది. కృష్ణారావుగారు విశాఖపట్నం పెళ్ళివారి ఎడ్రెసు ఇచ్చి వాళ్ళస్థితిగతులు కనుక్కొని రాయమన్నారు. మంచి ఉద్యోగమే. సావిట్లో ప్లీడరుగారి టేబిలు మీద 'జాన్ోలండన్' పత్రిక కనబడ్డాది.

"ఇదెక్కడిది ?" అనడిగాను.

"ఇంకో ప్లీడరు గారిది. ఇదేకాదు. క్రైటీరియన్, మెర్క్యురీ, డిబ్బాదిరుగుండం తెప్పిస్తాడు. ఏంటో, అతనిలాంటి పత్రిక లన్నింటికీ డబ్బు తగలేస్తాడు. శుద్ధ క్రేకు." అన్నాడు కృష్ణారావుగారు.

'జానోలండన్' వగైరాలు తెప్పిస్తున్నవాడు శుద్ధక్రేకు! ఆ సంచిక పేజీలు తిరగేస్తే నేటి సాగస్వతంమీద ఒక సనాతనుడి విమర్శ కనబడ్డాది ఒక్కపేరా చదువుకోలేక పోయాను. అవతల గదిలో చిట్టి తిరుగాడు తున్నాది. అంత దగ్గరలోఉన్న చిట్టికీ, నాకూ ఎంత ఎడమైనా ఉన్నాది. దాని వెనకాటే తిరిగే భాగ్యం ఉంటే! చిట్టి చిన్న మోషాపాటిస్తున్నాది. అంచేత వాళ్ళ సావిట్లో కూర్చోడం ముళ్ళ మీద కూర్చున్నట్టు ఉన్నాది.

"వస్తాను" అని లేచాను.

"బాబ్బాబూ ! ఉత్తరం రాయి. కట్నాలంటే నావల్లగాదు. లాంఛనాల్లో లోపంచెయ్యను. వొచ్చినవాళ్ళకింత అన్నంపెడతాను. ఇంత అన్నం ఉంటే ముడెట్టేస్తాను" అన్నాడు.

"కనుక్కొంటాను" అని బయలుదేరాను.

విశాఖపట్నంవెళ్ళి చిట్టికి సంబంధం కుదురుస్తానా ? వెళుతూనే ఉత్తరం రాశాను—వాళ్ళ కప్పుడే బరంపురం పిల్ల నిశ్చయమైపోయిం దని భయంపట్టుకొంది. నాకు తెలియకుండా చటుక్కుని చిట్టికి పెళ్ళయి పోతుంది. కాని ఎంత దుస్సాధ్యమైనా సాధ్యంగానే కనబడు తుంది. చిట్టికి పెళ్ళే అయితే దాని మొగుడు తారున చస్తాడు. అప్పుడు విధవని పెళ్ళాడి సధవని చేస్తాను. చిట్టి విధవ అయితేనే మంచిది. నేను ప్రాధేయపడుతూ పెళ్ళాడితే నా మీద స్వారీ చేయొచ్చు విధవ అయితే దీనురాలై పోతుంది. దీనురాలిని పెళ్ళాడినవాడు దేముడై పోతాడు.

ఒకనాడద్ధరాత్రి నన్ను మా వాళ్ళు లేపి మంత్రసాన్ని తీసుకు రమ్మన్నారు. చీకట్లోపడి దేముడా అని వెళ్ళేను. మంత్రసాని రాకుండానే నా పెళ్ళానికి పురుడొచ్చింది. ఆడపిల్ల పుట్టింది. ఇహన్నేను జాగ్రత్త పడకపోతే పెళ్ళాం ఏటేటా తేలిగ్గా కని ఇల్లు నింపేస్తుంది. పురుడు దానికి గండంకాదు.

కాని చిట్టిదెయ్యం నన్నువొదిలి పెట్టలేదు. కోర్కెలు అణచి వేస్తే మనోవికారాలకింద తేలుతాయి. కోర్కెలు సాఫల్యం చెయ్యేదమో లేక జయించడమో మనంచేస్తూ వుండాలి. చిట్టితో కాపురం చెయ్యక పోతే ఇకేం జన్మ? ఆ కోర్కెతో నేను కుంగిపోవలసిందేనా? లేదు లేదు. వాంఛానివృత్తికి మార్గాలున్నాయి. లేని ఊర్వశితో కాపురం చెయ్యడాని కవకాశాలున్నాయి.

పడక కుర్చీలో మధ్యాహ్నం కునుకు. సగంనిద్రలో తలగడా మెత్తదనం ఊర్వశి చెక్కిళ్ళదనుకో, ఊర్వశి సాక్షాత్కార మౌతుంది.

మెత్తటి పరుపుమీద పడుకుని పల్చటి కంబళీ ముసుగువెయ్యి. ఊహించు. ఊర్వశి నీ పక్కలో ఉంటుంది.

ఏటొడ్డుకిపోయి ఇసక తిన్నెక్కి-కూర్చో. భావగీత మోటి నీ కభిమానమైనది కూనిరాగం తియ్యి. భావ ప్రపంచంలోకెళ్ళి మనస్సుని ఊర్వశివైపు మళ్ళించు. నీకా్కవలసిన సన్నివేశాలు సంప్రాప్త మౌతాయి.

నీపక్కలో పెళ్ళాముున్నదా, సదవకాశం ఉన్నాది. పెళ్ళాన్ని ప్రతిరాత్రీ ఊర్వశి అనుకో. చీకట్లో కళ్ళకి కాదండానికి హక్కు పోతుంది. మనస్సుతో చూడు. మసిబొగ్గు మాణిక్యమైపోతుంది.

నిజంగా ఊర్వశిని తెచ్చి నీకప్పజెప్పితే నువ్వు చాలా చిక్కుల్లో పడిపోతావు. సంసారికి ఊర్వశి దరిద్రదేవత, దుఃఖకారణమూ అవు తుంది. ఊహా ఊర్వశి రాజయోగాన్ని సిద్ధింపిస్తుంది. ఊహా ఊర్వశిని పట్టుకొని 'చింబరోజో' అగ్నిపర్వత శిఖరాంచలాలకి షికార్లుపోవచ్చు. ఆఫ్రికా ఎడారిలో బిడారి ప్రయాణంచేసి తోవలో నువ్వూ, నీ ఊర్వశీ గుడారం వేసుకొని ఉక్కాపీలుస్తూ లొట్టిపిట్ట పాటల్తో కాఫీ పెట్టుకో వచ్చు.

ఆ విధంగా చిట్టితో 'ఊహా ఊర్వశి' కాపరం చేస్తున్నాను. భావకవుల ఆవేశం నాకు పట్టుకొందనుకుంటారు కాబోలు. భావ కవిత్వంమీద అనాదరణా, కవితలో వాస్తవికత, అతివాస్తవికత అంటే అభిమానం ప్రబలిన తరువాతనే నాయీ మనోజాడ్యం. మనోజాడ్యం కాదు, మనోజ్ఞత.

నాభార్య మళ్ళాగర్భవతి అయింది. ఇట్టే తిరిగొచ్చేయి నవ మాసాలూ! కొడుకుట్టేడని అత్తవారు శుభలేఖ పంపారు. బారసాల కెళ్లేను. బారసాల్లూ, సత్యన్నారాయణ వ్రతాలూ ఇష్టం లేనివే. అయితే నేం? శుభ్రమైన చాపూ, పెళ్ళానికి చీరా, కొడుక్కి బంగారపువొత్తులూ మామగారు పెట్టేరు. అంచేత పెళ్ళాంతో పీటలమీద కూర్చుని అత్తారిని సంతోష పెట్టేను.

నెలకొక్క రోజు తక్కువచేసి, నడ్డీబిగించి పెళ్ళాం చంటాడితో టింగురంగా మని వొచ్చింది. కాని చిట్టికింకా వివాహం కాలేదు. నాకు నలుగురు సంతానం.

చిట్టికి పెళ్ళికావడం ఇప్పటికీ నాకిష్టం లేదు. పెళ్ళే అయిపోత్తే జెలసీతో గింజుకు చస్తాను. చాలాకాలం ఎవరిదగ్గరా చిట్టి అన్న అందాల రాణి పెళ్ళికున్నాదని మాటవరసకైనా చెప్పలేదు. ఎవడైనా పెళ్ళా డేస్తాడేమోనని భయం! ఎంతమంది పెళ్ళికొడుకులైనా చిట్టిని చూచారు. అందం ఎవడిక్కావాల? గజిటెడు ఆఫీసరుగారి కూతురు కోత్రైనా సరే, తెనుగు ప్రొఫెసర్లు పెళ్ళాడతారు. చిట్టికింకా పెళ్ళికాక పోదం, జీర్ణించిపోయినా, నాలో దురుద్దేశాలని రేపుతున్నాది. చిట్టి కింకా పెళ్ళి కాకపోవడం తెనుగు యువకుల రసజ్ఞతా దారిద్ర్యం వెల్ల డిస్తున్నాది.

చిట్టికింకా వివాహం కాలేదు. నాకు నలుగురు సంతానం. ఇప్పుడు చిట్టికి ఇరవయ్యొకటో ఏడు నిండిపోయింది. చిట్టి నాపెళ్ళాంకన్న మూడేళ్ళు పెద్ద.

(మార్చి, 1943)

# 24. స్మరణ

—మాధవపెద్ది గోపాలకృష్ణగోఖలే

అదొక చిన్నపూరు. ఆ పూళ్ళోవున్న చింతల తోపుకు మయాన పున్న కుంటకు అవతల చిన్నచిన్న దుబ్బులు వుండిపున్న ఖాళీ ప్రదేశానికి చివరగా వుంది కనకమ్మా, ఆరేళ్ళ కొడుకు వెంకటాద్రీ వున్న యిల్లు.

దగ్గరగా అటూయిటూ కొన్ని యిళ్ళవున్నా, గుబురైన చింతల తోపు కావటంలో వెన్నెల రాత్రిళ్ళలోనే జీబురు మంటుంటే, యింక చీకటి రాత్రిళ్ళలో చెప్పనే అక్కర్లా. పురుగూ బుడతా అంటూ తిరుగుతూ నిముషాని కోకేక పెడుతూవుంటై వింతవింతగా.

నల్ల పరదాపట్టాలలాగ చల్లచల్లగా మేఘాలుకమ్మి ఆరాత్రి వాన చిటపట పడ్తుంటే, కుంట ఒడ్డునచేరి సంతోషంకొద్దీ గంతులేస్తూ వాలుగా వున్న ఓ బేరంకప్పను గభాల్న ఒచ్చి పట్టుకుంది, ఓ గుమ్మడిమచ్చల జెర్రిపోతుపాము. కప్ప భయంతో బెకబెక అరుస్తూ కొట్టు కుంటున్నది అమ్మపక్కలో పొర్లుతున్న వెంకటాద్రిని కలతపెడ్తూ.

''ఆ అరిసే దేంటే అమ్మా?''

"కప్పనేందో పాము పట్టుకున్నట్టుంది!"

చటుక్కున అమ్మను కరుచుకున్నాడు వెంకటాద్రి, భయంతో ఒణకుతూ.

''అమ్మా, బయమే !''

''బయం దేనికిరా, ఎంకూ ?''

"సూడమ్మా ఎత్తా ఏడుత్తుందదో, ఆ కప్ప ?"

''నువ్వు ఏడుత్తే నిన్నెవురు సూత్తారూ ?''

''నువ్వేం గామ్మా !"

"అమ్మ సచ్చిపోయిందనుకో అప్పుడూ ?"

"మా అమ్మ సచ్చిపోకేం ! మా అమ్మ మంచిదిగా ?''

"మంచోళ్ళే తొందరగా సచ్చిపోతారు ఎంకూ ! నేను మంచి దాన్నికాను''

''నువ్వు మంచిదానివి కాకుంటే అత్తా, ఆ పాము ఆ కప్పను అత్తా సంపుతుంతే, నేను బయపత్తుండే వోన్నికాదమ్మా !''

"మడుసుల్ని మడుసులు విరిసి సంపుక మింగి తింటుంటే, పాములూ, కప్పలూ ఏంలెక్కలో కొచ్చి బయపెడత్తై, ఎంకూ ?''

"బయవేఁ అమ్మా !'' అంటూ బావురుమన్నాడు వెంకటాద్రి.

''సంపుతా, యదవా, బయం అన్నావంటే.''

మరికొంచెం పొర్లింది వెంకటాద్రి కడుపు మెరుస్తున్న ఆ నీలాల కళ్ళకుండా.

''ఎదవబతుకులు !'' అన్నది కనకమ్మ, ఎంతో లోతునుండి.

"—ఆఁ ?—" అన్నాడు వెంకటాద్రి అమ్మ మొహంకళ్ళ చూస్తూ ఆమాట తనకేమన్నా పనికొస్తుందేమో అన్నట్టు.

''నేనో సిన్నకతలాంటిది సెబుతా, యీపాలి సరీగ్గా యింటావా ?"

సెప్ - సెప్ – సెప్పమ్మా."

ఆ కప్ప యింకోసారి ఆఖాలి అరుపు అరిచే ముందుగా అందులో కలిపి కనకమ్మ ఆ చిన్నకథను మొదలుపెట్టింది, కప్పరొద తెలియ నీయకుండా.

* * * *

"అదొక సిన్నవూరు, ఎంకూ! ఆవూర్లో యిద్దరు పుగాకు యాపారస్తులుండారు. ఒకడేమో బాపనాయన. పేరు సూరయ్య. రెండో ఆయన కాపు. పేరు ఏదవుతే ఏం! మొదట్లో యీ పుగాకు యాపారం సాగించింది కాపాయిన. పుగాకును ఆడీడ సౌకదరకు కొంటూ, దరలు లెగిసినప్పుడు బత్తీలలో వుంద ప్యాక్టరీలకు మంచి లాబం కాడికే సరఫరా సేత్తుండేవోడు. కమేనా ఆ లాబాలమీన మెట్ట బూములు కొని సొంతగా లంకపుగాకు పండిచ్చి యీవూరి జనానికి యింకో సెబ్బర పుగాకు రానీకుండా, తన మంచి పుగాకును సరసంగా అమ్ముతా, నలుగుర్లో కాత్తె పలుకుబడి సంపాదిత్తా, మడిసే మంచోడు గనక మంచోడనిపించు కుంటాడు ఆ నలుగురిసేత, యాపారం వుర్ది సేసుకుంటూ.

"అంతకు మునుపు ఆళ్ళాళ్లకు ఏం యవారా లుండయ్యో మన కవుతే బాగా తెలవదు, — యిదంతాసూసి ఆ ఆశపాతక బాపన సూరయ్యకు కల్లుకుట్టినై. ఆతప్పుడు లెక్కలూ, ఆ బూటాకోరు ప్యాంసరీ నోట్లూ, ఆ తప్పు దెవాలేందో ఆటితో కుదటన పడకూడదూ? వుఁహూఁ! అట్టాకాక తనూసాగించాడు యీ యాపారం. అంతమాగాని బూమి వుండా కడుపునిండక, పక్కోళ్ళ నోట్లో దుమ్మేసి ఆ దుమ్ము మడుసుల్నే యిరిసి మింగుతేగాని తన కడుపాత్రం తగ్గదన్నట్టు. కోడి యధవ! ఆ ఏరుకు తింటానికి ఎంత నై పోగు సెత్తయినాసరే!—"

"పక్కింతి సెంచాయోళ్ళ కోళ్లనై సెత్తనే కదమ్మా తింతం ?" అన్నాడు వెంకటాద్రి మధ్యగా, తనకు తెలిసిందేదో.

"నువ్వు మద్దెన కుంటిపళ్ళెలు ఎయ్యమోకు ! చెంచాయి కోళ్లనై సెత్త తింటంలో గనతేం వుందీ ! అది మడిసికోడి. కోడి కుండాల్సిన లచ్చనాలు అంతకు ఎక్కువగా యింకెవుర్లోనూ వుండవ్— ఆడికి తప్ప ! అని చీత్కారించింది కనకమ్మ ఆ లోపల వుండే మంట బయట పెడ్తూ.

"వుఁ !"

"వూఁ ఏముందీ ! కమేనా సూరయ్యా సాగించాడు పుగాకు యాపారం ! ఆళ్ళకేం, ఆత్తిపరులు. ఎంత యిట్టం లేకున్నా నలుగురూ ఆయినను తాలం ఎయ్యక తప్పదు అవసరాన్నిబట్టి. బత్తీలల్లో నైనా ఆ కోడి కూతలేకూసి పని సాగించుకున్నాడు. ఎంతదగా యాపారాని కన్నా పాలుబడ్తా. పుగాకు కరుజు ఎక్కువగా వుంటంవల్ల సరిపోయింది గాని, బజార్నపడి బలానోడి యాపారం యింతని దగుల్బాజీ యవారాలు డిపిత్తుంటే, పది కూతల్లో ఓ కూతన్నా నమ్మరూ, యినేజనం ? ందుకు నమ్మరూ ? కాపాయిన ఎంత మంచోడను కుంటారో అట్టాగే ంత సెడ్డోడను కుంటానికి ఏంనాయం అక్కర్లేక పోయినా సాలా ుటుకు సబబుగా వుంటుందిగాని, పుగాకు కరుజు ఎక్కువగా వుంటం ల్ల యిద్దరికీ పోటీతో పనిలేకుండా వుంటానికి యీలుంటూండగా, సరికొద్ది నాలుగు దబ్బులు తెచ్చుకుంటూండగా, నిన్న మొన్నటాయినకు గిట్టక అవతలోడు ఎందుకు బాగుపడాలని తడిగుడ్డలు సానబడ్తుంటే, దానికేం నాయం పాయం వుండక్కర్లా ? మంచిసెడ్డ ఆడ ఏం యిశా రించక్కర్లా ?"

"వుఁ."

"అసలు తమాశా యేముంటుందే, 'ఏం కాపాయినా, బాగుందావా?' అంటాడు బాపనాయన. 'ఏముందండీ సూరయ్యగారూ, మీరూ మీ వోరంతా బాగుండారా?' అంటాడు కాపాయిన మొగం యింత సేసుకుని, యినయంగా. 'నీ యాపారం ఏమన్నా లాబంగా వుందంటోయ్' అంటాడు సూరయ్య. 'మరేటండీ. యాతదండీ, తమకు తెలవకుండా,' అంటాడు కాపాయన గోల్లుగిల్లుమంటూ. 'యియాల దరలు పెరిగినయ్యంట. ప్యాక్టరీకి బత్తాలు ఎత్తుదామేంటీ?' అంటాడు సూరయ్య. 'సిత్తం. మీరు నట్టబడ్తే నామటుకు నట్టం తగల్దటండీ?' అంటాడు కాపాయిన, యీ యవారం?' అంటాడు కాపాయిన, యీ యవారం తన పెళ్లానికి ఎంత యిట్టంలేందీ తెలవకుండా.

"ఓ రోజున కాపాయిన పెళ్లాంతో అన్నాడు — 'మన లంక పుగాకు మెరకబూమి రెట్టింపు దరకాడికి సూరయ్యగారు కొంటానంటున్నాడు. అమ్మేద్దామంటావా' అని పెళ్లానికి సెర్రుమని పిత్త. 'బానే వుంది! ముద్దెన నాదా ఎట్టాపెత్తనం? యాపారస్తుడివి నువుగాని, అదెట్టా తగలబడ్తే నాకేం! కాపాయిన యవారం మలుపు తిరిగిందని నలుగురనుకుంటుంటే అనుబవించేది నేనుగాని! మంచి దరలుండయ్యని నీ సేత యాబై కాడికి అమ్మిచ్చటం ఏందీ, యనకాడ్తే తను అరవై కాడికి రాబట్టుకోటంఏందీ! యింతదని ముంగల యాపారానికి, యిప్పటిదానికీ యాదన్నా సంబంధంవుందీ? సేతులు యిరుసుకుని సంపాదించుకున్న బంగారం లాంటి బూమిని అమ్ముతాడంట! నీ బూమికొని. ఆ వుంద బత్తాలు కొని ప్యాక్టరీలల్లో, వూళ్ళల్లో నీపేరు ఎనకేత్తుంటే, యింకా కొన్ని రోజులకు యీ కాపాయిన మొగం సూదను ఎవురికి సత్తుందీ, బలాన సూరయ్య అంటారుగాని! అదు నిన్ను పాతాళ్లోకానికి అనగ తొక్కుతుండాదని వూళ్లో అంతమందీ అనుకుంటుండా నీకు తెలవ

కుండా పోతుందదేం ? కాపు దొరలకు యాపారా లెందుకోయ్ అనికాదూ నే బావికాడికెల్లి నీలు తెత్తుంటే ఆ పెద్దమడిసి బజార్లో అంటుందదీ ? అయ్యోదాత ! ఎనకటికి మల్లే బలాన యాపారస్తుడి బార్యేనని యిక ముందు సెప్పుకు మురిసే బాగ్గెం నాకు పట్టుంది. గనక తగుదు నమ్మాంటు సెప్పనొచ్చానా !' అని పెల్లాం బాగా నూరిపోసే తలికి మల్లీ తెప్పరిల్లుకుని కాత్తెదారిన పడ్డాడు కాపాయిన.

"ఓ పాలి పరీచ్చగా సూరయ్య కళ్ళల్లో సూదులు గుచ్చు కున్నట్టు ఆ ఏడు కాపాయిన పుగాకుపంట బంగారపు పంట పండింది, బారెడు బారెడు పాయలేసుకుని. ఆ పంట తన కమ్మమన్నాడు సూరయ్య. కట్టపడి పండించిన ఆ పంటమీన తనకే యెక్కువ అబి మానం వుందన్నాడు కాపాయిన, తన పెల్లాంయిరబే మురిసేటట్టు. 'నీకెంత అబిమానంవుందీ నాకుమటుకు తెలవదంట్రా ? మాట సామెతకు అడగాల్సొచ్చింది గాని !' అని ఎల్లిపొయ్యాడు సూరయ్య, పళ్ళు కొరుక్కుంటా.

"మరసనాడు కాపాయిన మెట్టబూమి కాడికెల్తే ఏముందీ ? యింకో రెండుదినాల్లో పాకానికి రానుంద ఆ బంగారపు పాయలంతా గొడ్డుమంద సీలికలు సీలికలుగా తొక్కి కవిలి పరిసివుందయ్యా మెట్టబూమి సేలంతా.

కళ్లెంటా నీటిబొట్లను బొటబొట జారుత్తా సేల మయాన నెత్తిన సేతులేసుకుని వలవల ఏకదారగా కాపాయిన ఏడుత్తుంటే, పక్కనవుండే సుందోళ్ళ పిల్లోడొచ్చి సెప్పాడు 'సూరయ్యగోరి జీతగాడు ఎంకయ్య ఆళ్ళ బర్రెల మందతో రేత్రి మెట్టదిబ్బలమీద సాలాసేపు ఆడు కుండా' దని.

"ఆ కాకమీన కాపాయిన పోయిన పోటం సేతికందిన ఓ ఒసి కఱ్ఱ వూద బెరుక్కుని వూళ్ళోకి లగెత్తుకుంటూ ఎల్లి, అప్పుడే సూరయ్య యింటోనుండి బయటి కొత్తుండ ఎంకయ్యను రాత్తామీన పడేసి ఒల్లు సితకకొడ్తుంటే ఆడు పెట్టిన రొదకు నలుగురూ సేరి తన్ను పెడరెక్కలు యిరిసి పట్టుకుండేంత వరకూ తెలవలా అసలు తనేం సేసిందీ.

''యీ సమాచారమంతా కడుపుతోవుండ కాపాయిన పెల్లాంయిని ఎంకయ్యతిన్న దెబ్బకన్న ఎంత ఎక్కువగా బాద అనుబవించిందీ ఆ బగమంతుడికే తెలవాలి.

''ఆరేత్రికి కాపాయినను మునుసబు కొట్టోపెట్టి మరసనాడు బత్తీకి తీసికెల్లారు యిశారనకు గాను. ఏ పనైనా యిశారించకుండా అంత తొందరపడి సేయకూడదు. పాపం, ఎంత అబిమానస్తుడు! ఏం సిచ్చయిదిస్తారో' అని ఆ సూరయ్య ఎంత యిశారవన్నా పడ్డాడు, సేయవలసిన యవారమంతా పొందిగ్గా సాటున సేసుకుంటా, కాత్తె డబ్బుకరుజయినా యవారం ఎనకకు పొనీకుండా.

"ఒళ్లుపగిలిన ఎంకయ్యకు యిప్పట్లో సావురాదని డాక్టర్లు పూసీ యిచ్చినాక, పబిలీగ్గా రాత్తామీద ఓ నిండుమనిసిని కూనీ సెయ టానికి పెయత్నించి నందుకుగాను కాపాయినకు ఏడేళ్ళు కటిన సిచ్చ వేశారు.

''యింక పుగాకుమెట్ట తనకేం పట్టిందీ: వూళ్ళో ఎవురేం అను కుంటుండదీ తనకేం కావాలి! ఏదో పున్నెం సేసుకుని ఆ సూరయ్య గారు యింత తెరిపిన పడగలిగాడు గాని, తను యాపారి పెల్లాన్నని ఎంత కాడికైనా అనిపించుకో గలిగినందుకే తనకు పదివేలు అని

కాపాయిన పెళ్లాం మతిసెడి పలవరిత్తుంటే, ఓదార్చను సూరయ్యగా రొచ్చాడు.

'యిశారించి లాబం లేదమ్మా ! ఒత్తూవుంటై కట్టాలు ! నేసెప్పిన మాట యినవయ్యా అంటే యిన్నాళ్లా ? యింత అలజడి వుండేదా అప్పుడు ? యిప్పుడికైనా నీకు అబ్బెంతరం లేకపోతే, ఆ బ్బూమిని నువు నాకు అమ్మకోవచ్చు. ఎవురన్నా సూదపల్సి నోళ్ళు వుండాలనిగాని అంతకన్నా మరేంలేదు. నువు నెమ్మదిగానే తెలియ సెయ్యొచ్చులే !' అనిసల్లగా తన సనుగుడు బయటపెడ్డాడు. 'అయ్యా, మీరుసేసిన వుపకారానికి ఒచ్చేజనమలో ఏటూవేసు మీ కడుపున పుట్టకతప్పదు. యిప్పటికి, యీ జనమకు మమ్మల్ని యిట్టాపోనిత్తే, ముందుకు మీఅంత మంచి సూరయ్యలుండరు' అని ఏడ్సింది కాపాయిన పెళ్లాం నోట బలంపోయి.

"ఆ ఏడేళ్ళు బగమంతుడిమీన బారం ఏసి ఎట్టాగైనా గడపాలను కుంది కాపాయినపెళ్లాం, తన కడుపున పుట్టిన సిన్నకాపాయినతో

ఆ కాపాయిన మినుండే బెమకు పెళ్లానికి ఆశె అంటూ ఏమాత్రం వుండా, సిన్నకాపుకు నాలుగో ఏడు నిండకతలికే ఆ ముచ్చట కూడా తీరింది. కొట్టోపట్ట కాపాయినకు యిశారన్నా షయ దగ్గుతగిలి, తీసు కుంటున్నట్టు తెలుత్తే, మరసనాడు వైకుంట ఏకాశనంగా పిల్లోట్టి బుజా నేసుకుని వూరికి దచ్చినపు దిక్కుగా ఏడుత్తూ ఎల్లింది పెళ్లాం కాపాయిన దిక్కుతాడనే బెమకొద్దీ.

"ఆ మూడోరోజు రేత్రికే సిన్నకాపుతో తిరగొచ్చేసింది కాపా యినపెళ్లాం కుంటా, సెట్లూ, దుబ్బులూ దాటుకుంటూ, ఆ జీబురు మంటుండ యింటోకి.

''ఓ ఏడాదిపాటు, ఏమీతెలవని సిన్నకాపుతో ఎల్లబోసుకుంది తన సొదంతా, కరాకు తనగుండె రాయికిమల్లె మారేంతవరకు. గుండె నీరవుతుండ ఆరోజుల్లో పుట్టావు. అందుకనే నీగుండె అట్టా ఏడ్చింది ఆ కప్ప అరుపుయిని. యింక ముందుముందు యీ మడుసుల అరుపులు నీగుండె ఏవిదంగా బరిస్తుందో !''

* * * *

వెంకటాద్రికి ఎప్పుడు నిద్రపట్టిందో ! కప్ప అరుపు విన పడటంలా. ఎప్పటి మోస్తరు బయట ఏమికాకుండా వుంది ఆ గడియకు తగ్గట్టు.

(డిసంబరు, 1941)